శ్రీ

# సర్వమంగళాపరిణయము

కడప మ్యునిసిపల్ హైస్కూలునందు ప్రధానాంధ్రపండితుండగు

**కావ్యస్మృతితీర్థ**

## జనమంచి శేషాద్రిశర్మకృతము






చెన్నపురి:

**వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు వారిచే**

శ్రీ 'రాజ' ముద్రాక్షరశాలయందు ముద్రితము.

[illegible]

[illegible]



కళాప్రపూర్ణ కావ్యస్మృతితీర్థ జనమంచి శేషాద్రిశర్మ

# FOREWORD



I deem it a great privilege to have the opportunity of writing a preface to this epic poem written by the voluminous yet, I should say, luminous writer, Brahmasri Janamanchi Seshadri Sarma Garu of Cuddapah. There is no field in Telugu Literature which he has not touched—beginning from small books to school boys and ending with dramas and great puranas including a portion of the Bhagavata. He has immortalised himself by writing his treatises on Sri Ramachandra and Lord Sri Krishna in his inimitable prose and expounding the theories of life, preached and practised by our ancients. He has translated Srimad Valmiki Ramayanam including in it the essence of the thought as developed by the great earlier commentators. It is but right that he must write an original poem giving us an insight into his creative genius and spiritual and metaphysical lore and also an idea of his pure and flowing style, which could not, for obvious reasons, easily be exhibited in his translations.

The poem is based on a small episode in the Brahma Purana and the development is entirely his own. The theme of the poem is aimed at the establishment of the identity of the Hindu Trinity by demonstrating that Siva and Vishnu are one in essence, though different in form. An advanced Brahmarshi of the eminence of Narada, errs in being partial to Vishnu and deems him superior to Siva and tries to canvass the hand of Parvathi as a fitting spouse to Vishnu and attempts to make her choose Vishnu as her husband in preference to God Siva, to whom her heart was devoted. Lord Vishnu plays the game in his own tactful way to be differentiated from Siva and that, whatever his feignings in the course of the episode might have been, he is fully satisfied when Siva's equal predominance was finally declared by his taking Parvathi as his wife.

The poem is full of moral and is quite a fitting contribution to allay the 'isms' and 'schisms' of these days. His description of Siva as the God of all religions apart from the several names by which he is devoted, is the key note of peace and happiness. No

doubt the author mentions only Shanmathams of the Ancient Hindus, and it would strike a modern reader as to why he did not include later religions also in the category; it is perhaps due to the fact, that it might be deemed an anachronism to do so, that he omitted reference to Buddhism or Islam or Christianity, when we remember the time to which the story relates. It is not for me to speak of the literary excellence of the poem and so I would leave it to better people. Suffice it to say that the style is very facile—so facile that a reader of his earlier productions may feel a doubt about the authorship of this poem.

What needs particular mention is this. The descriptions evolved in the course of the book are peculiarly free from the usual descriptions, especially, when a woman comes to be described. Parvathi called Sarvamangala—is the heroine and whenever she comes to be described, the thoughts raised are of a Divine and Spiritual nature and the descriptions are not of the contours of the flesh but of manifestations of the spirit behind. This reminds the reader of the description of Saraswathi by Sri Harsha in Naishadha Kavya, where, every part of the body of Bharathi is described as one or other of the Sciences or Arts.

Verses 80 to 103 in the first Canto of this poem may be read with immense pleasure to appreciate this aspect. The author being essentially of a religious temperament with strong devotion, the attributes are essentially spiritual and are drawn from sources of devotion and yoga.

The poem abounds with common proverbs and is full of descriptions which are very natural. For instance, the anxiety of parents to get a suitable husband for a grown-up daughter, their solicitude for finding the best possible match and their persistent efforts to secure this are very very graphically seen in the character of Himavan and Mena. The vanity and egoism of human beings even in their selfless activities is depicted in a very natural way in the character of Narada, thus illuminating the old saying "Even Homer nods." Not only Narada but the whole congregation of Devas is also subjected to this human failing, so that the readers with similar failing may take heart and proceed to mend themselves when they

discover their failings, instead of dying of a broken heart. This is a moral meant for all mankind and serves for all time. The immutability of the Divine will and Divine Law is thus very well explained, though the fatalistic tendency is emphasized rather too much. This is only by the way.

The main idea is to give a phillip to the Spiritual side of Life in these days of rampant materialism and so the theme is developed in accordance with this aim. This central thought of the Poet is shown in verse 165 of the first canto and is seen right through in a masked form. His description of Vaikuntam is also in keeping with this idea and when man wants to describe what is beyond the view of man, he naturally creates an anthropomorphous God and his habitation also is very much likened to our own world with some imaginary or imaginable embellishments with celestial flora and fauna.

There is a condemnation of polygamy, praise of female education and above all, the constancy and one pointedness of a wedded wife even from the moment of making up her mind to marry her chosen Lord. The book is certainly instructive in many ways and may the reading public read between the lines and live up to the ancient ideals, which have been depicted for us in this wonderful poem of ancient setting with modern ideas. May the author live long to help the Telugu Country with his expositions of men and manners so as to take us nearer the day of millennium and nearer to the Promised Land.

AUM SANTIS SANTIS SANTIHI.

ANANTAPUR,<br>15-10-35.

G. RAMESWARA RAO, B.A., B.L., M.L.C.

# సర్వమంగళాపరిణయము

## భూమిక.

సర్వమంగళాపరిణయ మనునీమహాకావ్యమును విరచించిన కావ్యతీర్థ స్మృతితీర్థాభినవాంధ్రవాల్మీకిత్యాదిబిరుదవిభ్రాజమానులగు శ్రీయుత జనమంచి శేషాద్రిశర్మగా రాంధ్రజనులకుఁ జిరపరిచితులగు సుప్రసిద్ధకవీశ్వరు లగుటచే వారి ప్రతిభాదులంగూర్చి విశేషముగాఁ జెప్పవలసినది లేదు. వీరు బాల్యమునుండి పరదేవతోపాసనాసక్తచిత్తులై గీర్వాణాంధ్రభాషలయందుఁ గృతపరిశ్రములై యాంధ్రభాషయందుఁ గవిత్వముసేయుచు హాలాస్యమాహాత్మ్యము, బ్రహ్మాండపురాణము, లలితోపాఖ్యానము, శ్రీమద్రామాయణము, బ్రహ్మపురాణ మనుపురాణములను నాంధ్రంబునఁ బద్యగ్రంథములుగా రచియించిరి. పాఠశాలావిద్యార్థుల యుపయోగముకొఱకు సంగ్రహముగా భారతభాగవతరామాయణములను, నుదయగిరిముట్టడి, యుత్తమమార్గము మున్నగు చిన్నగద్యగ్రంథములను విచిత్రపాదుకాపట్టాభిషేకము, పాండవాజ్ఞాతవాసము లోనగు నాటకములను రచియించి ప్రకటించిరి. వెండియు రామకృష్ణులను నామధేయములతో మనుజరూపంబులం బుడమిపై నవతరించిన భగవంతుని దివ్యచరిత్రముల మహిమము లెట్టివనియు మతవైషమ్యములం బాటించుట కరం బనుచితంబనియు, జనులకుఁ జక్కఁగాఁ దెలుపుటకై శ్రీకృష్ణావతారతత్త్వము, రామావతారతత్త్వమను రెండు విపులగ్రంథములను గద్యములుగాఁ బ్రమాణశ్లోకముల నుదాహరించుచు వ్రాసి ప్రకటించిరి. వానిలో రామావతారతత్త్వమునం దింకను గొంతభాగము ప్రకటింపఁబడవలసియున్నది. ఇవిగాక శ్రీకృష్ణునందలి భక్తిపారవశ్యంబునం జేసియో యన భాగవతదశమస్కంధమును గీర్వాణమాతృకానుసారిగా నాలువేలపద్యములతోఁ బద్యకావ్యముగా రచియించిరి. అయ్యది యచిరకాలంబుననే కృతిసమర్పణోత్సవమునకుఁ బ్రతీక్షించుచున్నదని యెఱుంగ నయ్యెడు

ఇటు లిన్ని గొప్పగ్రంథములను వ్రాసియు నీకవివరుండు గ్రంథరచనాకార్యంబునఁ దనివియొదవమింజేసి స్వకపోలకల్పితముగా మహాప్రబంధలక్షణములతో నొకమహాకావ్యమును నిర్మింపఁగడంగి సర్వమంగళాపరిణయమను నీప్రబంధరాజమును వ్రాసి పూర్తికావించి ముద్రింపించెను. ఇక్కావ్యంబునకు నన్ను భూమికవ్రాసియిమ్మని కవిగారు కోరఁగా శరీరాస్వాస్థ్యమునంజేసి యించుక వెనుదీసియు మిత్రవచనసమాదరణబద్ధచేతస్కుండనై యొక కొంత వ్రాయ నియ్యకొంటి. కాని యేతత్కవినాథుని కవితాప్రాగల్భ్యాదులంగూర్చి యాంధ్రలోక మెఱింగియే యునికింజేసి యే నంతగా వివరింపవలసియుండదని తలంతు.

ఈ కావ్యమునందలి కథకు మూలము బ్రహ్మపురాణము 32-33-34 అధ్యాయములలోఁ జెప్పఁబడిన గాథ. దానిని సంగ్రహముగా వివరించెద.

రుద్రమాహాత్మ్యవర్ణనావసరంబున దక్షప్రజాపతీయుపాఖ్యానమును దక్షుం డొక మహాక్రతువొనర్చి దుర్మదాంధుఁడై శివుని నాహ్వానింపక యవమానించిన దాని కోర్వక యతనికుహిత సతీదేవి మృతిఁబొందుటయు దానికిం గోపించి శివుఁడు నిజాంశసంజాతుండగు వీరభద్రుం బంపి యాక్రతువును ధ్వంసంబుగావించి దక్షుని తలఁద్రెవ్వఁజేసి సురల వేఁడికోలున నతనిని మేషశీర్షుఁగావించి మన్పుటయు హిమవంతుఁడు విపులతపంబొనర్చి పరమేష్ఠిని సంప్రీతునిగావించి యతనివలన వరంబు వడసిన నతని సతియగు మేనకయందు మున్ను మృతిఁబొందిన సతీదేవి యుమ యనుపేరం బ్రభవించుటయు నాకన్నియమిన్న శివుని భర్తగాఁగోరి తపంబు గావింప విరించి వరంబొసంగుటయు గౌరిమనంబుఁ బరీక్షింపఁగోరి శివుండు వికృత రూపంబుదాల్చి యాదేవి మ్రోల నసుదేర వారిరువురికిని హిమవంతునికిని సంవాదంబు జరుగుటయు వికృతరూపధారియగు నతనిని శివుంగా నెఱింగి పార్వతి యతనిం బతిఁగావరించుటయు నపుడు శివుం డంతర్ధానంబుఁ జెంద నట సరస్తటంబున గ్రహగ్రస్తుండై యొకబాలకుఁ డాక్రోశమొనర్చుచుండ హైమవతి నిజతపోమహిమంబున వానిని గ్రహవిముక్తుంగావించి వెండియుఁ దపంబు సేయఁబూనుటయు నపుడు శంభుఁడు ప్రత్యక్షుండై యాదేవికోరిన వరం బొసంగుటయు నంత హిమవంతుఁడు స్వయంవరంబు చాటించుటయు నందు గిరీశుఁ డిచ్చినవరంబు చందంబునఁ దదంశసంభవుండగు రెండేండ్లబాలుఁడు పార్వతి తొడపైఁగూర్చుండియుండ వానిని దేవత లెవ్వరును లేవనెత్తలేకున్న శివుం డవలీల నెత్తుటయు నింద్రాది దేవతలు క్రోధావిష్టులై శివునిపై నస్త్రములేయఁబోవ వారికి బాహుస్తంభనమగుటయు నంభోజసంభవుని ప్రార్థనంబునం జేసి శివుండు దేవతలను బాహుస్తంభన విముక్తులఁ గావించుటయు నంత నిజరూపుదాల్చిన మహేశ్వరునిఁ బార్వతీదేవి భర్తఁగా వరించి తదీయచరణయుగళంబునఁ గుసుమమాలిక నర్పించుటయు ననంతరము వారిరువురికి మహోత్సవంబున వివాహము జరుగుటయు ననుకథలు బ్రహ్మపురాణమునఁ గలవు.

వానిలోఁ గవులకుఁ గలస్వాతంత్ర్యమున నిక్కవిగారు పెక్కుమార్పులు గావించి వర్ణనలు మొదలగువానిని యథేచ్ఛముగాఁ బెంచి యీగొప్పకావ్యమును విరచించిరి.

కవిగారు కావించిన మార్పులఁ దెలుపుటకై యీకావ్యమునందలి కథాక్రమంబును సంక్షేపముగా నిట నెఱింగించెద.

కైలాసంబునఁ దన్ను సేవింపవచ్చిన సనకాదిమహామునులను బరమశివుఁడు లోకవార్తల నడుగ వారిక్కాలంబునఁ గొందఱు కపటయోగివేషంబులు దాల్చి

వంచకులై హరిహరులు భిన్నులనియు వారిలో హరియే యుత్కృష్టదేవుండనియు బోధించుచుండ లోకు లాకులంబుఁ జెందుచున్నారని విన్నవింప శివుం డదియంతయుఁ గ్రమంబునఁ జక్కంబడఁగలదని యానతిచ్చి యంతర్హితుం డయ్యె. దక్షాధ్వర ధ్వంసము, సతీమృతి, యుమాసంభవము మున్నగుకథలు మూలమందుఁ గన్పట్టునవి యిందు వర్ణితములు. మహిమవంతుండగు హిమవంతుండు తన కొమరితం దగిన వరునకిచ్చి పెండ్లికావింప నాలోచించుచుండఁ గలహాసంఘటనావిశారదుం డగు నారదుం డతనిపాలి కరుదేరఁ దనమనోగతం బెఱింగింప నమ్ముని విష్ణువే పార్వతికిఁ దగినవరుండు కానోపునని యతనిప్రాభవంబును వర్ణించి చెప్పిన నట్లైన నీవే మాకుఁ బెండ్లిపెద్దవై పురుషోత్తమునిపాలికరిగి యతనిని సమ్మతింపఁజేసి యీవివాహ కార్యంబు నిర్వర్తింపుమని యభ్యర్థించెను. ఆమునినాథుఁడు దాని కియ్యకొని వైకుంఠమునకుఁ బోయి నళినాక్షునితోఁ దనవచ్చిన కర్జంబుచందం బెఱింగింప నతని మనంబును బరీక్షింపఁగోరి శౌరి బహుభార్యలుగలవానికష్టములను వివరించి యింకొకతె వలదని పలుక నమ్మునిచంద్రుండు నీవాడంబడుట యొక్కటియే చిక్కై యున్నది. నీవు సమ్మతించిన నన్నియు సరిపడునని బలాత్కరింప నియ్యకొనిన తెఱంగు దోఁపఁ బలికె. నారదుఁడు తుహినాద్రిచెంతకుఁ జని తాఁబూనిన కార్యంబు ఫలించెనని నుడివి తడయక పెండ్లిప్రయత్నములు కావింపుము. నేను దానవారి యొద్దకుఁ బోయి వత్తునని నుడివె. మేనకయుఁ బర్వతరాజును బ్రమోదంబుఁ జెంది పార్వతి కాచందంబుఁ దెలుప నాలలన మహేశ్వరునే పతిగాఁ గోరెదనని స్వాశ యంబుఁ దేటపఱిచె.

అంత నాకాంత యేకాంతంబునఁ గాననంబునఁ దపంబు నేయుచుండ శివుండు కృత్రిమమునివేషధారియై యామెను బరీక్షింపఁదలంచి శివునిఁ దూలనాడి విష్ణుని సన్నుతించి యతనినే పెండ్లియగుమని చెప్పిన నప్పొలంతి సుంతయేనియుఁ జలింపక యాకపటమునిపలుకుల నధిక్షేపించి యతని నవ్వలంబొమ్మనిన శివుఁడు నిజరూపంబునఁ బ్రత్యక్షంబై యామె కోరిన వరంబులిచ్చిన జనకునిచే స్వయంవరంబుఁ బ్రకటింపఁబంచి మదంశసంభవుండగు రెండేండ్లబాలు నొక్కని నీజననియొడిపైఁ గూర్చుండఁజేసి యాబాలుని లేవనెత్తినవారికి నిన్ను భార్యఁగా నిచ్చునట్లతనిచేఁ జాటింపఁజేయుము. విష్ణుఁడు మున్నగువేల్పు లెవ్వరును నాబాలుని లేవనెత్త నోపక భగ్నాశులగుదు రపుడు నేనా బాలకునెత్తుదు. హిమవంతుఁడు నిన్ను నా కొసంగి పాణిగ్రహణము గావించునని నుడివి యదృశ్యుండయ్యె. పదంపడి హిమ వంతుఁడును దత్సతియు నారదమౌనియు గిరిజతో సరసిజాక్షుని వరించి నిరుపమ సుఖంబు లందుమా యని బోధించి తపంబు చాలించి యింటికిరమ్మా యని చెప్పిన నప్పఁడతి యేమియుం బలుకక యూరకుండె. దానింగని యందఱును నమ్మగువ సమ్మ తించినట్లు తలంచిరి.

# IV

నారదుఁడు నారాయణుని కిది తెలుప నరుగువాఁడు ముందట నొకతపో
వనంబునఁ గుహనామునివేషధారియగు శివునిఁగాంచి యతఁడడుగఁ దనకార్యంబుఁ
దెలిపిన నతం డుచితభంగిని నిది నెఱవేఱును. నీవు బ్రహ్మపాలికో బృహస్పతిపాలికో
చని సుముహూర్తంబు నిర్ణయించి యమరనివహంబును పెండ్లికాహ్వానించి
మాధవుం దోడ్కొనిరమ్మని బోధించిన నారదుండు వల్లెయని బ్రహ్మపాలికిఁ జని
యెల్లయు విన్నవించి ముహూర్తంబు నిర్ణయింపుమని కోరినఁ జతురాస్యుం డీపెట్టి
వాఁడు విష్ణుమాయావిమోహితుఁడై యిటు లశక్యంపుఁబనికిఁ బూనెను వీనికి
గర్వశాంతి యగుంగాక యని మనంబునఁ దలపోసి యిట్లనియె. విష్ణునిపెండ్లికి
ముహూర్త మొకఁడు నిర్ణయింపఁగలఁడా? తదేవ లగ్న మనునార్యోక్తి చొప్పున
నతఁడు తలఁచినపుడే సుముహూర్తము గావున నీవు పద్మనాభునితో నంతయు
వివరింపుమని పంచిన నమ్ముని గోలోకంబునకుఁ బోయి విష్ణుంగని పార్వతి శివుని
వరుంగాఁగోరి యుండు టెఱింగి యే నత్తరుణిచిత్తంబును మఱల్ప నెన్ని యేన్విధం
బుల నిన్నుఁ గీర్తింప నప్పొలఁతి యొప్పినట్లు నామదికిఁ దోఁచె. అంత బ్రహ్మయొద్దకుఁ
బోయి వివాహముహూర్తము నిర్ణయింపుమని కోరిన నీవెప్పు డెదందలంచిన
నప్పుడే లగ్నమని చెప్పి పంపిన నిటవచ్చి నీకెల్లయుం దెలిపితి. ఇఁక నీవు పెండ్లికి
వలయు జతనంబులు సేయుమా. అని వేఁడినఁ జక్రి యిట్లనియె. అత్తన్వి చిత్తం
బును లెస్స యెఱుంగకయే పెండ్లిపెద్దవై నేనన్నియు ఘటించితి నని ప్రజ్ఞలు పలికి
యూరకయున్న నన్ను నలుగురు నవ్వునట్లు వెలికీడ్చితివి. కలహమునకుఁ గాలు
ద్రవ్వువాఁడ వని నేనెఱింగియు నీనిర్బంధమునకుఁ జిక్కి మోసపోయితి. ఇప్పటికిఁ
బొడమిన యగడుచాలును. ఇంక నైన నీయత్నమును మానవయ్యా. అని దూఱ
నాడిన నారదుండు నాపూనినకార్యము హరికరుణచే సఫలంబు గాకపోవునే. నా
తపంబెల్లను దీనికై వ్యయించియైన నికార్యంబును సాధింతునని యోజించి
దేవా యావనిత నిన్నుఁ దప్పక వరించు నిది నిక్కువము. నీయానతిం గైకొని హిమ
వంతుని చెంతకుఁ జని వివాహప్రయత్నము గావించెద నని వచియించినఁ దామర
సాక్షుం డట్లేని పోయిరమ్ము నీకుఁ గార్యసిద్ధి యగుంగాక. ముహూర్తము నిశ్చ
యించి యొకదూతచే నాకుఁ జెప్పిపంపుము. నీవు రమ్మని నప్పుడు తప్పక మావారిం
గూడి యేనువత్తు. అని పంచిన సురముని హిమశైలనికటంబున కరిగి యావృత్తాం
తంబుఁ దెలిపి యింక జాగుసేయక పెండ్లికార్యములు సలుపుమా యనిన నతం
డోయీ! యేల యిట్లు పదరెదవు. ఇప్పటికిని పార్వతి విష్ణునివరించుచందము
సుంతేనియుఁ గానరాదు. ఆమెచిత్తము శంకరునిమీఁదనే యున్నపగిది తోఁచెడు.
నీబలమును నమ్మి నేను విష్ణునికి నాదుహిత నిత్తునని పలికితి. నీవే యీకార్యమును
సాగింపవలయును. అని చెప్పిన నారదుండు హిమవంతునితో నాయత్న మెన్నం
డును నింతకు వృథయైనది లేదు. నేను భవత్తనయమనంబును ద్రిప్పెద నని

పలికి యయ్యంగనం గని శ్రీపతియే నీపతియగుంగాక దీని కియ్యకొని సమ్మతిం దెలు
పుమా యని పలుచందంబుల బోధించినఁ బార్వతి మోము సగమువాంచి మిన్న
కుండె. ఆమౌనంబును నారీజనసహజంబగు లజ్జచేఁ గలిగినదనియు నది యంగీకార
సూచకంబనియు నిశ్చయించి హిమవంతునితో నీతనయ యంగీకరించె. ఇఁక వేవేగ
వివాహకార్యంబులు నిర్వర్తింపుము. బ్రహ్మాదిదేవతలను నాహ్వానింపుమని చెప్పిన
హిమవంతుండు సంతసంబునం బొదలి నీవు విరించిపాలికరిగి ముహూర్తమును
నిశ్చయించి శిష్యునిబంపి నాకది యెఱింగించితేని యన్నియు సమకూర్చి సిద్ధముగా
నుండువాఁడ నని నుడివి యతనిం బంపెను. నారదుండు వల్లెయని యంతరంగమున
నుప్పొంగుచు వేలుపుఁబెద్దయొద్దకుఁ బోయి యన్నియు విన్నవించి లగ్ననిశ్చ
యంబుసేయుమని కోరిన నీరజాసనుం డోయీ! యాసారసాక్షి నీరజాక్షునిఁ బెండ్లి
యాడ సమ్మతించెనా చెప్పు మనవుడు నమ్ముని యమ్ముదిత సమ్మతించె నని జాడలం
దెలిసికొంటినని యుగ్గడించె బ్రహ్మ తదేవలగ్న మని చెప్పి యప్పద్మాక్షుండు తలంచి
నదే లగ్నమని నిశ్చయింపుము పోయిరమ్మని చెప్పిన నారదుండు మనంబున విత
ర్కించుచుఁ దన్నుఁ దాను నిందించుకొనుచు నేదియు సరిపడి రాదయ్యె నేమి
సేయుదు నని చింతించుచుండఁ జతురాస్యుండు నీకార్యంబు సఫలంబగు నమ్మలిం
పక పొమ్మని పంచె.

నారదుం డించుక యూఱడిల్లి శ్రీవల్లభుని పాలికిఁ బోయి తనపడిన పాటు
లంతయుం దెలిపి నాకు నగుఁబాటులు రానీయక నీవివాహకార్యంబును నిర్వ
హింపుమా యని వేఁడిన నతండు వెండియు నీవరిగి ద్రుహిణునినే ముహూర్త
మును నిర్ణయింపఁగోరు మిది మదీయాజ్ఞ యనుము. పెండ్లికి నెల్లవారిని బిలువుము.
నేనును గట్టాయితంబై యుండెద నని చెప్పి మగుడఁ బంపిన నిలింపమౌని మరల
సురజ్యేష్ఠుని చెంతకుఁ జని హరిమాటలు నుడివిన నతం డిట్లనియె. సురమునీ! యిది
యేమి నీవెంతో ప్రజ్ఞావంతుఁడవయ్యు నీవిషయంబునఁ బ్రమాదంబుఁ జెందితివి,
చక్రి తలఁచినప్పుడే సుముహూర్తము కదా. అతనివివాహమునకు లగ్నమును
నిర్ణయింప నితరుల కలవియగునే? అమ్మహాత్ముఁడు పరిణయమునకుఁ దఱలినప్పుడే
దేవతలందఱును బయనమై రానున్నవారు. నీవనుమానింపక పోయి శ్రీవిభుం
బయనము కావింపుమా యనిన నమ్ముని పితామహునితో నీవే దేవతానివహం
బును నాహ్వానింపుమా నేను మానవుమఁ దిరిగితిరిగి యలజడిపడియున్నాను. నే
నొంటివాఁడను. అన్నిపనులును నాపైఁబడియున్నవి. అని దీనుండై నుడివిన విధి
యవ్విధముననే పిలుతును. నీవు పనివినుమని చెప్పిన నమ్ముని ప్రమోదాయత్త
చిత్తుండై విష్ణునిపాలికిఁ బోయి విరించిపలుకులం దెలిపి దేవా! నన్నింకను వెతలం
బెట్టక నాపూనినకార్యంబును సఫలంబుగాఁ జేసి నాకుఁ దలవంపులు రానీయక
కావుమా యని కరుణంబుగా వేఁడినఁ గమలనాభుం డెలనగవు మోమున మొల

తేర నతనితో నే నిందాఁక బ్రహ్మాదులం బరీక్షించితి. నీవే పంచాంగమును జూచి యొకసులగ్నమును నిర్ణయింపుమని యానతిచ్చె. అమ్ముని విష్ణుమాయచే బుద్ధి భ్రంశముఁజెంది తనయత్నంబు ఫలించెనని యుబ్బుచు నక్కరణి నొక్కలగ్నము నిశ్చయింప నందఱును నుద్వాహసన్నాహంబు గావించిరి. నారదుండును సంభ్రమంబునం ద్రిదశులకుఁ బనులు నియమించుచు నదలించుచు వారిపై నధికారంబు చెల్లించుచు వేగిరపఱచుచుండెఁగాని హిమవంతునికి ముహూర్తమును జెప్పిపంప మఱచె.

అట హిమవంతుండు నారదుఁడు బ్రహ్మకడకుఁబోయి ముహూర్తము నిశ్చయించి చెప్పి పంపెదనని నుడివి చని కడుం దడవయ్యె నేలొకో పంపఁడాయెనని తనపత్నితో నాలోచించుచు నితికర్తవ్యతామూఢుఁడై చింతించుచుండె. అపుడు పార్వతి తల్లిదండ్రుల మనంబుల కలంకదేర్చి మీప్రయత్నముల నుడుగక సలుపుఁడు. కాఁగలదానికి దైవము ప్రమాణమని బోధించిన వార లూఱడిల్లి కర్తవ్యములకుఁ గడంగిరి. శ్రీరమణుండు పత్నులంగూడి మునులు దోడరాఁ బరివారసహితుండై తఱలి వలిగట్టుకుఱంగట నొకకాఱుకానకువచ్చిచేరి యచ్చట నిలిచెను. చతురానను నాహ్వానంబున నింద్రాదిబృందారకులందఱును గుమిగూడివచ్చి యాకాంతారంబుననే విడిసిరి. కాని వారి నెదుర్కొనుటకును వరపూజ కావింపను హిమవంతుఁడు మున్నగు నెవ్వరును రామింగని యందఱును నిది యేమి వింత పెండ్లిగానున్నదే. ఇట్టిపెండ్లిని మున్నెన్నఁడుం గని విని యెఱుంగమని యొండొరులతో గుజగుజలు వోవుచుండిరి. విష్ణువు బ్రహ్మతో నిదేమి పరిభవమయ్యా. నారదుఁడు చేసినపని యెంత బాగుగానున్నది. మిన్నక యొకచోనున్న నన్ను బయటికీడ్చి యిటు నవమానపఱిచె. నీవాసురమునిని గిరివరునికడకు సరగునఁ బంపి విషయ మెట్లున్నదో కనుంగొని రమ్మని పంపుమా. అతఁ డిపుడు నా కంటికిఁ గానరాఁడు. అని చెప్పిన నప్పద్మజుండు నారదుం బిలిచి యేమయ్యా మంచి తంటలు తెచ్చిపెట్టితివే యిఁక రయంబునఁ దుహినాద్రిచెంతకుఁ జని మారాక యెఱింగించి వరపూజకై యతనిం దోడితెమ్మని పంచెను. నారదుం డిదె చని యాతనిందోడ్కొని వత్తునంచు వచించి యొక్కపరువునఁ బ్రాలేయశైలాధినాథుకడ కేగి హరిప్రముఖామరుల యాగమనంబుఁ దెలిపి యేమయ్యా! పెండ్లిచిహ్నము లేమియు నీయింటఁ గానము. వచ్చినవారి నెదుర్కొనుటకు రాక యూరకున్నావని నిష్ఠురోక్తులాడెను. హిమవంతుఁ డతనితో మునివరా! లెస్సగా నాడితివి. బ్రహ్మపాలికిఁ బోయి ముహూర్తము నిర్ణయించి యొకశిష్యునిచేఁ జెప్పిపంపుదునని చెప్పి నీవు చని నాకొండును జెప్పి పుచ్చకయే పెండ్లికొమరునిం జుట్టములను బిలుచుకొనివచ్చితి వని చెప్పి నాపై ధ్వజంబెత్తెదవే. మంచిపెండ్లి పెద్దవు లే, లెస్సపెత్తనమే. కలహమునకీవు ప్రథమపాదంబని యెఱింగియు నేను నీమాటలను నమ్మి నాజడత్వమున జేలు

పోయితి. ఇందు నానేరమేమి తెలుపవయ్యా. అని చెప్పిన నప్పుడు తాఁజెప్పిపంప మఱచినది తలంపునకు రాఁగ దురంతసంతాపంబుఁ బొంది తనలో నిట్లు తలపోయఁ దొడంగె. అకటా! యితనికిఁ జెప్పి పంప నేనే మఱచి తప్పుఁజేసితిని. బుద్ధిలేక గర్వం బున నపరాధంబు గావించితి. తగినశాస్తి యయ్యెను. ఇఁక హరి మున్నుగువారిని నేనేమొగంబుఁ జూతును. హరి నాపై నలుగకున్నె. ఏమిచేయుదు. అని తలం చుచు మ్రాన్పడియుండె.

అంతట శ్రీకాంతుండును బ్రహ్మేంద్రాదిసుపర్వపర్యలును తమంతట హిమ వంతుని నివాసంబుపొంత కరుదెంచిరి. హిమాద్రిమ్రోల మోడుమాడ్కి నొక్కెడ నిలుచున్న నారదుం గాంచి విరించి సోపాలంభంబుగా నిట్లనియె. దేవమునిసత్తమా! హరియానతిని నేనిటకు వచ్చితి. నాపేరు బ్రహ్మ యందురు వచ్చినపని యేమనియు నడుగక యేమియు నెఱుంగనివాని లెఱుఁగునఁ గదలక మెదలకున్నావేమయా. హరికిని హిమగిరిసుతకును బరిణయము సముహూర్తమని ప్రజ్ఞావచనంబులు వలికి మమ్ము నందఱ నిటఁ జేర్చి మాకు వగుబాట్లుతెచ్చిపెట్టి నీవు హాయిగా వేడుక చూచుచున్నాఁడవు. అని తూలనాడిన నప్పటి కించుక తెలివివచ్చి యచ్చతురా స్యుని చరణంబులపైఁ బాహిపాహి యనుచు వ్రాలి యశ్రుమోచనంబు గావించు చుండె. అంతఁ బద్మజుండు హిమవంతునితో శ్రీనాథుండు వచ్చియున్నవాఁడు. కర్తవ్యంబునకుఁ గడంగకమున్నుగాఁ బార్వతి నడిగి తదభిప్రాయం బెఱింగి కర్జంబు నిశ్చయింతమని హిమవంతుఁడు దోడరా నయ్యింతిచెంతకుఁ జని యంతయు నెఱిం గించి యమ్మా హరిం బెండ్లియగుదువె యని యడిగిన నుమ యిట్లనియె. దేవా! స్వయంవరమునఁ బతిని జేకొందునని తలంతు. రెండేండ్లబాలు నొక్కని నాజన కుఁడు నాజననియంకముపై నుంప నాబాలునిఁ బయికెత్తునతనిని వరింతు నిది మదభిప్రాయమని పలికిన విరించి మంచిదని యొప్పికొనియె. హిమవంతుండును వర్ణ్యయని స్వయంవరము చాటం బనిచె. ఎల్లసురలును నరుదెంచిరి. శంకరుండును నేవంకనుండియో చనుదెంచె. హిమవంతుఁ డొక రెండేండ్లబాలుని మేన యంక ముపై నిడిన వానిని వేలుపు లెవ్వారును నెత్తనోపరైరి. వెన్నుండును వాని నెత్తఁజాలక విముఖుండై తొలఁగె. నారదునిమోము చిన్నఁబోయె. అంత శివుం డవలీల నాబాలు నెత్తుడు హిమవంతునానతిని హైమవతి శ్రీకంఠునికంఠంబునఁ గుసుమదామకంబునునిచి యప్పరమపతిం బతిఁగావరించె.

ఇంద్రాదులు కోపించి శివునిపై వజ్రంబు లేయఁ బూనుఁడు శంకరుండు వఱలంకృతిధ్యానంబు గావించిన వారికి బాహుస్తంభనమయ్యె. హరియు హిరణ్య గర్భుఁడును వారికిఁ దగినశిక్షగలుగుట మంచిదే యని తలంచి మిన్నకుండిరి అంత నారదుం డావింతంగనుంగొని యోహో మహాదేవునిమహిమచందం బిట్టిదని యెఱుంగక యే నిన్నిదినంబు లతనిని సరకుసేయక వెన్నునినే మిన్నగా నెన్నుచుం

టినే. ఇప్పు డమ్మహామహుని శక్తిని గనుఁగొంటి. నాగర్వమంతయుఁ బోయెను. తెలివివచ్చెను హరిహరుల కభేదమని యిపు డెఱింగితి. అని మనంబునఁ దలంచుచు శంభునిచరణరాజీవయుగళిపై వ్రాలి కావుము కరుణానిధీ నాచేసిన యపరాధంబులను క్షమింపుమా యని ప్రార్థించెను. ఉమాజాని వానికిం గరుణించెను. రమాజాని శంకరునితో మనయభేదం బితనికిఁ దెలుపుటకును నితని మూలంబున లోకులెఱుంగుటకును నేనే యితనిని మదీయమాయకు లోనుగాఁ జేసి యీతంత్రం బితనిచే నడపించితిని. ఇతనివలన దోసంబు లేదు గావున నిమ్మునిని మన్నింపుమా. యని నుడివిన నుడుపతిమౌళి యట్టులె యగుంగాక యని యనుగ్రహించె. దివిజులు భుజాస్తంభన వినిర్ముక్తులై సంతసించి శంకరుని వినుతించిరి. హిమవంతుని వేఁడికోలున నీరజాక్షుండును నారదుండును ముందునిలిచి పెండ్లిపనులనెల్లఁ గావింప గౌరీశంకరులకుఁ బరిణయమహోత్సవంబు మహావైభవంబునం బ్రవర్తిల్లెను. అందఱును నమందానందంబుఁ జెందిరి.

ఈకథాప్రణాళికంబట్టి యీకవివర్యుఁడు కావించిన మార్పులును క్రొత్త కూర్పులును నివి యని చదువరులకు గోచరించు.

ఈకావ్యమువలన నీకవిగారు జనులకు బోధింపఁబూనిన ముఖ్యాంశము లీగ్రంథమును జదువుటచే నాకు గోచరించినవాని నిట వివరింతు.

ఇక్కాలంబునఁ గొంద ఱజ్ఞులును వంచకులును గపటవేషంబులు దాల్చి హరిహరులు భిన్నులనియుఁ బ్రకృతి వేఱనియు హరియే సర్వోత్కృష్టదైవంబనియు నిహపరసౌఖ్యప్రాప్తికై యతనినే సేవింపఁదగుననియు శివుని నుపాసించుటవలనఁ బ్రయోజనము లేదనియు నిట్లు పలుచందంబుల జనులకు బోధించుచు విత్తముల నార్జించుచున్నవా రని వివరించి నిజంబగు తత్త్వమును బోధించుట కవిగారి ముఖ్యోద్దేశమై యున్నట్లు కానంబడియెడు. దీనికి నిదర్శనంబులు చూపెద.

కావ్యారంభముననే యిది చూపట్టెడు. పరమశివుని భజింప సనకాదిమహామునులు కైలాసంబునకేగి యమ్మహాదేవుని దర్శనముసేయునపు డతండు వారిని భూలోకవార్తలనడుగ వారు "త్రిమూర్తులం దరయ సారసనేత్రుఁడె యెక్కుడంచు విజ్ఞానధనాఢ్యుఁడంచుఁ" గొందఱు సభలలోఁ బెల్లుగా ధ్వనులెసంగ వాదులాడుచు నున్నారని విన్నవింప మహాదేవుండు వారితో:—

చ. మనసున నెట్టిరూపము సమస్తవిధంబులఁ దృప్తిదంబుగాఁ
దనరునొ యట్టిరూపమును దాల్చినవానిగ నామమెద్ది యిం
పుగ గలిగించు దానినె విభుండగు నాపరమాత్మునిం బ్రియం
బనియుఁ దలంచి భక్తిమెయి ధ్యానము సేయఁగవచ్చు నిచ్చలున్. (1-36)

క. జగమునఁ గలిగినమతములఁ, బొగడంబడు దైవమొకఁడె పో తలపోయన్
దగు నతని కన్నిపేరులు, తగు సకలాకృతులు; నొకఁడు తగనిది కలదే. (1-38)

సీ. ఎల్లెడలందాను నెసఁగుచు నద్వితీయం బగుతత్త్వ మేదనుచు నుపని
షత్తులు వెదకంగఁ జాలక చేర్పడఁ గనఁగాని యానందకలితుఁ డగుచు
నేచోట నేపేర నేరూపమునఁ దన్నుఁ బిలిచి ధ్యానించినఁ బ్రీతుఁ డగుచు
సమబుద్ధిచేఁ బ్రాణి సంతతిం జూచుచుఁ దా సాక్షిమాత్రుఁడై తలఁపరాని
తే. మహిమమున నొప్పుచున్ సర్వమయతఁ బొల్చి, యిట్టివాఁడని యెవ్వరే నెఱుఁగరాక
యఖండ వ్యాపించి తేజోమయుండుగాఁగ, వెలయుఁ బరతత్త్వ; మింకఁ బెక్కు పలుకులేల. (1-40)

అని యిట్లు పరమార్థతత్త్వంబును నిరూపించి ప్రకృతియనంబడు భగవతి పరమేశ్వరునికంటె భిన్నురాలు కాదని

చ. తెలియనివారలే భగవతిన్ భగవంతుని వేఱుచేయఁగాఁ
దలఁతురు వారికెన్నఁటికిఁ దత్త్వ మిదంచు నెఱుంగఁజాలుజ్ఞా
నలవము గల్గదంచు మది నమ్ముఁడు జ్ఞానధనాఢ్యులార ! యీ
పలుకులఁ గల్గు సత్యమది పర్వెడుఁగాక జగద్వ్రజంబునన్. (1-41)

అని తెలియఁబలికి భేదవాదముగావించు కుమతులంగూర్చి యిట్లనియెః—

క. పతిఁబతులగు కొందఱు, పక్షీంద్రుఁడు వాహనముగ భాసిల్లు సరో
జాక్షునకుం బ్రత్యక్షునకున్, వీక్షింతురు భేదమున్నవిధమున నకటా ! (1-42)
క. అజ్ఞులె యయ్యుఁ దమరు సర్వజ్ఞులవలె నుండఁ గోర్కి వఱలఁగ ధరలో
విజ్ఞులు నవ్వఁగ వేదాంతజ్ఞానము బోధచేయఁ దలఁతురు మూర్ఖుల్. (1-44)
తే. తమకుఁ దోఁచినయర్థంబె తగినదనుచు, నొరులు చెప్పెడునర్థమం దొప్పదనుచుఁ
దెంపఱితనంబు మీఱ వాదించుచుండు,వారలే మూర్ఖు లనఁబడువారు జగతి. (1-45)
క. యతివేష మూనికొందఱు, మితిమించిన యాశఁబూని మేదిని స్వేచ్ఛన్
జతనమునఁ దిరిగి విత్తప్రతతిం గూర్పంగఁగోరి భక్తుల మనుచున్. (1-46)
చ. తెలియని ధర్మమార్గముల తీరిది యంచు వచించుచున్ జనం
బులఁ బలుభంగి శాంబరిసముద్రమునం బడఁద్రోయఁజాలు రీ
తులఁ గనిపెట్టుచుం దిరుగు ధూర్తులు యోగులు భక్తులంచు మె
ప్పులఁ గనువారు వార లెటు పూనికఁబల్కిన నేఫలంబగున్. (1-47)

అని వారలఁ దూలనాడి యీ వాదమునకుఁ బర్యవసానంబును మీ రెఱింగెదరు గాక యని యిందువతంసుఁ డానతిచ్చి తిరోహితుం డయ్యె.

ఈసిద్ధాంతమునే స్వయంవరసమయంబున నారదుం డెఱింగి యీరీతిని సభలో నెల్ల సురవల్లభులును విన నిట్లని యుపన్యసించెను.

మ. హరి యుత్కృష్టుఁడు సర్వదేవతలయం దామ్నాయతత్త్వం బిదే
హరుఁ డుత్కృష్టుఁడు సృష్టియం దిదియ పో యామ్నాయసారం బటం
చురువాగ్ధాటి సభాస్థలిం గుజను లోహో యంచు మెచ్చన్ సుధీ
వరవారంబునఁ గొందఱిట్లుభయథావాదంబులన్ జేయుచున్. (5-472)

మ. కలహంబుల్ కలిగించుచున్ మతమనంగా నెట్టిదో యెంచకే
పలుగాకుల్ తమశిష్యులై మెలఁగఁగా ధర్మంబు నార్జించుకో
ర్కులు మీఱం జరియించుచుండఁగను నాకుంబోఁచె నిందేది దు
ర్బలమో యెయ్యది సారమో యనుచుఁ దెల్పంజాలు నూహల్ ప్రభూ. (5-473)

చ. తెలిసెను నేఁటి కీశ్వరుఁడు దేవవిభుండగుఁ జక్రపాణి నా
నలరు మహాత్ముఁడట్టిఁడగు నారయ వీరలు కార్యసంగతిన్
జెలఁగుట నిర్వురైరి యిదె చిత్రము వీరిచరిత్ర మెంతొ ని
ర్మలమగు నిర్వురొక్కటియె మామక బుద్ధి యెఱింగె దీనినిన్. (5-477)

క. హరిహరులకు భేదంబును, బరికించెడువారు నేను బలె నజ్ఞాన
స్ఫురణమున మోసపోయిన, పురుషులె తత్త్వంబు నెఱుఁగఁ బోలరు వారల్. (5-479)

ఈయంశమునే కవిగారు విష్ణువునోటం బలికించిరి. విష్ణువు శివునితో నయ్యవసరంబునఁ జెప్పిన చందంబుఁ గనుఁడు.

ఉ. వంచకు లొక్క కొంద ఱిల వారక యెల్లెడలం జరించి ప్రే
మించిన యట్లు పామరుల మెల్లన లోఁబడి యుండునట్లు గా
వించి మహేశ! యీమనకు భేదము గల్గునటంచు మించి బో
ధించుచుఁ బెక్కుచందములఁ దేఁకువ విత్తములెల్ల లాగుచున్. (5-494)

మ. యతులం బోలి చరించుచున్ విమలయోగాభ్యాసముం జేయు ప
ద్ధతులం గన్పడఁ జేయుచున్ వివిధ భేదస్ఫారధర్మాళిఁ జే
యు తలంపుల్ వెలయించుచున్ మఱియు నెన్నోరీతులం బల్కి శి
ష్యతతింగూర్చుచు నుంద్రు వారివలనన్ సత్యం బదెల్లం జెడెన్. (5-495)

అని వచియించి దేవవ్రాతంబులతో హరిహరభేదవాదులకు సత్కర్మసిద్ధిఁ గలిగింపకుఁడు వారిని నరకంబులఁ గూల్చి దుర్భరబాధ లనుభవింపఁజేయుఁడీ యని యిట్లనియె.

సీ. మనయందు భేద మేమాడ్కిని గలదని వాదించుమూర్ఖులు భక్తి దూల
నిరయంబునం బడి నిత్యదుఃఖితులయి యుందురు వారికి నొక్కకాల
మున నైనఁ దన్ముక్తి పొసఁగదు సత్యంబుగా నని పల్కి యమ్మానివరుల
సురల నింద్రాదులఁ జూచి మీరెల్ల రీవృత్తాంతమును జక్క నెఱిఁగినట్టి
తే. వార లిఁకమీఁద నిట్టె దుర్వాదములను, జేయువారికి సత్కర్మసిద్ధి గలుగ
దనెడు మామకసూక్తిఁ జక్కనివిధమునఁ, దెలుపుఁడీ యిది నాయాజ్ఞ పలుకులేల. (5-505)

ఉ. హరిహరు లొక్కటే యనెడునాశయ మెవ్వరి మానసంబులం
దరయఁగ నుండదో యల నరాధములన్ జమునింట నిల్పి దు
ర్భరనరకంబులం బడుచుఁ బాపఫలంబుల నొందఁజేయుఁ డీ
సురవరులార! యాజ్ఞ యిది శూలికి సమ్మత మంచు నెన్నుఁడీ. (5-506)

ఇంతటితోఁ దనివిచెందక కవిగారు శంకరునిముఖంబుననే యీయంశము లను బలికించిరి. శివుఁడు సర్వమంగళాపరిణయమైన పదంపడి నారదునితో

ఉ. మానిగణేంద్ర! లోకముల మాధవశంకరతత్త్వమొక్కఁడే
గాని విభేద మించుకయుఁ గానఁగరా దెపుడైన దాని కం
చూసిన శ్రద్ధఁ దేటపడు నుద్యమముం బొనరించినాఁడ వీ
జ్ఞానమె కల్గు నెవ్వరికి శాశ్వతమోదము వారి కబ్బెడున్. (5-602)

చ. ఇరువురియందు నొక్కని గణించి మఱొక్కని దూలనాడు నా
పురుషులు దుర్గతిం బడి విముక్తియ లేక తపింత్రు మానితుం
జర కృతకృత్యతం గనఁగఁజాలితి వింక యథేచ్ఛమొప్పఁగాఁ
దిరుగుము లోకజాలముల దీనులఁ గావఁగ మానిమిత్తమై. (5-603)

ఉ. దాసులమంచుఁ గొందఱు నితాంతము స్వర్ణము ప్రోఁగుచేయ స
న్న్యాసులమంచుఁ గొందఱు విహారము సల్పఁగఁ గోరి యొక్కటన్
వేసములూని పామరుల వింతగ శిష్యులఁ జేసికొం చనా
యాసముగా సుఖింతురు మహాపద లబ్బును వారినుండియే. (5-627)

ఉ. వారల నీచవాక్యములకుం బామరు లెంతయు లొంగకుండ వే
సారక సంచరించి పలుచందములన్ సుమతం బిదంచు నిం
దారయ సత్ఫలంబు గలుగించు వచించుచు వారియజ్ఞతన్
దూరముగాఁ దొలంగునటు తోరపుఁబట్టుదలం బొనర్పుమా. (5-628)

అని యానతిచ్చె.

ఈ కవినాథుండు శ్రీవిద్యోపాసకుఁడని యితనిగ్రంథములందలి యాశ్వా సాంతగద్యములవలనఁ దెల్లంబగు. శక్త్యుపాసకుల మతంబున బ్రహ్మవిష్ణురుద్రులును నాపరశక్తి నారాధించువారలే. ఈయంశమును శ్రీశంకరభగవత్పాదాచార్యులు సౌందర్యలహరియందు మొదటి శ్లోకమందే నిరూపించియున్నారు.

"శివశ్శక్త్యాయుక్తో యది భవతి శక్తః ప్రభవితుం
నచే దేవం దేవో న ఖలు భవతి స్పందితుమపి,
అత స్త్వా మారాధ్యాం హరిహరవిరించాదిభి రపి
ప్రణంతుం స్తోతుం వా కథ మకృతపుణ్యః ప్రభవతి."

అని. మఱియు "హరిబ్రహ్మేంద్రసేవితా" అనియు, "కరాంగుళినఖోత్పన్న నారా యణదశాకృతిః" అనియు, "ఉన్మేషనిమిషోత్పన్న విపన్న భువనావళిః" అనియు లలితాసహస్రనామస్తోత్రంబున నయ్యాదిశక్తికి నామములు పేర్కొనఁబడియున్నవి. ఈమతమును విష్ణువు వక్కాణించినట్లు కవిగారిప్పగిదిని వివరించియున్నారు.

ఉ. పంకజసూతి నేనును గపాలియు నాపరశక్తిదివ్యప
త్పంకజరేణులేశులమె భద్రములన్ సుజనాళి కీయ సి

శ్శంకముగా సఘంబులను సల్పెడువారి నడంప లోకమం
దంకిలినొందకుండునటు లారసి ధర్మము నిల్పఁ బూనికన్. (5-509)

క. పరదేవి యాజ్ఞఁగొనియే, పరమాద్భుత శక్తిఁ దాల్చి పరమపదములన్
జరియించువార మని మీ, రరయుఁడు పలుమాట లింక నాడఁగ నేలా. (5-510)

క. పరశక్తి యాదితత్త్వం, తరమే యగు నిర్గుణమనఁ దత్త్వమ్మదియే
పరినుతమా వేదములన్, సురలారా! యీవచనమె సూనృతపథమా. (5-511)

సనందనాదిమునులు పరిణయానంతరము పరమేశ్వరిని వినుతించిన చందంబును జూడఁ గవిగారి పరదేవతోపాసనారతి తేటపడు :—

ఆ. సర్వమంగళయును సర్వజ్ఞునిచ్ఛయే, దనదు నిచ్ఛగాఁగ ననుపమాన
కరుణ నాశ్రితాళిఁ గాపాడుచు నుపాస,కులకు సిద్ధిదయయి యలరుచుండె. (5-657)

సీ. సాదాఖ్య కళయని స్వాంతంబులఁ దలంచి యోగులు ధ్యానించుచుండ వెలసి
కుళనాయిక యనుచుఁ గోర్కిని గౌళమార్గ నిరతు లర్చింపఁగాఁ జెలంగి
కామకళాంబ నాఁగ శుభాగమాచారతత్పరుల్ పూజలఁ దన్ను నలరి
పరదేవి యని వేదపద్ధతి వైదికుల్ తన్ను నారాధింప దయనుమించి

తే. యెట్టిమార్గమ్మునంగాని యెవరు భక్తిఁ, దన్నుఁగొల్చినఁ దద్వాంఛితముల నిడుచు
సర్వకారణతం బొల్చి సర్వమంగ,ళాఖ్యచే మించి శ్రీదేవి యలరుచుండె. (5-658)

ప్రకృతియుఁ బురుషుఁడు నొక్కటే యని వార లిట్లు వచించిరి :—

చ. ప్రకృతియుఁ బూరుషుండు నన భాసిలు నయ్యది యొక్కతత్త్వమే
సకలము తద్భవంబె యగుఁ జాలరు వానికి భేదమున్న య
ట్లోకవిధిఁ జెప్ప నేరయిన నొప్పును దద్ద్వయ సామ్యభావనా
ప్రకటవిధానమంచుఁ దలఁపం జనువారల నుద్ధరించుచున్. (5-648)

ఈకావ్యంబునఁ గవిగారు విపులముగా నుపన్యసింపఁబూనిన ముఖ్యాంశము నారదగర్వభంగమని తెలియవచ్చెడు. పరమభాగవతాగ్రేసరుండగు నా దేవర్షి వరేణ్యుండు జనులు సుకృతదుష్కృతఫలంబుల ననుభవింపఁ దగుకార్యంబు లాచరించునట్లు వారిమనంబుల నాశయంబు లుప్పతిల్లు పగిదిని వారిం బురికొల్పు చుండుటం గని యతనిని గలహాశనుండనియు నొరులకుఁ దంటలుపన్ని వారు చిక్కులఁ బడుచుండఁ గాంచి యతఁడు వేడ్కతో నుబ్బుచుండుననియుఁ గవులు వర్ణింతురు. కాని యతఁడు పడినపాటులను జెందినపరాభవంబును గవిగారీకావ్యంబున వర్ణించినచందములఁ గాంచినఁ జదువరుల కమ్మునివతంసునిపై జాలి యొదవక మానదు. హరిహరు లొక్కటేయని లోకులకు బోధించుటకై విష్ణువు స్వయముగా నారదుని నిజమాయకుఁ జిక్కించి యతనిం బలువిధంబుల నాడించితినని చెప్పినట్లు

క. నే నెక్కుడంచుఁ గొందఱు, కానరు త్ర్యక్షుని మహేశుఁ గాలాంతకునిన్
మౌనివరవినుతు శ్రేష్ఠం, డౌనని మఱికొంద ఱిట్టు లజ్ఞులకెల్లన్. (5-496)

క. తెలియం జెప్పుచు మనకుం, గల దెంతో భేదమనుచుం గడఁగి సభలలోఁ
బలుకుచుఁ బామరుల మనం,బులఁ గల దృఢభక్తి నాశముగఁ జేయుంపనిన్. (5-497)

క. ఒనరించుచుండ వారల, కనుపమ దృఢభక్తి నిల్ప నాత్మఁ దలఁచి యీ
ముని నాడించితి నివ్విధ,మున మాయం గప్పి యజ్ఞపాలక దేవా. (5-498)

అని యున్నది.

విష్ణువు నారదుని నాడించినది నిక్కమగునో యేమో కాని శేషాద్రిశర్మ కవిగా రాతనిని నానావిధంబుల నాడించినది నిక్కము. ఆడించి రన నేల? ఏడిపించిరి. పాపము. అమ్ముని పార్వతికిని విష్ణునికిని బెండ్లిఘటింపఁబూని హిమవంతుఁడు, విష్ణువు, బ్రహ్మ వీరల నడుమ నెన్నిమాఱులు మతిభ్రమణంబునఁ బరిభ్రమించెను. ఎన్నిమాఱులు విసిగి వేసటఁ జెందియు మాయావివశుండై మరలఁ దిరుగఁజొచ్చెను. అందఱివలనను నతనికిఁ జీవాటులే యగుచుండెను. (3-99-197-199-203) విష్ణుఁడు తొలుతనుండి యతనికి గర్వభంగముఁ గావింపఁ దలఁచెనఁట.

"అమ్ముని గరువంబడంప మదిబూని..........." (1-222)

అయినను నారదుఁడు తొలుదొల్త హిమవంతునిఁ జూడఁ బోయినప్పు డతఁడు తన తనయకుఁ దగినవరుఁ డెవ్వఁడగునని యడుగ నారదుఁడు విష్ణువే యని చెప్పిన నట్లేని నీవే హరిని సమ్మతింపఁజేసి యీ వివాహమును నిర్వహింపుమని కోరిన సందర్భమున నారదుండు తనమనంబున:—

చ. తనమది నెంచె నీగిరిసుతామణి శంకరుఁ గోరుచున్నదే
వనరుహనేత్ర శ్రీపతికి వల్లభయౌట పొసంగనేర దీ
పని పయిఁబెట్టుకొంటిఁగద భావి మహాకలహంబునందుఁ బా
ల్గొనియెద శూలికిన్ హరికిఁ గూర్చెద నొక్కట నట్టె గాంచెదన్. (1-164)

చ. హరిహరయోగదర్శన మహాకృతిఁ బాపి విముక్తి నిచ్చు శం
కరునకుఁ బద్మనేత్రునకుఁ గల్గును భేద మటంచు విష్ణువే
నిరుపముఁ డంచుఁ బల్కు కుమనీషులగర్వముఁ బాపువాఁడ నీ
చరితము నీనెపంబున నెసంగునుగాక జగత్త్రయంబునన్. (1-165)

క. కలహమె నాకు భోజనముగాఁ దలపోయుదు రజ్ఞులెల్ల ని
మ్ములఁ గలహంబె పెట్టి విధిముఖ్యుల నజ్ఞులఁగా నొనర్చి ని
స్తులమగు తత్త్వమిద్దియని తోడనె లోక మెఱుంగఁజేసెదన్
గలుగును దాన సత్ఫలము నాకును నక్కిన భక్తకోటికిన్. (1-166)

అని నారదుఁడే యిట్లు తలంప నతనికి గర్వమెక్కడిది? ఇఁక నతనిని విష్ణువు నిజమాయలోఁ బడఁద్రోయుటయు నతనికి గర్వశాంతి గావింపఁ దలంచుటయు నెక్కటంబుననో తెలియరాకున్నది. అమ్మునినాథుఁడు పూనిన యీ కార్యంబువలన హరిహరాభేద తత్త్వం బెక్కరణిని విశదమయ్యెనో యదియు నెఱుంగరాదు.

అయినను "నిరంకుశాః కవయః" అనునార్యోక్తిచొప్పునఁ గవులు వర్ణించుట కడ్డు గలదే. నారదుఁడు తెలిసియే యీకార్యంబునకుఁ గడఁగినట్లుండఁగా నడుమనడుమ

"తెలియఁ జాలకపోయితి విష్ణుమాయలన్." (3-5)

"గర్వమె నన్నుసీస్థితికిఁ గావలెనంచును జేర్చె మానిపా." (3-56)

"......................ఇంకమీఁద ని
ట్లే యవివేకికార్యముల నెన్నఁడు సాహసమూని సుంతయే
చేయక సత్తపోనిరతిఁ జెంది వసించెద నొక్కచోట." (3-63)

"బుద్ధియె లేక యిప్పసికిఁ బూనితి." (4-244)

"నాదు గర్వముల్ తొలఁగె." (4-336)

అని యీరీతులఁ బలుమఱు దుఃఖించు టేలొకో? నారదుని కీవిషయంబున సంభవించినకష్టంబు లిఁక నతనికి జన్మాంతమును నెన్నిజన్మములకును జాలు నని తలంపవలసియుండెడు. నారదుఁడు లేకుండిన నీకథయుఁ బెరుగదు; ఈకావ్యమును నింత దొడ్డది కానేరదు.

నారదుఁడు ప్రథమంబున మురమథనునిజూడ వైకుంఠమునకేగి. (1-187)

ఉ. అందొక సుందరాలయము హారితమంబుగఁ జూడనొప్పు నం
దిందిర పాదపద్మములు నెంతయు వేడుక నొత్తుచుండ నా
నందరసాబ్ధిమున్గిన మనంబున నెంతయుఁ జూడనొప్పు గో
విందుని దేవదేవునిఁ ద్రివిక్రముఁ గాంచె సురర్షి యంతలోన్. (1-191)

చ. దివిజమునీంద్రురాకయు మదిన్ మునుమున్నె యెఱుంగుఁగాన దే
వవిభుఁడు లేచి సంతసము వర్ధిలఁగా నెదురేగి భార్గవీ
ప్రవిమలహస్తసారసవిభాసురకాంచనపాత్ర మందికొం
చు విధిని బాదముల్ గడిగి శుభ్రజలంబుల వాని వేడుకన్. (1-192)

చ. తనదు శిరంబునన్ మఱియు దారశిరంబున యందుఁజేర్చి...... (1-193)

అని కవిగారు కావ్యాదిని నుడివినను దదనంతర మెన్నిసారులు నారదుఁడు నీరజనాభుని జూడఁబోయినను గోలోకమునకే చనియె నందొక సుందరమందిరంబున నరవిందనయనుండు రాధాదేవితో నివసించియుండె ననియుఁ బెండ్లికివచ్చినపుడును వారిరువురే వచ్చిరనియుఁ జెప్పుట యేలొకో? శ్రీలక్ష్మీదేవి పేరెత్తకయే పోవుట యేలొకో? చూడుఁడు. (3-128-157-359); (4-327); (5-517-5-636-637.)

హరిహరులంగూర్చి యుత్కృష్టాపకృష్టవాదములు గావించుదుష్టాత్ములు నికృష్టులని నిరసించుచు వారిరువురు నభిన్నులని బోధించుటయు నారదగర్వభంగమును గవిగారి ప్రధానోద్దేశ్యములుగాఁ గానంబడుచున్నను వీరు మహాకావ్యలక్షణములగు నగరర్తుశైలాదివివిధవస్తువర్ణనల విలసిల్లు నొకస్వతంత్రకావ్యమును రచింపఁదలంచి యిమ్మహాకావ్యమును నిర్మించినారనుట తెల్లము. ఇందలి కవితా

ఘార సురసరిల్లహరికైవడి ననర్గళమై యలరారెడు నని నుడువుట యతిశయోక్తి కానేరదు. కావ్యమంతయు ద్రాక్షాపాకమై వైదర్భీరీతిని గైశికవృత్తిని బ్రసాదమాధుర్యాదిగుణంబులను నివ్వటిల్లెడు. అందందుఁ జూపట్టు సురుచిరంబులగు జాతీయంబులు చదువరుల యుల్లంబులఁ బల్లవింపఁజేయు. వానిం బ్రదర్శింపఁబూనిన నీ భూమిక మితిమీఱి పెరుగుననుతలంపునఁ జూపనైతి.

చదువరులు సంతసింప నీకావ్యమునందలి హాస్యరసప్రధానములగు పద్యములను గొన్నిటిని శృంగారరసవిలసితంబులగు కొన్నిపద్యములను బ్రదర్శించి యీ భూమికను ముగించెద. బ్రహ్మ పార్వతిపెండ్లికిఁ బోయినపుడు వివాహసన్నాహసూచన లేమియుఁ గానమింగని నారదునితో నిట్లు చెప్పెను.

చ. అరిగి హిమాచలేంద్రుఁ గని యాతనిముందొక శుష్కదారువ
ట్లరయఁగనా సురర్షివరు నప్పుడు కాంచి పితామహుండు నే
సరసిజనేత్రు నానతిని జయ్యన వచ్చితి బ్రహ్మనాముఁడన్
సురమునివర్య యేటికిటుఁ జోద్యముగా నిలుచున్నవాఁడవో. (5-302)

ఉ. వచ్చిన కార్య మేమనుచు స్వాంతమునం దలపోయకుండఁగా
వచ్చునె న్యాయ్యమే యిదియు వాసవముఖ్యులు నీవు రామిచేఁ
జెచ్చెర వచ్చినారిటకు శ్రీహరియున్ దయచేసె నింక మే
మిచ్చట నెందు నుందు మిపుడేని వచింపుము సత్కృపానిధీ. (5-303)

ఉ. చాలును నీవొనర్చిన ప్రశస్తమహోత్సవకార్యదీక్షయుం
జాలు నిటం బొసంగిన విశాలసపర్యలు మాటలేల మే
మోలిఁ జనంగ నుత్తరువె యోమునీ! పెండ్లికిఁ బెద్దపాటయే
చాలును వేలువచ్చినటు సంతసమందుచుఁ బోవ బొప్పఁగా. (5-304)

చ. కడిసిన నుల్కమంచముపయింబున బిఱ్ఱబిగించుకొన్న ని
ష్పుపు పనిసాగునయ్య మముఁబోఁటులఁ జంపితి వింతదాఁక న
య్యడవుల నుండఁజేసి మరియాదలు నేర్చుకొనంగవచ్చు నీ
కడ నికఁ జాలుఁ జాలు మృతకల్పులఁగా మము నెంచినాఁడవే. (5-305)

చ. దనుజులు దైత్యరాక్షసులు త్వత్పరికల్పితదేవకార్యమి
ట్లనుపమకీర్తి సాగఁగని యార్పుచు నేఁడె యొనర్పకుందురే
వనజదళాక్షుఁ డిప్డు చనవచ్చునె వచ్చినత్రోవఁబట్టి య
య్యెనె యటఁ బెండ్లియంచమునఁగ నేమని పల్కెదు మేము వారితోన్. (5-306)

శృంగారరసమునకు:—

సీ. నవ్యపల్లవము వింతగఁ గర్ణభాగంబునం దలరించి విఖ్యాతచూత
కిసలయమ్మును వేణిఁ గీలించి యద్దానిచుట్టును గుందప్రసూనములను
బొదిగి వన్యములగు పూవ్వులపేరులు హృదయభాగంబున నెంతొ వేడ్క
భాసిల్లుచుండఁగ వనమయూరకలాప మొకచెవి సందున నొప్పుచుండఁ

తే. సంతసంబునఁ దనవెంట సమవయస్కు,లైన సకియలు రాఁగ నిత్యమ్ము వనుల
సర్వమంగళ విహరింప సకలమునులు, చూడ్కు లానందమున మున్గఁ జూతు రొకట. (1-96)

చ. సరసులఁ బంకజాతముఖ చారుసుమంబులఁ బెల్లురేఁగు నా
పరిమళముల్ గ్రహించి వనపాళి నెసంగెడు పూలతావులం
బొరలుచుఁ జందనద్రుమసమూహమునన్ విహరించి వాయువా
దరమునఁ బార్వతీతనులతం గొలుచున్ భయభక్తు లొప్పఁగన్. (1-97)

చ. ప్రతి దివసాంతమందు గిరిరాజకుమారిక యక్షకన్యకా
ప్రతతులు తన్నుఁగొల్వ వనపంక్తివిహారము సల్పఁబోవ న
ప్రతిమపదాబ్జచిహ్నములఁ బర్వెడు పంకజవజ్రరేఖలన్
శతమఖముఖ్యులెల్లఁ గని శ్రద్ధను మ్రొక్కుచుఁ గొల్తు రెంతయున్. (1-98)

ఉ. పున్నమలందు హైమవతి పూజ్యపదంబులఁ గొల్వవచ్చి యా
కిన్నరకాంత లొక్కమొగిఁ గేవలభక్తిరసంబు పొంగఁగా
సన్నుతి యోగ్యగీతముల జానుగఁ బాడఁగ నానినాదమ
భ్యున్నతమోదదంబగుచు నొప్పెడు బ్రహ్మముఁ దెల్పుచుండగన్. (1-102)

ఉ. వృంతమునుండి కోరకము వెల్వడినంతనె కూడవాసనల్
వింతగఁ బుట్టునన్న సుకవిప్రతిపాదిత నీతివాక్యమా
వంతయు రిత్తగా దనెడునట్టులు భూధ్రకుమారితోఁ గళా
సంతతి యెల్లవిద్యలును జన్మముగాంచి వరించె నంబికన్. (1-103)

చ. హిమకిరణోపలంబుపయి నింతి ముదంబునఁ గూరుచుండి యం
కమున విపంచిఁ జేర్చి యది గండతలంబు స్పృశించి సవ్యక
ర్ణము సయిదోడుగా నమరనాదముఁ బర్వఁగఁ జేయుచుండ భృం
గములును ఝంకృతుల్ చెలఁగఁగా జతనంబునఁ బాడుఁ దోడుగన్. (1-106)

చ. ప్రమథగణాధినాథుని విరాజితవేణులతాభిషంగ హ
స్త మలయమారుతుండు కడుదూరమునుండియె కాంచి సాధ్వసం
బు మయిఁకొనంగఁ బత్త్రముల పుంజమునందె యడంగియుండె శ
బ్దము వినరా దదేదియును భావమె కార్యము లెల్లఁ దీర్పఁగన్. (1-125)

చ. సిరులకుఁ బట్టుగొమ్మ గుణసిద్ధులకెన్నఁగఁ బాలసంద్రమా
తురులకు మంచి మందు గతదోషులకున్ సురభూరుహంబు సుం
దరతకుఁ బుట్టినిల్లు కరుణాగుణసన్మణి శాకరంబు భూ
ధరవర సీకుమారిక నితాంతము తావక భాగ్యరాశియే. (1-148)

ఇటు లెన్నియో యుదాహరింపఁదగియున్నవి. రసజ్ఞు లీకావ్యరాజమును జదివి యిందుఁ జెలువారు లలితమనోహరశైలికిని సురుచిరవచనంబులకును డెందంబుల నానందంబుఁ జెందుచు సొగియుదురు గాత.

నాగపూఁడి కుప్పుస్వామయ్య.

శ్రీః.

# కల్యాణోదంతము.



ఉ. "ముచ్చటలార సేవకసమూహముపైఁ గరుణారసైకసం
పచ్చరదృష్టులం బఱపి భద్రములొందఁగఁ జేయుచుం జనో
జ్జోచ్చతఁ గాంచి భక్తులు మహోత్తమపద్ధతిఁ దన్నుఁ గొల్వఁగా
వచ్చిన మెచ్చుచుం వెలయు వస్తువు సజ్జనరాజిఁ బ్రోవుతన్."

మహాశయులారా!

"కర్మణోహ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః,
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః. ౧౭
యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః,
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమాహుః పండితం బుధాః. ౧౯
త్యక్త్వా కర్మ ఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః,
కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్కరోతి సః." గీ. ౪-అ. ౨౦
"చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః,
బుద్ధియోగముపాశ్రిత్య మచ్చిత్తస్సతతం భవ. ౫౭
మచ్చిత్తస్సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి,
అథ చేత్త్వ మహంకారాన్న శ్రోష్యసి వినంక్ష్యసి. ౫౮
యద్యహంకారమాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే,
మిథ్యైష వ్యవసాయస్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి. ౫౯
స్వభావజేన కౌంతేయ నిబద్ధస్స్వేన కర్మణా,
కర్తుం నేచ్ఛసి యన్మోహాత్కరిష్యస్యవశోఽపి తత్. ౬౦
ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయం త్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా. ౬౧
తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత,
తత్ప్రసాదాత్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతం." అ-౧౮. ౬౨

అను నీ శ్రీకృష్ణపరమాత్మవాక్యములు కర్మసిద్ధాంతసారమును, కర్మయోగము నుండి తరించుమార్గమును బోధించుచుఁ గర్మగతి తెలియఁదగినది కాదనియుఁ దేట పఱచుచున్నవి. కర్మాచరణము లేకయున్న సృష్టియే లేదనవచ్చును. సుకృతదుష్కృత ఫలముల యనుభవముం బట్టియే సత్ప్రవర్తనాసత్ప్రవర్తనము లేర్పడినని తేలును.

ప్రపంచసృష్టియే కర్మము. "ధాతా యథాపూర్వమసృజత్" అన్న వేదవాక్యమున కర్థమేమి? కర్మ మనాది యనుసిద్ధాంతమునకు వేదమే కదా ప్రమాణము. దాని త్రిప్పులకు లోఁబడనివా రుండరు. మహామునులు కాదు. వారియుపాస్య దేవతలగు త్రిమూర్తులును గర్మబద్ధులే యనక తప్పదు. కర్మబద్ధు లనఁగాఁ బామరులని యర్థమా యనువారే పామరులు. భగవంతుఁడు నొకప్పుడు ప్రకృతిబద్ధుఁడుగా నగుట లోకహితార్థము కర్మము ప్రబలమని తేటపఱచుటకే కదా. నిస్సంగులు గూడఁ గర్మతత్త్వ మెఱింగినను దానికి లోఁబడక తీఱదు. భృగుపత్నీవధము విష్ణు వొనరించుట, భస్మాసురునకు శంకరుఁడు వరములొసంగుట, హిరణ్యాకశిపుప్రభృతులకు విరించి వాంఛలం దీర్ప వరములిచ్చుట, దాన రాఁగలఫలముల నెఱుంగక కాదు. ఎఱుంగకయే యందురేని ఆమూవురు నస్మాదృశులే యనవచ్చును. పరప్రబోధార్థమే వారట్టు లొనరించిరి. ఎట్టివారుగాని దుష్కర్మము నాచరించిన దుష్ఫలము, సత్కర్మము నాచరించిన సత్ఫలము నొందకపోరాదను విషయమును బోధించుటకే త్రిమూర్తులు రాఁగల దుష్ఫలముల నెఱింగియు నట్లు లొనరించిరనియు, దానిచేఁ దక్కినవారు త్రిమూర్తులకే దుష్ఫలానుభవము తప్ప నపుడు మన కిఁకఁ జెప్పనేలయని యట్టి దుష్కర్మముల నాచరింపక మానుదురనియు మన మెఱుంగవలయును. ఇది మార్పునొందని సిద్ధాంతము. పూర్వ మొకరాజు తనకడ కర్థార్థియైవచ్చిన పండితునిఁ గాంచి సకలశాస్త్రసార మొకశ్లోకమునం జెప్పుమా యని యడుగ

"శ్లోకార్ధేన ప్రవక్ష్యామి శాస్త్రాణాం సారముత్తమమ్,
పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్."

అని బదులు చెప్పెనఁట. దుష్టకర్మముల నాచరింపకయుండఁ బరమేశ్వరుఁ డేల చేయరాదను ప్రశ్న మసంగత ప్రసంగమువంటి దగును. తన్మూలముననే యితరులకు బుద్ధి రావలయునని భగవంతు నిష్టము. సకలవేదపారంగతుండగు రావణునకుఁ బరదారాపహరణరూపదుష్కర్మాచరణేచ్ఛ భగవంతుఁ డేల మాన్పఁడయ్యెను? తానేల రామరూపమున నవతరించెను? అన్ని కష్టముల నేల యనుభవించెను? అంతమాత్రమున భగవంతునకు బుద్ధిలేదనవచ్చునా? ఒక్క దుర్యోధనుని బుట్టింపకయున్న నెందఱు సంఘాతమరణమునకుఁ బాల్పడకయుందురు? వానిం బుట్టించుటంబట్టి సృష్టికర్త యవివేకుఁ డన్న దెంత యుక్తమో యోజింపుఁడు. వారు వీరననేల దేహధారులందఱుఁ గర్మమునకు లోఁబడినవారలే యనక యూరకుండ వలనుపడదు. కర్మ మనాదియను సిద్ధాంత మెవ్వారిచే మార్పఁబడఁ జాలని దగు నని మన మెఱుంగుటయే మేలగు తెఱంగు.

ఈసిద్ధాంతమున కుదాహరణమే యీ సర్వమంగళాపరిణయము. సకల గ్రంథములు నొక్కొక్కనీతి కుదాహరణములుగనే యున్నవి. తారాశశాంక

విజయము లోనగు గ్రంథములుకూడ మానవులకు బుద్ధిచెప్ప నిర్మించినవే యని నా యాశయము. కాదందురేని రామాయణము నట్టిదే యగునేమో యనుభయము నాకుంగలదు. పఠించువారి కర్మముననుసరించి గ్రంథము లర్థమగుచుండును. గ్రంథ కర్త భావ మిదియే యని గోచరించుచుండును. చెడుటయు బాగుపడుటయుం గలదు. అది వారి కర్మములపై నాధారపడి యుండును. పాఠకులు సన్మార్గభ్రష్టులు కావలయునని వ్రాయఁబడిన గ్రంథ మేదియు లేదనియు నుండదనియు నాసిద్ధాంతము. తారాశశాంకాదులు కేవల మవినీతికే మార్గదర్శకము లందురేని కాంతా కనకముల నిర్మించుటయు సృష్టికర్త కట్టిదే యని సమాధానము చెప్పవచ్చును. ప్రతిప్రశ్నములు చేయవచ్చును. చక్కఁగా విమర్శించినచో సకలగ్రంథములు నీతిని స్థాపింపఁ బాటుపడునవియే. వానితత్త్వ మెద్దియని యరయువారి కర్మము ననుసరించి యవి ఫలముల నొసంగుచుండును.

## సర్వమంగళానామ నిర్వచనము.

“సర్వమంగళా. సర్వాణి మంగళాని యస్యాః, దేవీపురాణేతు, సర్వాణి హృదయస్థాని మంగళాని శుభాని చ, ఈప్సితాని దదాతీతి తేన సా సర్వమంగళా. శోభనాని చ శ్రేష్ఠాని యాదేవీ దదతే హరే, భక్తానా మార్తిహారిణి తేనేయం సర్వమంగళా.” అని భాస్కరరాయకృత లలితాసహస్రనామభాష్యము. “మంగళం మోక్షవచనం చా శబ్దోదాతృవాచకః, సర్వాన్ మోక్షాన్ యా దదాతి సా ఏవ సర్వమంగళా. హర్షే సంపది కల్యాణే మంగళం పరికీర్తితం, తాన్ దదాతి చ యాదేవీ సా ఏవ సర్వమంగళా.” బ్రహ్మవైవర్తము, ప్రకృతిఖండము, ౫౮-అధ్యాయము. “సర్వమంగళశబ్దశ్చ సంపూర్ణైశ్వర్యవాచకః, ఆకారో దాతృవచన స్తస్మాత్సా సర్వమంగళా.” బ్రహ్మవైవర్తము, శ్రీకృష్ణజన్మఖండము, ౨౭-అధ్యా. “సర్వాణి హృదయస్థాని మంగళాని శుభాని చ, దదాతి చేప్సితాన్ లోకే తేన సా సర్వమంగళా.” దేవీపురాణము, ౪౫-అధ్యా. అను నీ ప్రమాణముల ననుసరించి యాదిశక్తియే యిటఁ జెప్పఁబడినదని యెఱుంగవలయును. కారణాంతరముల ననుసరించి హిమాలయపుత్త్రిక యయ్యెననుటయు సుసంగతమే. సాదాఖ్యకళ.

> “తవాధారే మూలే సహ సమయయా లాస్యపరయా
> నవాత్మానం మన్యే నవరసమహాతాండవనటమ్,
> ఉభాభ్యామేతాభ్యా ముదయవిధిముద్దిశ్య దయయా
> సనాథాభ్యాం జజ్ఞే జనకజననీమజ్జగదిదం.” ౪౧

“అత్ర సమయినో నామ సమయపూజకాః తేషాం షట్చక్రపూజాసు నియతా ఆసన్ సహస్రకమల ఏవ పూజా. సహస్రకమలపూజా నామ సహస్రకమలస్య

బైందవస్థానత్వేన తన్మధ్యగతచంద్రమండలం చతురశ్రాత్మనా తన్మధ్యబిందుం పంచవింశతితత్త్వాతీతం షడ్వింశాత్మకశివశక్తిమేళనరూపసాదాఖ్యాత్మనా అనుసంధానమ్. అత ఏవ సమయిమతే బాహ్యారాధనం దూరత ఏవ నిరస్తమ్. షోడశోపచారాంగకలాపశ్చ తతోఽపి దూరత ఏవ." సౌందర్యలహరియందు శంకరాచార్యభగవత్పాదులు వ్యాఖ్యయు

> "సహస్ర కమలే శక్తిశ్శివేన సహ మోదతే,
> సాదావస్థాపరాజ్ఞేయా సైవ నిర్వృతికారణమ్." వామకేశ్వరతంత్రము.

"తటిల్లేఖా తన్వీం తపనశశి వైశ్వానరమయీమ్" అను సౌందర్యలహరి శ్లోకవ్యాఖ్యయందు "మహాంతః యోగీశ్వరాః పశ్యంతస్సాదాఖ్యకళాసుధాధారానిష్యందమనుభవంతః దధతి." అని యున్నది. "సమయినాం మతే సమయస్య సాదాఖ్య తత్త్వస్య సపర్యా సహస్రదళకమలఏవ, న తు గుహ్యాపీఠాదౌ, యేయే సమయినో యోగీశ్వరా జీవన్ముక్తా స్సంసారయాత్రా మనువర్తమానాస్సాదాఖ్యతత్త్వమనుచింతయంతః ఆత్మైకప్రవణా వర్తంతే తేషాం జపోజల్పశ్శిల్పమిత్యాదినా సపర్యాప్రకారో నిరూపితః." అని. "జపోజల్పశ్శిలం సకలమపి ముద్రావిరచనా." అను శ్లోకవ్యాఖ్యయందుఁ బ్రతిపాదితము.

ఈప్రమాణములంబట్టి యోగీశ్వరారాధ్య యగుపరదేవి సాదాఖ్యకళ యనఁబరఁగునని యెఱుంగందగు. అట్టి పరదేవీవివాహమే యిందుఁ బ్రధానవస్తువు. ఏపురాణమునుండి గ్రహింపఁబడిన దను ప్రశ్నమునకుఁ జిన్నియుత్తరము చెప్పఁదగియున్నది. బ్రహ్మపురాణమునందలి 32, 33, 34 అధ్యాయములఁ గలకథను సంగ్రహించితిని. మహారాష్ట్రదేశమునఁగల శివవ్రత పంక్తిలోనికథను గ్రహించితిని. వానింగలిపి యాపమ్మేళనమే యాధారముగఁ జేసికొని కర్మసిద్ధాంతమున కనురూపముగాఁ గథను మార్చితిని. పార్వతీతపఃకరణము సుప్రసిద్ధమే. దానియందు నా చేసినమార్పు గొప్పది గాదు. పార్వత్యంకమునఁ గలశిశువును మేనాదేవ్యంకమున నున్నయట్లు మార్చితిని. విష్ణుమూర్తి ధర్మోపన్యాసము చేసెననియు శంకరుఁడును ధర్మములఁ దెలిపెననియుఁ గల్పించితిని. అవి నీతిదూరములు గానేరవు. శాస్త్రవిహితములే. ఇఁక నారదముని నాడించితివి గదా యని యడుగవచ్చు. కలహాశనుఁ డనుపే రామహాత్మునకు లోకవిదితముగ నున్నదే కదా. ఆపేరునకు ఫలమెప్పుడైన నతఁ డనుభవింపక తప్పదుకదా. ఆకలహములమూలమున నుపకారమే లోకములకుఁ గలదనువా రనేకులుందురు. కాని కలహమును గల్పించుట మంచికార్యమన్న సూచకులను నిందింపనేల? వారును స్తుత్యులే యగుదురు గదా. ఆకలహములమూలమున మేలుగలుగునను మాట యటులుంచిన నాకార్యమేమో

యేకాలమునందైన దూష్యమే. అట్టికార్యమునకుఁ బ్రతిఫల మేకాలమునందైన నించుకగనో గొప్పగనో యనుభవింపవలసినదే. అనున్యాయమును మదినిడుకొని పెక్కుసారులు నారదుని విష్ణుమూర్తికడకు బ్రహ్మసన్నిధికి హిమవంతుని చెంతకుం ద్రిప్పితిని. శంకరుఁడు మునిరూపమునఁ గనఁబడినట్లు కల్పించితివికదా యందురేని అది నారదునకుఁ బ్రోత్సాహము నొసంగుటకుఁ బశ్చాత్తాపతప్తుఁ డగునపు డతనికే కర్మ మెంత బలవత్తరమని తోఁచుటకు ననునదియే యుత్తరము. సర్వవిదులయ్యును గర్మములత్రిప్పులకు లోఁబడియే లోకులకు ధర్మములు తెల్పఁదగుదురు - అను న్యాయమునే ప్రధానము చేసికొని యీకథను గల్పించితిని. తొలుత నారదుఁడు హిమవంతునికడ కరుగుతరుణమున -

"ఈపని చేయ లోకముల • నెల్లను నిండిన దుష్టవాదముల్
వేపడిపోవు సత్యపథ • వృద్ధియె చేకురు శాంతి యబ్బెదుర్
శ్రీపరతత్త్వ మిట్టిదని • చెప్పకయే తెలియంగ నౌనటం
చీపగిదిం దలంచి పర • మేశ్వరు నాత్మను నిల్పి కొల్చుచున్." ఆ-౧. ౧౪౦

వలయుననియే తా నీకార్యమునఁ బ్రవర్తించెను.

"అని తగుభక్తి వేఁడుటయు • నామునినాయకుఁ డాత్మ నెంచి యీ
వనితయె కారణంబుగను • వర్తిలు నొక్కవిశేషమెల్ల చో
నని తలపోసి యిట్లనియె......................" ఆ-౧. ౧౬౧

అని నిశ్చయించియే విష్ణువున కిమ్మని హిమవంతునకుం దెల్పెను. దీనిచే నారద మునియు భగవత్తత్త్వమును లోకులకుం దెల్పి భేదభావమడంప నీకార్యమున కుం దిగెననియే తేలెడిని. బ్రహ్మయు విష్ణుమూర్తియు నీనారదమునిని మాయకు లోఁబడఁజేసి యాడించిరి.

"దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా,
మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే."

అన్న భగవద్వాక్యము ననుసరించి యూహింపఁగా నీనారదముని యామహామా యకు లోఁబడుట యొక గొప్పగాదు.

"ప్రదీపజ్వాలాభి ర్దివసకరనీరాజనవిధి
స్సుధాసూతే శ్చంద్రోపలజలలవై రర్ఘ్యరచనా,
స్వకీయై రంభోభి స్సలిలనిధిసౌహిత్యకరణం
త్వదీయాభి ర్వాగ్భి స్తవ జనని వాచాం స్తుతి రియం."

అని శ్రీశంకరభగవత్పాదులు బోధించినట్లు మహామాయకు లోఁబడనివాఁడొక భగవంతుఁడు తప్పఁ దక్కినవాఁడు లేఁడనుట నిర్వివాదాంశము. సకలము తత్ప్రసాదలభ్యమే యని విశ్వసింపవలయు. నారదముని గర్వభంగము చేయఁబూని యీకృతి రచించితినని భావింపరాదు. దేవర్షులు త్రిమూర్తులును మాయావశంవదులే యనుభావము వెల్లడించుటకే యీకృతి రచింపఁబడినది యని యూహించుటయే సముచితము. నారదమహర్షి దేవతలు విన నుపన్యసించుఘట్టమున నీవిషయము తేటపడును. ఆయాసమయములయం దామునిచంద్రుఁడు పరితాపపడుటయు నజ్ఞానమునఁ గాదనియుఁ, గర్మప్రేరితుఁ డయ్యెననియు, నెట్టివాఁడైనను గర్మములకు లోఁబడక తప్పదనియుఁ దెలుపుటయే యాతనివిచారమును వెల్లడించుట యని తలంచుటొప్పు. హరిహరవిరించులకృత్యములయందు నిట్టిలోపములు గలవు. ఆ యాయవసరముల వారజ్ఞానులన వలనుపడునా? తపస్సునకు ఫలము వరలాభమనియు, దుష్కర్మములకు ఫలము కష్టానుభవమనియుఁ దేటపడుటకే వారిప్రవృత్తి సాగెననికదా మన మూహింపవలయును. అట్టి ఘట్టములు వ్రాసిన వ్యాసమహర్షి త్రిమూర్తులను దెలివితక్కువవారిం జేయఁబూనెనని తలంపం జనునా? తొలుత నారదమహర్షి వైకుంఠమున కరిగి మహాలక్ష్మీసేవితపార్శ్వుఁడగు శ్రీమహావిష్ణువుం గాంచెననియు, రెండవసారి తద్దర్శనమున కరిగి గోలోకముననున్న రాధాకృష్ణుల దర్శించెననియు, మరల నందే వారిని దర్శించెననియుఁ జెప్పఁబడినది. మహాలక్ష్మియన్నను, రాధయన్నను నామభేదమే గాని వస్తుభేదము లేదని నా యాశయము. అట్లే శ్రీమహావిష్ణువన్నను శ్రీకృష్ణుఁడన్నను భేదము లేదు. వైకుంఠమన్నను గోలోకమన్న నంతియే. గోలోకముననున్న రాధామాధవులను దర్శింప వైకుంఠమునుండి విష్ణువు, శ్వేతద్వీపమునుండి నారాయణుఁడు వచ్చిరని పురాణమునఁ గలదు. ఈముువ్వురు వేఱనియా దానిభావము. "ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా." అన్నన్యాయము ననుసరించి భగవన్నివాసస్థానములు కల్పింపఁబడుననియు నన్నియు సమానములే యనియు నెవ్వరి కెయ్యది సమ్మతముగ నుండునో వారందున్న రూపమునే ధ్యానింప ఫలము గలుగుననియు సకల శ్రుతిస్మృతిపురాణేతిహాసాగమసమ్మత మగువిషయము. ఆమతము ననుసరించియే నేను వ్రాసితిని. మహావిష్ణునామకదంబమునం దెట్టియభేదమును బాటింతునో శివకేశవుల యందు నట్టియభేదమునే పాటించువాఁడను. కావున నట్లు వ్రాసితినని తలంచుటొప్పు. తాము సర్వజ్ఞులే యైనను కర్మబద్ధులగు నితరులకు సన్మార్గమును బోధింపఁ ద్రిమూర్తులు కార్యములఁ బ్రవర్తింతురని మనమూహించిన నేశంకలు, నేభేదభావములు నుండవనియే నావిశ్వాసము.

"ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశే ఽర్జున తిష్ఠతి,
భ్రామయం త్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా."

అన్న భగవద్వాక్యము ననుసరించి పరమేశ్వరభిన్న మేదియు లేదని స్పష్టమగును. అట్టిచోఁ గార్యార్థము రూపవంతులగు త్రిమూర్తులకు భేదకల్పన కవకాశ మెక్కడిది? అది యవిద్యాకల్పితమగుట నద్దానికి మనము లోనుగారాదు. ఏవ్యక్తి యేరూపమున నాభగవంతుని దలంచిన నారూపమున నాతని ధన్యునిజేయునను సిద్ధాంతము ననుకరింపకపోయినఁ దత్ప్రసాదమునకు దూరమగుదుము. మతదురభిమానమున నట్టిభేదమును బాటించి తత్కారుణ్యము బాత్రులము కాకపోరాదు. ఇట్టిభావములనే యీప్రబంధము బోధించునని విన్నవించువాఁడను.

"త్వయా యదభయం దత్తం తద్దత్త మఖిలం మయా,
మత్తో విభిన్నమాత్మానం ద్రష్టు మర్హసి శంకర! ౪౭
యోఽహం సత్వం జగచ్చేదం స దేవాసురమానుషం,
మత్తో నాన్యదశేషం యత్తత్త్వం జ్ఞాతుమిహార్హసి. ౪౮
అవిద్యామోహితాత్మానః పురుషా భిన్నదర్శినః,
వదంతి భేదం పశ్యంతి చావయోరంతరం హర. ౪౯
ప్రసన్నోఽహం గమిష్యామి త్వం గచ్ఛ వృషభధ్వజ!"

విష్ణుపురాణము, ౫-అంశము, ౩౩-అధ్యాయము.

"త్వమేక స్సర్వజగతా మీశ్వరో బంధమోక్షయోః,
తం త్వామర్చంతి కుశలాః ప్రపన్నార్తిహరం గురుం. ౨౨
గురుమయ్యాం స్వశక్త్యాస్య సర్గస్థిత్యప్యయాన్ విభో,
ధత్సే యయా సదృగ్భూమన్ బ్రహ్మవిష్ణుశివాభిధాం. ౨౩
త్వం బ్రహ్మ పరమం గుహ్యం సదసద్భావ భావనం,
నానాశక్తిభిరాభాతస్త్వమాత్మా జగదీశ్వరః." ౨౪

స్కం-౧. అ-౭.

"ఆదావభూ చ్ఛతధృతీ రజసాస్య సర్గే విష్ణు స్థ్సితౌ క్రతుపతిర్ద్విజధర్మసేతుః,
రుద్రోఽప్యయాయ తమసా పురుషస్స ఆద్య ఇత్యుద్భవస్థితిలయా స్సతతం ప్రజాసు."

౧౧-స్కం. ౪-అధ్యాయము.

"త్రయాణామేకభావానాం యో న పశ్యతి వై భిదాం,
సర్వభూతాత్మనా బ్రహ్మన్ స శాంతి మధిగచ్ఛతి." ౫౪

స్కం-౪. అధ్యా- ౭. శ్రీ భాగవతము.

"న హి మే కేన చిద్దేయో వరః పాండవనందన,
ఇతి సంచింత్య మనసా పురాణం రుద్రమీశ్వరం.
పుత్రార్థమారాధితవా నహమాత్మాన మాత్మనా,
న హి విష్ణుః ప్రణమతి కస్మై చి ద్విబుధాయ చ.
యత ఆత్మాన మేవేతి తతో రుద్రం భజామ్యహం,"

శ్రీమహాభారతము, శాంతిపర్వము, ౩౪౨ అధ్యాయము.

అను నీప్రమాణములు నాయీప్రబంధమున వ్రాసిన విషయమునకుఁ బ్రమాణములు. వీని ననుసరించియుండు నాకు శివకేశవభేద మెట్లు పొడకట్టు? కావునఁ బామరులకుంగల భేదభావమును దొలఁగింపనెంచి యాయాయిఘట్టములయందుఁ బైవ్రాసిన ప్రమాణవాక్యముల యర్థమునే వివరించితిని. ప్రధానవిషయము లన్ని మతములయందును సమానములే యనియు యోగ్యతననుసరించి యనుష్ఠేయములగువిషయము లౌకికమతమునం దెక్కుడుగను వేదోక్తమతమునం దల్పముగను బ్రతిపాదింపఁ బడినవనియు నాయాశయము. కాన నొకమతము వేదోక్త మతసిద్ధాంతములఁ దూలనాడఁ బనియే లేదను నాయభిప్రాయమునే యందందు సంక్షేపముగఁ దెలిపితిని.

ప్రబంధములయం దట్టిభావము లుండ రాదనియుఁ, శృంగారరసప్రధానముగా నుండఁదగుననియుఁ గొంద ఱందురు. అది పాటింపఁదగని మాటయని మూఁటికి ముమ్మాటికి నిరాఘాటముగాఁ జెప్పఁగలను. నీతిబోధకమే కాకపోవునే నది ప్రబంధమే కాదనువారలలో నే నొకఁడను. కావున నీసర్వమంగళాపరిణయము శృంగారరసప్రధానముగా నుండక శాంతశృంగారరసద్వయప్రధానముగా నలరుచు నీతిని బోధించుచు మతవైషమ్యముల రూపుమాపుచు నిలవెలయఁగలదని విశ్వసించుచున్నాను. ప్రబంధములయం దుండఁదగినవిషయములు బహువిధములుగాఁ జెప్పఁబడినవి. ఏకరీతిగా నవియుండక భిన్నరీతులుగా నవి చెప్పఁబడినవి.

"సంధ్యా సూర్యేందురజనీ ప్రదోషధ్వాంతవాసరాః,
ప్రాతర్మధ్యాహ్న మృగయా శైలర్తు వనసాగరాః.
సంభోగవిప్రలంభౌ చ మునిస్వర్గపురాధ్వరాః,
రణప్రయాణోపయమమంత్రపుత్రోదయాదయః.
వర్ణనీయా యథాయోగం సాంగోపాంగా అమీ ఇహ."

సాహిత్యదర్పణము, ౬-పరిచ్ఛేదము.

ఈమహాకవిమతమున నివియన్నియు నుండిన మంచిదే యనియు నందుఁ గొన్ని లేకున్నను బాధలేదనియుఁ దోఁచెడిని.

> "నగరార్ణవశైలర్తుచంద్రార్కోదయవర్ణనం,
> ఉద్యానసలిలక్రీడామధుపానరతోత్సవాః. ౧౯
> విప్రలంభో వివాహశ్చ కుమారోదయవర్ణనం,
> మంత్రద్యూతప్రయాణాజినాయకాభ్యుదయా అపి. ౨౦
> ఏతాని యత్ర వర్ణ్యంతే తన్మహాకావ్యముచ్యతే,
> ఏషా మష్టాదశానాం ద్వైః కైశ్చిదూనా మపీష్యతే." ౨౧
>
> ప్రతాపరుద్రీయము.

ఈ మహాకవిమతమునఁ బదునెనిమిదివిషయములు వర్ణింపఁబడిన మహాకావ్య మనఁబడుననియు నిందుఁ గొన్ని లేకయున్నను బాధలేదనియు స్పష్టము. ఇందును గథననుసరించి యుక్తములని తోఁచినవి గ్రహింపఁబడియే యున్నవని విన్నవించెదను.

## కృతజ్ఞత.

ఈగ్రంథము ముద్రించుటకు ధనమెట్లు లనునూహా పొడమఁగానే నెల్లూరు మండలసహాయపరిపాలకసంఘమువారు (జిల్లాబోర్డువారు) నాపుస్తకము నొక్కదానిని దమపాఠశాలలయందలి పుస్తకభాండాగారమునకుఁ గొన నిర్ణయించిరి. తన్మూలమున రెండువందల యేఁబది రూప్యములు లభించినవి. ఆసహాయముననే ముద్రించితిని. భాషోద్ధారక బిరుదాంచితులు నావంటి పేదలపాలిటి మందారవృక్షములు నగు మ-రా-రా-శ్రీ, వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారు విశేషించి సాయపడి అచ్చుకూలివిషయమున నెంతదనుకఁ దగ్గింపవచ్చునో యంత తగ్గించి యామూల్యము నాయిష్టముననుసరించి యిచ్చినపుడు గ్రహింప ననుమతించిరి. వారిసాయమే లేకున్న నాపే రెవ్వరికిని దెలిసియే యుండదు కావున నెల్లూరుజిల్లాబోర్డున కధ్యక్షులు, శ్రీశ్రీశ్రీ, రాజా వెలుగోటి సర్వజ్ఞకుమారకృష్ణయాచేంద్ర బహద్దర్ వారికిని, ఉపాధ్యక్షులగు మ-రా-రా-శ్రీ, పోణకా గోవిందరెడ్డిగారికిని మఱియు నందలి సభ్యమహాశయులకును, నావ్రాసినగ్రంథముల ముద్రింప బద్ధకంకణులగు మ-రా-రా-శ్రీ, వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారికి నేతన్మూలమున నాకృతజ్ఞతను దెలుపుకొనుచున్నాఁడను. ఈ చిన్నగ్రంథమునకు నొకయుపోద్ఘాతము వ్రాయించి యిమ్మని ప్రార్థింపఁగనే వేఱొకమాట పలుకక వ్రాసియిచ్చిన మ-రా-రా-శ్రీ,

జి. రామేశ్వరరావు, బి. ఏ., బి. యల్., యమ్. యల్. సి. గారికిని, విమర్శకాగ్రేసర బిరుదాంచితులు బహుగ్రంథకర్తలు సంస్కృతాంధ్రద్రావిడాంగ్లభాషాకోవిదులు నగు బ్రహ్మశ్రీ, మ-రా-రా-శ్రీ, నాగపూడి కుప్పుస్వామయ్య, బి. ఏ., గారికి నేత న్మాలమున "శతశస్సహస్రశః" కృతజ్ఞతను దెలుపుకొనుచున్నాఁడను.

చ. "కలుగుఁ బ్రమాదముల్ ధిషణఁ గల్పులుగాఁ దగియున్న సత్కవీ
శులకె రవంతయోపికను ♦ జూచిన నజ్ఞుఁడ నైననా కృకం
గలుగవె వానినిం దొలఁచి ♦ కావఁదగుం గరుణావిశేషముం
బొలయఁగఁజేసి సాధుకవి భూపవతంసములార! యీకృతిన్."

అని నేనీకృతియందుఁ బ్రార్థించినట్లు లీ చిట్టిగ్రంథమును బరిశీలించి యెందేని గుణ ముండిన గ్రహించి దోషరాశిఁ దొలఁగించి నన్ననుగ్రహింతురని సాధుకవిపండిత మహాశయులఁ దలయొగ్గి వేఁడువాఁడను.

"నింపతు నందతు వాస న్ననసూయు రనసూయు రత్ర కిం తేన,
యత్స్నానసగమనాయై వేదం మమతు పాథేయమ్."

అనుమానోక్తిం బాటించి గుణగ్రహణపారీణులు మన్నింతురని ప్రార్థించుచున్నాఁడను. "కిం వా ప్రార్థనయా పరోపకృతిషు స్వాభావిక స్తద్గుణః" అనుసూక్తినే నమ్మి యున్నాఁడను. ఇంతకంటె విశేషించి మహాకార్య మొనరించితినని చెప్పుకొనఁదగిన విషయము లింక లేవు.

ఇట్లు విన్నవించు విద్వత్కవిపాదభక్తుఁడు,
జనమంచి శేషాద్రిశర్మ,
శ్రీ. శ్రీ. శ్రీ.

# విషయసూచిక.



## తృతీయాశ్వాసము.



## చతుర్థాశ్వాసము.



## పంచమాశ్వాసము.

# ధ న్య వా ద ము.



సీ. బాలిశనికృతాల। వాలంబునజనించి యఘముఖ్యదృక్సహా। యమున నెసఁగి
యీర్ష్యాళు పుణ్యజ। నేభ్యదోశ్చాలనరూపశాఖావళి। నేపుగాంచి
కలహాశనవ్యాళి। గణపల్లవంబుల దుర్వర్ణనార్హమై। తోడఁ బ్రాకి
జాల్మకుంతాళి పుష్పవ్రాతవిస్రసంవృతచతుర్భాగమై। వెలయఁగలిగి
తే. కార్యవిఘటకవిషఫల। కలనఁ జెలఁగి
యట్టె వ్యాపించి సుజనాళి। నణఁచఁబూని
యెవ్విధంబున మసలింప। నెదురులేమి
వెలయు క్ష్వేళమహీజముఁ। దలఁతు మదిని. ౧

ఉ. దానికఠోరశాఖల నితాంతముదంబునఁ దాండవించుచున్
బూనిక సాధుకార్యముల। బ్రుంగఁగఁ జేయుచు మమ్ముఁబోలు వా
రినిగమంబునం గలరె। యెమ్మెయిఁ జూచిన మమ్ము వేఁడఁగా
మానిన నెద్ది సాగు నను। మాడ్కిని గూయు పతత్రిసర్వముల్. ౨

చ. చెలఁగెడు లెక్కపెట్టుటకు। శేషునికైనఁ దరంబుగాక ని
చ్చలు సుజనాళికార్యముల। శ్రద్ధను సాగకయుండఁ జేయుచున్
ఖలమతులొప్ప భేకములు। గావలె నంచు వచించుచున్ మహా
ఫలములఁ గాంచి యబ్బుగతిఁ। దవ్వుచు నిక్కుచు నట్టె త్రుళ్లుచున్. ౩

చ. కనఁబడువారికెల్లరకుఁ। గావలెనంచు వచించుచున్ మహా
జను లవమానమొంది రనఁ జాలుచు నస్మదపారశక్తినిం
గనితిరె యంచు దుర్వచన। కాండము పాముల రాజముం బటన్
వనివిచనంగఁ దెల్పుచును। దారుణపత్రరథేశు లొప్పుటన్. ౪

ఉ. వారికి దూరమై సుజన। వశ్యులచెంతను మెల్ల మెల్లఁగాఁ
జేరి ప్రశస్తకార్య మిది। చేసిన మేలు ఫలిల్లు నెంతయున్
గౌరవమబ్బు సజ్జననికాయము మెచ్చు నటంచు వేఁడ నా
ధీరవరుల్ సరే యనుచుఁ। దృప్తిగ నొప్పుకొనంగ నాసుమల్. ౫

చ. శ్రుతులఁ జొరంబడంగఁ దమ। శూరత కెంతయుఁ గీడువాయునో
వితతయశంబు మాయునొ పవిత్రతమంబగు వృత్తి కేదియోఁ
జ్యుతి యిఁకఁ గల్గునో యనుచు। నుద్ధతిఁ బత్రరథేశ్వరుల్ కడున్
ద్రుతగతిఁ బాఱి యొండొరులతో గతియే మిఁక నంచుఁ బల్కుచున్. ౬

చ. పని యిది సాగకుండఁ గడుఁ బట్టుదలన్ జెలరేఁగి సాధుకా
ర్యనిరతిఁ బూనియున్న సుగుణాఢ్యులయిండ్లకుఁ బోయి యేల యీ
పనికిని బూనినారలొకొ పాడియె దీనికిఁ దోడ్పడంగ నిం
కను గలవెన్నొ కార్యములు కావలెనన్న నొనర్పుఁ డొయ్యనన్. ౭

సీ. భూషించినట్లుండి దూషించునాతని పనికిఁ దోడ్పడు టేమి పాడి యనుచు
మెచ్చినయట్లుండి యిచ్చకములు పల్కునతనికిఁ దోడ్పడ నగునె యనుచుఁ
దృప్తునియట్లుండి తెగడిట్టునాతనిపని కూఁతయిచ్చు టేమి నయ మనుచు
దాంతునియట్లుండి ధనమాసఁ గొనువాని గారవించుట యేమికార్యమనుచుఁ

ఆ. గొంప మునిఁగినట్లు కొండంత ధనరాశి, పోయినట్లు కీర్తి పొలిసినట్లు
తిరిగితిరిగి చక్కఁ జెల్పి వారిఁగలంచి, తుదకు నంతరాయ మొదవఁజేసి. ౮

చ. అది ఫలియింపకుండ దనునట్టి తలంపు దృఢంబుగాఁగ స
మ్మదజలరాశి మున్గుచు శ్రమంబులు పండెను శర్మ మొప్పఁగా
నిదుర గనంగవచ్చు నని నెమ్మదియందుఁ దలంచుచున్ గడుం
బొదలెడు నండజేశ్వరసమూహముఁ గొల్వఁగఁ బూను టర్హమా. ౯

చ. ప్రతిదిన మంతరాయముల పాలగు నట్లుగ నన్యకార్యసం
తతి నొనరించుచుండుటయె తద్దయు ముక్తి యటంచు నమ్మి యు
ద్ధతి నయిదోడుగాఁ దగుపతత్త్రిశతక్రతురాజి కెంతొ యా
దృతిఁ గయిజంటఁ జేర్చి వచియించెద నెన్నియొ ధన్యవాదముల్. ౧౦

ఉ. కోవిదరాజికిం గలుగఁగూడదు గౌరవమన్నయూహచే
నావిలచిత్తతం జెలఁగి యప్పని కెంతయు హాని గల్గ నే
యేవిధులన్ ఘటింపఁదగు నెట్టి సహాయము గల్గ నొ నటం
చావరుసం బొనర్చు కలితాత్ముల నాశుచినేత్రుఁ డేలుతన్. ౧౧

చ. తమకొఱ కన్యకార్యసముదాయ మడంచుట దుష్టకార్యమం
చమలమనీషు లందు రది యర్హమె యందము స్వీయమైన కా
ర్యము కనరాకయున్న నితరార్థములన్ జెఱుపంగఁ బూని ద
య్యములకు మ్రొక్కుచుండు విమలాత్ముల కియ్యవె ధన్యవాదముల్. ౧౨

"కలివిలాసము - ద్వితీయభాగము."

ఇయ్యది త్వరలో వెలువడును. ప్రథమభాగ మచ్చులోనున్నది.

శ్రీరస్తు.
శ్రీ పరమేశ్వరాయ నమః.

# సర్వమంగళాపరిణయము

## పీఠిక

ఇష్టదేవతాదిస్తుతి.

శా. శ్రీమద్వేదసమూహసన్నుతము, సంసిద్ధప్రభావంబు, స
ర్వామర్త్యాధిపమౌళిభాసురము, పద్మాక్షవాగీశ ని
త్యామోదప్రద, మోంకృతిస్థితము, భవ్యస్ఫారతేజంబునై
శ్రీమించన్ విలసిల్లు, శైవమహముఁ సేవింతు నిష్టాప్తికై. ౧

చ. శ్రుతులు తదర్థముం దెలుపఁ జూచు స్మృతుల్ శ్రుతిబోధితార్థమే
హితముగ గాథలట్లు వచియించు పురాణము, లంతకంటెఁ ద
ద్గతపరమార్థముం దెలుపఁ గాఁగల భూరితరేతిహాసముల్
సతము నుతించు దైవమును శంకరుఁ గొల్చెద నిష్టసిద్ధికై. ౨

చ. వరుఁడు పరాత్పరుండు గురుపాతకతూలదవాగ్ని, భక్తసుం
దరహృదయాబ్జవాసుఁడు, నితాంతకృపాకరుఁ, డవ్యయుండు, దే
వరమణవిష్ణుధాతృముఖవర్ణితరూపుఁడు, దివ్యశక్తి భా
స్వరుఁడు, శశాంకశేఖరుఁడు, భద్రములిచ్చుచు నన్నుఁ బ్రోచుతన్. 3

ఉ. మౌనివతంసు లాత్మమహిమంబును సుంతయు నెన్నఁజాల కీ
శాన! "నమోఽస్తుతే" యనుచు సంతతముం వెఱఁగందుచుండఁగాఁ
బూని "నమశ్శివాయ" యను పూజ్యమహత్తర మంత్రయుక్తి నెం
తేని శ్రుతుల్ పవిత్రత, నహీనగతిం గన నొప్పు శంకరుం
డీనిఖిలప్రపంచవిభుఁ డేలుత నన్ననుకంప నెప్పుడున్. ౪

మ. కలశాబ్ధిం బనిపూని ద్రచ్చునెడ నాకల్పద్రుమైరావతం
బులు పద్మాముఖదివ్యవస్తువు లొగిం బుట్టంగ నింద్రాచ్యుతా
దులు ప్రీతిం గొన, లోకమృత్యుకరమై తోఁతెంచు హాలాహలం
బులలిం ద్రావి యుపద్రుతంబగు జగంబుం బూని కాపాడి, ని
స్తులశక్తిం దగు లోకరక్షకుని, గొల్తున్ భక్తి మృత్యుంజయున్. ౫

చ. పరశివుఁ డన్న పేరుఁ గని భవ్యతమాంగిని సర్వమంగళన్
నిరుపమ, మత్సహోదరిని నెమ్మిని బెండిలియాడి యింక నీ
యురగకపాలముఖ్యముల నొయ్యనఁ దాల్చెనె, బావ! యిద్ది సుం
దరమె యటన్న మాధవు, ముఖంబునఁ గాంచెడు దేవుఁ గొల్చెదన్. ౬

మ. సురకాసురుల్ వినయంబునం, బరశివా! సర్వేశ్వరా! యంచు వం
దనముల్ చేయ సమర్థు లీశ్వర! భవత్తత్త్వంబెఱుంగం దరం
బె నమో యంచు నుతింప, దైత్యవరులో యీశాన! దక్కవె యం
చునతుల్ సల్పఁగ నొప్పునీశుఁ దలఁతున్ శుభ్రాంగు సర్వజ్ఞునిన్. ౭

శా. ఆపద్ధ్వాంతదివాకరుండు, రిపుగోత్రాభీలదంభోళి, స
ర్వోపాయజ్ఞుఁ డచింత్యవిక్రముఁడు, హాహాహూహూముఖ్యగంధర్వహృ
త్తాపోచ్ఛేదన గీతసంశ్రవణమోదస్వాంతుఁ డద్రీంద్రపు
త్రీపార్శ్వుండు సురేంద్రపూజ్యుఁడు మహాదేవుండు నన్నేలుతన్. ౮

మ. పరదేవిం గరుణాంబురాశి విబుధవ్రాతార్చితశ్రీదప
త్సరసీజద్వయ, మౌనిహృత్కమలవాసప్రీత, విష్ణ్వాదిని
ర్జరవర్యస్తుతి గానమోదితమతిన్ రాజాస్య, విధ్వస్తదు
ర్భరభక్తార్తినికాయఁ గొల్తు లలితాంబన్ సర్వలోకేశ్వరిన్. ౯

శా. మాయాబీజ మహాక్షరత్నవిలసన్మంత్రైకరూపంబునన్
మాయాఖ్యన్ విలసిల్లి దేవపరులన్ మన్నించి విశ్వౌఘమున్
న్యాయప్రాంచితపద్ధతిన్ వెలయ విఖ్యాతాత్మశక్త్యున్నతిం
జేయంజాలు పరాంబఁ గొల్తు సతమున్ శ్రీరాజరాజేశ్వరిన్. ౧౦

చ. సురలు మహాసురుల్ మునులు శూరతలోకము లేలు దిక్పతుల్
సరసిజనాభపద్మజులు సంతతమున్ వెఱఁగంది లోకవి
స్ఫురణముఁ గాంచి యేమిదనుచున్ దలపోయుచు నేపరాంబఁ గొ
ల్తురో యలదేవి భక్తిఁ గొలుతున్, జననిన్ శివకామసుందరిన్. ౧౧

చ. ఉరుకరుణామహాంబుధి, నతోత్తమకల్పకశాఖి, దుర్జనో
త్కరవనదావవహ్ని, మునికాండమనస్స్ఫుటపంకజాతభా
స్కరరుచి, దీనవారసురక్రమణీవరమన్నఖ్యాతి యె
త్తరణమునం జెలంగఁ దగు తామరసాక్షుని నాశ్రయించెదన్. ౧౨

మ. వనజాక్షాశయ మిట్టు లుండుననుచున్ భావించి భక్తవ్రజం
బున కిష్టార్థము లిచ్చుచున్ సురముని వ్యూహంబు స్వీయాంఘ్రిప
ద్మనిబద్ధాత్మత నొప్పఁగాఁ, బ్రకృతినా దైవాఱుచున్ లోకపా
లన దీక్షం గని యొప్పుచుండెడు మహాలక్ష్మిన్ భజింతున్ మదిన్. ౧౩

చ. సురదనుజాళి నొక్కగతిఁ జూచుచు భక్తినిబట్టి వారికిన్
వరము లొసంగుచున్ సకలభద్రదుఁ డన్న మహాయశంబు సు
స్థిరతగనంగ లోకతతి సృష్టిపరత్వమునన్ వెలుంగు పం
కరుహభవుండు నా కొసఁగుఁగాక చిరాయువు సాధుసేవకై. ౧౪

చ. అనుపమదివ్యదైవభజనాదృతి ముక్తిని గల్గఁజేయు బీ
జనికర మాత్మరూపత నొసంగుచు వాగ్భవకామరాట్పరా

ఖ్యను దగియుండ సాధుజనహర్షదమై మునిసన్నుతాత్మశ
క్తిని బెనుపొందు వాగ్జనని ధీవిభవాప్తికినై భజించెదన్. ౧౫

మ. తొలిపూజం గొనఁజాలు పెంపుఁగని ప్రత్యూహాచలౌఘోల్లస
త్కులిశప్రాయనిజాభిధానము తగన్ గ్రూరాసురవ్యూహదో
ర్బలసంభేదనశక్తియొప్ప ద్విపవక్త్రం బెంతయున్ సత్యమై
యలరన్ భక్తుల నేలుప్రోడను మదిన్ ధ్యానింతు నశ్రాంతమున్. ౧౬

మ. తనుజాతున్ బలె నన్నుఁ బెంచి రవిసిద్ధాంతక్రమం బెల్ల నే
ర్పిన విద్వద్వరు శాంభవీవిధి నిరూపించెం గ్రియాంకితి నె
ట్లని తద్రీతిని దీక్షితుం గరుణఁ జేయంగల్గు సుజ్ఞాని రా
జ్ఞి నృసింహాహ్వయు మద్గురూత్తముని ధ్యానింతున్ మహాభక్తిచేన్. ౧౭

చ. శ్రుతినయనత్రిభాగములఁ జొక్కపుఁబ్రీతి నెసంగ నేర్చి త
ద్గతముగ ధర్మశాస్త్రముల నేర్పడఁ దెల్పిన సత్కృపాబ్ధి స
త్కృతికరణప్రవీణుని బుధేంద్రునిఁ దోపలివంశ్యు సజ్జనా
దృతిగను దైవవిద్వరు నుతింతును వేంకటరామసద్గురున్. ౧౮

సీ. అనవద్యహృద్యపద్యముల నాదిమకావ్య మైనరామాయణ మనువదించి
యాదికవీంద్రుఁడై యలరు వాల్మీకిని వ్యాసమహామునిన్ సత్యఁ గొలిచి
కాళిదాసకవీంద్రు ఘనతను వినుతించి భవభూతికవిచంద్రు పాదపద్మ
యుగళంబు ధ్యానించి తగినభక్తిని దండి పాండిత్యగరిమమ్ముఁ బ్రస్తుతించి

తే. మాఘు భారవి బిల్హణ మల్హణాది, కవివరుల నంజలిం బట్టి శిరము గొలిచి
మఱియుఁ గల్గిన సత్కవిమండలంబుఁ, గొలుచువాఁడను మత్కృతిఁ దెలియఁగోరి.

క. తెనుఁగున వాల్మీకి యితం, డనఁగా నారామమహీంద్రుఁ దై భాంతమును
దెనిఁగించిన నన్నయభట్టును గొల్తును సంతతము కలుగ భక్తిమెయిన్. ౨౦

ఉ. నన్నయసృష్టిచేయఁ గవినాథుఁడు తానయి పూనిసృష్టిచే
య న్నరనాథుప్రార్థనము నాదృతియుం బురికొల్పఁ దిక్కనా
ఖ్యన్నవపద్మజన్ముఁడయి కమ్రతరోక్తుల లక్షణైకసం
పన్నముగాఁగ భారతము వ్రాసినపూజ్యుని సన్నుతించెదన్. ౨౧

చ. పరమశివుండె యెఱ్ఱనగ భారతభూమి జనించెఁ బండితో
త్కరములు శంభుదాసుఁడని తత్కవివర్యుని సన్నుతించు చు
ర్వరఁ బరమేశ్వరుం డనఁ బ్రబంధములన్ రచియించి ఖ్యాతిసు
స్థిరముగఁ గాంచె నట్టి కవిశేఖరుపాదము లాశ్రయించెదన్. ౨౨

సీ. సోమనాథుని గవిభూమీశు శ్రీనాథ కవిసార్వభౌము; భక్తికవివర్య
బమ్మెరపోతనాహ్వయుఁ బెద్దనార్యుని నందితిమ్మనఁ గవినాథుఁ గృష్ణ
దేవరాయని గవిశేఖరు మూర్తిని రామలింగని మఱియు వెలుఁగుబాస
గ్రంథముల్ రచియించి ఖ్యాతిమించిన పూర్వకవులను భారతగ్రంథ మెల్లఁ

తే. దెనుఁగునన్ వ్రాసి మతిశత×మునకు మించి,నట్టిగ్రంథములను ధీరు×లౌననంగ,
నెలమి వ్రాసిన శ్రీపాద×కృష్ణమూర్తి, శాస్త్రిఁ గవిసార్వభౌముని × సన్నుతింతు.

చ. సరసకవీంద్రు లిత్తఱిని × క్ష్మాస్థలిఁ బెక్కుఱు పొల్చియున్న వా
రరుదుగ వారిసాధుకృతు × లత్యమల స్థిరకీర్తియామినీ
కరకిరణప్రవర్తన ని×శామవిభూషిత దిగ్విదిక్కులై
పరఁగెడు నట్టిసత్కవిసు×పద్యల కంజలిఁ గూర్తుఁ బ్రీతిచేన్. ౨౪

చ. కలుగుఁ బ్రమాదముల్ ధిషణ×కల్పులుగాఁ దగియున్న సత్కవీ
శులకెరవంతయోపికను × జూచిన, నజ్ఞుఁడనైన నా కిఁకం
గలుగవె వానినిం దొలఁచి × కావఁదగుం గరుణావిశేషముం
బొలయఁగఁజేసి సాధుకవి × భూపవతంసములార! యీకృతిన్. ౨౫

ఉ. వ్యాకృతిపద్ధతుల్ తొలఁగి × స్వాంతమునం దెటుతోఁచు నట్టుల
స్తోకపదప్రయోగముల×తో వెలయింతురు గ్రంథరాజినిం
బ్రాకటకీర్తిగన్న కవి×రాజులు; వారిపదప్రయోగముల్
కైకొని యవ్వలం గృతుల × క్ష్మాస్థలి నిల్పుచునుండ్రు సత్కవుల్. ౨౬

చ. వరుసగ నిట్టులే కృతులు × వర్ధిలు; వ్యాకృతి, తత్ప్రయోగముల్
సరిపడ వంచుఁ దెల్పినను × సాధుకవిప్రతిపాదితమ్ములై
పరఁగుట సంప్రయోగ్యములె × భవ్యములే యని యొప్పుకొంద్రు వ్యా
కరణము ప్రాక్ప్రయోగములఁ × గాదనఁజాలక మాన మానవా. ౨౭

చ. ఎవి గ్రహియింపఁగాఁదగునొ × యెవ్వి త్యజింపఁగ నౌనొ పండిత
ప్రవరులు నిశ్చయించు టది × బాగగు నందఱుఁ దోఁచినట్లు ప
ల్కవలనుగాదు భాష దగు×గౌరవము న్నిలుపం దగుంగదా
యెవరికి వారలే యయిన × నెవ్విధి నయ్యది గౌరవార్హమా. ౨౮

ఉ. భాషణియర్ ప్రయోగ మది × తప్పనరాదని కొందఱందు రా
తీపన నైనచో ధరణి × ధీరహితం బెటుగాకయుండు? న
ట్లారసినం త్రియంబక మహా నెటు లయ్యపశబ్దరాజిలోఁ
జేరఁగ నర్హ; మయ్యది ప్రసిద్ధమహాకవిదై చెలంగుఁగా. ౨౯

సీ. శ్రీరంగమనుశబ్ద × మేరీతిని సిరంగ మయ్యెనో యిట్టి శబ్దాళి సుకవి
సంబంధమునఁ జేసి × సాధుతఁ గాంచునయే శుభస్కరమని × యేను బల్క
నట్టిది పైవానియందుఁ జేర్పుండని సత్కవులను వేఁడ × సాహసింతు
నాప్రార్థనముఁ గైకొనం బూనుదు రటన్న విశ్వాస మాత్మను వెలసియున్న

ఆ. దనఘులార! మీరలును "బ్రమాదో ధీమతామపి" యనెడునుడి తత్త్వమెఱుఁగు
వారలౌటఁ జేసి వానిని త్యాజ్యము, లనుదురో గ్రహింపఁజను ననుదురొ. ౩౦

క. ఎవియేని ప్రమాదంబులు, దవులుఁ బరీక్షింప వానిఁ × త్యాజ్యమ్ములుగాఁ
గ విపశ్చిద్గణము తలం,పవలయు నద్దానఁ గీర్తి × పాయదు కవికిన్. ౩౧

క. పట్టుదలం గొని వాని న, దెట్టులొ సాధింపఁ బూన నెల్ల ర[illegible]
గట్టిగఁ బంతము పూనినఁ, జెట్టగుఁగా భాష [illegible]

ఉ. శారద నారదూటకృతసత్కలాపవిభూషితాంగిగాఁ
గోరికఁ జేసినట్టులె యగుంగద గ్రామ్యపదప్రయోగసం
భారముగాఁ గృతిన్ జగతిఁ బన్నఁగఁ జేయుట; నవ్యమూఢు రే
సారమనీషు లాకృతి రసాస్థలమందుఁ బ్రసిద్ధిఁ గాంచునే. ౩౩

మ. ఎవరేఁ జెప్పిన దుష్టమౌ పదము నెంతే భావ మీఁజాలినన్
గవిసంఘంబునఁ గొంద ఱొప్పినఁ దొలంగం జేయుటే యుత్తమం
బవు సద్దాని గ్రహింప వ్యాకరణమేలా యింక ఛందోవిధుల్
వివిధాలంకృతులేల తోఁచినటు లుర్వీం జెప్పవచ్చుం గృతుల్. ౩౪

చ. నియమము లేకయుండుననె నిల్వదు భాషయుఁ గొంత కాలమే
నయవిదు లొప్పుకొందు రిది న్యాయవిశుద్ధముగా నిదెట్లమా
వియదరవిందమట్లు కవిబృందసుసమ్మతిమూలబంధ మిం
తయు నొనఁగూడ దట్టి కృతి తానె నశించెడు నిత్యరీతిగన్. ౩౫

చ. కనుక మహాకవివ్రతతి కానక యెచ్చటనో ప్రమాదము
గని కృతియందు నొక్కయెడఁ గన్పడఁ జేసిన యప్పదంబునే
గొనక త్యజించి లెక్కయిడఁగూడదని యట్లుగఁ జెప్పియున్నవా
నినె గ్రహియింపఁ బోలు ధర నిల్చును దత్ఫల మెల్లకాలమున్. ౩౬

చ. తమతమవారివారల కుదాహరణంబులు దారెయౌట ని
క్కముగఁ దలంచి స్వేచ్ఛ నరికట్టి సముంచితశాస్త్రసమ్మతో
త్తమ బహుశాస్త్రసంభృత పదప్రకరంబులఁ గూర్చి సత్కృతుల్
క్షమ వెలయించు టొప్పు రసికప్రకరంబులు మేలుమేలనన్. ౩౭

ఉ. భారత మాంధ్రసత్కృతులపాలిటి కల్పమహీజ మందునే
పారు ప్రయోగరత్నముల వ్యాకృతిసమ్మతిఁ గన్నవానినే
యారసి సేకరింపఁదగు నందున కొందఱు తత్ప్రమాదముల్
చేరకయుండఁ జేయుఁడని చెప్పినఁ గొంద ఱఘం బటంచుఁగా. ౩౮

చ. ఎవరికివారె పెద్దలుగ నేర్పడినం గృతులెల్లఁ బొల్లులై
వివిధవిభేదముల్ గలుగ విస్మృతి నొందకయుండఁ గల్గునే
ప్రవిమలచిత్తులార! యిది బాగుగ నారసి భాష నెట్లు చ
క్క వఱలఁ జేయ నౌనొ యటు గౌరవమొప్ప నొనర్పుఁ డిత్తఱిన్. ౩౯

తే. అనుచుఁ బండితవర్యుల కంజలిఁ దమిఁ, బట్టి ప్రార్థించి సాధుప్రబంధ మొండు
వ్రాయఁగా నెంచి బ్రహ్మపురాణమునఁ దెనుఁగునను వ్రాయుచున్నవాఁ గల్గుకథ నొండు.

క. పరికించి పరమపావన, పరమేశ్వరచరిత మద్ది ఘనభయహరమై
పరఁగుటఁ బ్రబంధముగ నా, చరితము వ్రాయంగ సంతసముఁ గొంటి మదిన్.

సీ. ధార్వాడయను పుర। తల్లజముననుండి హరికథల్ చెప్పను।ద్యమముఁ బూని
చను దెంచినట్టి సచ్చరితుఁడు శ్రీరామశాస్త్రి యీచరితమె। సరసభణితి
వచియించెఁ దత్కథా।భంగి వేఱుగనుండె; నదిమహారాష్ట్రము।నందు ప్రతవి
తతియందు నొకటిగఁ। దనరు నందలికథ యిద్దియౌ ననిపల్కె। నెంతొ పెద్ద
తే. దానిగ్రహియించి యద్దాని।తత్త్వ మరసి, బ్రాహ్మగాథను గొని వాని। వలసినట్లు
నీతి కనుకూలమైనట్టి।రీతి మార్చి, వ్రాసినాఁడను దీనిఁ బ్ర।బంధముగను. ౪౨

క. కేవలశృంగారంబే, భావింపఁ బ్రబంధమునకుఁ। బ్రాణంబను నా
భావము గ్రహింపనొల్లక, యీవిధమున వ్రాసినాఁడ। హితమని దీనిన్. ౪౩

క. పురముఖ్యవర్ణనంబులు, సరిపడు నెందాఁకఁ గథకుఁ। జాలుననియె యం
దుపమతులు పల్కుదురు త,త్సురుచిరవాక్యంబు మదిని। శ్రుతివాక్యముగన్.

ఆ. విశ్వసించి కథకు। విహితంబు లనితోఁచి, నట్టివానిని గొని। యర్హరీతిఁ
గథను నడిపినాఁడఁ। గవిశిరోమణులార!, తప్పులున్న సైప।దగును గరుణ. ౪౪

మ. చరితం బియ్యది పావనంబగుటచే। శ్రద్ధం బఠింపంగ స
త్పురుషార్థంబు లొసంగుఁ గావునఁ గృపాం।భోరాశి యోగీశ్వరే
శ్వరు లోకావనదక్షు బ్రహ్మముఖదే।వవ్రాతపూజ్యున్ మహే
శ్వరు నీసత్కృతినాథుఁ జేసితిని వి।ద్వత్సమ్మతిన్ భక్తిమై. ౪౫

ఉ. నిద్రను దోఁచి నే శివుఁడ। నీవొనరించు ప్రబంధవర్యమున్
భద్రములెల్లఁ గోరుకవి।వర్యులు మెచ్చ మదంకితంబుగా
ముద్రణముం బొనర్పఁ బని।పూనుము మేలగు దీన నీకు శే
షాద్రికవీ! యటం చడిగి।నట్టులు నే నెఱుఁగన్ నిజంబుగన్. ౪౬

ఉ. పెద్దలవేఁడినంత ననుఁ। బ్రీతినిగాంచి త్వదీయమౌకృతిన్
నిద్దపుభక్తి నీదివిజ।నేతకు నంకితమిమ్మటన్న వే
ఱెద్దియుఁ బల్కకట్టిదివి।జేశున కంకిత మిచ్చుచుంట యిం
కెద్దియు నొచకుండుటయు। నీయవి నాదు ప్రవృత్తులై తగున్. ౪౭

క. కావున నీకృతిరత్నము, నావిధమున నీశ్వరునకు। నంకిత మిడితిన్
బావనమతు లనుమతినిడ, దైవము కరుణించు ననెడు।తలఁపు గలుగుటన్. ౪౮

తే. నిండుచందురు నందొక।నీలిమ గను,పట్టుచుండిన నుంత లో।పంబు గల్గ
దట్టిహరుగాథయందుఁగా।వ్యగతదోష,మగపడినఁ గౌతుకం బిడ।దగునుజుండి.

చ. సుమహితసాధువర్ణగుణ।శోభితఁ జారుసువృత్తభూషణో
త్తమనుతిపాత్ర, భవ్యగుణ।ధన్య, మనోహరరూపఁ, బండిత
ప్రమదకరస్వభావ, గురు।భావవిభూషితఁ, గోమలాంగి నీ
త్యమల గ్రహింపు మీశ్వర! కృ।పాకర! యీకృతికన్య నాదృతిన్. ౫౦

క. అని వేఁడి సంతసంబునఁ, బినాకచాపుండు కరుణ। పెంపెసలారన్
ననుఁ గాచునని తలంచుచు, వినిపించెద నాదువంశ।విధ మెల్ల నికన్. ౫౧

### కర్తృవంశచరిత్రము.

సీ. ఆంధ్రదేశమునకు యామ్యభాగమ్మున శ్రీశైలము త్తరసీమగాఁగఁ
గాంచీపవిత్రనగరము దక్షిణభాగమున నుండఁగాఁ దెలుఁగనెడు పేరఁ
బరఁగు దేశంబొండు భాసిల్లు నదియె త్రైలింగాఖ్యదేశం బనంగ వెలయు
నందుఁ బినాకిని యనుమహానదియొప్పు దానికిఁ జెంతనె దక్షిణమునఁ
తే. దనరుఁ గలువాయ యనుపురతల్లజంబు, నాదుజన్మస్థలంబయి నలువుమీఱు
దానికిం బశ్చిమాశనుదగును గడప,యనెడు నగరంబు పంచయోజనములందు.
క. ఆమండలమున వేంకట, రామపురం బనెడునొక్కగ్రామము తగు సు
త్రామోత్తరదిక్సంధిని, ధీమన్నివహాశ్రయ మగుచు ద్విజపురము నాన్. ౫౪
వ. అందు నాంధ్రమహీసురవంశంబులు పెక్కు వెలయుచుండు. ౫౫
క. ఆతెలుఁగునాడులో వి,ఖ్యాతిని జనమంచివంశ మార్యవినుతమై
భూతలమునఁ దగు నందు ద,యాతపములు తనర సూరనార్యుఁడు వెలసెన్
తే. అతనికొక్కతనూభవుండలరె వేద, శాస్త్రనిపుణుండు సద్వ్రతాచరణరతుఁడు
శంకరాధీనచిత్తుండు జ్ఞాని వినమి, తావసజాని వేంకటేశావధాని. ౫౭
క. పతిభక్తియె తనకున్నత, గతియను నిశ్చయము తనరఁగాఁ దత్సతి యీ
క్షితిఁ గీర్తనీయసుగుణా,కృతి యగుచుం జేరమాంబ యొసఁగె నసమతన్.౫౯
సీ. ఆదంపతుల కిద్దఱాత్మభవుల్ గల్గి రందు సుబ్రహ్మణ్యుఁ డగ్రజన్ముఁ
డతని సోదరుఁడు శేషాహ్వయుఁ డీయిద్ద రమలచిత్తులు భవ్యయశులు దేవ
దేవాంఘ్రిపంకజాధీన మానసులునై వెలసిరి శేషార్యుఁ డెలమిఁగాంచెఁ
బుత్త్రు లక్ష్మీశబ్దపూర్వకనారాయణాహ్వయు; నగ్రజుం డైనయట్టి
తే. భూరికీర్తి సుబ్రహ్మణ్య బుధవరేణ్యుఁ, డఖిల జనసుతశీల భవ్యగుణజాల
నుభయకులకీర్తిదాయినిననుపమయార్ద్ర,హృదయఁగామాక్షియనుసతినెలమిమిగుల.
క. పెండిలియై సద్గుణగణ, మండితుఁ డాభూసురుండు మహిమం జేసెన్
ఖండేందుధరప్రియము ల,ఖండఫలప్రదములు నగుకార్యములఁ దగన్. ౬౦
ఆ. అట్టిదంపతులకు నాత్మజ లిద్దరు, తనయుఁ డొక్కఁ డగ్రతనయ సుబ్బ
మాంబ యన్నపూర్ణ యనుజుఁడ శేషాద్రి, యనెడునేను వారి కవరజుండ.
వ. ఇట్టి నేను. ౬౧
క. జనులను యాచించి ధనా,ర్జన మొనరుపఁజాల కెట్లొ సంస్కృతి సాగిం
పను నాంగ్లపాఠశాలను, దెనుంగుఁబండితుఁడనై విధిం జక్కంగన్. ౬౩
క. ఒనరించుచు హాలాస్యం, బనునామమునం జెలంగునట్టి మధురదా
ఘనమహిమముఁ దెల్పుకృతిక్,బొనరించితి స్కాందమునను బొల్పెసనదియున్.
క. లలితోపాఖ్యానంబను, లలితాంబాదివ్యకృప చెలంగు ననెడికో
ర్కలఁ దెన్గుచేసినాఁడను, బలుకులనదె యొనరఁజేయుఁ బావనములుగన్.

వ. బ్రహ్మాండమహాపురాణం బాంధ్రీకరించి శ్రీమద్రామాయణంబు తెనిఁగించి శ్రీకృష్ణావతారతత్త్వమనుపేర ద్వాదశప్రకరణంబులుగ శ్రీకృష్ణచరిత్ర మంతయు గద్యమయంబుగ వ్రాసి బ్రహ్మపురాణముఁ దెనిఁగించి హనుమద్విజయ మనుపేర నొక్కగ్రంథంబు నల్లి శ్రీరామావతారతత్త్వంబనుపేర రామాయణార్థతత్త్వమును బయలుపఱుప గద్యగ్రంథంబు వ్రాయుచు నెనిమిదిప్రకరణములు పూర్తి నొందించితి. తచ్ఛేషం బింకనుంగలదు. సర్వమంగళాపరిణయం బనునీప్రబంధము వ్రాయఁబూని పూర్తినొందింపకమునుపే తాండవకృష్ణభాగత మనుపేర శ్రీమద్భాగవతదశమస్కంధముం దెనిఁగించి పూర్తినొందించి పిదపఁ ప్రబంధంబుఁ బూర్తినొందించితి. పీనినడును నుత్తమమార్గమనుభక్తిరసమయ గద్యగ్రంథము వ్రాసితిని. మఱియుఁ బెక్కుగద్యగ్రంథములను సత్ప్రివర్తనాదికముల వ్రాసితి. విచిత్రరామాయణంబు, కలివిలాసంబు ననుపద్యకావ్యములను వ్రాసితి. అవి యముద్రితములు. ౧౮

క. ననుఁ దాండవకృష్ణుండని, యును మఱి శేషాద్రియనియు । నొగిఁ బిల్చిరి ప్రీ
తిని జనకాదులు తొలిదా,నిని నాగ్రంథములె తెల్పు । నియతిమెఱయఁగన్.

వ. ద్వితీయనామమువ్యవహారార్హం బయ్యె.ఇట్టి నేనుసమాహితాంతఃకరణుండనై.

కృతిసమర్పణము.

క. శ్రీకరునకు దుష్టాసుర, భీకరునకు భక్తలోక । వితతిహితకర
ప్రాకటకరుణాకరునకు, నాకేశాద్యర్చితపద । నళినయుగునకున్. ౧౯

క. పావనునకు సనకముఖ, ప్రావృతపార్శ్వునకు దేవ । పతిముకుటమణి
శ్రీవిలసిత వరపదరా, జీవద్వంద్వునకు మౌని । సిద్ధేంద్రునకున్. ౨౦

క. సర్వజ్ఞునకుఁ దుర్జన, దుర్వారాఖర్వగర్వ । దోర్బలతేజో
నిర్వాపణపటునకుఁ, శర్వునకుఁ వేదరాశి । సుసేవ్యునకున్. ౨౧

క. హర్షప్రదునకు భూర్యఘ,మర్షణునకు దేవదైత్య । మండల సతతా
ధర్షణ విక్రమునకు దు,ర్ధర్షామితతేజునకు సు । రప్రభుపతికిన్. ౨౨

క. ప్రణవాకారునకుఁ గృపా, గుణభూషితచిత్తునకు న । కుంఠభుజబల
ప్రణుతునకుఁ దేవాసుర, గణపూజితదివ్యపాద । కమలయుగునకున్. ౨౩

క. హైమవతీ సంశోభిత, వామార్ధాంగునకు వేద । వారనుతస్వీ
యామేయ మహత్త్వునకుఁ, గామాంతకునకును భక్త । గణపాలునకున్. ౨౪

క. జ్ఞానైకనికేతనునకు, మానిహృదంభోజ దివ్య । మణిమయ పీఠ
స్థానవసతికిఁ విలసజ్జ్ఞానప్రదునకును సర్వ । సద్గుణనిధికిన్. ౨౫

క. హారునకు సంసృతిసాధ్వస, పరిహరణోత్సాహునకు న । భంగురమోదా
కరునకుఁ దాండవకృష్ణహృ,దరవిందదివాకరునకు । సాంబశివునకున్. ౨౬

తే. అంకితమ్ముగ నావ్రాయు । నట్టిదైన, సర్వమంగళాపరిణయ । సాధుకృతికి
భక్తజనబృందకల్పక । పాదపంబు,నకుఁ గథారంభ మెవ్విధి । నమరుననిన. ౨౭

శ్రీ ర స్తు.

# సర్వమంగళాపరిణయము

## ప్రథమాశ్వాసము.

---

### కథారంభము.

హిమాలయవర్ణనము.

చ. అలరుమహీతలంబున మహోన్నతరూపము స్తుత్యమై తగం
గ లలితరత్నకూటముల ♦ గాటపువేడుక దేవదంపతుల్
విలసితదివ్యయానముల ♦ వింతగతుల్ మెఱయం జరింప ని
స్తులమహిమోన్నతిం దనకు ♦ దోడన నేదియు లేనిరీతిగన్. ౧

చ. కనఁబడుచున్ మహోన్నతి నిశాకరముం బుష్కరమున్ స్పృశించుచున్
గనదురుహైమకోపలనికాయపరిచ్యుతభూరినిర్ఝరా
ఘనిబిడసానురాజియయి ♦ గైరికముఖ్యసుధాతుచిత్రిత
ప్రణుత గుహోర్ధ్వభాగమయి ♦ భాసుర భూరిదరీవిశేషమై. ౨

ఉ. ఉన్నతహారిరత్ననివహోత్తమశృంగ గణోర్ధ్వభూములం
దెన్నఁగరాని సంపదల ♦ నెంతయువెల్గెడు వ్యోమయానరా
జి న్నలువొప్పఁ గామినులఁ ♦ జిత్రగతుల్ దగువారిఁ గూడి వే
డ్క న్నలుదట్లనుండి సురకాంతులు వచ్చి వసింప వర్ణ్యమై. 3

ఉ. భీతిదకందరాంతర వివిక్తతమోమయ భూతలంబులన్
జేతము లీశ్వరాంఘ్రిసరసీరుహతేజము గాంచ నేత్రముల్
ప్రీతిని బాష్పముల్ విడువ ♦ [1]పెల్లదగ [2]వంకగతాండజవ్రజం
బాతఱిఁ గ్రోలి తృప్తిఁగన ♦ నట్టి మహోత్తరనిష్ఠ నున్నవి
ఖ్యాతమహర్షు లొప్పఁగ మహామహిమంబున నున్నతంబునై. ౪

ఉ. [3]యామినులందు వజ్రముఖహారిమణీగణకాంతిపుంజముల్

1 పెల్లదగ = మిక్కిలి దప్పిచేత. 2 అంకగతాండజవ్రజంబు = తొడలపైనివసించిన పక్షులగుంపులు. 3 యామినులందు = రాత్రులయందు.

సోమునిరీతి నెల్లెడలఁ జూపఱకుం గనువిందుఁ గూర్ప నే
తామసియందుఁ జూచినను ధ్వాంతము గన్పడమిన్ సురేంద్రు లెం
తే మదులందు శంకఁగన నెంతయు నిర్మలకీర్తి నొప్పుచున్. ౫

మ. హిమసంతానము గ్రమ్మి భానురుచు లెంతే పర్వఁగాఁబూన స
క్రమ మొప్పారఁగ నద్ది కొంత విరియంగాఁ బీతశుభ్రప్రభా
సమయోగంబున వృక్షరాజములు చంచ[1]త్పార్వతీశంకర
ప్రమదాశ్చర్యకరైకదేహతను సంభావింపఁగాఁ జేయుచున్. ౬

ఉ. తరుసందోహము పూన్కిమైఁ బెరుఁగుచుం దారౌఘముందాఁక న
చ్చరలంగూడి యదృచ్ఛఁ గేళిఁదగు వాంఛన్ బొంగుచున్నట్టి ని
ర్జరు లోషా కుసుమౌఘభూషణములన్ రంజిల్లెడుం గంటిరే
తరువర్యంబు లటంచు భ్రాంతిపడఁగాఁ దా నున్నతిం గ్రాలుచున్. ౭

శా. ప్రాలేయోపలసంతతుల్ శిఖరవారం బందోగిన్ మూఁగి యే
కాలం బచ్చటు వీడనౌ ననెడుసంకల్పంబు దైవం బెదన్
బోలన్ జేయునొ యప్పుడే పడుచుఁ బెంపుం బాయుజంతువ్రజం
బీలీలన్ ధర నంచు నిస్వనము లెంతేఁ జేయఁగా నొప్పుచున్. ౮

శా. నారీరత్నముతోడ శంకరుఁడు వింతల్ గూర్చు వేదోల్లస
త్సారం బర్థి వచింప మాధవసరోజాతాసనుల్ దేవతా
వారమ్ముల్ సురమానులున్ వినుచు సద్భక్తిన్ దనుం గొల్వ నెం
తే రంజిల్లఁ బవిత్రమై తగుమహాశృంగంబులం బొల్చుచున్. ౯

చ. పరశివసజ్జటా గళితపావన దేవతరంగిణీ మనో
హరవరవీచికానిచయ హస్తవశీకృతసానురాజియై
నిరుపమభాగ్యమై సురమునిప్రవరాన్వితమై ప్రశస్తకం
దరనికురుంబమై తుహినధామధరంబు నితాంత మొప్పెడున్. ౧౦

వ. మఱియు నమ్మహామహీధరంబు సన్నిహిత [2]కోలాహలంబయ్యు నసన్నిహిత
కోలాహలంబును సత్వాకరంబయ్యు [3]నసత్వాకరంబును [4]భోగిసంసేవిత కూటం
బయ్యు నభోగిసంసేవిత కూటంబు [5]విరతతుహినధామంబయ్యు నవిరతతుహిన
ధామమ్మును [6]విపక్తఋక్షషండంబయ్యు నవిపక్తఋక్షషండంబును [7]ప్రకాశితా
దిత్యమండలంబయ్యు నప్రకాశితాదిత్యమండలంబును, [8]నిత్యసన్నిహితపరమహం

---

1 పార్వతీశంకరప్రమదాశ్చర్యకరైకదేహతన్ = పార్వతీపరమేశ్వరు లనెడు సంతోషాశ్చ ర్యములను గలిగించునొక్కదేహము గల్గుట. 2 కోలాహలము = తదాఖ్యపర్వతము. 3 సత్వము క్రూరజంతువు. 4 భోగి =సుఖి, సర్పము. 5 తుహినధామ, మంచుకొండ, చంద్రుఁడు. 6 ఋక్షము= నక్షత్రము, భల్లూకము. 7 ఆదిత్యమండలము = సూర్యమండలము, దేవతాపంక్తి. 8 పరమహంస = హంసలు, కలహంసలు.

సౌఘంబయ్యు ననిత్యసన్నిహితపరమహంససౌఘంబును, [1]వ్యాళౌఘనిబిడంబయ్యు నవ్యాళౌఘనిబిడంబును, [2]దారాసన్నిధానంబయ్యు నతారాసన్నిధానంబు నగుచు శింశుమారచక్రంబుభాతి ఋషిప్రవరపంక్తి విరాజితంబును, సిద్ధాశ్రమంబు లేవ [3]వ్యాఘ్రపాదసన్నిధానంబును, వైకుంఠంబుచందంబున [4]లక్ష్మీనారాయణ సమన్వితంబును, [5]సత్యలోకంబుకరణి శారదాకమలభవ విరాజితంబును, [6]కైలాసంబురీతి నుగ్రపార్వతీయుతంబును, [7]నాకలోకంబు విధంబున రంభాహేమాహారిణీసంకీర్ణంబును, [8]నాగలోకంబువోలె ననంత కర్కోటకాకీర్ణంబు [9]నలకానగరంబట్లు కుందముకుందనీలభాసురంబును [10]క్షీర వారాశిబలె నోషధీశమనోజ్ఞంబును, [11]సూర్యలోకంబుపడువున ఛాయావిలాసంబును, బరమేశ్వరపదంబుప్రకారంబునఁ బ్రశాంతద్విజనికరప్రకీర్ణంబునై యనుపమానమహిమాస్పదంబై యుండు. ౧౧

ఉ. అందొకకూట మొప్పుఁ దుహినాంశుఁడు సొంపుఁడటంచుఁ గేళినే
యం దగునాకృతిం బొలిచి హారిమహీరుహభూరిశాఖలం
గ్రందుగఁ దారకౌఘము నికామము స్వస్థితిఁదప్పి [12]యంగదం
గందఁగఁ జేయుచుఁ శతమఖప్రముఖాఖిల[13]లేఖజుష్టమై. ౧౨

మ. అది కైలాస మనంగ రౌప్యశిఖరం బౌనంచు శ్రీకంఠమో
దదమంచుం గొనియాడఁగాఁ బడుచు వింతల్ గూర్చుస్థానౌఘమొ
ప్పిదమైయుండఁగ దేవభూసురమునుల్ పృథ్వీశవైశ్యర్షలీ
శదయాకాంతులు సంతతం బలరఁ దేజస్స్ఫారమై యొప్పెడుఁ. ౧౩

ఉ. అయ్యది కూటమన్న ప్రథ నంపక శైలవరం బటం చొగిన్
నెయ్య మెలర్పఁగా సురమునిప్రకరంబులు సన్నుతింపఁగా
నెయ్యెడలన్ సమాన మన నెద్దియు లేక యెసంగు; నందు నా
[14]దయ్యము లొప్పఁగొల్చు సురతల్లజనాయకుఁ డుండు వేడ్కమై. ౧౪

మ. రమణీయస్థలి నందు మజ్జియను పేరన్ ఖ్యాతిచే మించు వృ
క్షము బీజాల్పత వృక్షవిస్తృతిత నిక్కం బౌపరబ్రహ్మా వి
శ్వము లిట్లే గణియింపనౌ జనకుఁడన్ జన్యంబు నా బంధుతన్

1 వ్యాళము=క్రూరసర్పము, క్రూరజంతువు. 2 తారా=నక్షత్రము, తారయను స్త్రీ. 3 వ్యాఘ్రపాద=ఒకముని, పులిపాదము. 4 లక్ష్మీ=శ్లేంకణవృక్షము, నారాయణ = జామచెట్లు. 5 శారద =ఏడాకులరఁటి, కమలభవ = తామరలు. 6 పార్వతి = అడుగుచెట్టు, ఉగ్ర=వసచెట్టు. 7 రంభ= అరఁటి, హేమ=ఉమ్మెత్త, హారిణి=అడవిమొల్ల. 8 అనంత = పిరుపిప్పలి, కర్కోటక = గూరేడు. 9 కుంద=మొల్ల, నిధి. ముకుంద=ఎఱ్ఱఁదామర, నిధి. నీల=నీలిచెట్టు, నిధి. 10 ఓషధీశ=లతావిశేషము, చంద్రుఁడు. 11 ఛాయ=ఒకస్త్రీ, నమేరువృక్షము. 12 అంగద=ఆపద. 13 లేఖ=దేవత. 14 దయ్యములు. దేవతలు.

క్షమ నంచున్ దెలియంగఁజేయు నటులాశావ్యాప్తిన్ రాజిలున్. ౧౫

ఉ. దానిమనోజ్ఞమూలమునఁ దాపసు లెంతయు భక్తి పైకొనన్
మానససీమలం దనఘమంగళపావనపాదపంకజ
ధ్యానము చేయుచుం గొలువ నచ్యుతముఖ్యులు సన్నుతించుచున్
బూని సపర్యలన్ సలుప భూతగణంబులు నిల్చియుండఁగన్. ౧౬

చ. ఉపనిషదోఘభావముల నొప్పుగఁ దెల్పుచు నార్తులైన దే
వపతుల మొఱ్ఱలన్ వినుచు వారి కభీతివరం బొసంగుచున్
[1]దపనహిమాంశుపావకకృతం బగుదృక్త్రితయంబు చిత్రకాం
తి పటలయుక్తి లోకవితతిన్ వెలుఁగొందఁగఁ జేయుచుండఁగన్. ౧౭

మ. శ్రుతిసంఘంబులు రూపయోగమున నచ్చో నిల్చి యావంతయే
శితికంఠప్రభుశక్తి నొక్కయణువేఁ జింతించి పల్కంగ రా
ని తెఱంగుం దెలుపంగఁ బూనినగతిన్ నిశ్చంచలాత్మైకసం
గతభక్త్యుద్గతహర్షబోధకనమస్కారంబులన్ జేయఁగన్. ౧౮

సీ. శైవులు లోకైకశంకరుండగు శివుఁ డంచు, శాక్తులు శక్తియంచు, విష్ణు
వని వైష్ణవులు; [2]సౌర లబ్జబాంధవుఁడని, గాణపత్యులు మహాగణపతి యని,
కాపాలికులు భక్తగణపాలనాదృతిఁ గాంచుభైరవుఁడని కరము భక్తి
భావించి కొలువంగ బహువిధనామభేదములచే నెల్ల మతములవారు

తే. తనునె సేవింపఁ దాఁ బరతత్త్వ మగుచు
సకలలోకాధినాథుఁడై సర్గపాల
నాత్యయంబుల నొనరింప నర్హులైన
వారి నియమించి సమదృష్టి వారిఁ గనుచు. ౧౯

ఉ. తాను నిరంజనుండగుచుఁ దత్త్వవిదుల్ ఘనయోగమూని వి
జ్ఞానతమైకదృష్టిఁ దమస్వాంతసరోజములందు దివ్యతే
జోనిలయాకృతిన్ నిలిపి చొక్కపుఁబ్రీతిని దన్నుఁ జూచుచున్
మానని మోదమంద నసమానమహత్త్వము గల్గి పొల్చుచున్. ౨౦

ఉ. అందమునందు మాకు నిసుమంతయు లోకములందు సాటిచే
యందగు నన్నుమిన్న యొకఁడైనను గల్గునె యన్న గర్వముం
బొందెడునచ్చరల్ తనసముందట నిల్చి యనంగసూదనా
వందనరాజిఁ గైకొనుము భద్రము లిమ్మన సంతసించుచున్. ౨౧

ఉ. ధర్మపథంబుఁ గాచుచు నధర్మము నట్టె యడంచుచున్ మనో
నిర్మలతం జెలంగెడు మునిప్రవరాళికి బాధఁ గూర్ప దో

1 తపనహిమాంశుపావకకృతము = సూర్యచంద్రాగ్నులచేఁ గల్పింపఁబడినది. 2 సౌరులు = సూర్యుఁడె భగవంతుఁడను మతమునకుఁ జెందినవారు.

ఘోర్మ్ములమించు దానవమహోదధి, వాగ్బడబానలంబుచే
నర్మిలి నింకఁజేయఁ దగునట్టి దిగీశులు కొల్వ నొప్పుచున్. ౧౨

చ. ప్రకృతియుఁ బూరుషుండు ననిభాసిలు వారన నొక్కతత్త్వమే
యిఁక ననుమానమేల యను నిద్ధమహార్థముఁ దెల్పఁబూను న
ట్లొక కెలనన్ సురూపవనితోత్తమచిహ్నము పుంస్త్వలక్ష్మ మిం
కొకయెడఁ గన్పడన్ వెలయు నుజ్జ్వలచిత్రశరీర మొప్పఁగన్. ౧౩

ఉ. వృద్ధమునీంద్రు లంఘ్రియుగ మెంతయుభక్తిని గొల్చి వేదసం
బద్ధమహార్థముల్ వినెడువాంఛల శిష్యులెయై చెలంగఁ దా
నిద్ధనవీనయౌవన మదెంతయుఁ జెల్వవహింపఁ జూచువా
రిద్ధరణిన్ విచిత్ర మన నిద్దియె యంచుఁ దలంప నొప్పుచున్. ౧౪

సీ. వ్యాఘ్రచర్మము సంవ్యానమై యుండంగ గజవరచర్మము కట్టువస్త్ర
ముగ బాలచంద్రుఁడు సిగముడిసొమ్ముగ నగ్ని నేత్రము నిటలైకభూష
ణమ్ముగ గరళధనంజయజ్వాలాభయంకర వదనకాలాహి చయము
వలయాదిక కలాపహారమ్ముగా భీతికరపిశాచగణంబు పరిచరతతి

తే. గాఁగ ననితరసాధ్య మహాక్రమము తోడఁ
జేయు సామర్థ్య మొప్పారఁ జిత్రగతుల
జగములం బ్రోచు సత్కృపాశరధి శివుఁడు
నిండుకొలువుండుఁ గన్నులపండు వగుచు. ౧౫

సీ. సురలు వందన మని జోహారులని సిద్ధు లభివాదనములనియఖిలసాధ్యు
లురగులు మ్రొక్కంచు గరుడులు చేమోడ్పు లని కిన్నరులు నతులంచు యక్షు
లాదిగాఁగలనిర్జరాంతరభేదాళియంజలులంచు మహర్షు లొగి న
మస్కారములటంచు మహితశంకరపదపంకజద్వంద్వపరిసరమునఁ

తే. దలలు వంచుచు మర్యాద నెలమి జరప
బ్రహ్మవిష్ణుశతక్రతుప్రభృతు లెల్లె
మ్రొక్క వాత్సల్య మేపార భూరిశుభము
లొలయ నాశీర్వదించుచు నుండు శివుఁడు. ౧౬

సీ. జ్ఞానస్వరూపాయ జ్ఞానిదుర్జ్ఞేయాయ దేవార్తిహరణాయ తే నమోఽస్తు
వేదాభివేద్యాయ వేదాంతరూపాయ దివ్యప్రభావాయ తే నమోఽస్తు
యోగైకగమ్యాయ యోగిప్రమోదాయ దీనశరణ్యాయ తే నమోఽస్తు
మునిపూజితాంఘ్రయే ఘనతపఃఫలదాయ దృప్తవినాశాయ తే నమోఽస్తు

తే. సర్గపాలనసంహార సాధుకార్య, నిర్వహణదక్షపరమేష్ఠి నీరజాక్ష
పరమహారుద్రరూపాయ భక్తలోక, శంకరాయ నమస్తేఽస్తు చంద్రభూష.

చ. అని సనకాదిమౌనివరు లాహరు మ్రోల వచించుచున్ మహా
వినయముమీఱ మ్రొక్కఁగని వేడుక వారల గారవించి యిం

కను దనుఁ గొల్వవచ్చిన ప్రకంపనముఖ్యుల నాదరించి యి
ట్లనియెఁ [1]తటిత్వదారవ నిభాయతనిమ్నగళస్వనంబునన్. ౨౮

ఉ. జ్ఞానధనాఢ్యులార! వెదకం జనుతేఁగ పదప్రసక్తమై
గానఁగ వచ్చుచందమునఁ గాదె భవాదృశమౌనిరాజ సం
తానము రాక లోకతతి ధర్మపథంబు లెఱుంగఁ జెప్పఁడీ
యానుడు లాలకింప, నిపు డాదృతిఁ బూనితిమంచు వేడుకన్. ౨౯

మ. తముఁ బ్రశ్నింపఁగ భక్తిభావమున నోస్థాణూ! మహాత్మా! జగ
త్సముదాయంబున నీ వెఱుంగని విశేషంబుండునొక్కొ సమ
స్తము నీరూపమె కాదె యైనఁ గరుణాధారుండవై యుంటఁ బ్ర
శ్నముచే మాకు యశంబుఁ గూర్పఁగఁ బ్రయత్నం బూనితీవిత్తఱిన్. ౩౦

ఉ. కాన వచించువారము సుఖంబుగ నుండు జగంబు లన్నియున్
దేనఁ గొఱంత గాంచ విక ధీరులు తోఁచినరీతిగాఁ జనం
బూనినవారికిం దగినబుద్ధులు తెల్పుదు రజ్ఞు లందఱున్
మానక వారియానతినె మస్తకమందు ధరింత్రు శంకరా. ౩౧

ఉ. ఐన జనప్రవాద మొకఁ డార్తిని మాదృశమౌనికోటికిన్
బూనిక నీఁదలంచి నటు పుట్టె నదేమన విన్నవింతు మీ
శాన! త్రిమూర్తులం దరయ సారసనేత్రుఁడె యెక్కుఁడంచు వి
జ్ఞానధనాఢ్యుఁ డంచు మునిసంతతపూజ్యుఁ డటంచు నెంతయున్. ౩౨

చ. చెలఁగె సభాంతరాళములఁ జిత్రముగా నిది విన్నమాత్రనే
కలవిలపాటుతోఁపఁ గవికాండము వేదవచస్సమూహముం
దెలుపుచు వాదులాడుచు మతిస్థిరతన్ విడనాడుచున్ సభా
స్థలముఁ బెల్లుగా ధ్వని సెసంగఁగఁ జేయుచునుంద్రు పూన్కిమై. ౩౩

చ. అని తెలుపంగఁ జిత్తమున నచ్చెరు వెద్దియుఁ దోఁపమిన్ ముదం
బును గనఁజేయుపల్కుల సమూహము భక్తులసంశయాళిఁ జ
య్యనఁ దొలఁగింపఁగాఁ బలికె నార్యవరేణ్యులు మీరలట్టిచొ
ప్పునకు విచారముం దెలుపఁ బోలునె సత్యముగావె యానుడుల్. ౩౪

ఉ. సారసనేత్రుఁ డెక్కుఁడనఁ జాలవిచారము పూననేల? యా
పేరును దేవదేవునకుఁ బ్రీతిదమై తగియుండుఁగాదె యా
పే రననేల? యింకఁగల పేరు లవెల్లను జెల్లుఁగాదె యా
భూరితరైకశక్తియయి పొల్చెడు[2]చిన్మయమూర్తి కెప్పుడున్. ౩౫

చ. మనసున కెట్టిరూపము సమస్తవిధంబులఁ దృప్తిదంబుగాఁ

---

1 తటిత్వదారవ...నంబునన్=మేఘధ్వనివంటి గంభీరకంఠధ్వనితో. 2 చిన్మయమూర్తి = జ్ఞానమే శరీరముగాఁ గలవాఁడు.

దనరుచు నెట్టిరూపమును । దాల్చినవానిగ, నామ మెద్ది యిం
పును గలిగించుదానినె విభుం డగు నా పరమాత్మకుం బ్రియం
బనియుఁ దలంచి భక్తిమెయి । ధ్యానము చేయఁగవచ్చు నిచ్చలున్. ౩౬

క. వివిధ బ్రహ్మాండంబుల, నవికలుఁడై యావరించి । యాపరమేశుం
డె వివిధరూపాఖ్యలఁ దాల్చి విరాజిలుఁ బెక్కునుడులు । చెప్పఁగ నేలా. ౩౭

క. జగమునఁ గలిగిన మతములఁ, బొగడంబడు దైవ మొకఁడె పో తలపోయన్
దగు నతని కన్ని పేరులు, తగు సకలాకృతులు నొకఁడుఁ । దగనిది కలదే. ౩౮

చ. ఎవనికి నెట్టిరూపమది । యింపుగనుండుఁ దదాకృతిన్ ధరిం
చి వలయువాని గాఁ దలఁప । శ్రీప్రదుఁడై పొడసూపు మ్రోల దే
వవరుఁ డదెట్టినామమున । భవ్యమతుల్ తనుఁ బిల్వ నో యనున్
[1]భవికము లిచ్చుటాతనికి । నైజముగాదె తలంచి చూచినన్. ౩౯

సీ. ఎల్లెడలం దానె । యెసఁగుచు నద్వితీయంబను తత్త్వమే । దనుచు నుపని
షత్తులు వెదకంగఁ । జాలక చేడ్పడఁ గనుఁగొని యానంద । కలితుఁడగుచు
నేచోట నేపేర । నేరూపమునఁ దన్నుఁ బిలిచి ధ్యానించినఁ । బ్రీతుఁ డగుచు
సమబుద్ధిచేఁ బ్రాణి । సంతతిం జూచుచుఁ దా సాక్షిమాత్రుఁడై । తలఁపరాని

తే. మహిమమున నొప్పుచున్ సర్వ । మయతఁ బొల్చి
యిట్టివాఁడని యెవ్వరే । నెఱుఁగరాక
యుండ వ్యాపించి తేజోమ । యుండుగాఁగ
వెలయుఁ బరతత్త్వ మిఁకఁ బెక్కు । పలుకు లేల. ౪౦

చ. తెలియనివారలే భగవ । తిన్ భగవంతుని వేఱుచేయఁగాఁ
దలఁతురు వారి కెన్నఁటికిఁ । దత్త్వ మిదంచు నెఱుంగఁజాలు జ్ఞా
నలవము గల్గదంచు మది । నమ్ముఁడు జ్ఞానధనాఢ్యులార! యీ
పలుకులఁ గల్గుసత్య మది । పర్వెడుఁగాక జగద్వ్రజంబునన్. ౪౧

క. కుక్షింభరులగు కొందఱు, పక్షీంద్రుఁడు వాహనముగ । భాసిల్లు సరో
జాక్షునకున్ ద్ర్యక్షునకున్, వీక్షింతురు భేద మున్న । విధమున నకటా! ౪౨

క. ఈయిరువు రొక్కతత్త్వ,స్ఫారాంశములే యటంచుఁ । బలుకుఁడు కరుణా
ధారులగువారి కెంతయు, నీరీతి విభేద మొప్పు । నిది యుచితముగదా. ౪౩

క. అజ్ఞులెయయ్యుఁ దమను ప్రాజ్ఞులవలె నుండఁగోర్కి । వఱలఁగ ధరలో
విజ్ఞులు నవ్వఁగ వేదాం, తజ్ఞానము బోధచేయఁ । దలఁతురు మూర్ఖుల్. ౪౪

తే. తమకుఁ దోఁచిన యర్థంబె । తగిన దనుచు
నొరులు చెప్పెడునర్థ మ । దొప్ప దనుచుఁ
దెంపఱితనంబు మీఱ వా । దించుచుండు
వారలే మూర్ఖు లనఁబడు । వారు జగతి. ౪౫

1 భవికములు = శుభములు.

క. యతివేషమూని కొందఱు, మితిమించినయాశఁ బూని । మేదిని స్వేచ్ఛా
జతనమునఁ దిరిగి విత్త, ప్రతతిం గూర్పంగఁ గోరి । భక్తుల మనుచున్. ౪౬

చ. తెలియనిధర్మమార్గముల । తీ రిడియంచు వచించుచున్ జనం
బులఁ బలుభంగి శాంబరిసముద్రమునం బడఁద్రోయఁజాలురీ
తులఁ గనిపెట్టుచుం దిరుగుధూర్తలు యోగులు భక్తు లంచు మె
ప్పులఁగనువారు వార లెటుపూనికఁ బల్కిన నేఫలంబగున్. ౪౭

చ. అని వచియించి యమ్మునులనందఱఁ గాంచి కనంగ నొప్పు నిం
కను జగమందు రేఁగినవికారపువాదఫలం బటంచుఁ జ
య్యనఁ దుహినాంశుశేఖరుఁ డహార్యమహత్త్వము చూప నెంచుచుం
గనియె నదృశ్యతన్ మునినికాయము దేవత లద్భుతంపడన్. ౪౮

చ. కలిగెఁ గదా సుపర్వులకు । గాఢభయంబని యెంచు చందమున్
గలవిలపాటుతోఁ దమ[1]నికాయ్యము లొందిరి, యోగిపుంగవుల్
విలయకృదుగ్రకోప శుచిభీకర కీల లవెట్లు పర్వఁగాఁ
దలఁచునొ యంచు నెంచుచును । దా [2]రుటజంబుల కేగి రవ్వలన్. ౪౯

మ. హరుఁ డాత్మం దలపోసె నొక్కవిధిఁ దద్ధ్యానైకశక్తుల్ హరుం
బరమేశుం గనుపూన్కి దక్షునకుఁ దోఁపం జేసె; నొక్కప్పు డీ
శ్వరుఁ డధ్యాత్మరహస్యముల్ దెలియఁగా । వాంఛించుదేవర్షిని
ర్జరవర్యాళికిఁ దెల్పుచున్నసభఁ జేరన్ వచ్చె దక్షుం డటన్. ౫౦

ఉ. శంకరుఁ డేర్పడం దెలుపుసర్వమహోపనిషద్రహస్యముల్
శంకలఁ బాఱఁదోలఁ గడుశ్రద్ధలు పైకొన నాలకించు చే
ణాంకుని సేవఁ గోరెడుమహర్షులు దక్షునిగాంచి లేచి రా
శంకరుఁ డాత్మ వందనముసల్పి సపర్య లొనర్చె మామకున్. ౫౧

మ. తను నాతిథ్యసపర్యలం దనుపకే । దర్పంబునం బొల్చె నీ
తని నల్లుండని యెంచవచ్చునొకొ యీదక్షుండు గణ్యుం డదె
ట్లనుభావంబున నున్న యాశివుని యత్యాచార మోర్వంగవ
చ్చునొకో యంచుఁ దలంచి గర్వమున సంక్షుబ్ధాత్ముఁడై యాసభన్. ౫౨

ఉ. ఇంచుకయేఁ ద్రపంగనక । యేవిధిఁ దోఁచునొ యట్లు నీచవా
క్సంచయ మెల్లసభ్యు లికఁజాలు ననంగ వచించుచున్ గ్రుధా
సంచలితాంతరంగుఁడయి । శంకరు మోమికఁ జూడఁ బాపమా
నంచుఁ దలంచుచుం జనియె । నధ్వర మొక్కఁడు చేయుకోరికన్. ౫౩

క. హరునకు భాగం బాయ, ధ్వరమున లేకుండఁజేయుతలఁపున దేవో
త్కరమును బిల్చిన వారలు, సరియేయని కాలవశత । సమ్మతిఁ జూపన్. ౫౪

---

1 నికాయ్యములు = గృహములు. 2 ఉటజములు = పర్ణశాలలు.

శా. ఆరంభించెను దక్షుఁ డధ్వరము దైత్యారాతియున్ బ్రహ్మయున్
రారై రయ్యది సాగదంచు మఱియున్ । రానున్న యాపద్విజం
బేరీతిం దొలఁగింపరా దనుచు నూహింపంగ లోకంబులన్
వారల్ దక్షులెయాట; నంత హరుఁ డావార్తాళి లో నెంచుచున్. ౫౫

ఉ. ఊరకయుండెఁ గర్మగతు । లొక్కపుడే ననివార్యరీతి గం
భీరమహాప్రవాహమటు । వింతగఁ బర్వనటం చెఱింగియే;
కోరిక నధ్వరంబుఁ గనఁ । గోమలులం దమిఁగూడి నిర్జరుల్
హారినినాదముల్ చెలఁగ । నంబరవీథిని బోవుచుండఁగన్. ౫౬

చ. కనుఁగొని శంభుపత్ని సతి । కామహరా! జనకుండు చేయఁబూ
నిన మఖముం గనన్ మనసు । నిర్జరదంపతు లేగఁ గాంచఁగాఁ
దనరె ననుజ్ఞయేయనిన । దక్షునకుం గలకాంక్షఁ దెల్పిపో
వను దలఁతేని పొమ్మనిన । భావిఫలంబులు ప్రోత్సహింపఁగన్. ౫౭

చ. సతి యరుగం దలంచె గురుసత్త్వులు కొందఱు శంభుకింకరుల్
క్రతువున కేగి; రందు సురకాంతలయంతరమందు దక్షుఁ డు
ద్ధతిఁ దనుదూఱ నాసతియుఁ । దక్షిణమే గురుయోగశక్తి వి
చ్యుతతనువై హిమాద్రికి నయోనిజయయ్యును బుత్త్రి నాఁదగన్. ౫౮

ఉ. దక్షుఁడు వీరభద్రుని గదానిహతిం దల బ్రద్దలైనఁ దాఁ
దర్పితుని దూషణంబునకు । నర్హఫలంబును గాంచె; నంతఁ గం
జాక్షపితామహుల్ చని మహాత్ముని శంకరు వేఁడి యవ్వలన్
దక్షుని మేషశీర్షునిగఁ । దా రొనరించిరి శక్తి యొప్పఁగన్. ౫౯

మ. పునరుజ్జీవితుఁడై మహానియతి శంభుం బూజలం దన్ప్రియ
వ్వనజాతాక్షు హితోపదేశమున సర్వజ్ఞున్ శివున్ సంస్తుతిం
దనిపెన్ శంకరుఁ డెంతొ తృప్తుఁడయి నిత్యజ్ఞానజానంద[1]శ
ర్మ నిమగ్నాత్మకుఁడై తపోనిరతిఁ దా । రంజిల్లుచుండెన్ వనిన్. ౬౦

మ. తనుఁ దాఁ గాంచుచు నద్వితీయుఁడగుటన్ । ధ్యానంబె యత్యుత్తమం
బనఘుంబున్ సుకృతైకసత్ఫలము నౌ ననుచుం బ్రబోధింపఁ బూ
నినచందంబున నుండె నాశ్రమమునన్; । నిశ్శబ్దమైయొప్పెఁ బ
క్షినికాయంబును [2]సత్వవారము వడఁకెన్ భీతి తమ్మేఁచఁగన్. ౬౧

శా. శాంతాకారము భక్తకోటికి మనస్సంతోషముం గూర్చును
స్వాంతంబుం గలవాఁడె యయ్యు నపుడాస్థానంబునం దుగ్రుఁడై
వింతల్ గల్గఁగఁజేయు నెమ్మొగమునన్ । వీక్షించుభూతాళి క
త్యంతంబున్ భయదాతయై యలరెఁ గార్యం బట్టిదై యొప్పుటన్. ౬౨

1 శర్మము=సుఖము. 2 సత్వవారము = క్రూరమృగములగుంపు.

చ. అమరులు సిద్ధసాధ్యముఖు [1]లాశరు లింకనుగల్గు భూతవా
రముఁ దనుఁ దేఱిచూడఁగను రానివిధంబున నొప్పియుండె దే
వమునులు నద్భుతం బొలయ స్వాంతములం దిదియేటి రూప మే
మి మదినిగోరి యిట్లిచట మేటితపం బొనరింపఁ బూనెనో. ౬౩

చ. అని పలుభంగులం దలఁచి యాహరుచిత్త మెఱుంగరామిచే
ననవరతంబు సంశయములందుచు నుండిరి; కొంతకాల మే
గె నిటులు; భూధ్రపుత్త్రిక యకృత్త్రిమరూపమహత్త్వ మొప్పఁగా
జనకునియింటఁ జంద్రకళచందమునం గ్రమవృద్ధిఁ గాంచుచున్. ౬౪

పార్వతీదేవివర్ణనము.

చ. త్రిదశవరేణ్యకన్యకలు దివ్యతనూరుచి మించునచ్చరల్
ముద మొదవంగఁజేయఁదగుమూర్తిని బోల్చెదుమయక్షకాంత లిం
కఁదగిన దేవభేదములకామిను లించుకయేని సాటిచె
ప్పఁ దగుదురే హిమాచలునిపట్టి కటంచు నుతింపఁగాఁ దగెన్. ౬౫

ఉ. కోమలిమేనుఁ గాంచి లతలకూనలు సిగ్గొకరీతిఁ బైకొనం
గా మిగులం గృశత్వమును గాంచెడుమస్తము లట్టివంచి పైఁ
గా మలయానిలార్భకుఁడు కాఱియపెట్టఁగ నూఁచుచుండఁగా
వే మకరందదంభమున విడ్చును శోకభరాశ్రుబిందువుల్. ౬౬

ఉ. కన్నియమిన్నదౌ మృదులకాయముఁ దాను స్పృశించినంతనే
వన్నియ మాఱఁ గందు ననుభావము తోఁచుటఁజేసి యేమొ శ
క్త్యున్నతి మందమందగతి నూని చరించుచు మందమారుతుం
డన్న సమాఖ్యఁ గాంచె మలయానిలుఁ డెల్లెడలం గ్రమంబుగన్. ౬౭

మ. సుమనస్సంగతి సంతతం బమరియున్ జొక్కంపుమానీంద్రవృ
త్తమునం బొల్చియు నుత్తమోత్తమమృదు ధ్యానంబునన్ నిత్యత
త్త్వ ముపాసించియుఁ గీటజాతియను దుర్వారాపవాదంబుఁ గం
దు మి దేమన్న వ్యర్థన్ శిరోజతను బొత్తుం బాయకే పార్వతీ
ప్రమదారత్నము ప్రాపుఁగాంచియె ద్విరేఫంబుల్ ప్రశస్తిం గనెన్. ౬౮

సీ. క్షయరోగ మనిశంబు గాఱించుచుండుట పాప మంకముగఁ దన్ బాయకుంట
రాహుకేతువులు పర్వములందు నేఁచుట గ్రహరాజయుతి మృతికరము నగుట
జారహితుండని జనులెల్ల దూఱుట సురలొగిఁ గిరణాళి జుఱ్ఱుచుంట
విరహిణుల్ దన్నెప్డు విరసంబులాడుట గురువు తన్గని చాలఁ గుందుచుంట

ఆ. మదిని దలఁచి యింక మర్యాద గనకున్న
నామమాత్ర నుండునేమొ యనుచు

---

1 అశరులు = రాక్షసులు.

భావమందు నెంచి ౹ పార్వతీముఖముగఁ
బుట్టి శశధరుండు ౹ పూజ్యుఁ డయ్యె. ౧౯

మ. [1]అసమానప్రభ లొప్ప నొక్కతఱి మెయ్యారంబుమీఱం గద
ల్ప సమస్త [2]ద్రుహిణాండముల్ వెలయు లీలల్ గ్రాల వర్ధిల్లుఁ ద్రుం
గు సురేంద్రాదులు చూడఁగోరుదురు కోర్కుల్ పండ నారీతిఁ గ్రా
లు సమస్తేశ్వరి భ్రూలతాయుగము పొల్పుల్ భక్తమందారమై. ౨౦

ఉ. పున్నమనాఁటి చందురుని బోలెడు హైమవతీముఖంబు నం
దెన్నఁదరంబుగాని రుచి ౹ నెంతయుమించు [3]విశేషకంబు సం
పన్నిలయంబుగా నెసఁగుఁ ౹ బండితు లద్ది హిమాంశులాంఛనం
బన్నిట దీనికిన్సమమె ౹ యానని పల్కుదు రెంతొ నేర్పునన్. ౨౧

చ. కమల మదేకసంస్థయగుఁ ౹ గాని తదీయసహోదరుండు ద్వే
షము గను నన్నుఁగాంచి యిదిసాధుసమావృతిఁ గాంచునట్టిమా
ర్గమె యనియెంచి శీతగిరికన్యక దృగ్యుగమాచుఁ జంద్రుపొం
దమరుట శర్మముం గనియె ౹ నంబుజజాతి జగద్విజంబునన్. ౨౨

మ. అనురాగంబన సర్వకాలయుతియేయా నన్నసిద్ధాంతమున్
జనవారంబున కెప్పుడుం దెలుపఁగా ౹ సంకల్ప మొప్పారఁ జ
య్యన శీతాద్రిజకుం గనీనికలుగానై పద్మయోగంబుఁ బా
యనిమాడ్కిం జెలువారె భృంగతతి నిత్యైశ్వర్యముం గాంచుచున్. ౨౩

చ. శ్రుతులకు భూషణంబు రవిసోములె వారె జగత్ప్రవృత్తి నా
దృతిగలిగించు వార లను ౹ నీవిధిఁ దెల్లముచేయఁగోరి స
మ్మతి గిరిజాశ్రుతిద్వయిని ౹ మానితకుండలయుగ్మమూర్తులై
చ్యుతి యనలేని కాంతులను ౹ శోభిలుచుండ్రు దివానిశాకరుల్. ౨౪

చ. నగజకుఁ గుండలంబులయి ౹ నైజరుచుల్ వగఁ దమ్మిచుట్టమున్
బొగచెలికాఁడు పొత్తుగని ౹ తోరపువేడుకమై మహాశ్రయం
బు గలుగ నేకొలంతలును ౹ బుట్టవ దెవ్వరికైన నంచుఁ జ
క్కఁగఁ దెలుపంగఁ బూనినటు ౹ క్రాలుచునుందురు సర్వకాలమున్. ౨౫

చ. అసదృశ పద్మరాగమణి ౹ హారిరుచుల్ గయికొంచు వానియం
దు సరసిజాతబాంధవుని ౹ దొల్లి మథింపఁగ రాలినట్టి చూ
ర్ణసమితిఁ జేర్చి చెక్కిళుల ౹ రమ్యవిధిం దుహినాద్రిజాతకున్
బిసరుహసూతి యేర్పఱచె ౹ వింతగ నూతనసృష్టి చూపఁగన్. ౨౬

1 "తవాజ్ఞామాలంబ్యక్షణచలితయోర్భ్రూలతికయోః." అని శ్రీశంకరభగవత్పాదులు వచించినదానిసారమే యిది. 2 ద్రుహిణాండములు=బ్రహ్మాండములు. 3 ముఖచంద్రకళంకాభ మృగనాభివిశేషకా = అని ప్రమాణము.

ఉ. కామినిదౌ కపోలఫలకద్వయిఁ దోఁచుచు నుండునాజగ
త్స్తోమము సర్వకారణత శోభిలు నాపరదేవి యీమెయే
కామితదాత్రి నాఁదనరుఁగా యని జ్ఞానులు సన్నుతింప సు
శ్రీమహనీయ యంచొగిని జెప్పక చెప్పెడు స్పష్టరీతిఁగన్. ౨౭

చ. ఇరువురమే జగద్వితతి నెన్నఁ బ్రధానుల మంచుఁ దెల్ప భా
స్కరహిమరశ్ము లాశిఖరిజాతకు ఘ్రాణసురంధ్రరూపతన్
బరఁగి యిడాఖ్య; పింగళయనందగు పేరులఁదాల్చి తద్ధృదం
తరగత లోకసంతతికి దారిగ నుందురు సర్వకాలమున్. ౨౮

సీ. వదనానిలంబు వెల్వడునంతలోన బ్రహ్మాండముల్ ప్రభవిల్లి యలరుచుండు
మరల నయ్యది లోని కరుగునంతటిలోన విశ్వంబులన్నియు విలయమందు
విశ్వముల్ సృజియించి వెలయించి యడఁగించు విధిహరిరుద్రులు వేనవేలు
తమవిశ్వములతోడఁ దా రంతమొందుదు రవ్వారె శాశ్వతులనుట యెట్లొ
తే. యనుచు సనకాదియోగీంద్రు లభినుతింప
నఖిలకారణకారణ మగుచు నొప్పు
నద్రిపతికన్యకామణి హారివదన
కమల మెంతయు రాజిల్లు సమతలేక. ౨౯

చ. వివిధకళావిశేషములు విద్యలు గల్గినసంపుటం బిదే
యవు సుజనోత్తముల్ గొలువ నబ్బు నవౌ నవి దీనిమూఁతయే
ద్వివిధముగాఁ జెలంగఁ దగుఁ దెప్పున దానిని దీయవచ్చు న
న్న వెరవునన్ బ్రవాళరదనచ్ఛదముల్ విధి కూర్చె లేమకున్. ౩౦

చ. అఱువదినాలుగౌను గళ లందును రెండొకదంతమం దొగిన్
వఱలును నిస్సమానవిభవంబున నంచుఁ బ్రసిద్ధిఁగాంచ నం
దఱ కెఱుఁగంగఁ జేయునటు తామరసాక్షికిఁ బద్మసంభవుం
డెఱిఁగియె రెండు ముప్పదియు నిద్ధరదంబులఁ గల్గఁజేసెఁ దాన్. ౩౧

మ. సకలామ్నాయవిశేషశాస్త్రముల దోసారంబు సర్వంబు నిం
చుకయే న్యూనతఁగాంచకుండ ధరియించుం బ్రీతిభాషించు న
న్నకథన్ రూఢిగఁజేయఁ జేసె విధి యానారీమణీజిహ్వా వ
న్నె కడుం గ్రాల రసజ్ఞయన్న ప్రథ నందెన్ ధాత్రి నాఁ డాదిగన్. ౩౨

మ. తను సేవించెడు సాధుబుద్ధుల మనస్తాపంబులం దీర్ప నో
పు నభంగాభయముద్రఁ గాంక్షితములం బూరించుశక్త్యున్నతిం
దనరం జాలు వరాఖ్యముద్రఁ దగు హస్తద్వంద్వమున్ భూధ్రరా
ట్తనయారత్నము దాల్పఁ గూర్చె నజుఁ డుద్యత్సృష్టినిం జూపఁగన్. ౩౩

సీ. హృదయకాసార మం దెంతయు సొంపుగా జనియించి కరుణారసంబు సంత
తము లోనఁ బ్రవహింప నమలకాంతిని బొల్చి ధర్మాత్ములకు వాంఛితములనిచ్చు
పటుమహత్త్వము గాంచి భవ్యచిహ్నంబుల వెలయుచుఁ గరపద్మములు వదలక
వర్ణ్యతమంబులై భాసిల్లుబాహు సువర్ణప్రతానసద్వంద్వ మలరఁ
తే. గనె చమత్కృతి నిర్మించెఁ గమలజుండు, హిమమహీధరపుత్త్రికి నింపుమీఱ
నవ్యసృష్టిప్రభావంబు నం దదాది, గనె భుజంబులు కమలసంగతిని గనుట. ౫౪

మ. మనసెంతో యమలంబుగా వఱలు నామాన్యుల్ తనర్చన్ సంతతం
బును గొల్వం దదభీష్టసంతతిని సంపూర్ణంబు గావింపఁగా
ననుకంపామృతసాగరంబె హృదయంబై యొప్ప నిర్మించె సృ
ష్టిని దాఁ బొందిన నేర్పుమై విధియు మేల్ చిత్రంబుగా గౌరికిన్. ౫౫

ఉ. పొక్కిలియన్ సుధాసరసిఁ బొందుగ మున్గ గుణత్రయాఖ్యఁ బెం
పెక్కిన మూఁడులోకము లహీనవిభూతులఁ గానవచ్చు న
వ్విక్కడ నంచుఁ దెల్పుటకె యేర్పడినట్టి పథత్రయంబుఁ బె
రెక్కినపండితుల్ త్రివళు లీయవి యంచు వచింత్రు నేర్పునన్. ౫౬

చ. అమృతసరోవరం బనఁగ నగ్గిరికన్యక నాభియొప్పు నం
దమరి యురస్స్థలంబువఱ కౌర! యనంగఁ జెలంగు లోమవా
రము మృదులప్రతాననిగ రాజిలు దానిఫలద్వయంబె లో
కములకు జీవనప్రదము కమ్రపయోధరసంజ్ఞచేఁ దగున్. ౫౭

చ. వితతరజోగుణంబుననె విశ్వములెల్ల మదిచ్ఛచేత నా
వృతములె యయ్యె నిత్యమని యెల్లరకుం దెలుపంగఁ బూనుప
ద్ధతి నరుణారుణాంబరముఁ దా ధరియించి గిరీంద్రపుత్త్రి ద
క్షత వెలయింప నొప్పుఁగటి కమ్రకళావిభవాభిరామతన్. ౫౮

శా. నాదబ్రహ్మమె యా నుపాస్య మది యానందప్రదంబౌ నిదే
వేదాంతాశయ మంచుఁ దెల్పుటకె సంపీతప్రభారాజి వ
జ్రాదుల్ కింకిణులై హిమాచలతనూజాంచన్మహారమ్యకాం
చీదామంబును గూడి సూక్ష్మరవముం జేయున్ మనోజ్ఞంబుగన్. ౫౯

చ. సిరిమగఁ డాదిఁ గూర్మమయి శ్రీనిధియై తగు యోగమాయకున్
ధరవరపుత్త్రినాఁ బరఁగి తత్త్వము తానగు లోకమాతకున్
వరచరణాగ్రయుగ్మమయి భక్తిభరంబునఁ బాయమింగవీ
శ్వరు లది కూర్మపృష్ఠ మని పల్కుదు రాచరితం బెఱుంగమిన్. ౬౦

చ. అమలనఖంబు లాహిమధరాగ్రణికన్యక కెంతొ వింతగా
నమరి కళంకహీనుఁడగు నయ్యమృతాంశునిఁ గాంతి మించి మ్రొ

క్కు మునులదౌ తమోగుణముఁ గూల్చి రజంబు దూలఁగఁజేసి స
త్త్వము వెలయంగఁ జేయుచును భక్తిని బెంచును నేర్పుమీఱఁగన్. ౯౧

శా. ప్రాలేయాద్రికుమారికా మృదులసత్పాదాబ్జయుగ్మంబు భా
జాలంబుల్ వెలయించి యాకసమునన్ సప్తాశ్వబింబంబుగాఁ
గ్రాలం జేసెఁ దదాదిఁ బద్మసఖుఁ డన్ ఖ్యాతిం గనెన్ భాస్కరుం
డోలిం బంకజమంగళంబె మదిలో నూహించుచుండుం దమిన్. ౯౨

మ. ఇదియే సంతతసేవ్యమౌ నిదియె పో యిష్టార్థదానక్షమం
బిదియే యోగివిముక్తిదం బగును జుమ్మీ యంచు శ్రోత్రైకశ
ర్మద మంజీరకలధ్వనుల్ తెలుపఁగా రాజిల్లు కాత్యాయనీ
పదపద్మద్వయి దేవతల్ తలలఁ దాల్పం బొల్చు నత్యంతమున్. ౯౩

మ. కలహంసీతతి భద్రకుంజరములున్ గాత్యాయనీకన్యకా
విలసద్దివ్యతమాంఘ్రిసంచరణముల్ వీక్షించి పల్మాఱు ని
స్తుల తన్మందమనోజ్ఞయానమును దోడ్తో నెంతయో వింతనే
ర్పలరన్ నేర్చెఁ దదాది సాధుగతులం బాటింత్రు తత్సామ్యమున్. ౯౪

మ. తపనీయంబు మణీగణంబుఁ దమలోఁ దారే వితర్కించుకొం
చపవాదంబు జనింపకుండఁ జని యాయద్రీశకన్యాలస
ద్వపువున్ భూషణదంభమూని స్పృశియింపం గల్గె నద్దానఁ గా
శ్యపి విఖ్యాతిని బావనత్వమును గాంచం జాలె నెల్లప్పుడున్. ౯౫

సీ. నవ్యపల్లవము వింతగఁ గర్ణభాగంబునం దలరించి విఖ్యాతచూత
కిసలయమ్మును వేణిఁ గీలించి యద్దాని చుట్టును గుందప్రసూనములను
బొదిగి వన్యములగు పూవుల పేరులు హృదయభాగంబున నెంతొ వేడ్క
భాసిల్లుచుండంగ వనమయూరకలాప మొకచెవిసందున నొప్పుచుండఁ

తే. సంతసంబునఁ దనవెంట సమవయస్కులైన, సకియలు రాఁగ నిత్యమ్ము వనుల
సర్వమంగళ విహరింప సకలమునులు, చూడ్కులానందమున మున్గ జాతురొకట.

చ. సరసులఁ బంకజాతముఖచారుసుమంబులఁ బెల్లు రేఁగు నా
పరిమళముల్ గ్రహించి వనపాళి నెసంగెడు పూలతావులం
బొరలుచుఁ జందనద్రుమసమూహమునన్ విహరించి వాయు వా
దరమునఁ బార్వతీతనులతం గొలుచున్ భయభక్తు లొప్పఁగన్. ౯౬

చ. ప్రతిదివసాంతమందు గిరిరాజకుమారిక యక్షకన్యకా
ప్రతతులు తన్నుఁ గొల్వ వనపంక్తి విహారము సల్పఁబోవ స
ప్రతిమ పదాబ్జచిహ్నములఁ బర్విడు పంకజవజ్రరేఖలన్
శతమఖముఖ్యులెల్లఁ గని శ్రద్ధను మ్రొక్కుచుఁ గొల్తు రెంతయున్. ౯౭

ఉ. గౌరి శిలోర్ధ్వభాగములఁ గమ్రతమాంఘ్రియుగంబు మోపి శృం
గారగతుల్ చెలంగఁ జనఁగా మునివర్యులు తత్పవిత్రచి
హ్నోరుశిలాతతిన్ గొలువ నున్నతపుణ్యఫలంబు లబ్బ నం
చారసి శాస్త్రరీతి వివిధార్చనముల్ పొనరింత్రు భక్తితోన్. ౯౯

చ. ప్రకృతి యమేయశక్తిమెయి భక్తులవాంఛల నెల్లఁ దీర్పఁబ్రో
ర్కి కలుగ ధర్మరక్షణమె కేవలకృత్యముగాఁ దలంచి రూ
పకలితయౌచు శైలవరబాలిక నాఁదగి యున్న దంచు నే
ర్పుకలిమి ధ్యానయోగమునఁ బూని తలంతురు యోగిపుంగవుల్. ౧౦౦

చ. సిరియును వాణియున్ సకలసిద్ధసుపర్వసతీలలామముల్
హరిహయురాణియున్ మనసులం గల ప్రీతిని సర్వమంగళన్
బరశివురాజ్ఞిఁ గాఁగలుగు భాగ్యము గల్గినయోగమాయఁ గా
ర్యగతిని బొల్చినట్టిసతి నాగిరిజం గన వత్తు రొక్కటన్. ౧౦౧

ఉ. పున్నమలందు హైమవతి పూజ్యపదంబులఁ గొల్వవచ్చి యా
కిన్నరకాంత లొక్కమొగిఁ గేవలభక్తిరసంబు పొంగఁగా
సన్నుతియోగ్యగీతముల జానుగఁ బాడఁగ నానినాద మ
భ్యున్నతమోదదం బగుచు నొప్పెడు బ్రహ్మముఁ దెల్పుచుం దగున్. ౧౦౨

ఉ. వృంతమునుండి కోరకము వెల్వడినంతనె కూడ వాసనల్
వింతగఁ బుట్టు నన్నసుకవిప్రతిపాదిత నీతివాక్య మా
వంతయు రిత్తగా దనెడునట్టులు భూధ్రకుమారితోఁ గళా
సంతతి యెల్లవిద్యలును జన్మము గాంచి వరించె నంబికన్. ౧౦౩

ఉ. ఒక్కొకవేళ నాసుదతి యున్నతసౌధముమీఁద వేడుకం
బెక్కుకుమారికల్ గొలువ వీణియ మీటుచుఁ బాడుచుండ నా
చక్కనిబోఁడు దేవమునిసత్తముఁ డాస్వన మాలకించి యే
యిక్కకుఁబోవఁ దోఁప కటులే నిలువంబడు నెంతకాలమే. ౧౦౪

ఉ. భారతి తానుగోరియె విపంచికమీటఁగ నేర్పవచ్చి యా
సారసనేత్ర యంగుళులఁ జానుగఁ దంత్రులమీఁదనుంచు నా
నేరుపుగాంచి తాను విన నెమ్మిని వచ్చినజాడదోఁచు న
ల్లై రహిఁ మాటలాడి చను నెన్నఁడు రాఁ దలకార్యసంగతిన్. ౧౦౫

చ. హిమకిరణోపలంబుపయి నింతి ముదంబునఁ గూరుచుండి యం
కమున విపంచిఁ జేర్చి యదిగండతలంబు స్పృశించి సవ్యక
ర్ణము సయిదోడుగా నమర నాదముఁ బర్వఁగఁజేయుచుండ భృం
గములును ఝంకృతుల్ చెలఁగఁగా జతనంబునఁ బాడుఁ దోడుగన్. ౧౦౬

ఉ. నాదమె బ్రహ్మమౌ నది యనంతసుఖప్రదమౌను బండితా
మోదముఁ గాంచినట్టిదియపో యనుభావము సర్వమంగళా
పాదితవాద్యనాదము సుపర్వమునీశ్వర సంఘుసమ్మతం
బై దనరారుటన్ జగములందుఁ బ్రసిద్ధిని గాంచె నెంతయున్. ౧౦౭

చ. వరుసగ సర్వమంగళకు ఽ బాల్యము వాయఁగ యౌవనంబు సుం
దరగతి రాఁ బ్రయాణమయి ఽ దాపును జేరఁగ మౌగ్ధ్య మెంతో సం
బరమున దూరభూమికిని ఽ బాఱఁగ నాకృతి చూడనొప్పె నె
క్కరణిని నిర్ణయించుటకుఁ ఽ గాని తెఱంగున నెంతవారికిన్. ౧౦౮

సీ. కనుఁగవ యాకస్మికముగ నిందీవరదళకాంతి నెంతయుఁ ఽ దా గడించె
ముఖమండలమ్ము కుముదమిత్రమండలమును గెల్చుసాహసమునఁ జెలంగెఁ
బలుకులు నైజకోమలత నించుకవీడి గంభీరభావమ్ము ఽ గలిగి వెలసె
హృదయైకమగ్నత ఽ నెసఁగెడుపాలిండ్లు తలచూపఁదగునని ఽ తలఁచి నిక్కెఁ

తే. బలుకులంగల తీవ్రత ఽ భంగపఱతు, ననుమహోద్యోగమునలజ్జయలముకొనియె
నద్రిపతిపుత్త్రికిన్ బాల్యమంతరింప, మెల్లమెల్లన లావణ్య ఽ ముల్లసిల్లె. ౧౦౯

ఉ. అచ్చరమిన్నలున్ దివిషదంగనలున్ మఱి సాధ్యకాంతలున్
మెచ్చఁగఁజాలు రూపమున ఽ మించెడు యక్షసరోజనేత్రలున్
ముచ్చటలూరఁగాఁ బెరుఁగు ఽ భూధరకన్యకఁ గాంచి విస్మయం
బచ్చుపడంగ నన్నలువ దా నవసృష్టిని మెత్తు రాత్మలన్. ౧౧౦

చ. తనువు త్రినేత్రు కోపశిఖి ఽ దారుణకీలల దగ్ధమయ్యె నా
త్తని ననుఁ గావఁగాఁ దగుదు ఽ తోయజలోచన యంచు భావజుం
డనునయమొప్పుచుండఁ దుహినాచలకన్యక నాశ్రయించి లో
కనిచయమున్ జయింప మదిఁగాంక్షను బూనె ననూనశక్తిచేన్. ౧౧౧

సీ. మదనుఁడీరీతి నాసుదతి ప్రాపుననుండు టరసి తదీయసాయకము లైదు
ప్రభువుచెంత వసింప ఽ బాగని తలపోసి యరవింద ముత్పల ఽ మఱియుగళ
ముగను, జూతాశోకముల ప్రవాళంబులు కరతలమ్ములుగను ఽ గమ్రనవ్య
మల్లికాముకుళముల్ ఽ సల్లలితదశన రూపమ్మునన్ వరారోహ నాశ్ర

తే. యించి మించెను నెమ్మది ఽ నిట్లు తరుణి, యసదృశాకృతి వెలయుచు ఽ నఖిలలోక
పాలనాసక్తి నొందినలీల మెఱసె, నభినవాద్భుత యౌవన ఽ మాశ్రయింప.

మ. హిమవంతుండును బుత్త్రికామణి నదెంతేఁ బ్రీతిమీఱంగఁ జూ
చి మదీయంబగు సంతతిన్ వరయశశ్శ్రీమంతమై యొప్పున
ట్లమరింపం బరదేవియే గలిగె నెయ్యంబొప్ప నంచెంచె; మే
న మహానందముప్పొంగ నెంచె సుతకున్ ఽ నాథుం డెవం డబ్బునో. ౧౧౩

చ. కులగుణరూపశీలములకుం దగియుండఁగ నొ వరుండు నం
దుల కిఁకనైనఁ జేయఁదగుఁ । దోరపుయత్న మటంచు భర్తకుం
దెలుపఁగ నెంచె; నట్టులె మదిం దలపోయఁగఁ జొచ్చె నాకుభృ
త్కులపతి యల్లె బంధువులు । కోరిరి కన్యకు నర్హుఁడౌపతిన్. ౧౧౪

చ. గిరిజయు నంత దైవగతికిం బ్రతిచేయఁగఁజాలు శక్తిచేఁ
బరఁగియు నాత్మ నెంతయుఁ దపం బొనరించెడు వేడ్కఁ గాంచెఁ; దా
రురుఫలసిద్ధులయ్యును మహోత్తము లన్యుల కెల్లఁ దెల్పనా
దరమున సాధుకర్మములఁ । దద్దయుఁ జేయుచు నుందు రెగా యిలన్. ౧౧౫

ఈశ్వరతపోవర్ణనము.

మ. హరుఁ డంతన్ హిమశైలపార్శ్వమున మాహాత్మ్యాంభోధిమగ్నాత్ములం
బరమధ్యాననితాంతరక్తులను గా । వర్ధిల్లఁజేయంగ నో
స్థిరశక్తిం గని యోగిసేవ్యమగు నాసిద్ధాశ్రమం బందు ని
ర్భరయోగంబును బూనియుండెఁ; బ్రమథుల్ సద్వారంబుఁ గాపాడుచున్. ౧౧౬

ఉ. ఎవ్వరికేఁ బ్రవేశ మన । నెట్టిదియో మఱువంగఁ జేయుచున్
బువ్విలుకానివైరి దగుభూరితరాజ్ఞను మౌళిఁ దాల్చి యే
యవ్వసుధం బ్రమాదమునునద్ది యెఱుంగక రాత్రులుం బవల్
దవ్వులనుండు భూతములు । తద్దయు భీతిలునట్లు చేయుచున్. ౧౧౭

చ. చటులపరాక్రమంబు సురసంతతు లద్దిరె యంచు మెచ్చఁగాఁ
బటుతరహుంకృతుల్ చెలఁగ । వారనిభక్తిని బొల్చి; నంత ధూ
ర్జటియును సర్వభూతతత । సాధ్వసదంబగు రూప మొప్ప లో
దిటవు నదెవ్వరేఁ దెలియు । ధీవులు లేనటు లుండె యోగియై. ౧౧౮

శా. తేజోరూపమె యాపరాత్పరునిదౌ । దీపించు నారూప మే
యేజాతిన్ జనియించుప్రాణికయినన్ । హృద్దేశ మందెప్పుడున్
రాజత్కాంతిని; బ్రాణివర్గిలును దానం బాయఁగా నద్ది యే
యోజన్ వర్ధిలకే యడంగు నదియే । యూహింప దైవం బనన్. ౧౧౯

చ. సకలజగంబులం బరఁగి । సర్వమునీశ్వరసంస్తుతం బటం
చకలుషకీర్తి గాంచి నిగమాగమవిశ్రుతమై తనర్చి యొ
ల్లకడలఁ దానయై శుభదలక్షణ రాజి వెలుంగు తేజమే
ప్రకట పరాత్పరం డనఁగ । భాసిలు నాపరతత్త్వ మద్దియే. ౧౨౦

ఉ. ఎల్లెడలన్ వెలుంగు పరమేశ్వరు తేజము దానిఁ గొల్చువా
రల్లన ముక్తిఁగాంతురు మహాత్ముఁడు శంకరుఁ డప్పు డట్టిభా
స్వల్లలితాత్మతేజ మన । నర్హితమై తగుదాని లోననే
యల్ల నడంచి ప్రాకృతునియట్లు తపం బొనరించె నేప్పునన్. ౧౨౧

మ. తనతత్త్వంబునె తా మదిం దలఁచుచున్ । దత్త్వాంతరం బొందులే
కునికిం దెల్లము చేయుచందమున నట్లుండెన్ మహాయోగిచా
డ్పున నిశ్శబ్దముగాఁ దదాశ్రమము సొం।పుల్ గూర్పఁగాఁజాలియున్
ఘనభీతిం గొలుపంగఁ బూనినటులే । కానంబడెన్ ఘోరమై. ౧౨౨

ఉ. ద్వారము నందికేశ్వరని।వాసము దానిని జూడవచ్చువా
రేరును గానరా రతఁ డ।హీనపరాక్రమశాలి వేత్రసం
చారము చేతనే మిగుల । సాధ్వసముం గలిగించుచుండ నా
సారససంభవుండయినఁ । జాలకయుండెను రాఁ దలంపఁగన్. ౧౨౩

ఉ. చీమ చిటుక్కుమన్న గిరి।శేఖరుఁ డెల్లెడ మాఱుమ్రోఁగున
ట్లోమను శబ్దమే యొసఁగు।చుండెను; భూరుహముల్ ప్రతానసీ
స్తోమము కూడఁ జంచలతఁ । జూపక నిశ్చల చిత్తవృత్తిమై
నేమము నూనిన ట్లమరె । నీడజముల్ వసియించె నట్టులే ౧౨౪

చ. ప్రమథగణాధినాథుని వి।రాజితవేణులతాభిషంగహ
స్తు మలయమారుతుండు కడు । దూరమునుండియె కాంచి సాధ్వసం
బు మయిఁగొనంగఁ బత్త్రముల । పుంజమునందె యడంగియుండె; శ
బ్దము వినరా దదేదియును । భావమె కార్యము లెల్లఁ దీర్పఁగన్. ౧౨౫

ఉ. రెండవప్రేల్ గదల్చునో గి।రిప్రియచాపుని మేటిభృత్యుఁ డు
ద్దండపరాక్రముం డతని । దారుణకోపహుతాగ్నికీలలే
తాండవమాడుచుం గవిసి । దగ్ధముచేయవె లోకజాల మం
చుండిరి నిశ్చలత్వమున । నొక్కవిధిన్ దివిజుల్ మహార్తులై. ౧౨౬

క. ఆనాఁటినుండి తర్జని, నా నెగడెన్ రెండవది య।నం జను ప్రేలం
చూనిన శ్రద్ధం బల్కుదు, రానిర్జరవర్యు లిట్టు । లాశంకరుఁడున్. ౧౨౭

క. అసమానయోగమునఁ దా, నెసఁగుచు నేకార్యమైన । నెద నెంచక యుం
డ సమస్తదిక్పతులు దే,వసమితియున్ భీతి నిండు।స్వాంతము లొప్పన్. ౧౨౮

క. ఇది యేమికాలగతియో, ముదమున భక్తాళిఁ బ్రోచు । పురహరుఁడి ట్లీ
యదనున మౌనసమాధిం, బదిలుండై యున్నవాఁడు । పని యేదియొకో. ౧౨౯

ఉ. హుంకృతిమాత్ర భూతగణ । మొప్పవొలంగఁ దపించుచున్నదే
వంకను రక్షకుండు కృప।వర్ధిలఁ గాచెడుజాడ గానరా
దింక జగల్లయంబె యని । యెంచఁగ నోఁ బ్రతి చేయఁ జాలకే
పంకజగర్భముఖ్యు లొగిఁ । బాఱెడుచందము తోఁచెడుం గటా! ౧౩౦

చ. అనియిటు దిక్పతిప్రభృతు । లార్తి మునుంగుచునుండ శంకరుం
డనుపమయోగనిష్ఠ తగు।నట్లుగ నుండెఁ; దదాశ్రమంబు శాం

తిని దెలియంగఁ జేయుచు నతిస్థిరయోగవిశేష మిట్టిదే
యని యెఱిఁగించుచుండె; నిటలాక్షుఁడు తీవ్రతపఃప్రసక్తిచేన్. ౧౩౧

సీ. తనదివ్యతేజంబుఁ ౹ గనుచు మహానందవార్ధి నిమగ్నుఁడై ౹ వఱలుశక్తి
సంకుచితము చేసి ౹ సకలభూతభయంకరాకృతిఁ దాల్చి ౹ నట్లు తోఁచఁ
జేయుచుఁ దనయూహ ౹ లీయెడ నిట్టి వంచెంతవారికినైన ౹ నెఱుఁగరాని
యట్లుగా మెలఁగుచు ౹ నఖిలకార్యంబుల వదలి తీవ్రతపఃప్రభావ మిట్టి

తే. దనుచు భక్తులకెల్ల నెయ్యమునఁ దెలుపఁ
దలఁచియే యుండె నేరితోఁ ౹ బలుకకుండ
జరగె నిటు కొంతకాలంబు ౹ నిరుపమాన
తపము కలిమికి భూతముల్ ౹ తత్తఱపడ. ౧౩౨

మ. చెలరేఁగెన్ గగనాంగణంబునఁ దపశ్శ్రీతేజ మత్యుగ్రమై
విలయంబుం గలిగింపఁ బూనినటు లుద్వృత్తిన్ [1]బృహద్భానుకీ
లలె పో యివ్వి యటంచు నెల్లప గతోల్లాసంబునన్ జిత్తవీ
థుల భావింపఁగ భీతిదంబగుచు నెంతయుం జూచినం దానరై. ౧౩౩

సీ. ఇదియె నూతనసృష్టి ౹ యినబింబమే యిది యగునంచు భాస్కరుం ౹ డదరిపడఁగఁ
బ్రళయకాలానిల ౹ వర్షమ్మె యిదియగు ననుచు [2]విద్యుత్సంగ ౹ తాగ్ని యొదుగ
జగముల దహియింప ౹ నిగిడెడు హరునేత్రవహ్ని యిద్దని సమ ౹ వర్తి యడల
జలములఁ బడియుండఁ ౹ జాలక లేచిన బడబాగ్ని యిదెయని ౹ ప్రజలు వడఁక

ఆ. సంబరమునఁ బ్రాఁకి ౹ యర్కు నాచ్ఛాదించి, దెసల నిండి ప్రాణి ౹ విసరమునకు
భీతిఁ గొలుపఁజాలి ౹ వెసవెసఁ బర్విను, సరణి తోఁచఁజేసె ౹ సురలకెల్ల. ౧౩౪

చ. మునివరు లోమహాత్మ శివ ౹ మూర్తివి నీవన నిట్టు లుగ్రరీ
తిని దప మేల చేసెదవు ౹ దీనిని మానఁగదయ్య భక్తరా
జిని గొని కావవయ్య యిఁకఁ ౹ జెప్పఁగఁ జాలినవారు లేరు మా
కని భయభక్తు లొప్పఁగతి ౹ నంజలు లొగ్గుచు వేఁడి రార్తులై. ౧౩౫

చ. కలుషయుతాత్ములం గదిసి ౹ కాల్చునుగాక మహాతాపసుం డితం
డిలపయిఁ బ్రాఁకి యెల్లరను ౹ నిత్తఱిఁ గాల్చునొకో యటంచు య
తులు ఫణినాథులున్ భవుని ౹ గూర్చి సగం గడుఁగుంది ప్రార్థనల్
సలుపఁగఁ గిన్నరోత్తములు ౹ చాలఁ దపించుచు మ్రొక్కుచుండఁగన్. ౧౩౬

చ. పరశివుఁ డెల్లదుష్టులను ౹ భస్మము సేయఁ దలంచుచుం దపో
నిరతిని బూనియుండెఁ గన ౹ నేరక వాని సుపర్వు లక్కటా!

1 బృహద్భానుకీలలు = అగ్నిమంటలు. 2 విద్యుత్సంగతాగ్ని = మెఱుపుఁదీగతోడి సంబంధముగల యగ్ని.

కరమిది దారుణం బనుచు । గాఢభయంబునఁ గుంది రిట్టు లా
తరుణము లోకభీతిదము । దానవనాశకరంబునై తగెన్. ౧౩౭

హిమవంతుని జూడ నారదుండు వచ్చుట.

మ. ఒకనాఁ డాహిమవన్మహీధ్రవిభుఁ డత్యుత్సాహ మొప్పంగ మే
నకయుం దాను రహస్యగోష్ఠి దుహితన్ । నాథాన్వితం జేయు వే
డ్కఁ గడున్ మించఁగ నెంచుచుండ సురలోకం బెల్ల వీక్షించి మా
నక మర్త్యంబునఁ గ్రుమ్మరం దలఁచి వీణానాదమోదాత్ముఁ డై. ౧౩౮

ఉ. నారదమౌనివర్యుఁడు మనంబున నించుక యెంచి యప్పుడే
ధారణి కేగుచో శిఖరితల్లజునిన్ హిమవంతుఁ గాంచి గం
భీర తదాశయం బెఱిఁగి । విష్ణునకున్ గిరిపుత్త్రి నీయఁగా
నేరుపుమీఱఁ జెప్పఁదగు । నీ కిది మేలని నిశ్చయంబుగన్. ౧౩౯

ఉ. ఈపనిచేయ లోకముల । నెల్లను నిండిన దుష్టవాదముల్
వే పడిపోవు సత్యపథవృద్ధియె చేకురు శాంతి యబ్బెడున్
శ్రీపరతత్త్వ మిట్టిదని । చెప్పకయే తెలియంగ నౌ నటం
చీపగిదిం దలంచి పరమేశ్వరు నాత్మను నిల్పి కొల్చుచున్. ౧౪౦

మ. మహతీనాదము నాదరూపమగు బ్రహ్మం బిట్టిదే యంచు ద
న్మహిమంబుం దెలుపంగఁ దన్మయత మోనం బ్రాఁకఁగా దేవమౌ
ని హిమాంశుప్రతిమానదేహరుచులున్ । నింగిం బ్రకాశింపఁ జే
య హిమక్ష్మాధరవర్యుఁ జేరె నతఁ డత్యంతంబు హర్షింపఁగన్. ౧౪౧

ఉ. మేనయుఁ దాను శైలముల । మేటి మహర్షిని గాంచి లేచి స
న్మానముమీఱ మౌనిగణమండను దారొక్కనేగి మ్రొక్కి యో
మౌనిమహేంద్ర! నిన్నుఁ గన । మానసమందుఁ దలంచుచుండఁగాఁ
గానఁగ వచ్చితీవె యనుకంప మెయిన్ నను నేటిభాగ్యమో. ౧౪౨

క. మీవంటిమహాత్ముల దౌ, సేవయె మావంటివారి । చిత్తమలములన్
బోవం జేయం జాలును, భావిమహాభాగ్య మిదియె । పరికింపంగన్. ౧౪౩

చ. అని మరియాదఁ బల్కి వినయంబునఁ దోడ్కొని వచ్చి పాద్యము
ఖ్యనిఖిలపూజలం దనిపి । యాసనమం దుపవిష్టుఁ జేసి ద
ర్శనము నొసంగినార లిదె జన్మవిశేషఫలం బనంగ నో
మునివర! యంచుఁ బల్కి తనపుత్త్రిని మ్రొక్కఁగఁ జేసెఁ బ్రీతితోన్. ౧౪౪

ఉ. దేవమునీంద్రుఁ డద్రివితతిప్రభు నాహిమవంతు మేనకా
దేవిని దత్కుమారికను । దీవనలం దనియంగఁ జేసి మీ
భావములెల్లఁ బూజ్యములె । భవ్యములే యగు మిమ్ముఁ జూచియేఁ
బోవఁగ వచ్చినాఁడ నిటు । పూజ్యతముండవు భూధ్రపంక్తిలోన్. ౧౪౫

మ. తొలిజన్మంబునఁ జేసియున్న సుకృతǂస్తోమంబె యీజన్మ మం
దు లసద్రూపమనోజ్ఞపుత్త్రి యగుచుం ǂ దోఁచెంగదా నీకు నం
చలరున్ మానస మాదిమాయయె సుమీ ǂ యద్రీశ! యీకన్య ని
స్తులభాగ్యం బన నిద్దియే జగములంǂదుం జక్కఁగా నెంచినన్. ౧౪౬

ఉ. కన్నెను గన్నవార లెజǂగంబునఁ బున్నెము చేసినార లం
చెన్నుదు రార్యు లాసుతకు ǂ నీడగు భర్త లభించెనా గదన్
మన్ననగాంత్రు వార లది ǂ మాఱినచో వగఁ గుందుచుంద్రు భా
గ్యోన్నతిఁ గాంచినాఁడ వని ǂ యుల్లమునం దలపోయుదుంజుమీ. ౧౪౭

చ. సిరులకుఁ బట్టుగొమ్మ గుణǂసిద్ధుల కెన్నఁగఁ బాలసంద్రమా
తురులకు మంచిమందు గతǂదోషులకున్ సురభూరుహంబు సుం
దరతకుఁ బుట్టినిల్లు కరుǂణాగుణసన్మణి కాకరంబు భూ
ధరవర! నీకుమారిక నిǂతాంతము తావకభాగ్యరాశియే. ౧౪౮

ఉ. మంగళదేవతామణియె ǂ మానిత తావక గోత్రమున్ సము
త్తుంగసుఖాబ్ధిఁ దేలునటు ǂ తోరపువేడుకమై నొనర్చ నీ
సంగతిఁ గాంచువారలకు ǂ సర్వశుభంబు లొసంగఁ బుత్త్రియ
య్యెం గద నీకు నీవిభవ ǂ మెంతయు నుత్యము ముజ్జగంబులన్. ౧౪౯

ఉ. కావున నీకుమారికను ǂ గామితదాత్రిని శ్రీపరాంబగా
భావనచేసి యీడయిన ǂ భర్తను గూర్పఁ బ్రయత్నమూనుమా
నీవన నాహిమాద్రి మహǂనీయచరిత్రుని మౌనిఁ గాంచి యో
దేవమునీంద్ర! యర్హుఁడవు ǂ తెల్పఁగ నీమెకు నర్హుఁడౌ పతిన్. ౧౫౦

చ. అని తగుభక్తి వేఁడుటయు ǂ నామునినాయకుఁ డాత్మ నెంచి యీ
వనితయె కారణంబుగను ǂ వర్తిలునొక్కవిశేష మెల్లచో
నని తలపోసి యి ట్లనియె ǂ నద్రిగణేశ్వర! నీకుమారికం
గొనఁదగువాఁడు శ్రీహరి యǂగుం బరమేశ్వరుఁ డాతఁడే కదా
వినుతగుణాకరుండు పరǂవీరనిహంత నియంత నాఁ దగున్. ౧౫౧

ఉ. జ్ఞానము జ్ఞేయమున్ మఱియు ǂ జ్ఞాతయుఁ దా నగు మౌను లాత్మలన్
ధ్యానము చేయఁగాఁదగిన ǂ తత్త్వ మతండె విముక్తిదుం డనం
గా నతఁడే పరాత్పరుని ǂ గాఁ దలపోయుదు రెల్లయోగు ల
వ్వానినె యట్టిశ్రీహరికి ǂ భార్యగఁ జేయుము నీదుపుత్త్రికన్. ౧౫౨

సీ. ఉరమున శ్రీదేవి ǂ కరయుగ్మమున వరాభయముద్ర లొప్పంగ ǂ వఱలువాఁడు
కనుఁదమ్ములతుదలఁ ǂ గరుణారసముఁజిల్కు దృష్టి భక్తులఁ గావ ǂ నెంచువాఁడు
సురమౌళిమణిగణǂశోభల నలరారు నంఘ్రిపద్మంబుల ǂ నలరువాఁడు
ధర్మైకరక్షణǂతాత్పర్యమున మించుహృత్పద్మరోచుల ǂ నెసఁగువాఁడు

తే. మానిహృత్ప్రీతముల నిల్చి । మానితప్ర, కాశరూపంబునం దదా । కాంక్ష లొసఁగఁ
గోరువాఁడు సురారులఁ । గూల్చువాఁడు, శ్రీమహావిష్ణువని వేఱ । చెప్పనేల?

ఉ. ఆమహనీయమూర్తికిఁ బ్రి।యాత్మజ నెంతయుభక్తి నిచ్చి యెం
తోమహిమంబునన్ వెలయు । మోతుహినాచలరాజ! నీదుపు
త్త్రీమణి యాదిలక్ష్మికిని । దీటయి మించఁగ నెల్లలోకముల్
వేమఱు సన్నుతింపఁ గను।విందుగఁ జూడఁగ నెంతు నంచనన్. ౧౫౪

ఉ. మానివరేణ్య పల్కులకు । మానస మెంతయు సంతసిల్లఁగా
మేనయు నిట్లు చేయఁ గడు।మేలె యటం చొగి హెచ్చరింప నెం
తే నిధిఁగన్న పేదవలె । నేర్పడ నారదుఁ గాంచి యోమునీం
ద్రా! నినుఁబోలు బంధువు మ।హాత్మునిఁ జూడఁగఁ జాల నెయ్యెడన్. ౧౫౫

ఉ. కన్నియ నిమ్మటంచు నడు।గంబడు నాచరణంబు లోకమం
దున్నది గాని నాతనయ । నొప్పదురే స్నుషగా వరింప నం
చెన్నఁడుగాని యన్నయటు । లేరును విన్నదిగాదు క్రొత్తగా
నెన్నఁ దగుంగదా నడత । యీయది మీరె తలంపుఁ డిత్తఱిన్. ౧౫౬

చ. కనుక మహానుభావుఁడవు । కన్నియకుందగు నాథుఁ గూర్పఁగాఁ
జను నను నాశయంబుగల । సాధువ వీవు మునీంద్ర! యిప్డు నా
తనయను విష్ణుదేవునకు । దారగఁ గూర్పఁగ నాకు మాఱుగాఁ
జని నెఱవేర్ప మీపనిని । సాధుపథం బన నిద్దియే గదా. ౧౫౭

చ. పరహితకార్యమే యొనరు।పందగు నయ్యదియే తపఃఫలం
బురుతర మంచు నెన్నుదురు । యోగ్యులుగాఁదగు మిమ్ముఁబోంట్లె యీ
తఱుణమునందు నాపయి ని।తాంతకృపం బొలయంగఁజేసి శ్రీ
హరియె మదీయపుత్త్రిఁ బర।మాదృతిమై వరియింపఁ జేయుమా. ౧౫౮

ఉ. ఈవిషయంబునందు నను । నేమియుఁ బ్రశ్న మొనర్పకుండఁగా
నీవె సమస్తకార్యముల । నెమ్మి మునీశ్వర! నిర్వహింపుమా
నావరపుత్త్రి నీకృపను । నాథునిగా గరుడధ్వజున్ బ్రపం
చావసథున్ హరిం బడసి । యన్వయయుగ్మము నుద్ధరించుతన్. ౧౫౯

శా. ఎందుంజూడఁ బురాణవాక్యము లవే । యేపారి "కన్యాపితృ
త్వం దుఃఖాయ" యటంచుఁ బల్కుఁ గనుకన్ । దద్వాక్యజాలార్థ మె
న్నం దప్పౌనటు లీమహాకృతిని నీ।నైపుణ్యముం జూపి పెం
పందంగా ఫలియింపఁ జేయుము "కృతార్థోఽహ"మ్మటంచెన్నెదన్. ౧౬౦

ఉ. నామనవిన్ గ్రహించి ముని।నాథ! భవన్మతిఁ దోఁచినట్లుగా
నీమహిళామణిన్ హరికి । నింపుజనింపఁగఁజేసి కూర్చి నా

నోములు పండఁజేసి మది నొవ్వఁ దలంగఁ దేవదేవుఁడే
యేమెయి నెంచినన్ భవదభీష్టము చేకుఱకుండ బోవునే ౧౬౧

తే. నూఱు అబద్ధములాడియు నూలుకొనఁగఁ
జేయఁదగుఁ బెండ్లియని బుధుల్ చెప్పుదురు
గాదె మునినాథ! నీవు నీ కార్యభరము
నెట్లొ తుదముట్టఁజేయు మాహితమె కోరి. ౧౬౨

ఉ. శ్రీపతివంటి యల్లుఁ డిలఁ జేకుఱుటే గద భాగ్య మన్న నీ
వోపికఁ బూని కార్య మెటులో ఫలియింపఁగఁ జేయవయ్య! యో
తాపసవర్య! యంచుఁ బ్రమదంబున మ్రొక్కఁగ నల్ల చేయుదున్
దాపముపీడి యుండుమని ధైర్యము చెప్పి సుపర్వమౌనియున్. ౧౬౩

చ. తనమది నెంచె నీగిరిసుతామణి శంకరుఁ గోరుచున్న దీ
వనరుహనేత్ర శ్రీపతికి వల్లభయౌట పొసంగనేర దీ
పని పయిఁ బెట్టుకొంటిఁగద భావిమహాకలహంబునందుఁ బా
ల్గొనియెద శూలినిన్, హరినిఁ గూర్చెద నొక్కట నట్టె గాంచెదన్. ౧౬౪

చ. హరిహరయోగదర్శన మహాంకృతిఁ బాపి విముక్తి నిచ్చు, శం
కరునకుఁ బద్మనేత్రునకుఁ గల్గును భేద మటంచు విష్ణువే
నిరుపముఁ డంచుఁ బల్కు కుమనీషుల గర్వముఁ బాపువాఁడ నీ
చరితము నీనెపంబున నెసంగును గాక జగత్త్రయంబునన్. ౧౬౫

చ. కలహమె నాకు భోజనము గాఁ దలపోయుదు రజ్ఞులెల్ల ని
మ్ములఁ గలహంబె పెట్టి విధిముఖ్యుల నజ్ఞులఁగా నొనర్చి ని
స్తులమగు తత్త్వ మిద్దియని తోడనె లోక మెఱుంగఁజేసెదన్
గలుగును దాన సత్ఫలము నాకును దక్కినభక్తకోటికిన్. ౧౬౬

మ. పరమేశా! భవదీయతత్త్వ మిదియన్ భావంబు యోజింప నె
వ్వరికిం బొల్చునొ వారె యజ్ఞు లనఁగా వాఙ్మానసాతీతమై
పరమంబై తగు నీదు తత్త్వ మెఱుఁగన్ బ్రహ్మాదులే జాల రీ
నరులన్నన్ గణనార్హులే యకట వింతం గూర్చు నీవాదముల్. ౧౬౭

ఉ. భక్తులు ధ్యానయోగమున భవ్యభవద్గురుతేజ మెంతొ యా
సక్తిని గాంచుచున్ మిగుల సంతస మందుచు నట్లెయుండ రీ
వక్తలు దుర్విదగ్ధులయి వాదములం బచరించుచుం మనో
వాక్తనువుల్ చెడంగ భవవార్ధి మునుంగుదు రేమిపాపమో! ౧౬౮

చ. కటకట! పూర్వజన్మకృత గాఢతరాఘ మదెట్టిదో మనః
పటమునఁ దోఁచు చిత్రముగఁ బల్కుదు రాపరతత్త్వ మిద్ది యం

చటమటమో నిజంబో యనుసంతతటి సంశయమైనలేక యు
త్కటపుటహంకృతిఁ గుజనకాండము మెచ్చఁగ వాక్కు హెచ్చఁగన్. ౧౬౯

తే. అట్టివారల గర్వంబుఁ బడఁగ నిడియె, చేయఁదగు కార్య మగు నని చిత్తమందుఁ
దలఁచి హిమవంతునిం గని పలికె నీదు, కాంక్షితంబును దీర్తు నక్కటిక మూని.

క. పోయెద వైకుంఠంబున, కాయంబుజనేత్రుఁ గాంచి యందు వివాహో
పాయము ఫలించునట్లుగఁ, జేయుదు నాశక్తికొలఁదిఁ జెలఁగెడుపూన్కిన్.

మ. అని శైలాగ్రణి సమ్మతింబడసి కృష్ణా! కావుమా యంచు భ
క్తిని వీణానినదంబు వ్యోమమున సంకీర్ణంబు కాఁగా వెసం
జనియెన్ గాంచఁగ మౌని, [1]శీతకిరణాశ్మవ్రాతసంకల్పిత
ప్రణుతానేక[2]నిశాంతసుందరముగా భాసిల్లువైకుంఠమున్. ౧౭౨

వ. చనిచని పితృగణసంకీర్ణంబై మనోహరతమంబై విరాజిల్లు చంద్రలోకంబు నిర్గ
మించి తపోధననివహాప్రజుష్టంబై మహత్తరప్రశాంతతేజోవిరాజితంబగుచు
వీరుదోఘసమాశ్లిష్ట సమున్నతశాఖాశిఖాసమాక్రాంతవ్యోమంబులగు వృక్ష
రాజంబులం దనరారుచున్న సౌమ్యలోకంబుమీఱి నిస్తులప్రతాపానల సందీ
పితాశావకాశులగు దైతేయవర్యులు చెలువార నీతిశాస్త్రవిశారదధీరవార
సంయుతంబగుచు ద్వైతీయశశాంకలోకంబునా నెసంగుచు భయంకరతపోహవ్య
వాహజ్వాలాప్రదగ్ధదుర్మతమునిసంఘాతంబై కనుపట్టు కవిలోకంబు మించి,
నైజతేజంబుల సకలలోకంబులఁ బ్రకాశింపఁజేయుచు భయంకరజ్వాలామాలా
విలాసంబగు మండలంబు పరఁగఁ ద్రయీమయంబై సకలమునిప్రకరధ్యేయంబై
తేజోగోళంబన, భగవదాలయంబనఁ బరమవిఖ్యాతినెసంగుచు సకలగ్రహగోళా
ధారంబై యవ్యయంబై స్వప్రకాశంబై యలరుచు సత్కర్మాధారంబై సకల
లోకసమాకర్షణదక్షంబై యసదృశంబై వెలయు లోకబాంధవలోకంబు దృష్టి
పాత్రంబుగాఁ గావించి యవ్వలంజని యగ్నిమండలంబుభంగిఁ గానంబడుచు
భూమండలమహోపకారకరణచణంబై యుద్దండంబై తీవ్రరూపప్రాణికోటీనివా
సంబై రక్తకుసుమాభిరామ విటపిపటల నిబిడంబై యత్యున్నతవిశాలంబై
కానంబడు నంగారకగ్రహలోకంబు నధోదృశ్యంబుగావించి మించుజవంబునఁ
బోయిపోయి శాంతగుణభూషితప్రాణిసమూహ సాంద్రంబై వేదనాదముఖరి
తంబై దేవతావ్రాతసంకులంబై సత్కర్మనిరతవితతభూతసంఘాత సంవ్యాప్తంబై
యజ్ఞఫలభోక్తృజన నిబిడంబై యజ్ఞఫలానుభవార్హస్థాన మాననీయంబై
ప్రకాశించు బృహస్పతిలోకంబు నధిగమించి యచ్చోటువాసి యత్యంతవిశాలం
బగుచుఁ జంద్రసప్తకకిరణప్రకాశితంబై యింద్రనీలమణిగణఘృణిప్రతిమాన తేజ
స్సంవృతభూతప్రాంతంబై తమోగుణప్రధానజంతుసంతానంబై కానంబడు

1 శీతకిరణాశ్మములు = చంద్రకాంతశిలలు. 2 నిశాంతము = గృహము.

సౌరిలోకం బవలీలం దాఁటి ఘుతియనునది యొప్పంగక స్వకీయవినిర్మలకాంతి పుంజంబులం బఱపుచు క్ష్మాప్రభృతిగోళంబుల సుఖవంతంబులుగా నొనరించుచుఁ బుణ్యవిశేషఫలంబులకు నుదాహరణ భూతంబులై యుండు నక్షత్రలోకంబు లనంబడు బ్రహ్మాండంబులం గాంచుచుం బోయిపోయి యనేకలోకంబుల వీక్షణ పాత్రంబులఁ గావించుచు నొక్కచోట. ౧౭౩

## వైకుంఠలోకవర్ణనము.

సీ. శాంతంబె యాకృతిఁవంతమై వింతగఁ దిరుగుచున్నటు లుండుఁదివిజగణము
బహుజన్మకృతపుణ్యపరిపాకఫల మిట్టి దని తెల్పుచుండు భూతనికురుంబ
మవ్యయానందసౌఖ్యం బన నిట్టిదై యుండునం చని తెల్పుచుండు మునులు
సత్కర్మతతిసమాచరణసంజాతమౌ శర్మ మీయదె యని చాటుమనుజు
ఆ. లందునందుఁ గూడి సందులేక చెలంగఁ, గనులపండువగుచుఁ గమ్రసౌధ
పటలహారి యగుచుఁ బరమతేజస్సంవృతమయి సాటియెఱుఁగ కమరఁజాలి.

చ. చెలువ మనంగ నిట్టిదియొ చేరువనుండెడు భూతరాజి ని
స్తులతరహర్షముం గనుచు ధూతకళంకత నన్యవస్తువుల్
గల వనుచింత లేక తమకంబున దేనిని జూచుచుండునో
యలయదె చెల్వమానఁగ నద్భుతమైతగు మూర్తులొప్పఁగన్. ౧౭౪

చ. సురతరుశాఖలన్ మెలఁగుచున్ శుకకోకిలముఖ్యనీడజో
త్కరము మృదుస్వరంబుల నితాంతము వేడ్క జనింపఁజేయు సుం
దరతరభాషితంబులను నైజముగాఁదగువానిఁ బల్క నా
దరమున నాలకించుచు ముదంబునఁదేలెడు పుణ్యు లుండఁగన్. ౧౭౫

ఉ. దారుణమూర్తులొప్ప నినదం బతిభీతిదమై వినంబడన్
జేరఁగరాదు వీనినని చెప్పక చెప్పెడుదంష్ట్ర లొప్ప భూ
దారతరక్షుసింహ ముఖదారుణసత్వము లెంచుకే నొరుం
జేరక శాంతమూనియె వసింపఁగఁ జూడ విచిత్రమై తగన్. ౧౭౬

మ. తరుమూలంబులనుండి సంతతము ద్వంద్వంబుల్ తముంగాంచి స
త్వరమే పాఱఁగ వ్యాధు లాధు లనుశబ్దంబుల్ శ్రుతిద్వంద్వముం
జేరరాకుండఁగ నిర్వికల్పులగుచున్ జొక్కంపుధ్యానంబులం
బరమాత్ముం బరికించుచున్ ముదమునన్ వర్తిల్లుయోగుల్ తగన్. ౧౭౭

చ. ఫలముల నుంతగోరక యభంగురభక్తిని భూరిదక్షిణల్
గలవిగ నెన్నొ యజ్ఞముల క్ష్మాస్థలిఁ జక్కనొనర్చి యంతమం
దలపరమాత్ము నవ్యయుని ధ్యానము చేయుచు మేనుబీడి ని
స్తులపదమందుఁ గర్మనిరతుల్ వసియింపఁగ వర్ణనీయ మై. ౧౭౮

చ. శుకములు వేదపాఠముల శ్రోతల హర్షమహాబ్ధి ముంపఁగాఁ
పికములు సామవేదమును వింతఁగఁ బాడఁగఁ జెట్లక్రింద ను
న్నకపులు శ్రోత్రయుగ్మచలనంబును మాని తదేకనిష్ఠను
న్నకరణినుండఁ జూచెడు జనంబుల గుంపులు గల్గ నొప్పుచున్. ౧౮౦

ఉ. ఆఁకలిదప్పులన్ మఱచి యచ్యుతపాదసరోజచింతనా
స్తోకసుఖంబునం జెలఁగుచున్ నిరతంబు తదేకనిష్ఠమై
లోకమె విస్మృతంబగుట లోచనయుగ్మము మూసి దేవతా
నీకమహాప్రభుం గనెడు నిర్మలభక్తులచేఁ దనర్చుచున్. ౧౮౧

ఉ. వేదమె యీశ్వరాకృతిగ విశ్రుతమయ్యెఁ దదుక్తకర్మముల్
కాదన కాచరింపఁదగుఁ గాని త్యజింపఁగరాదు ముక్తిసం
పాదనమూల మిద్ధియగు భద్రద మయ్యదియే యటంచు స
మ్మోదమునం దదుక్తగతిఁ బూనినకర్మఠులం జెలంగుచున్. ౧౮౨

చ. హరియె సమస్తమార్గముల నందఱఁ గాచును బౌరుషం బిదే
వరుసఁ దలంచిచూచినను భంగురమే యగునంచు సర్వ మీ
శ్వరునకు నర్పణం బనెడుభావమునం దగి సేవచేయు నా
దరమున నొప్పియుండెడు బుధప్రవరుల్ నివసింపఁ జూడ నై. ౧౮౩

మ. కృతపుణ్యుల్ గురు నమ్మి తత్పదములం గేల్మోడ్చి సేవించుచున్
సతతంబున్ గురునానతిన్ మెలఁగుచున్ సర్వంబు శ్రీనాథునా
నతి వర్తిల్లు నటంచు నెంచుచు మనోనైర్మల్యమేపార న
చ్యుతునిం గొల్చెడు వైష్ణవుల్ వెలయ నెంతో వింత రాజిల్లుచున్. ౧౮౪

మ. పతియాజ్ఞం దలఁదాల్చి భక్తతతికిన్ భద్రంబు లెల్లప్డు స
మ్మతితో నిచ్చుచు లోకరక్షణమె యాత్మం గోరుచున్ ధర్మసం
తతి వర్ధిల్ల నొనర్చుచున్ సకలముం దానై మహామాయయన్
శ్రుతకీర్తిం గని పొల్చుశ్రీతరుణి సంశోభిల్లఁగాఁ జూడ నై. ౧౮౫

మ. ఎవ రేచందమునం దనున్ దలఁపఁగా నెంతేఁ గృపన్ వారిఁ బ్రీ
తి వివృద్ధింగన నట్టిరూపమున సంతృప్తిం గనం జేసి దో
షవిహీనంబగు బుద్ధి నిచ్చి మరలన్ జన్మంబు లేకుండఁ జే
యు వరాభీతికరుండు చక్రి తగ నెంతో వింతగాఁ దోఁచుచున్. ౧౮౬

తే. సకలసుఖసన్నివాసమై శమనివాస,మై దమస్థానమై తృప్తి కాలయమయి
పరమమై పొల్చు వైకుంఠభవ్యలోక,మును దమిం జొచ్చె నారదమునివరుండు.

మ. తనరాకం గని పార్షదప్రవరుఁ డంతన్ స్వామిపాదంబులం
గనఁగాఁ బోయి సురర్షి వచ్చె నెలవే కానంగరా నన్న మో

మున వర్తించెడు మందహాసముననే ♦ పొమ్మింకఁ దోడ్తెమ్ము న
మ్ముని నంచుం దెలుపంగ వాఁడు చని నీపుణ్యంబె పండెన్మునీ. ౧౮౮

మ. వనజాతాయతనేత్రుఁ డొంటరిగ నిన్ ♦ వాంఛించెఁ జూడంగఁ బ్రా
గ్జనిపుణ్యం బన నెట్టిదో తలఁపఁగా ♦ శక్యంబె మౌనీశ్వరా!
యన సంతోషము పొంగ నారదుఁడు పద్మాక్షున్ హరిం జూచువే
డ్కను బోయెన్ నవరత్ననిర్మితసురౌఘప్రావృతాధ్వంబునన్. ౧౮౯

సీ. ఒకవంక మునివర్యు ♦ లోంకృతినాదంబు సలుపఁగా వింతఁగా ♦ వెలయుదాని
నొకప్రక్కఁ బార్షదు ♦ లొగి జయజయశబ్దములు పల్కనెంతయుఁ ♦ జెలఁగుదాని
నొకపార్శ్వమున దేవతోత్తముల్ వినుతిపద్యంబులఁ బాడఁగా ♦ నలరుదాని
నొకయెడ సనకాదు ♦ లురుభక్తి నేకాగ్రమనసుల నిల్వంగఁ ♦ దనరుదాని

తే. సకలదిక్పాలసేవ్యమై ♦ ప్రకటవీర, భటనికరరక్షితంబయి ♦ పరఁగుదానిఁ
జారుచింతామణీ నామసద్మవరముఁ, గాంచిముదమంది యటఁ బ్రవేశించెనపుడు.

ఉ. అందొక సుందరాలయము ♦ హారితమంబుగఁ జూడనొప్పు; నం
దిందిర పాదపద్మముల ♦ నెంతయు వేడుక నొత్తుచుండ నా
నందరసాబ్ధి మున్గినమనంబున నెంతయుఁ జూడనొప్పు గో
విందుని దేవదేవుని ద్రివిక్రముఁ గాంచె సురర్షి యంతలోన్. ౧౯౧

చ. దివిజమునీంద్రు రాకయు మదిన్ మునుమున్నె యెఱుంగుఁగాన దే
వవిభుఁడు లేచి సంతసము ♦ వర్ధిలఁగా నెదురేగి భార్గవీ
ప్రవిమలహస్తసారసవిభాసుర కాంచనపాత్ర మందికొం
చు విధిని బాదముల్ గడిగి ♦ శుభ్రజలంబుల వాని వేడుకన్. ౧౯౨

చ. తనదుశిరంబునన్ మఱియు ♦ దాపశనంబునయందుఁ జేర్చి యో
మునివర! నీదురాక శుభముల్ గలిగించెడుఁగాక మాకు నం
చనునయ మొప్పఁ బల్కుచు మహాత్మ! కృపన్ దయచేయవే గృహాం
బునకని మందమందగతిఁ ♦ బూనికఁ దోడ్కొనిపోయి యొక్కచోన్. ౧౯౩

చ. అమలమణీగణస్థగిత ♦ మై తగుపీఠమునందుఁ గూర్చుచుం
డుము దయచేత నంచును గరంబుగడు వేఁడి తదాజ్ఞఁ దాను నొ
క్కమహితపీఠమందు మునికాంతునిప్రక్కను గూర్చుచుండి క్షే
మములను ప్రశ్నచేయుటయు ♦ మానివతంసుఁడు సుప్రసన్నతన్. ౧౯౪

చ. హితవచనంబులం గుశల ♦ మేర్పడఁ జెప్పి త్రిలోకవార్తలన్
జతనముమీఱ వేఁడు సురసత్తమునిన్ హరిఁ గాంచి యోమహా
వ్రత! సకలం బెఱింగియును ♦ బామరున ట్లడుగంగఁ బూను టా
దృతి నను బోఁటి యల్పమతి ♦ కెంతయుఁ గీర్తినొసంగనే కదా. ౧౯౫

సీ. బ్రహ్మాండజాలముల్ § పరఁగునీకుక్షిలో నందలివార్త లేమనుచు నన్ను
నడుగుటయే చిత్ర § మైన వచించెద భవదాజ్ఞఁ దలఁదాల్చి § వాసుదేవ
నీవు పాలింపఁగ § నీవిశ్వములు సౌఖ్యమున మించకుండునే § దనుజబాధ
లడుగంట దేవతల్ § హాయిచెందిరి యజ్ఞములు సాగుచున్నవి § భూమియందు
తే. దానవృద్ధిగదా దేవతల్లజులకు, నొక్కవార్త నెఱింగించు § నూహ నిచటి
కరుగుదెంచితి నాదగు § నజ్ఞతను క్షమించి యద్దానిఁ గైకొన § నెంచవలయు.

చ. మహిళయొకర్తు రూపమున § మారవధూటిఁ దిరస్కరించి యా
తుహినధరాధరేంద్రునకుఁ § దొల్తటిపుత్త్రికయై చెలంగుచున్
బహువిధసద్గుణంబులను § భాసిలి యప్రతిమానదీప్తిమై
నహాహ! వెలుంగుచున్న దిది § యద్భుతసృష్టి యనంగనొప్పుచున్. ౧౯౭

చ. అనుపమయౌవనంబు తరళాక్షిని వే కదియంగ రాఁగఁ గాం
చినయటు బాల్య మెచ్చటికొ § చెచ్చెరఁ బోవఁగ మౌగ్ధ్య మిందు నే
పని గలదింక నాకనుచుఁ § బాఱఁగ నేపుసపాక్షిపాతముం
గనక చెలంగు నారమణి § కన్నులపండువుగా మహాప్రభూ! ౧౯౮

చ. సుగుణమణీగణాకరము § సుందరతానిలయంబు నాఁగ ము
జ్జగములఁ గీర్తిగాంచె నని § చాలవినంబడఁ బోయి చూచినాఁ
డఁ గనుక విన్నవించెదఁ గొడంకచెలంగఁగఁ బెండ్లియాడఁగాఁ
దగుఁ బరమేశ! నీవు హిమ § ధామ గిరీంద్రుఁడు సంతసించెడున్. ౧౯౯

ఉ. ఈవిషయంబు నన్నడుగ § నెంతయు వేడుక మీ కొసంగినన్
భావుకముల్ పొసంగునని § పల్కితి నాతఁడు సమ్మతించి న
న్నేవిధినైన నిద్ధి ఫలియింపఁగఁ జేయు మటంచుఁ గోరె నో
దేవవరేణ్యా! వేగ చను § దెంచితి నప్పని నిర్వహింపఁగన్. ౨౦౦

వ. అనుటయు దామోదరుం డిట్లనియె. ౨౦౧

మ. బహుభార్యల్ గలవాఁడ నింకొకతుకన్ § వాంఛించుటల్ విన్నఁ బ్రా
జ్ఞమహిళారత్నము లొప్పుకొందురె ననున్ § మన్నింతురే లోకు లి
ద్ది హితంబే యగునంచు నెంతురె బుధుల్ § దేవర్షివర్యా! మఱొ
క్కహితంబే నెఱిఁగింతు దాని మది నిక్కంబంచు నూహింపుమా. ౨౦౨

సీ. ఒకతుకఁ బ్రేమింప § నువిద మఱొక్కతె యీసడించుచు నిద్ధి § మోసమె యను
నొకతె నాకడకురా § నూహింప నెఱిఁగి యింకొక్కతె ముందె రా § నుద్యమించు
నొకబోటిమిన్న నే § నూఱడింపఁగఁబోవ నడ్డమై యొకలేమ § యనికిఁ గడఁగు
నొకకాంతయింటికే § నోగిరముంగొనఁ జనఁబూన నొకయింతి § ననుఁ గొనిచను
తే. నకటకట! పెక్కుభార్యల § నాదరింపఁ, దలఁచువారల కష్ట మిం § తయని పల్క
నాదిశేషునకునైన § నలవిగాదు, వలదు వల దింక వేఱొక్క § కలికి నాకు.

శా. ఏమేమీ పరిహాసవాక్యములకే యీశాల మర్త్యంబో యం
చోమౌనీ! తలపోయుదేమొ యటులే నొక్కప్పుడే నాడినా
నో మోమోటమి నొందువాఁడనొ కటా యూహింపుమా సూనృతం
బౌ మాటల్ వచియించినాఁడ బహుభార్యల్ గల్గ ముప్పే సుమీ! ౨౦౪

ఉ. కాపురముండి సౌఖ్యములఁ గాంచఁగఁ గోరినవారలెల్ల స
ద్రూపమనోజ్ఞశీలములతోఁ దులఁదూఁగెడు నొక్కయింతియే
చేపడినం గనంగలరు సిద్ధిని భార్యలెయిర్వురైన సం
తాపమునే కనంగలరు తప్పదు తప్పదు తప్ప దింతయున్. ౨౦౫

చ. ఇఁక బహుభార్యలున్న గతియేమని ప్రశ్న మొనర్పనేఁ? త
ద్వికటఫలానుభూతిఁ బదివేలవిధంబుల లెక్కపెట్టు నో
పికకలవాఁడు కల్గినను బిట్టుశ్రమంబె ఫలంబుగాని యి
ద్ది కొస యటంచు సుంతయును దృష్టిని బొందఁగఁజాలఁ డోమునీ! ౨౦౬

చ. జలనిధి నీఁదవచ్చు గురుసర్పముపై శయనింపవచ్చుఁ బ్ర
జ్వలితహుతాశనాంతరము వారకచొచ్చి సుఖింపవచ్చు భా
ర్యలు గలవానికిం బొసఁగునార్తుల నించుకయే భరింపఁగా
నలవియెగాదు నారదమహర్షివరా! నిజ మిద్ది నమ్ముమా ౨౦౭

మ. అనుచున్ శ్రీపతి శ్రద్ధమీఱఁగ నుపన్యాసంబు గావింప న
మ్మునియున్ మౌనము నూని శ్రీహరిమతంబున్ స్వాంత మందెంచి పూ
నినకార్యంబు ఫలించు టెట్టులని చింతింపం దొడంగన్ మనం
బున శ్రీనాథుఁ డెఱింగి యమ్మునిమనంబుం దృష్టిఁబొందింపఁగన్. ౨౦౮

చ. తలఁచి ముఖారవిందము స్మితప్రభలన్ గడు వింతనొప్పఁగాఁ
బలికె మునీంద్ర! నీమదిని బర్వె విచారమటంచు మౌనమే
తెలిపెడు వేఱుగాఁ దలఁచి తీవ్రవిషాదమునొందనేఁ? యా
జలరుహనేత్రు నన్ వలచి స్వామిగఁ దా గ్రహియింపఁబూనునా? ౨౦౯

ఉ. ఆసుదతీమణీజనకుఁ డందుల కెంతయు సమ్మతించెనా
దోసిలిఁబట్టి నేను జని తొయ్యలి నిమ్మని వేఁడునట్టియ
భ్యాసము లేనివాఁడఁగద పర్వతపత్నియు సమ్మతించెనా
యేసరణిం దదాశయము లియ్యవి యంచు నెఱింగితో గదే. ౨౧౦

ఉ. ఆవల నీకు మాకును రవంత మనోవ్యథయంకురింపకే
యేవిధి నుండు నట్టివిధి నీవు ప్రయత్నము సల్పినాఁడ వే
దేవమునీంద్ర! యావిధముఁ దెల్పుము నీమదిఁదోఁచునద్ది స
ద్భావముగాక వేఱొకఁడు పన్నెనె యెన్నివిధంబులన్ గనన్. ౨౧౧

ఉ. ఏదియొ పల్కి నాజతన ॥ మెంతయు వ్యర్థము చేయఁజూచెగా
యీఁడితిఁజారియంచు మది ॥ నెంచకుమా మనవిన్ గ్రహింపుమా
యీఁదగుయత్నమెల్ల నిపుఁడే ఫలియింపఁగఁజేయువాఁడనే
మీఁద భవత్ప్రియత్న మది॥మేలుగఁ గన్పడఁగాఁ దగుంగదా. ౨౧౨

చ. తొలుతనె నామనంబునకుఁ ॥ దోఁచినసంశయవార మంతయుం
దొలఁగిన బాగుగాదె ముని॥ధూర్జటి! యంచు మురాసురారి యిం
పులుగులుకంగఁ బల్కవిని ॥ పొంగెడువేడుక సర్వయత్నముల్
సలిపితి నిందు నీదయిన॥సమ్మత మొక్కటియే కొఱంతగన్. ౨౧౩

మ. సెలవే నిప్పుడె పోయి సంతసమునన్ ॥ శీతాద్రి కీభవ్యవా
ర్తలనెల్లన్ వినిపించి మూఁహుతము రాద్ధాంతంబు గావించి యో
జలజాతాయతనేత్ర! నీదుచరణా॥బ్జద్వంద్వముం గొల్చువాం
ఛలు పొంగం జనుదెంతునన్న విని యా॥చక్రాయుధుం డాదృతిన్. ౨౧౪

క. కలహాశనుఁగని సుస్మిత, ములయన్ బ్రావృట్తటిత్వ ॥ దురుగర్జితని
స్తుల మంజుల సద్భావా, కలిత లపితవితతు లొప్పఁగా నిట్లనియెన్. ౨౧౫

మ. చనవయ్యా! మునివర్య! యాశిఖరి ॥ కెచందంబునన్ నచ్చఁజె
ప్పను నీవెంచితొ యట్టులే తెలిపి యొ॥ప్పంజేసి మాహార్తికో
ర్తిని బాటించెడులగ్నపత్రికను వే ॥ తెమ్మా దివౌకోవ్రజం
బును మానీంద్రులు బ్రహ్మముఖ్యులును నీ॥వున్ బెండ్లికిం బెద్దలై. ౨౧౬

ఉ. కార్యము నిర్వహింపఁదగుఁ ॥ గానియెడన్ ననుఁ బల్కరింపకే
యార్య! గృహంబుఁ జేఁుమన ॥ నమ్ముని యెంతయు సంతసిల్లి నే
నార్యను నీకుఁ గూర్తు మరి॥యాఁద యొకించుక తప్పకుండ నే
[1]పర్యయమేఁ బొసంగనటు॥పంతముమై జతనంబుఁ జేసెదన్. ౨౧౭

ఉ. ముప్పదిమూఁడుకోట్లు సుర॥ముఖ్యులు దిక్పతు లింకఁగల్గు వా
రప్పురి కేగుదేర మరి॥యాఁద యొకించుక తప్పకుండఁగా
నెప్పటి కెద్ది వాంఛితమొ ॥ యెవ్వరి కయ్యది యాలసింపకే
యప్పనిసేయ నేర్పుదు స॥హార్యవరేణ్యున కెంతొ పూనికన్. ౨౧౮

క. ఖురహర! నాపైఁగల్గిన, కరుణం బర్వతకుమారిఁ ॥ గా దనక తమిన్
వరియింప నీయకొంటివి, పరమార్థం బిదియె నాత॥పశ్చరణమునన్. ౨౧౯

క. సెలవి మ్మికఁ సత్వరముగ, వలిమలకడ కేగి యిచటి॥వార్తల నెల్లన్
వెలిపుచ్చి కార్యతంత్రం, బుల తెఱఁ గెఱిఁగించి మీకు ॥ మూర్తముఁ దెలుపన్

---

1 పర్యయము = క్రమముతప్పుట.

క. అరుదెంతు మహాస్వామీ!, సురవరులం గూడి మిగులసొబగున విహగే
శ్వరునెక్కి మీరు రాఁదగుఁ, బరికింతుర్ మిమ్ము జన్మఫలసారముగన్. ౨౨౧

చ. అనుటయు నెమ్మనంబునఁ గలట్టితలంపుల నెల్ల మాటయ
మ్మునిగరువంబడంప మదిఁ బూని మొగంబున లేఁతనవ్వుతోఁ
ప నియతిఁ దీర్పు కార్యము సుపర్వులు సంతసమందునట్లు లో
మునివర పోయిరమ్మనినఁ బొంగుచు నారదుఁ డేగె స్వేచ్ఛమైన్. ౨౨౨

ఉ. అచ్చట నాహిమాద్రి మునియాగమనంబె తలంచుచుండఁగా
వచ్చి సురర్షి చక్రధరువాక్యము లన్నియుఁ జెప్పి నీ శుభా
గ్యోచ్ఛయ మెన్న నౌనె, పురుషోత్తముఁ డీభవదాత్మజాతఁ దా
నిచ్చఁ గొనెం గొనంగ భవదీప్సితముల్ ఫలియింపఁ జేయఁగన్. ౨౨౩

ఉ. సర్వసుపర్వులం గలిసి స్రష్టృముఖుల్ తనవెంట రాఁగఁ దా
సర్వవిదుండు శ్రీవిభుఁడు చయ్యనఁ బెండ్లికిఁ దర్లివచ్చు దృ
క్పర్వము చేయుచుర్ పరమ భవ్యవిభూతిని బెండ్లియత్న మో
పర్వతరాజ! నీవొనరుపం దగు నెల్లరు మెచ్చునట్లుగన్. ౨౨౪

చ. భవనవరంబు లెల్లరకు వాసము చేయఁగ నొప్పునట్లుగాఁ
బ్రవిమలవాయువుల్ విసరుపద్ధతి గల్గినయట్లుగా సమ
ర్పవలయు సర్వవస్తువు లపారముగాఁ దగియుండ నో మహీ
ధ్రవర! వివాహయత్నమునఁ దద్దయు నోపికఁ బూననౌఁ జుమీ! ౨౨౫

చ. సిరిచెలువుండు నిన్నడిగెఁ జిత్రముగా నొకమాటఁ బర్వతే
శ్వరుసుత నన్నుఁ బెక్కురగు భార్యలు గల్గినవాని నొప్పెనే
యరసితివే తదాశయము నాహిమశైలునియింతి పుత్రి నా
కు రమణిగా నొనర్ప మదిఁ గోరికఁ బూనెనె నీ కెఱింగితే. ౨౨౬

మ. అని ప్రశ్నింపఁగ నన్నియుం దెలిసిన ట్లౌ నంచు నేఁ బల్కఁ దా
వనజాతాక్షుఁడు సమ్మతించునటుగా భాషించి తద్వాక్యముం
గొని యేతెంచినవాఁడ నీకడకుఁ గోర్కుల్ పండె నీకింకఁ జ
య్యన యత్నం బొనరింపుమా యనిన నాయద్రీంద్రుఁ డుత్సాహియై. ౨౨౭

తే. చెంత నిలుచున్న మేన నచ్చెరువుఁ దెలుపు
దృష్టి నీక్షించి యోసాధ్వి యిమ్మునీంద్రుఁ
డస్మదర్థము పడిన ప్రయాస మెఱుక
పడియెఁ గాదె యదృష్టంబు పండె మనకు. ౨౨౮

క. కొమరిత భావమును రహస్యముగా నీ వడిగి పంకజాక్షునిపై ని
ష్టముగల్గఁ జేసి యెఱిఁగింపుము నాకుర్ దగినయత్నములు సల్పఁదగున్. ౨౨౯

మ. అతివా! సర్వజగత్ప్రభూత్తముఁడు పద్మాక్షుండు సర్వామర
ప్రతతిప్రస్తుత దివ్యకీర్తి మునివర్యస్తోమసంపూజితా
ప్రతిమానాంఘ్రిసరోరుహుం డుపనిషద్రాశిప్రగీతాత్మవి
స్తృతమాహాత్మ్యుఁడు గాఁడె కూఁతున కతండే భర్తయే నొప్పదే. ౨౩౦

క. బంగరు వెలిగారముతో, సంగతి గనునట్టు లాత్మజయు భర్తగ శ్రీ
శుం గనునే దానిని మిగు,లంగాఁ దగుభాగ్యముం గలదె తలపోయన్. ౨౩౧

చ. సుకృతపుఁబంటగాదె మధుసూదనుఁడే మనయల్లుఁడైన నే
మి కొదువ యింకన్ మనకు మించును సంతతిగౌరవంబు నో
పికఁ బికవాణి కివ్విధముఁ బెద్దలసమ్మతమంచుఁ దెల్పి వే
ఱొకపని చూడుమంచుఁ దనయుగ్మలిఁ బంపి ప్రహృష్టచిత్తుఁడై. ౨౩౨

ఉ. దేవమునీంద్రుతోఁ బలికె దివ్యభవత్కృప వే ఫలింపఁగా
భావమునం దలంపుఁడది బాగుగ నాకు మహోపకారమున్
వేవిధులం బొసంగునటు వింతగఁ జేయు నటుంచు నమ్మెదన్
భావవిశుద్ధియే సద ప్రపంచమునన్ ఫలదానదక్షమా. ౨౩౩

ఉ. నాసుతకోర్కె యెట్టిదొకొ నారద! నే నరయంగఁబూన లే
దీసమయంబుదాఁకఁ బరమేశ్వరుమాటగ మీరు చెప్పుటం
జేసి కనుంగొనంగ సరసీరుహలోచనఁ బంచినాఁడ నా
శ్రీసఖు నొప్పకుండునె ప్రసిద్ధిని గోరనివార లుందురే. ౨౩౪

చ. అరుదుగ నాగృహంబునకు నాపరమేశ్వరుఁ డేగుదేర ని
ర్జరవరు లాపరాత్పరుని సంగతి రాఁ దగినట్టు లేను మీ
పరమకృపావిశేషమున వస్తుతతిన్ దమిఁగూర్చి వారియా
దరణముగాంచుపద్ధతి నితాంతసపర్య లొనర్తు నోమునీ! ౨౩౫

చ. మనమున నించుకేని యనుమానముఁ బూనక మీర లేగి యా
వనరుహలోచనున్ సపరివారునిగాఁ గొనిరమ్ము మూరుతం
బును వచియించువాఁడు సురపూజ్యుఁడు గీష్పతిగాదె యామహా
త్మునకును నాకు మాఱుగనె మూర్తముఁ జెప్పఁగఁ దెల్పఁగాఁదగున్. ౨౩౬

ఉ. వారును మీరుఁగూడి తగుభంగిఁ దలంచి ముదంబుమీఱ ని
ర్ధారణచేయుమూర్తమును దాల్తు శిరంబున నాఁటికెల్ల దై
త్యారులఁగూడి శ్రీపతిమహంబునకుం జనుదెంచునట్లు లో
నారద! చేయఁగాఁదగిననాయకుఁ డన్నఁ దలంప నీవెగా. ౨౩౭

ఉ. శ్రీపతికంటె ముందు దయచేసి మునీశ్వర! యేరికేరి కే
యేపగిదిన్ సపర్యల నదేవిధిగా నొనరింపనౌనొ యు

శ్లే పరమానురాగమున నిద్ది భవద్గృహమే యటంచు మీ
రోపికఁ బూనిచేయుఁ డిది యున్నతచిత్తుల ధర్మమే కదా. ౨౩౮

శా. ఏలోపమ్ము ఘటిల్లినన్ మఱియుఁ దా నేగౌరవం బబ్బినన్
మేలే కల్గినఁ గీడె గల్గిన మునీ! నీకే యటం చెన్నుమా
యేలా పెక్కునుడుల్ సమస్తమున కీవే దిక్కటం చెంచితిన్
బాలన్ ముంచెదవో నీళ్ళ ముంచెదవొ నాభాగ్యం బదెట్లున్నదో. ౨౩౯

చ. జడమతినోట సుంతయును సాధుజనార్హసపర్య లిట్టు లే
ర్పడి చెలువారునం చెఱుఁగు పాటివివేకము నాకుఁ జాల ది
ప్పుడు మరియాద నేర్చుకొనఁ బూనినఁ గార్యము చెంతనుండుటన్
సుడివడుఁ జిత్త మట్లగుట సూరివరా! యిటు మిమ్ము వేఁడుటల్ ౨౪౦

ఉ. [1]కూకుదుఁడయ్యె నిప్పటికి క్షోణిధరుం డనుసూరివాక్యముల్
చేకొని సంతసింపఁగను సిద్ధమునీ! మదిఁ గోరినాఁడ నీ
వేకద దీనిఁ దీర్చుటకు నెంతయుఁ జాలినవాఁడ విత్తఱిన్
నాకుఁగలట్టివాంఛను మనంబున నెంచి ఫలింపఁజేయవే. ౨౪౧

చ. అని బహుభంగులం దను నహార్యవరేణ్యుఁడు వేఁడ దేవతా
ముని యెద సంతసించి యను భూమిధరా! నను నింతవేఁడఁగా
జనునొకొ, క్రొత్తవాఁడనె యొసంగెదు వేడుక వచ్చి నీగృహం
బున నివసించి హెచ్చరికఁబూని చరించెద నీకు మాఱుగన్. ౨౪౨

చ. దివిజులు సంతసింప సురనాధిపులు మేలని ప్రస్తుతింప స
ర్వవిభున కెల్లభంగులను బాగనుసూహ జనింప మిత్రబాం
ధవు లిటఁజేయుపూజలను దా రెదలం గడు సమ్మతింప నె
ల్లవిధుల నేకొఱంతలు దలంపఁగ లేనటు నిర్వహించెదన్. ౨౪౩

ఉ. మూరత మెంతదాపుగను బుద్ధిమదగ్ర్యుఁడు దేవదేశికుం
డారసి నిశ్చయించునొ మహామహమున్ జరపంగ దానికిన్
ధారణిభృద్వరిష్ఠ ప్రమదంబున ముందుగ నేగుదెంచి నీ
కోరికదీర్తు సుంతయును గొంకక నెమ్మదితో వసింపుమా. ౨౪౪

మ. జతనం బెంతయుఁ బూన్కిఁ జేయఁదగు నాచక్రిన్ విరించాదిదే
వతతిన్ జక్కఁగ గారవింపఁదగు నేభంగిం దదర్హంబుగా
వితతామూల్యపదార్థసంచయము సేవె కూర్పుమా నేను నీ
హితముం గోరుచు సంచరించి సమయం బీక్షించి వత్తుం జుమీ. ౨౪౫

క. తడవేల యింకఁ బోయెదఁ, బుడమిం జరియించి స్వర్గమున కేగి యటం
దడయక పద్మదళాక్షుని, కడ కేగెద నాముహూర్తకాలముఁ దెలుపన్. ౨౪౬

1 కూకుదుఁడు = సాలంకృత కన్యాదానము చేయువాఁడు.

మ. పరపక్షంబునఁ బిల్వఁగాఁ దగినయయ్యవ్వారిన్ ముహూర్తం బొగిన్
జరపన్ రమ్మని పిల్వఁబంచి పరముం జక్రాయుధుం గూడి ని
ర్జరవర్యుల్ చనుదేర నేర్పఱచి సర్వంబున్ శుభోదర్కమై
పరఁగం జేసి మహీధరేజ్య! యది తెల్పన్ వత్తు నీ చెంతకున్. ౨౮౭

శా. ఇంకం జెప్పఁగలట్టిమాట లవి యెన్నే నుండు నవ్వేళ నే
ణాంకున్ దాల్చినపుణ్యరాశికి మహార్హస్థానసంభూషితా
పంకస్వాంతున కిట్టి నీకు వచియింపం జన్నె శైలేంద్ర! యా
పంకేరుణ్ణయనున్ గనం జనియెదన్ భద్రంబు నీ కయ్యెడున్. ౨౮౮

చ. అని వచియించి భక్తిమెయి హస్తధృతామలతాళనాదముల్
వినవిన హర్షముం గొలుప విశ్వపతిన్ హరి గేయపంక్తులన్
వినుతియొనర్చుచున్ హృదయవీథిఁ బరాత్పరుఁ డొప్పుచుండఁగాఁ
జనియె జగద్వ్రజంబునకు సంతతభద్రము గల్గఁజేయఁగన్. ౨౮౯

క. పరమార్థతత్త్వమును వి,స్తరముగ భక్తాళికెల్లఁ దాఁ దెలుపఁగ నీ
తరుణము మంచిదిగాయని, సురమౌని యెదం దలంచుచున్ వెసఁ జనియెన్.

ఆశ్వాసాంత్యము.

క. గురుతర భవగహనమహో,త్తర తీవ్రకుఠారనామ దారుణపాపో
త్కరతాపహరణచరితా, పరమేశ్వర భక్తవారపాలననిరతా. ౨౯౧

మ. అరిషడ్వర్గనిమిత్త భూరితరపాపాటోపసంహార ని
ర్జరవర్యోత్తమమౌళిభూషణమణీ రాజత్పదాంభోరుహా
పరతత్త్వస్ఫుటకీర్తిభాసుర పరబ్రహ్మాభిధేయా నిరం
తరసద్భక్తజనావనాదరణపాత్రస్వాంత, జ్ఞానాకృతీ. ౨౯౨

మాలిని. సకలజగదధీశా సంహృతార్తార్తిలేశా
ప్రకటభుజగభూషా భంజితాశేషదోషా
సుకవివినుతిపాత్రా శోషితామిత్రగోత్రా
వికటదనుజవైరీ విక్రమాక్రాంతసౌరీ. ౨౯౩

గద్యము. ఇది శ్రీమత్త్రిపురసుందరీ కరుణావాప్త గీర్వాణాంధ్రకవితాప్రాభవ, కాశ్యపాన్వయప్రభవ, శ్రీజనమంచి వంశాంబురాశికుముదినీమిత్ర, సుబ్రహ్మణ్య మనీషిపుత్త్ర, తాండవకృష్ణాపరాభిధేయ శేషాద్రినామధేయ నిర్మితంబైన సర్వమంగళాపరిణయంబను మహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ.

శ్రీ ర స్తు.

# సర్వమంగళాపరిణయము

## ద్వితీయాశ్వాసము.



క. ఉపనిషదుత్కరపరినుత, కృపాస్వరూపాత్మ విమలకీర్తిసమాక్రాం
త పితామహాదిలోకా, కపర్దభూషావిశేషకలితేందుకళా ౧

ఆ. అవధరింపు మవలఁదగు కథ సర్వజ్ఞ, నీదుచరిత మెయయి నెగడునట్టి
దైన భక్తిభరముచే నేను వివరింతు, నిజయె సేవ యనెడు నిచ్ఛఁ బాదల. ౨

### మేనాదేవి పార్వతికి హితముఁ దెలుపుట.

ఉ. అంతట మేన ప్రాణవిభునాశయ మెంతయుఁ బ్రీతిమీఱ నే
కాంతమునందు నాత్మజకు నంతయుఁ దెల్పఁగఁబూని యిట్లనున్
గాంతరొ నీయదృష్టమునఁ గంజదళాక్షుఁడు శ్రీవిభుండు నా
గాంతకవాహనుండు పతియౌటకు సమ్మతిఁ జూపె నిత్తఱిన్ ౩

ఉ ఎందఱో పత్నులుండ నిఁక నేటికొ నన్నతఁ డర్థిఁ గోరుటల్
విందునుగాదె తత్సతులవృత్త మజస్రము దెబ్బలాటలా
డం దనచేతగామిని గడంకను వేఁడుచు నాతఁడుంట యం
చందువా యేమొ బేలవయి యాహరివృత్తము చిత్రమౌఁజుమీ ౪

ఉ. ఒక్కెడఁ గానిపించినటులుండి మఱొక్కెడఁ దోఁచుచుండు నే
దిక్కునఁ జూడఁ దానెయయి దేవమునీంద్రులకైన సుంతయే
నిక్క మెఱుంగరా నటులు నిత్యము తోఁచుచునుండుఁ బార్వతీ
యక్కమలాక్షు తత్త్వ మిది యంచు నెఱుంగఁ దరంబె యేరికిన్ ౫

మ. బహుపత్నీకుఁ డటంచు సుంతయు మదిన్ భావింపఁగాఁ బోకుమీ
మహిళారత్నమ! సర్వశక్తులకు నామాన్యుండె సంస్థాన మ
ర్కహిమాంశుప్రభృతిగ్రహావళియుఁ దత్కార్యప్రభూతంబె త
న్మహిమం బెన్న శ్రుతిత్రయంబునకు నేమాత్రం బశక్యంబయా. ౬

ఉ. ఆమహనీయమూర్తి నిను నర్ధశరీరిఁగ సంగ్రహింపఁగాఁ
దా మది సమ్మతించు టదెతన్వి తలంపఁగ నీయదృష్టమే

కామితదాయకుండు సురకాండసమర్చితపాదపద్ముఁడౌ
నామురసూదనుం డగుట నందఱ సమ్మతిఁ బెండ్లియాడుమా. ౭
చ. అమరులు సర్వదిక్పతులు నబ్జభవాదులు మానివర్యు లిం
క మహినిగల్గు భూమిపతికాంతులు నిచ్చలు పాదదర్శనా
ర్థము కరయుగ్మ మొగ్గి హరిధామము ముందట నిల్చియుందు రా
కమలదళాక్షుఁ బ్రాణవిభు గాఁ గొనుటేకద భాగ్య మంబికా! ౮
క. [1]శివతాతి యమ్మహాత్ముఁడు, దివిజేశ్వరముఖులు గొల్వఁ దేజరిలెడున
ట్టి విభుని నచింత్యమహిముని, నువిదా! చేపట్టవమ్మ యురుభాగ్యగతిన్. ౯
చ. అని యిటు మేన యుల్ల మలరారఁగఁ దెల్పిన నాలకించి మో
మును వెసవంచి యోష్ఠయుగళముల్ జలియింపఁగఁ జేయుకారణం
బునఁ దనచిత్తనిస్పృహతఁ బోలఁగఁ దెల్పుచు గోత్రభూమిభృ
త్తనయ వచించె నివ్విధిని దల్లిమనంబు విషాద మందఁగన్. ౧౦
మ. జననీ మానసకాయకర్మము లనన్ జాలన్ బ్రసిద్ధంబు లై
తనరంగా కరణత్రయం బనఁగ ఖ్యాతం బద్దియే సుమ్మి యం
దును బెంపుంగను మానసం బనునదే దోషంబొ పుణ్యంబొ దా
నిన కల్గందగుఁ గాననే యదియు మానిస్తుత్య మయ్యేం గడున్. ౧౧
క. యోషారత్న మదెప్పు మ,నీషన్ గల్పించుకొన్న నియతి వదలినన్
దూషింపఁబడునుగాదె మ,నీషిప్రకరమ్ముచేత నిత్యము తల్లీ! ౧౨
క. అమ్మనసున నొకపూరుషు, సమ్మతిమై వలచి మరలఁ జక్కఁదనమొ భా
గ్యమ్మొ గలవాని నితరుని, బమ్మెరపడి వలచుట యొకపాడియె జననీ! ౧౩
క. తనువాక్కుల నొనరుచునఘు, మునకంటె మనంబుచేతఁ బూనికమీఱం
బొనరుచు పాపము మిక్కిలి, యనిపల్కెడు నార్యులనుడి యాలింపవొకో. ౧౪
ఉ. ఇంచుక తెల్విగల్గినదియే మొద లప్పరమేశు దేవతా
సంచయశీర్షసన్నిహిత సర్వమనోరథదానదక్షశ
క్త్యంచిత భవ్యపజ్జలజు నాశ్రితకల్పమహీరుహంబునై
మించుహరున్ వరించితిని మేలును గోరియె నామదిం దమిన్. ౧౫
ఉ. అండజవాహనాది దివిజాధిపు లెల్లరు గొల్చువాని బ్ర
హ్మాండసమూహముల్ గలుగ నత్యభివృద్ధిని బొందఁ ద్రుంగఁగా
మెండగుశక్తిఁ జేయు ఘను మేచకకంధరు భక్తసంతతా
ఖండఫలప్రదున్ శ్రుతినికాయపరిస్తుతుఁ గోరఁ జెల్లదే. ౧౬
ఉ. శంకరుసాధ్వి యీమె యనుచక్కనికీర్తి నెసంగఁ గోరుదున్
శంక యొకింతయేఁ గనక చక్రిని గైకొనుమంచుఁ బల్కకే

[1] శివతాతి = మేలునిచ్చువాఁడు.

యంకిలిమాని పోయి తనయాశయ మియ్యదటంచు మార్చఁగా
నింక నశక్య మంచు వచియింపుము చక్కఁగ నాదుతండ్రికిన్. ౧౭

చ. త్రికరణశుద్ధిగల్గి యురరీకృతసత్యమనీష యొప్పఁగా
వికలతనొందకుండఁ దగువృత్తము పేర్మి వహింప నుండుక
న్యక మది నెవ్వనిన్ వలచు ఽ నాతఁడె భర్తకదా మఱొక్కనిన్
సకలధనాఢ్యునేఁ దలఁపఁజన్నె స్వనాథునిగాఁ గొనన్ మదిన్. ౧౮

ఉ. అన్నివిధంబులం దగినయట్టిమహేశుఁ బరాత్పరున్ దప
స్సన్నిహితస్వరూపు రిపుజాలభయంకరు భక్తరాజికిం
బెన్నిధి యైనశంకరుని ఽ వేయివిధంబుల నాహృదబ్జమం
దెన్నియొ కోరుకొంటి నిఁక ఽ నెట్టులు త్రిప్పఁగవచ్చు నామదిన్. ౧౯

మ. పలుమాటల్ పనిలేదు శంకరుని సంభావించియే కోరితిన్
జలజాక్షుం డఖిలేశుఁడంచు సిరికిన్ ఽ స్థానం బటంచున్ జగం
బులఁ దత్తుల్యుఁడు లేఁడటంచు జననీ! ఽ భూషించినంతన్ మదిం
గలరాద్ధాంతము మాఱునే వదలు మింకన్ జాలుఁ జక్రిస్తుతుల్. ౨౦

తే. చాలసేపాయె వచ్చి యిచ్చటికి నింకఁ, దరలిపొమ్మన్న మేన యాత్మజను గాంచి
బేల యీలీలఁ బలుకంగ ఽ నేల యల్ల, దేవదేవునిమహిమంబు ఽ దెలియవైతి.

తే. ఐన నేమాయె యింతటిలోన మించి,పోయినదియేమి నీతండ్రి ఽ కీయుదంత
మెఱుకపఱతును బెద్ద ఽ లేమేనినీతి, గఱపవలదనఁబోకుమా ఽ కన్నె మిన్న! ౨౨

చ. అనుచు మనోవ్యథల్ కలఁప ఽ నంతటఁబోయి హిమాచలేంద్రునిం
గని వచియించె సాగినది ఽ క్రమ్మఱ నిట్లనియెన్ మహాత్మ! నీ
వును దమిమీఱ నాత్మజకు ఽ బుద్ధివికాసము గల్గునట్టిరీ
తిని హితబోధచేయఁదగుఁ ఽ దెప్పునఁ గార్యము పంపునట్లుగన్. ౨౩

చ. తెలియమి నెవ్వరే హితముఁ దెల్ప సనేమిర యంచుఁ గిన్కచేఁ
బలుకునుగాని పుత్త్రిక స్వభావమునన్ మతిమంతురాలెయౌఁ
బలుకులు వేయునేల పిలుపంగనుబంచి తదీయచిత్తవృ
త్తుల మరలింపఁగా వలయుఁ ఽ దోడనె పెంచిలి సాగుపోలికన్. ౨౪

ఉ. ఉత్తర మీయఁజాలునటు ఽ లూహలు పర్వకయుండఁజేయున
ట్లిత్తఱిఁ బల్కఁగావలయు ఽ నియ్యదియేకద పుత్త్రియాశయం
"బుత్తముఁ డీశ్వరుం డనుచు ఽ నుగ్రునినే వరియించు కొన్న న
త్యుత్తమమంచు" నీజతన ఽ మొప్పదె మాన్పుట ప్రాణనాయకా. ౨౫

ఉ. పిల్లతనంబుచే నెవరొ పేరు సఖీతతి నొక్కిచెప్పెనో
యల్లసమాభిధానమునె ఽ యాత్మఁ దలంచుచు భర్త యాతఁడం

చుల్లసనంబు నొందుచుఁ బ్రి ఽయోక్తుల నెవ్వరు తెల్పఁబూనఁగా
నొల్లదు వీనులం జొనుప ఽ నూహలు చేయును బెద్ద లట్లుగన్. ౨౬

చ. తెలిసినబోటియంచు సుమతిం దగియుండెడునంచు నెంచుచుం
బలుకక యుండ రాదు గద ఽ బాలిక గావున మేలివంచుఁ గీ
డు లివియటంచు నెంచఁగఁ గఽడుంగడు సూక్ష్మమనీష లేనిదాఁ
గులగిరివర్య! యిట్టిదగు ఽ కూఁతునకుం దెలుపంగఁ బోలదే. ౨౭

ఉ. చిన్నతనంబునన్ మదికిఁ ఽ బ్రీతి జనింపఁగఁ దెల్పునీతులే
యెన్నటికైన మాప్పగన ఽ కేర్పడియుండు సభిత్తిచిత్ర మ
ట్లున్నతభాగ్యరేఖ గన ఽ నొప్పుతతిన్ బ్రియపుత్త్రియజ్ఞతం
గన్న మరల్ప నూల్కొనుటఽగాదె విధాయక మెన్నఁ దండ్రికిన్. ౨౮

మ. కరిచర్మాంబరు నాదిగంబరుని వేడ్కంగోరుటల్ తెల్పదే
పరికింపంగఁ గుమారి బాలిశత నాఽపద్మాక్షు శ్రీనాథు సుం
దరమూర్తిన్ వరియింపునున్న నగుచుం ఽ దా శంకరుం జంద్రశే
ఖరునిం గోరితి నంచుఁ బల్కెడిని దఽత్కాంక్షల్ నివారింపవే. ౨౯

ఉ. నారదమౌని మూరుతముఽనాఁటికి వత్తు నటంచుఁ బోయె నా
మూరుత మెప్పుడంచు సురఽముఖ్యగురుండు లిఖించునో మనో
హారిపదార్థసంతతుల ఽ నందఱనుం దనియింపఁజేయఁగాఁ
గూరుచు నెన్నఁడో తలఁపఽగూడదె కార్యభరంబు నెమ్మదిన్. 3౦

ఉ. దొడ్డది కార్యమంచిపుడు ఽ తోఁచెడుదానికిఁ దోడు పుత్త్రి యీ
యడ్డముఁ జూపుచున్నయది ఽ యమ్మురవైరియు సమ్మతింప నీ
యొడ్డమిగల్గెఁ గాదె మన ఽ కింక నుపాయము దోఁపకుండుటల్
గొడ్డలినాన పెట్టినటు ఽ గోత్రవరేణ్య! తలంపనౌనుగా. 3౧

చ. త్వరపడి కార్యభారము నిఽతాంతము సన్నుతిపాత్రమౌనటుల్
ధరణిధరేంద్ర! యింకయినఁ ఽ దత్పరతం గనవయ్య లేనిచో
సురవరు లేగుదెంచి యిటఽజూచినచో నగుఁబాటు లే యగున్
సరియగుబంధువుల్ మనలఁ ఽ జౌకగఁజూచి హసింతు రెప్పుడున్. 3౨

క. సరివారిలోన నవమతి, పఱఁగిన నద్దానికంటెఁ ఽ బాపఫలం బీ
ధర ననుభవింపఁగలదే, పరికింపుము దీని కెది యుఽపాయమొ దానిన్. 33

ఉ. నావిని గట్టుఱేఁడు నయఽనంబుల విన్నఁదనంబు దెల్పుచున్
వేవిధులం దలంచి సుత ఽ విష్ణుని మాని శివున్ వరించుటన్
దేవమునీంద్రప్రయత్నము సతీమణిభావము స్వాభిలాషమున్
వే విఫలంబు లయ్యె నని ఽ విహ్వలచిత్తముదోఁప నిట్లనున్. 3౪

ఉ. దేవి! యిదంతయుం దలఁప దీవ్రవిధిప్రతిబంధమంచు నే
భావమునం దలంతు సుత పట్టినపట్టును వీడకున్న ని
ర్దైవిధి నారదోక్తి ఫలియింపఁగఁజేయఁగ నౌనొ తాఁప దా
శ్రీవిభుఁ డాగ్రహింప విపరీతఫలంబులె కల్గు నెన్నియేన్. ౩౫

ఉ. మాటయు నోటినుండి సురమౌనికతంబున నొక్కపెట్టునన్
దాఁటి జగత్త్రయంబున నిరంతము మ్రోఁగెడు దాని నిప్పుడే
లాటియుపాయ మారసి తొలంగఁగఁబోలునొ తోఁపకున్న దో
బోటి! త్వదుక్తిరీతిగనె పుత్త్రికిఁ దెల్పుదు సాధువాక్కులన్. ౩౬

ఉ. నాతని బిల్వఁబంపు జతనంబున నాదగుశక్తి నంతయున్
బ్రీతిపథంబునం జొనిపి విష్ణువునే వరియింపుమంచు నా
చేతము నొచ్చునట్టులుగఁ జేయకుమంచు వచింతు దేవతా
వ్రాత మెఱుంగ నవ్వలను భాగ్యమురీతి ఫలంబు చేకుఱున్. ౩౭

చ. అని ప్రియపత్నిఁ బంపఁ జని "యద్రివిభుండు నినుం గనంగ వాం
ఛనుగొనె పొ"మ్మటన్న మదిసంతస మొప్పఁగఁ దోడనాడు వే
డ్కను గనియున్న నెచ్చెలులఁ గాంచి యిదే పితృపాదదర్శనం
బున కరుగం దలం పలరెఁ బోవఁగ మీరును సమ్మతింపుఁడీ. ౩౮

క. అనవారు సమ్మతించుచుఁ, బనివినఁగాఁ దండ్రిఁ జూచు ప్రమదంబున నొ
య్యనఁబయనమయ్యెఁ బార్వతి,మనమునఁగలసుదియములు మాటుపఱచుచున్.

మ. పరమేశున్ మదినమ్మునాకుఁ గల దోర్బ్లంగిన్ జయం బన్నసు
స్థిరధైర్యంబునఁ బోయి తండ్రిఁ గని భక్తిన్ భాలభాగంబు త
త్సరసీజంబులు సోఁక మ్రొక్కుటయు హర్షప్రాప్తనేత్రాంబువే
కరపంక్తుల్ దనయోత్తమాంగమునఁ జక్కన్ రాల శైలేంద్రుఁడున్. ౪౦

చ. కరములఁ గ్రుచ్చియెత్తి తమకంబున నంకమునందుఁ జేర్చి సుం
దరమధురోక్తులన్ సుఖమునన్ బొలుపొందుచుఁగాదె పిన్న లా
దరమున నేర్చుకొందువుగదా సకియల్ నినుఁగూడ నాటలం
గరమువినోదపాత్రముగఁ గన్నెరొ! నెమ్మదిఁ జేయుచుందువే. ౪౧

ఉ. గానము నర్తనంబు నెడఁగాంచక యుండఁగ నభ్యసింతువే
మానిని! చిత్రలేఖనము మానవుగాదె విపంచికోత్తమ
స్వానము చేఁ బరాత్పరుని సంతసమందఁగఁ జేయుచుందుగా
దే నిరతంబు సత్కళల నెంతయు నేర్చుచునుందుగా తమిన్. ౪౨

ఉ. పెద్దలు నీదుపాట విను ప్రీతిని వచ్చిన భక్తి మీఱఁగా
సుద్దపుఁబాట పాడి మదిఁ జొక్కఁగఁజేయుదుగాదె వారు పె

న్నిద్దపుఁబ్రీతి వేదహితనిర్మలసూక్తుల వర్థిలంగ నో
ముద్దియ! చేయఁజాలుట సుబుద్ధి నెఱుంగుదుగాదె చక్కఁగన్. ౪౩

శా. నీమూలంబున రెండువంశములకున్ । నిత్యాన్వితఖ్యాతి యెం
తే మర్యాదయుఁ గల్గఁగాఁ దగుఁజుమీ । యీలోకమం దింతిరో
యీమాటల్ మది విశ్వసించి గురు వేయేపద్ధతుల్ దెల్పినన్
క్షేమం బయ్యవియే యొసంగు నని నీచిత్తంబునం దెన్ననా. ౪౪

మ. తనయారత్నమ! నారదుండు తనయంతం దానె యేతెంచి నా
మన మానందరసాంబుధిన్ మునుఁగ సన్మానించి నీవిద్యావ
ర్తనముం జక్కఁగ సన్నుతించి మఱి యుద్వాహంపువృత్తాంతమున్
వినిపించెన్ వినవమ్మ! లోకగురువై । విష్ణుండు పొల్చుంగదా. ౪౫

ఉ. ఎల్లశరీరిబృందము తదిచ్ఛనె పుట్టును వృద్ధినొంది రం
జిల్లు నడంగుఁగాలమున । శ్రీహరి యాతఁడె దేవదేవుఁ డు
త్ఫుల్లసరోజనేత్రుఁడు విభుండు చరాచరభూతకోటికిం
దల్లిరో! యట్టివానిఁ బ్రమదంబున నాథునిఁగా వరింపవే. ౪౬

చ. సవతులు పెక్కురుంట నెటు । సమ్మతిఁ గోరుదు విష్ణుమూర్తి నం
చువిదరో శంకనొందుదువొకో హరిశక్తి నెఱుంగఁజాలమిన్
వివిధమనోజ్ఞరూపముల । వేవుర పత్నుల నొక్కసారి పెం
పువెలయఁ గూడి భక్తజనపుంజము నేలు నతండు కోరినన్. ౪౭

ఉ. ఎత్తఱి నేమికోరిన నదెంతయు నద్భుతరీతిఁ బొల్చి యా
యుత్తరకాలమందె తగియుండును భోగ్యముగాఁ దలోదరీ!
యుత్తములందు నెన్నఁగ మహోత్తముఁడై తగియుండుఁ గాన సి
విత్తఱి నాదుమాట విని । యెంచి మదిన్ వరియింపుమా హరిన్. ౪౮

చ. జనకుఁడు ప్రాయమున్ జనని । సంపద బాంధవులెల్లరుం గులం
బును మఱిగల్గుచుట్టములు । భోజనమున్ వరరూపసంపదన్
వనితయుఁ గోరుచుందు రని । వల్కుదు రార్యులు పుత్త్రికామణీ!
వనరుహనేత్రుఁ డిన్నిటను । వర్ణ్యుఁడు సుమ్ము జగత్త్రయంబునన్. ౪౯

చ. మఱియొకమాట చెప్పెదను । మానిని వేఱుగ నెంచఁబోకుమీ
యెఱుఁగవు లాభనష్టముల । నించుకయైనను బేలవాట నీ
వెఱఁగినరీతిగాఁగ నటియింపకు మవ్వలఁ జింతమీఱి కీ
డ్పఱచును నిన్నుఁ బెద్ద లొగిఁ । బల్కుదురెంతయు స్వానుభూతమున్. ౫౦

చ. పరశివు నీవు స్వాంతమున । భర్తగఁ గోరితివంచు వింటి శం
కరుఁడు మహాత్ముఁడే యగును । గాదని పల్కఁగఁ బూన నేను నో

హరిణవిలోచనా! జగములందు దరిద్రుఁ డటంచు నెప్పుడుం
బరినుతిఁగాంచి భూతపరివారము త న్నొగిఁ గొల్చుచుండఁగన్. ౫౧

సీ. వ్యాఘ్రాసనంబున వసియించి గజచర్మధారియై విష్ణుపాదమునఁ బుట్టి
నట్టిగంగను దలయందుఁ దాలిచి వృషభంబు వాహనముగఁ బ్రజల సేవ
గలిగించు చున్నట్టియొలుకులు సువిహారభూమిగా నొప్పంగ భూధరాగ్ర
మందు న్యగ్రోధంబు క్రిందఁ గాపుర మొప్పు భస్మాంగరాగంబు పరిఢవిల్ల
తే. భూరిభయదభుజంగవిభూషణాళి, వెలయ నుండును రుద్రుఁ డో వెఱ్ఱితల్లి!
యతని వరియించి యేసుఖ మనుభవించు, దానవో యెన్నఁజాల కున్నాను నేను.

చ. ఉరగము లొక్కదాని మఱియొక్కఁడు కోపము రేఁగఁ జూచి కా
వరమున బుస్సుబుస్సను రవంబులఁ బెన్విష మట్టె క్రక్కుచున్
ద్విరసన లొక్కసారిగనె తీవ్రభయంబును గల్గఁ జాప నె
వ్వరుసను జూచి తాళుదువా బాల! తలంపుమ నెమ్మనంబునన్. ౫౩

చ. కరమున భూషణాకృతినిఁ గ్రాలఁగ దాల్చిన జింకపిల్ల భీ
కరముగ వ్యాఘ్రచర్మమును గాంచినయంతనె మ్రాన్పడంగ న
క్కరణి వృషేంద్రవాహనము కన్నులుమూసి ప్రకంపితాంగమై
ధరణిఁబడంగఁ జూచు హరుదాపునఁ గాపుర మెట్లు చేయుదో. ౫౪

ఉ. అన్నులమిన్న! ఫాలమున నగ్నిమయాంబక మొప్పఁ గంఠమం
దన్న నొ ప్రాణవాయువుల నట్టె గ్రసించు హాలాహలంబు నా
నెన్నికఁగన్న దుర్విష మదెంతయు నల్లఁగఁ జూడనుండు నా
పన్నగరాజభూషణుని వారక కోరితివంట నిస్సిరో. ౫౫

ఉ. భామలు సుందరాంగు ధనవంతుని మన్మథశాస్త్రకోవిద
గ్రామణి లేఁతప్రాయమునఁ గ్రాలెడువాని వధూవశంగతుం
డై మనునాశయంబు గలయట్టి మృదూత్తమచిత్తుఁ గోరుటల్
వేమఱు వీనులంబడెడు వింత గదా నినుబోఁటులుండుటల్. ౫౬

చ. నలుగురు నవ్విపోదు రనునాన యొకించుకయైన లేక కొం
డలపయిఁ గందరంబుల వనంబులఁ గాపుర ముండు నిర్ధనున్
ఫలములఁ గందమూలముఖ వస్తువులం దినుచుండు మౌనిమం
డలమును గూడియుండెడు పినాకి నదెట్లుగ వేల! కోరితో. ౫౭

ఉ. కట్టుకొనంగ వస్త్రములు కమ్రతరంబులునై తనర్చునా
పుట్టములైన లేకయె విభూతిని దేహమునిండఁ బూసి మూ
పట్టుచు భూరిసర్పపరివారితదేహుఁడునై చెలంగుచున్
గట్టుశరాసనంబుగను గల్గినశూలి నదెట్లు కోరితో ౫౮

ఉ. గట్టులయందు మేటి యనఁగాఁ ద్రిజగంబులఁ బేరుఁగాంచి యి
ట్టట్టు గదల్పరానిదగు ఽ నద్భుతశక్తిఁ దనర్చి యింతయున్
మట్టును లేని యున్నతిని ఽ మన్ననఁ నొందిన నాకుఁ బట్టివై
యిట్టులుగా మెలంగ నగరే మగువల్ తగవే యి దెన్నఁగన్. ౫౯

చ. హిమగిరి యారయున్ మది నదెంతయు జాల్ముఁడె యంచుఁదోఁచె నీ
సమయమునందు ము న్నితఁడు ఽ సద్యశముం గనెఁ గర్మశూరుఁ డం
చమలమనీషుఁ డంచు నది ఽ వ్యర్థము రుద్రున కిచ్చెఁగాదె ర
త్నమువలె నున్న కన్య నని ఽ నాకిగణం బనకుందురే ననున్. ౬౦

మ. పగఁబాటించి యదెవ్వరో హరుని దౌర్భాగ్యంబు భాగ్యంబుగా
మగువా! నీకు నెఱుంగఁ జెప్పిరిగదే ఽ మర్యాద పోఁగొట్టఁ గాఁ
దగునే యోవిదుషీమణీ! తలఁపుమా ఽ తథ్యంబొ కాదో యటం
చగచాపుండు విరాగవంతుఁడుగదే ఽ యవ్వాని నెట్లెన్నితో. ౬౧

ఉ. నాపలుకుల్ చెవింజొనిపి ఽ నల్వురిలో నగుఁబాట్లు గల్గ న
ట్లాపరమాత్ము శ్రీహరి మహావిభవాఢ్యుని సమ్మతింపుమా
శ్రీపతి నాకు నల్లుఁడని ఽ చెప్పుకొనందగు భాగ్యమబ్బు న
ట్లోపడఁతీ! మదిం దలఁపు ఽ మొప్పనికార్యము నేలచేయఁగన్. ౬౨

### పార్వతి తండ్రికిఁ దనపూన్కిఁ దెల్పుట.

చ. అన విని కన్నుఁదమ్ములు మహార్తిని దెల్పెడు నశ్రుధార లో
య్యన వెడలింప గండముల ఽ కవ్వి మలీమసయుక్తిఁ గూర్పఁగా
జనకుని గాంచి యిట్లనియె ఽ స్వానము నూత్నవిధంబుఁ బూనఁగా
మనమునఁ గల్గువాంఛ నణుమాత్రము దాఁపక తెల్పుపూనికన్. ౬౩

మ. వినవయ్యా! హరుఁ గోరుమంచు నతఁడే ఽ విశ్వేశ్వరుం డంచు నా
కు న దెవ్వారలు తెల్పలేదు హరు నేఁ ఽ గోరంగఁ బ్రాక్పుణ్యక
ర్మనిబద్ధం బగుహృద్విలాస మొకఁ డేమంత్రంబు బోధించె నో
జనకా! శంకరునందు నిల్పితిని నాస్వాంతంబు నత్యంతమున్. ౬౪

చ. శివుఁ డనునామమందె నివసించును సంపదలెల్ల నిర్ధనుం
డవును శివుం డటన్ననుడి ఽ యారయ వ్యర్థముగాదె తండ్రి! భ
క్తవిసరశర్మదుండగుటఁ ఽ గాదె జగంబుల శంకరాహ్వయం
బు వఱలె నట్టిలోకవిభుఁ ఽ బూజ్యుని దూఱఁగ నేల నీగతిన్. ౬౫

చ. పరమశివాంగమందు విషపావకరోచులఁ గ్రక్కుచుండునా
యురగములెల్ల భూషణత ఽ నొప్పుటయే పరమేశ్వరత్వ మం
చరయుట జ్ఞానిలక్షణమె ఽ యాఁగద రత్నకలాప మన్న నె
ప్పురుషులకైన సాధ్యమగుబో పలుమాటల నేమిలాభమా. ౬౬

ఉ. ఏపరమాత్మ కానఁబడ హృద్గతభావములెల్ల మాఱఁగా
దీపితసత్స్వభావములు తేటపడం జెలువారుచుండునో
ద్వీపికరీంద్రముఖ్యమృగబృందము లట్టిపరాత్పరుం గృపా
శ్రీపరిపాలితాశ్రితుని సిద్ధుఁడు నిర్విధి దూఱు టొప్పునే. ౬౭

మ. సకలైశ్వర్యము లామహేశ్వరుని చంచత్పాదపంకేజపాం
సుకణోత్పన్నములం చెలుంగుము సురేశుల్ మానినుల్ తన
యక్కృపాలేశము నొంది యున్నతిని మర్యాదల్ గనంజాలి రిం
దుకళాభూషితమౌళి సర్వవిదునిన్ దూషింపఁజన్నే యిటుల్. ౬౮

చ. జనక! శశాంకశేఖరునిసంగతి సత్యము లెల్ల నైజమై
కనఁబడు దౌష్ట్యమున్ వదల్ గాఢతరంబగు స్నేహమూని యొ
ప్పునను నెఱింగియున్ గినుకఁ బూనినయజ్ఞునిరీతి శంకరున్
వినుతికి మాఱు దూఱు టనుకృత్తని బూనితివేల యక్కటా! ౬౯

చ. కరములు సర్పకంకణనికాయము మౌళిని జంద్రరేఖ కం
ధర నొకవంక హాలహలనామకతీవ్రవిషం బురంబునం
దురగసమూహహారములు నొప్పఁగ నొప్పెడుసర్వశక్తి శం
కరుఁ బరమాత్ము నెన్నఁదగుఁ గాని యిటుల్ వచియింపఁ దర్హమే. ౭౦

తే. తీవ్రపాపాళియున్ మహాదేవ యనిన, యంత నశియించు సంపదలబ్బు నట్టి
పరమపావననాముని హరుని దూఱ, సాహసించితి వీ యిప్డు శైలరాజ. ౭౧

చ. వపుసగ వాఙ్మనసకరణవర్తనరూపముగాఁగ నీశ్వరుం
బరమశివుం గృపాజలధి భక్తిగ నెంచి తరించితిన్ గిరీ
శ్వర! యిఁక దాని మార్పఁగ నశక్యము గావున నొందుచింత వి
త్తరుణమునందు నీవుమదిఁ దాల్పక యుండుమ యంచు వేఁడెదన్. ౭౨

చ. మనసు తపస్సునందె పలుమాఱులు చెంతనుముందుచుండుఁగా
వునఁ బరమేశ్వరున్ సకలభూతపతిన్ హరుఁ గూర్చి యివ్వనం
బునె తపస్సు చేయఁగను బూనెద నవ్వలదైవ మెట్లు వం
చిన నటులయ్యెడున్ జనక చెచ్చెర నాకు ననుజ్ఞ నీఁదగున్. ౭౩

చ. తప మొనరింప నాదు మనసౌదైవ మిదంచును దేలుఁ గాని యొం
డుపథము తోఁపకున్నది మనోభ్రమముం బొలఁగింపువాఁడు ఖం
డపరశువే యటం చొగి మనంబున నమ్మినదానఁ గాన వే
గపడక తప్పదింకఁ జనఁగాఁ దగుఁ బూనికి దీర్పఁ గానకున్. ౭౪

చ. అనుటయుఁ బిన్నన వ్వాలయ నాగిరినాయకుఁ డాత్మపుత్త్రికిఁ
గనుఁగొని తల్లిరో! తపము కన్నెలకిష్టము గా దటంచు స

న్మనులు వచింతు రిప్పగిది । బోలునె నీ వొనరింప నైన నే
జనకుఁడనౌట నీహితమె । చాలఁగఁ గోరుదుఁ గానఁ జెప్పెదన్. ౨౫

చ. తనపతితో నొనర్చుటయె । ధర్మము స్త్రీలు తపంబుఁ గన్యలున్
జనకునిగూడి యుంటయె సుసంగత మయ్యదియే తప స్సనం
జను నిపు డీవుపూనినది । శాస్త్రవిరుద్ధము శాస్త్రచోదితం
బనఁ జనునద్దియే సఫలమౌను మఱొక్కఁడు గాదు పార్వతీ! ౨౬

ఉ. అనుడి యట్టులుండె వినుమా మదుదాహృతభాషితంబులం
గానకుఁ బోవఁ జాలుదువె । కన్నెరొ తీవ్రగభస్తిరోచులం
గానఁగనైన నేపతువె । కానల కేఁగెదనంటి వమ్మ! యె
ట్లైన నరణ్య మిట్టి దనిరైన నెఱుంగుదువే వచింపుమా. ౨౭

ఉ. భల్లుకముఖ్యసత్త్వసమవాయము లెల్లెడ రేఁగి భీతిసం
ధిల్లఁగఁ జేయు నార్భటుల । నిచ్చలు చేయుచునుండ నెట్లు నీ
యుల్లము శాంతిఁ గాంచునొ మహోరగముల్ బిలమార్గనిర్గతిన్
బెల్లుగ సంచరింప నడవిన్ వసియింపఁగఁ జాలుదో కదే. ౨౮

ఉ. బాలిక నీవరణ్యము తప స్సని యెట్లు తలంచినావొకో
చాల విచిత్ర మయ్యెడిని । జాలు నిఁకీజతనంబు మాట లిం
కేల వివాహయత్న మిపుడే యొనరించెద నెవ్వరో నినున్
బేలవటంచు మార్పఱుప । [1]వేఱిఁడివైతి విఁకేమి పల్కుదున్. ౨౯

చ. సకలకలాప్రపూర్ణమతిశాలినివై మునిరాజపాదభ
క్తికలితవృత్తిఁ గాంచి యిటు । కేవలజాల్మహితోక్తులెల్ల నె
న్నక వచియింప నర్హమె జనప్రియు శ్రీపతి సర్వలోకనా
యకు వరియింప కీట్లనఁగ । నమ్మరొ యుక్తమె నీవె యెన్నుమా. ౩౦

చ. అని మఱియున్ వచింపఁ బటుయత్నము చేసెడు తండ్రితోడ ని
ట్లనియెను సర్వమంగళ [2]యహార్యవరా! కమలాక్షు నించుకై
నను మరియాదవీడు వచనం బొకఁడేఁ బలుకంగ లేదు నా
మనము శివాంఘ్రులం దవిలి । మాఱదు సుంతయు నేమిచెప్పుదున్. ౩౧

ఉ. జంతువు గ్రుడ్డివాఁ డొరువశంబున నున్నటు కర్మ మెట్లు త
న్నెంతయుఁ ద్రిప్పఁగాఁ దిరుగు । నిట్టటు స్వేచ్ఛఁ జరింపఁ జాల దీ
వింత నెఱుంగలేనిజనబృందము తానె స్వతంత్రతం గనన్
బంతముపూని నట్లలసి । వాంఛ ఫలింపమిఁ జింతిలుం దుదిన్. ౩౨

ఉ. ఈవిధ మంతయున్ జనులకెల్లను దెల్లమ కాని క్రొత్తదే
గ్రావవరేణ్య! నేఁ దెలుపఁ । గా వలెనే విను మేను శంకరుం

---

1 వేఱిఁడి = అవివేకి. 2 అహార్యము = కొండ.

దైవమటంచు నమ్మితిని । దానికిఁ గర్మమె హేతువౌఁగదా
యావిభు పీడి వేఱొకని । నాత్మ వరించుటఁ బాడి యెట్లగున్ ! ౮౩

ఉ. స్వాంతము శంకరాంఘ్రిజలజాతయుగంబునఁ జేర్చి కాననా
భ్యంతరభూమి దేవనదియంతికమందుఁ దపోవనంబునం
దెంతయు శాంతిఁ గూర్పఁదగు । సిద్ధఫలాదికముల్ భుజించి ని
శ్చింతముగం దపోనిరతిఁ । జెందెడు నవ్వల దైవ ముండెడున్. ౮౪

మ. పరమేశున్ భజియించువారల నదెబ్బంగిన్ మహాసత్వముల్
పరికింపంగను జాలవన్న నిఁక నాపాటల్ సమీపించి భీ
కరదంష్ట్రాహతి నొంచఁగల్గుఁ బలుకంగానేల పన్నగము లీ
శ్వరునిం గాంచక యూరకే మరలెరాఁ । జాలన్ నిజం బిద్దియా. ౮౫

ఉ. ఈతలఁపుల్ మనల్ప నిపు । డెవ్వరికైనఁ దరంబుగాదు నీ
చేతమునందు నమ్మి ఫలసిద్ధిని గాంచఁగ నాశపుంబులు
బ్రీతిని సంగమోజనక । వెగమపాఁ దగునంటిఁ బట్టు సు
జాతకృపాతిరేకమున । శైలమహేంద్రుఁడు పల్కె నీవిధిన్. ౮౬

మ. మునిమాటల్ విని సమ్మతించితిని మోహమోటంబునన్ వేఁలుఁ
ల్కను నేఁ జాలకయుంటి నిప్పుడు భవత్కాంతానుకూలంబుగాఁ
జన నేకీడులు మూఁడునో యనెడు పెన్‌సందేహ మావిర్భవిం
చి నితాంతంబు మనంబు నేఁ జెదుఁగదే । చింతాంబుధిన్ మున్గితిన్. ౮౭

ఉ. ఏవిధి మానికిన్ బదులి । దిట్టులె యంచు వచించువాఁడ నిం
కేవరుసన్ రమాపతికి । నీయఁగఁజాలను బుత్రి నంచు నా
దేవతలెల్లరున్ వినఁగఁ । జెల్పఁగఁజాలుదు నిన్ మనల్పఁగా
నేవడు నొప్పునో యెఱుఁగ । నేమియు నావిధి యెట్లు లున్నదో. ౮౮

శా. చింతాలేశము లేక యింతదనుకన్ । జీవించితిన్ హాయిగా
సుంతైనన్ వెత చిత్తమం దొలయ దేశోత్తముండైన నా
చెంతం జేరఁగలేదు భూసురమునిశ్రేణుల్ సుకర్షుల్ మన
స్సంతోషంబున నుండ్రు నావసతులన్ । సద్యోగనిష్ఠుల్ తగన్. ౮౯

శా. ఎన్నో నోములునోమ దేవతల నెన్నోకేతులం గొల్వఁగా
నెన్నోనాళ్లకుఁ బుట్టితివ్వు మదాశత్రేష్టంబు పండంగ నీ
వెన్నో విద్యలు నేర్చి వంశమునకెంతే ఖ్యాతి గల్పించి తీ
వన్నింటం గడుఁ గీర్తిఁగాంచితిగదే । యమ్మా! త్రిలోకంబునన్. ౯౦

తే. ఇట్టి నీవేటికో పట్టిపట్టుదలను, జూపఁబూనితివమ్మ యీశుభదసమయ
మందుఁ దపమేటికో సకలాభిమతము,లిచ్చుహరిఁ గోరవైతివో యెఱుఁగఁజాల.

క. ఏదేది యెట్టు లున్నన్, నీదగు వాంఛితము మాన్ప । నేనెన్న మసం
బోఁదగుఁ దపమునకైనన్, గాదనక సమీపమందె । కడు నిష్ఠమెయిన్. ౯౨

చ. పరశివు నెమ్మదిన్ నిలిపి । భద్రముఁ గోరి తపంబొనర్ప వే
సరక సపర్యచేయఁదగు । జాణలఁ బంపుదు మమ్మరో నిరం
తరము త్వదీయవృద్ధిని నితాంతము గోరెడు నీదుతల్లి యే
నరయుచునుందు మేమఱక । యందొకపర్ణగృహంబు సద్విధిన్ ౯౩

చ. వ్రతమున కెంతయుం దగినభంగిని గట్టఁగఁ బంచి యెప్పుడే
వితమున నేమికోరినను । వేగమ తెచ్చి యొసంగుసేవక
ప్రతతుల నుంచి నీదగుతపంబున కెంతయుఁ దోడ్పడంగ స
మ్మతి గనుచుందునమ్మ యని । క్ష్మాధరవర్యుఁడు పల్కె నవ్వుచున్. ౯౪

చ. హిమగిరిపుత్రికామణియు । నిట్లనియెన్ జనకా! మదుక్తిఁ జే
ప్పము శ్రుతిసీమలందుఁ దపముం బొనరింప నొకండెయుండ శా
స్త్రము విధియించెడుం జదువ । ఛాత్రయుగం బనియున్ విధించు; య
త్నము భవదిష్టమట్లు తగఁ । దద్దయుసౌఖ్యమె నాకుఁ గల్గెడున్. ౯౫

ఉ. అంతియకాని నాదుహృదయంబునఁ గల్గినవాంఛలెల్ల నా
వంతకొఅంతలేక యలరారుట కల్ల యటంచు నమ్ము మే
కాంతనివాసమే భగవదాకృతిఁ జిత్తమునందు నిల్పఁగా
నెంతయుఁ జాలియుండు సుఖమేడ? వ్రతం బననేడ? యెన్నఁగన్. ౯౬

సీ. అమరధునీపావనాంభస్తరంగముల్ చేటికాబృందమై । చేరి కొల్వఁ
దీరస్థితానేక । హరిభూరుహములు చారుసౌధంబులై । శర్మ మొసఁగ
శాఖిశాఖోల్లసత్సాధుపత్రిరుతంబులే చెలులవాదములుగాఁగ
పావనతమ కందఫలమూలములు రుచిరాన్నశాకాపూపకాళి గాఁగ

ఆ. బంచభూతములును । భాస్కరతుహినాంశు, తారకలు ధ్రువాదిధర్మమూర్తు
లాగిని రక్షకులుగ । నొప్పారఁ బరశివుఁ, గొలుచుదాన దివ్యఫలముఁ గోరి.

చ. నియతికి నంతరాయములు । నిచ్చలుగూర్చెడు దుష్టదైత్యసం
చయముల మత్తపోదహనుజ్వాలల భస్మముచేయుదాన నా
నియమము పండుదాఁక జననిన్ నినుఁ జూడఁదలంప నాదుని
ర్ణయ మిది వేఱుగాఁ దలఁపరాదుసుఁడీ మిము భక్తి వేఁడెదన్. ౯౭

మ. అని ప్రార్థించుచు నుండునంత గిరికన్యాదేహభాగంబులన్
గననయ్యెన్ నవతేజ మద్భుతముగాఁగన్ శైలరాట్టద్విధం
బును వీక్షించి విచిత్రమా నిదని యుప్పొంగెన్ గడున్ సాధ్వసం
బును గాంచెన్ మది నవ్వలన్ దలఁచె నిష్పోల్కిన్ గతాహంకృతిన్. ౯౮

చ. ఇది పరమేశుతేజమగు • నీయమఁ గేవల మాత్మజాతగాఁ
గఁ దలఁపరాదు దైవగతిఁ • గానఁగ శక్యముగాద దేరికిన్
మదిఁగల సంశయాళి నిఁక • మానఁగవచ్చును శంకఁబొందె ను
మ్ముదితకు దిక్కుగాఁగలఁడు • హా పలుభంగుల నేల చింతిలన్. ౧౨౦

చ. అని మది నిశ్చయించి కరు • ణాంబుధి శంకరుఁ డేమె నవ్వహం
బును బనిపూని దుష్టమృగ • పూగము చేరకయుండ దుష్టదా
దనుజులు గాంచకుండ నియ • తవ్రత మించుకయేఁ గొఱంతగాం
చనియటు గాచుఁగాత మని • స్వాంతమునన్ శివు భక్తి వేఁడుచున్. ౧౨౧

చ. సుత గని యిట్లు పల్కె నొక • చోఁ దపవంచఁ బల్కితి నిన్నుఁ గూర్చి నీ
మతివిభవంబు నేనెఱుఁగ • మానిని! నిన్నుఁ బరాత్పరుండు సం
తతమును గాచు నంచు నెద • ధైర్యము గల్గెనుగావఁ బొమ్ము ని
న్నితరులతోడఁ బోల్పఁదగ • దెన్ని తెఱంగుల నేఁ దలంచినన్. ౧౨౨

మ. నినుఁ గాపాడఁగ సేవకప్రతతులన్ • నేఁ బంప నూహించితిన్
గనుకన్ నాయవివేకముం దెలిసియే • కాఁబోలు శ్రీకంఠుఁ డ
క్కని మేషంబున స్వీయశక్తిలవ మేఁ • గాంచంగఁ జేసెన్ గదే
యనుమానం బిఁక నేల నిన్నుఁ బనుపన్ • హర్షించితిన్ బల్లిరో! ౧౨౩

సీ. ఎనిమిదిదిక్కుల • నిల నంబరంబున నుండుభూతములు నీ • యుండఁ జేసెఁ
జాలనియట్టు లాశంకరుఁడే కావఁ దలఁచినట్టులుగ నేఁ • దెలిసికొంటిఁ
గావున నదప మొప్పఁగాఁ జేయ వేగమ తరలు మం చనుచు మూర్ధమును బుణికి
యాశిషంబు లొసంగి • యనిపె నావార్తల విని మేనాంబికి • వెఱపుమాని
తే. పుత్త్రి నక్కునఁ జేరిచి • పొంగిపొరలు, వగపు లోననె యడఁచికొంచుఁ గడుమేలు
గలుగునట్టులు దీవించి • కదలనమ్మ, యింకఁ దపమున కని యాజ్ఞ నిచ్చె నంత.

చ. పితసలయానతిం బడసి • భీతి రవంతయు నెంచనట్టి స
న్మతియె సహాయమై వెలయ • మానిని సత్వరయాన్యమై తపః
కృతిఁ గనుపట్టునట్టడవి • కేగె సుధాంశుధరాంఘ్రిపంకజ
ద్వితయము నంతరంగ మను • దివ్యతమాసనమందు నొప్పఁగన్. ౧౨౪

తపోవనవర్ణనము.

మ. అలమందాకిని పావనాంబువుల రమ్యస్ఫారతీరస్థలం
బుల నార్ద్రింబులుగా నొనర్చి ప్రమదంబున్ గల్గఁగాఁ జేయుచున్
విలసత్తుంగతరంగహస్తముల వేవే భక్తులం జేరఁగాఁ
బిలువన్ స్వర్గసుఖంబుఁ గూర్చునటు భావింపంగ నప్పెంబునై. ౧౨౫

సీ. భవరాగభేషజప్రాయ శీకరముల వెదఁజల్లుచున్ గనుం • వింతగాఁగఁ
బయిపయిం బొలసెడు • బాలవాయువులచే నెల్లరయాధులఁ • బెల్లగింపఁ

బూనినయట్లుగాఁ బొల్చుచు సంచలజ్జలనిస్వనంబుల సకలజనుల
స్నానపానంబుల సకలపాపంబులు దొలఁగు రం డనుచును బిలుచునట్టు
తే. లొప్పుచున్ బతిఁగాంచెడు నుత్సుకతను, బరుగువాతెదురీతి జవంబు దుస్స
హముగఁగన్పడనరుగుచుఁ బ్రమదల కౌఁగి,సాధువర్తనమును దెల్పుచందమమర.

చ. నిలుకడలేనివృత్తిఁగొని నిక్కుచు స్వేచ్ఛఁ జరించునట్టి మ
ర్త్యుల కిటు పూర్వకర్మభవయోగఫలంబులుగూడ నొప్పకే
కలిగినయట్లు చూడఁదగి క్రన్ననఁ బోవు నటంచుఁ జక్కఁగాఁ
దెలిపెడునట్లు వస్తువితతిం గొని వే చనుచుం గనంగనై. ౧౦౮

ఉ. అంబరవీథి నొక్కమొగి నార్ద్రముగా నొనరింపఁబూని పం
తంబున నట్టిలేచి యది దార్కొనరామికిఁ జింతమున్గి వ్యో
మంబుననుండి మున్ దిగినమాడ్కిని వ్రాలఁగ నిక్కువాఁడు వే
గంబునఁ గ్రిందికిం దొరఁగుఁగా యనితెల్పెడునంచుఁ జూడనై. ౧౦౯

చ. తరుతతిపల్లవంబుల సదాగతిసంగతి సంగతాంబుశీ
కరముల వింతభూషలను గ్రాలెడునట్టు లొనర్చుచున్ మనో
హరగురు వీచికానిచయ హస్తములన్ ధరణీతలంబు స
త్వరముగ నావరింపఁ బ్రమదంబునఁ బూనినయట్టు లెన్ననై. ౧౧౦

ఉ. తుంగతరంగమాలికలఁ ద్రోయుచు లాగుచుఁ దీరభూములం
దుం గనుపట్టువస్తువులఁ దోరపువేడుకఁ బొంగుచున్ మన
స్సంగతవాంఛ లిట్టులె వెసం బొడచూపు నడంగు నన్ననీ
తిం గనుఁడంచుఁ జెల్పెడువిధిన్ నటియించుచు మెచ్చ నర్హమై. ౧౧౧

శా. మింటం బాఱు విహంగమావళులు ప్రేమింపన్ గతిన్ మాని వె
న్వెంటన్ నిస్వనముల్ ఘనర్ప బహుళోర్వీజప్రకాండాళి వా
ల్గంటుల్ దంటలనొప్ప వ్రాలి కనఁగాఁ గమ్రోర్మికారావముల్
వెంటన్వెంటఁ జెలంగ సుందరలసద్వృత్తిన్ నుతింపంగనై. ౧౧౨

చ. జలపతగస్వనంబులె యొసంగెడుపల్కులుగాఁగ నున్నతో
ర్ములె మృదుబాహువల్లరులపోలిక నొప్పఁగ నర్తకీవిధం
బలరఁగ లోకతత్త్వము నహర్నిశమున్ క్షణభంగురంబుగాఁ
దెలుపుచు సాటిలే కలరు దేవనదీతిలకం బ దెంతయున్. ౧౧౩

చ. కనులకు విందుఁగూర్ప శితికంఠునిగూర్చి తపం బొనర్చువే
డ్కనుమ వనంబుతీరమునఁ గమ్రతరర్తుఫలప్రసూనరా
జిని దళుకొత్తఁగా నట వసించి మహానియమంబుమీఱఁగా
నొనరిచె శంకరుం డెదుటనున్నటు లెంచుచు నిశ్చలాత్మయై ౧౧౪

సీ. నాసికాగ్రపదంబునను దృష్టిఁ గదియించి పద్మాసనస్థితిఁ బరిఢవిల్లి
వక్షంబు తనుమధ్యభాగమ్ముకన్న రవంత సగ్రస్థల మాక్రమింప
మధ్యభాగమ్ము సమమ్ముగా నమరియుండఁగ యష్టివలె దేహము గడు విచల
మై యొప్ప మనసు మహాదేవుపాదపద్మములందు నిశ్చలతను నిలువఁగ

తే. నుత్తమాంగముఁ జుట్టిమహోత్తమ మగు, దివ్యతేజంబు వెలయ నాతిస్థిరమగు
శ్రద్ధమై యోగశాస్త్రికపద్ధతిని దప మ్మొనర్చె మునుల్ మెచ్చఁ బర్వతసుత.

చ. తనదగుదివ్యతేజ మొగిఁ దామరసాప్తనిమండలంబు మిం
చి నిగిడి దేవసిద్ధులను జేడ్పడఁజేయఁగ యోగతత్త్వ మీ
వనిత యొనర్చుసత్తపము వైఖరియే యని నిశ్చయింపనౌ
ననుచు సనందనాదిమును లద్భుతమందఁగఁ బొల్చె దేవి తాన్. ౧౧౬

సీ. గంగాతరంగిణీసంగతిని జెలంగు చంద్రరేఖోల్లసజ్జటలరాజి
క్ష్వేళానలజ్వాలమాలా భయంకర వక్త్రగహ్వరయుత వ్యాళచయము
సర్వసమత్వైకసరణిని బోధించు కరుణారసార్ద్రదృక్క్రమ్రవదన
మాశ్రితాపద్గణహరణశీలకలాపసంఫుల్లపదసారసద్వయంబు

తే. తనదు విమలాంతరంగంబున నచపలత
నెలకొనియె యుండఁ గాంచుచు నియతిమీఱ
నద్వయుని యోగిహృద్ధ్యేయు హరుని నమ్మి
తపము సల్పెను మును లద్భుతంపడంగ. ౧౧౭

చ. అవయవముల్ నిరంతరహిమాంబుకణంబుల తాఁకునను మహా
పవన సమీరితాంబుధరసం క్తివితీర్ణమహాంబుధార లొ
క్కవడువునం గలంచుటను గాసిని బొందఁగ సుంతయే మనం
బు విచలతం గనంజననిపోలిక నొప్పఁ దదేకనిష్ఠ మై. ౧౧౮

మ. శితికంఠున్ బరమేశు నవ్యయు నజున్ జిత్తేశుఁగా నెంచుచున్
గతి వేఱెద్దియు లేదటన్నతలఁపుల్ క్రమ్మంగ భక్తి దే
వతలున్ మెచ్చఁ దపంబొనర్చె జలముల్ వాతంబు ప్రాచీనప
త్త్రతతుల్ భుక్తిగ స్వార్థ మెప్డు ఫలవంతం బౌనొ యం చెన్నుచున్. ౧౧౯

చ. తరుణిమనంబునుండి యొకతంతు వవృత్త్యగతుల్ చెలంగ శం
కరు మదిదాక సాగె నదె కాంక్ష యనంజను వానిరూప మె
వ్వరు కనఁజాల రవ్వియె యభంగురశక్తిని లెక్కసేయఁగా
దర మెటులైనఁ గానియటు తారొకనియుండు జగద్విజంబునన్. ౧౨౦

శా. ఆతంతువ్రజమే పరస్పరము హార్ద్రాంభోనిధిన్ ముంచఁ జిం
తాతాత్పర్యముఁగూర్పఁ బ్రాణులకు సూక్ష్మస్థానముఖ్యంబులన్

ప్రీతిన్ వర్తిలు దేవతాదులకు నేరీతిన్ సుసంబంధమౌ
జేతఃకాంక్షలెటుల్ ఫలించు నటులే । చేయున్ స్థితుల్ సాగఁగాన్. ౧౨౧

ఉ. దాననె లోకజాలము సతంబు దృఢోత్తమరశ్మిబద్ధమై
తా నొకరీతినే వెలయుఁ । దత్త్వవిదుల్ కనుచుందు రీగతిన్
మానసరశ్మిబంధము లమానుషముల్ మఱి కర్మరూపముల్
కానఁగరాకయే యవి నికామముఁ బొల్చెడు నంచు నాత్మలన్. ౧౨౨

ఉ. లోకములందుఁ గల్గుజనులున్ మఱియుం గలప్రాణికోటులున్
బాకరిపుండు లోనయిన । పాలకులున్ దదుదారతంతుసం
ఘాకలితాంతరంగులయి । యన్వహమున్ జరియింతు రద్దియే
లేక చెలంగు నెంతయును । లీలలఁ దత్త్వ మదద్వయం బగున్. ౧౨౩

చ. అదియొకఁడే స్వతంత్రత నహార్యగతుల్ దగియుండఁ జాలు నిం
కెదియు నటుండఁ జాలదని । యెన్నఁగనౌ మతిమద్గణంబుచే
నిదియొకదా యథార్థమని । యించుకయేఁ దెలియంగలేక కుం
దుదు రిల బాలిశుల్ నిజము । తోఁచుట శాంతి వహింత్రు సజ్జనుల్. ౧౨౪

ఉ. ఆగిరిరాజపుత్త్రి దగు । నాత్మఁ గలట్టితలంపె తంతువై
సాగి య దెవ్వరేఁ గనఁగఁ । జాలనియట్లు మహేశుదివ్యహృ
ద్భాగముఁజేరి నిల్చె; భగవంతుఁడు శంకరుఁ డార్తరక్షణం
బే గద కృత్యమంచు మది । నెంచెను దత్సుకృతంబు పెంపునన్. ౧౨౫

మ. భగవంతున్ బరమేశు స్వాభిముఖుగా । భవ్యాకృతిం దాల్చువా
నిగఁ జేయందగు నద్ది యారయ నతినింద్యంబైన కర్మంబె దా
నిగతుల్ పెక్కులు వానిఁదత్త్వవిదులే । నేరర్గదా కన్గొనన్
బొగడొందున్ జగమందు దైవ మనఁగాఁ । బూజ్యం బనంగా నదే. ౧౨౬

క. దానిగతుల్ గహనము లని, పూని వచించెడిని శాస్త్రపుంజం బదియే
మానవులను సుఖదుఃఖము, లూనంగాఁ జేయు వారలొప్పక యున్నన్. ౧౨౭

చ. కనుకనె కర్మమార్గ మధికంబగు నన్నిఁటిలోన నంచు స
జ్జను లెపుడుం దలంతు రదె । శర్మదమౌ విధియుక్తి నాచరిం
చిన నటుగాకయున్న నది । చేకురఁజేయును దుఃఖ మిద్ది త
ప్పనినుడి యంచు నమ్ముదురు । భద్రముఁ గోరిన యట్టిమానవుల్. ౧౨౮

శా. ప్రాలేయాచలకన్యకామణి మదిన్ । భావించె నెద్దాని వా
గ్జాలంబెల్లఁ బవిత్రతం గనఁగ శాస్త్రప్రక్రియం బల్కఁగాఁ
జాలెం దేని సువాంఛితం బదియె యోఽశాసున్ మహాదేవు సు
శ్లోకుం జేరి వరప్రదాననిరతిం । జొప్పించెఁ దద్భృత్యాలిన్. ౧౨౯

మ. విరతిం గాంచని నిష్ఠ బాలికయు హృద్వీథిన్ స్వకీయాంఘ్రిసం
కరుహద్వంద్వము నిల్పి శాస్త్రవిహితసంకల్పంబునన్ ధ్యానయో
గరతుల్ మించఁగఁ దన్ భజింప హరుఁ డాకాంతామణీ వాంఛ నా
దరణం బొప్పఁగఁ దీర్పనెంచె సుకృతార్థంబుల్ ఫలించుం గదా. ౧౩౦

శివుఁడు పార్వతినియమముఁ బరీక్షించుట.

మ. తను దర్శించెడుభాగ్య మబ్బుట నితాంతస్ఫారపుణ్యోదయం
బున నే కావున శంకరుండు మదినిం బూనెం బరీక్షింప; శం
భునియోగాల్ పొడసూపినంతనె మహాభూతంబులుం దావ్యమున్
వినుతిం గాంచెడు నంబరంబు జలముగ్బృందంబుఁ బుట్టించినన్. ౧౩౧

చ. మరుదధినాయకుండు తనమంగళతుల్ కనరాక యుండ నే
పరుస భరింపరానివిధిఁ బర్విడఁబూనె సముత్తరంగిత
గురుతరవారిపూరములు గ్రొంకక వాయుసమీరితంబులై
పరుగిడి విశ్వమెల్ల నొకపట్టున లోఁ గొన నెంచె నంతయున్. ౧౩౨

చ. జలములు పొంగుచుండఁగ నిజంబగు యత్నము సాగ దన్నయు
మ్మలిక ధనంజయుండు నభమానము నిండినయట్లు కృత్యముం
దలఁచుచునుండె క్ష్మాసతి స్వకధర్మము మాని మహేశునిచ్ఛచేఁ
గలఁగి వికంపితంగనెడు గాంచును బూనె నిరంతరంబుగన్. ౧౩౩

క. పంచమహాభూతము లిటు,సంచలతం గాంచి యప్డు సర్వేశ్వరున
ర్చించెడుగతి వెలసిన నొక్కించుకయును శాంతిలేకయే యపుడుండెన్. ౧౩౪

క. ధారాధరములు నిర్ఘోషారంభముగాఁ గిరీంద్రహస్తాకృతి నా
సారమున ముంచె విశ్వం,బారీతిం జెలఁగి నిచె ననిలుఁడు పూన్కిన్. ౧౩౫

చ. ఉడుగక వీచువాయువుల నొక్కమొగిం బడువర్షధారలం
గడఁగి సహించి పార్వతియు గాఢతరం బగుశ్రద్ధ నీశున
య్యుడుపతిశేఖరున్ గొలుచుచుండె నదెవిధి నంతరాయముల్
తడయక కల్గుచుండినను ధైర్యమె సిద్ధిద మన్నసమ్మతిన్. ౧౩౬

సీ. ఉత్తమాంగంబున యూథనాథకరోప మానంబుధారలు పడిన నుండి నిలఁక
కల్లన భాలమ్ము నుల్లసిల్లఁజేయుచును జనంబున నేత్రవనజములను
దడుపుచు దిగజారి తద్దయు ముగ్ధంబు లగుగండఫలకంబులందుఁ బొరి
క్రిందికి దిగి యందుఁ గించిచ్ఛ్రమంబున నొలవడి వళులరోమముల నెల్లొ
తే. పాఁకి వడివడి దిగి నాభిపల్వలమును, జేరి యందుండి వెడలుట యేరికైనఁ
దెలియరా కట్టులుండె; నాకీజనమిన్న, పుట్టినప్పటికిఁ దల్లియుఁ గాల్తఁగనక.

క. తననియమము సాగఁగ నుం,డెను గాఢసమాధి యందుఁ బడిన శిలపోల్కిన్
గనఁబడుచుండె మహాభూ,తనికర మానినయతిఁ గాంచి తమకని మానెన్.

చ. కదలికమానె దేహము ని౹కామము స్థైర్యము నూనె చిత్త మిం
తదనుక నాసికాగ్రమునె ౹ తప్పక చూచుచు నున్నదృగ్ద్వయం
బొదవినకాంతు సూక్ష్మముగ ౹ నొప్పి సుషుమ్న యనంగ యోగిసం
విదితమునైన సత్పథము ౹ వేడుక నొందెను దేని గాంచనో. ౧౩౯

చ. శిలవలెనున్న యాసుదతి౹చెంతనె చేరక పోవుచుండు ప
క్షులగుమి యిద్ది యేదొ యొక౹కుంజ మటంచుఁ దలంచి చాలవే
డ్కలఁ బయి వ్రాలుచుం జనుచుఁ ౹ గమ్రరుతంబుల శ్రోత్రమండలం
బుల నలరంగఁజేయుచును ౹ బోవుచు వచ్చుచునుండు నిచ్చలున్. ౧౪౦

ఉ. చీమలు లోనుగాఁగలుగు ౹ చిన్నకృముల్ తరు వన్నభ్రాంతిఁ బై
కేమెయినైన జంకు గన ౹ కెంతయుఁబూనికఁ బ్రాఁకుచున్ మహో
ద్దామజవంబునన్ దిగుచు ౹ ధన్యము యత్నమటంచు నెంచు నా
కోమలి సుంత చాపలముఁ ౹ గూడని గాఢసమాధి నుండుటన్. ౧౪౧

మ. ఒడిలోఁజేరి సరీసృపంబు లది యేదో పుట్టయం చెంచి యి
క్కడ బాగుండును గాపురం బనెడు వేడ్కన్ గాంచి మాత్సర్యమున్
విడువంజాలి వసించెఁ బూర్వసుకృతా౹వేశంబునన్ సుంత యా
బిడ నేమంబును పీడకే కొలిచె శ్రీవిశ్వేశు నెల్లప్పుడున్. ౧౪౨

చ. అదియె సమాధి యంచు మును౹లందురు చిత్త ముపాస్యదేవతా
పదసరసీరుహద్వయముఁ ౹ బాయక చూచుచు నింద్రియాళి యొ
ప్పిదముగ వశ్యమై నయము౹పెంపును గాంచఁగఁ జేయు టెన్నసి
ద్ధిదము సమాధి దానిగుఱు౹తించియొ బాలిక పూనె శ్రద్ధచేన్. ౧౪౩

ఉ. అట్టిసమాధియందుఁ దన౹యాత్మఁ దిరంబుగ నిల్పి సుంతయేఁ
బట్టుతొలంగ కీశ్వరుని౹పావనరూపము లోఁ దలంచుచున్
బుట్టువుఁ దొట్టి చేపడిన ౹ పూజ్యతరం బగు శ్రద్ధ మించి తోఁ
బుట్టువురీతి సాయపడ ౹ భూరితపం బొనరించె నవ్వనిన్. ౧౪౪

చ. తపమది నూలుకొల్పెఁ బర౹తత్త్వము తానయి భక్తు లెట్టిదా
వపువును నామముం గలుగ ౹ భావనచేయుచు హృత్సరోజమ
ధ్యపదమునందు నిల్పి కొని౹యాడఁగఁ గోర్కు లొసంగుచున్ హరుం
డుపనిషదోఘవేద్యుఁడన ౹ నొప్పు సదాశివు లోకరక్షకున్. ౧౪౫

చ. తను మది నిల్పి యొంటరిగ ౹ దారుణసత్త్వనిరంతరాటవిన్
ఘననియమంబునం దప మ౹ఖండతమం బనఁజాలునట్టి దా
నిని విధిఁజేయునద్రిజకు ౹ నెమ్మినిగూర్చు వరంబు లీయనెం
చెను బరమేశ్వరుండు ఫల౹సిద్ధిని గాంచునుగా తపం బిలన్. ౧౪౬

కుహనాశివుఁడు పార్వతికడకు వచ్చు.

ఉ. ఇంకొకసారి పార్వతియభీష్టములం బరికించి తీర్పఁగా
శంకరుఁ డాత్మ నెంచి కడసారి పరీక్ష యిదే నటంచు నే
ణాంకములోనుగాఁ గలుగునయ్యయిచిహ్నములం ద్యజించి యే
శంకకులోనుగాక తగు చారుశరీరముఁ దాల్చె నాదృతిన్. ౧౪౭

సీ. సరసిజంబుల సొంపు నిరసింపఁగాఁ జాలు కనుదోయి ముచ్చటల్ గలుగఁజేయ
స్మరచాపమును గేలిసల్పుచుమించెడు భ్రూయుగం బొకవింత పుట్టఁజేయ
లలితకటాక్షైకఫల మిదె శ్రీయుగ మనురీతి శ్రుతియుగ్మ మమరియుండఁ
గరుణాస్పదం బిదె గదయని నుతిగాంచు కమనీయవక్షంబు కళల నీన
ఆ. వాంఛ లొసఁగఁజాలు వర్ణముల్ వెడలింపఁ
గాంచియున్న వన్నెడు కరణి నెసఁగు
నోష్ఠయుగళ మెంతొ యొప్పులకుప్పఁగా
నమరియుండ రూప మది చెలంగె. ౧౪౮

మ. పదునాల్గేఁడులు దాఁటి యిర్వదికి లోపంబై తదీయాంతరం
బిది యింతే యని తెల్పఁగా మఱియు నూహింపంగ శక్యంబురా
నిదిగాఁ బ్రాయము చెల్వమీఱి మదనుం నిందింపఁగాఁజూచు న
ట్టిదియై కన్పడ రూప మప్రతిమమై యేపారె జల్వొంతగన్. ౧౪౯

చ. అరుదగు ఫాలనేత్ర మపు డారయ యోగులకేఁ గనంగనౌ
సురలకుఁ గానరాక తగుఁ జోద్య మిదేకద తా స్వతంత్రుఁడౌ
పరశివుఁ డెద్దిచేయఁ దలఁపన్ ఫలియించు న దప్పు డచ్చు ని
ర్జరవరులే యెఱుంగుదురు జ్ఞానధనంబున నొప్పియుండుటన్. ౧౫౦

సీ. రుద్రాక్షమాలికల్ రుచిరమణీహారములుగ భోగీశవిభూషణములు
మాణిక్యభూషణమండలంబుగ నర్ధచంద్రకలాపంబు చారువజ్ర
కల్పితమకుటసంఘటిత చిహ్నంబుగ గంగాతరంగిణీతుంగభంగ
మాలికల్ మణిరుచిజాలంబుగా భస్మచర్చ శ్రీచందనచర్చగాఁగ
తే. నితరులకుఁ గన్పడంగ నా యిందుధరుఁడు
రుచిరతరమూర్తియై యొక్కరుండె చేరె
ఘోరతప మాచరించు నా కోమలాంగి
యున్న వనమున కమరు లోహహో యనంగ. ౧౫౧

మ. తనకంటెన్ మును నందమారుతము మోదంబొప్ప నశ్శ్యానవం
బున వ్యాపించుచు దర్శనం బొసఁగుమా భూతేశ్వరా! యంచుఁ బ్రా
ర్థనముల్ చేయఁగఁ గాననామరులు విందల్గూర్చ వన్నెల్ తగన్
వనమం దెల్లెడలన్ మయూరములు నిస్స్వానంబులన్ నింపఁగన్. ౧౫౨

చ. చిలుకలు ముద్దుగుల్కనటు । చేరి పరస్పరహారిభాషణం
బులఁ దరురాజియే పలుకుపోల్కిని దోఁపఁగఁ జేయుచుండ ని
స్తులగతులన్ మయూరవితతుల్ తిరుగాడుచు సుందరారవం
బుల పసమెల్ల మార్పులుకఁ । బూనినరీతి నొనర్పుచుండఁగన్. ౧౫౩

చ. వలువ లమూల్యముల్ తనదువర్ష్మమునన్ వెలయంగ రత్నకుం
డలములు కాంతులీనుచుఁ గనంగన వింతగఁ దోఁచుచుండ ని
మ్ములఁ గపురంపుఁదమ్ములము । భూరిపరిమళసంతతిన్ దిశా
జలరుహనేత్రలం బరవశత్వము నొందఁగఁ జేయుచుండఁగన్. ౧౫౪

మ. స్మితమాస్యాంగణమందుఁ దాండవ మొగిం । జేయం గటాక్షంబు లా
యతకారుణ్యరసాలవాలములె యౌనా నంచుఁ దెల్పంగ నా
క్షితిభృచ్చాపుఁడు మందమందగతులం । జేరెం దదావాస మ
య్యతివం బూన్కిఁ బరీక్ష సేయఁదగునూహన్ జిత్రవేషంబునన్. ౧౫౫

మ. పరమేశుం డిదె వచ్చె నీదుతపముల్ । పండెన్ మహాభాగ్యముల్
వరుసన్ నీకు లభించుఁజుమ్ము గిరిజా । వర్ణింప శక్యంబె యె
వ్వరికే నీదగుపుణ్యమంచుఁ దమిచేఁ । బక్షుల్ శుకాదుల్ మనో
హరవాక్కుల్ వెలయించుచుండుతఱి దుష్టారాతి యీశానుఁడున్. ౧౫౬

చ. పదకమలంబులన్ ధరణిభాగముఁ బూతముగా నొనర్చుచున్
సుదతి వసించునాశ్రమముఁ । జొచ్చెను బార్వతి యప్పుడే సమా
ధి దలఁగి లేచుచుండి వసతిం గనవచ్చెడు నూత్నపూరుషున్
మదనుని ధిక్కరింపఁదగు । మంజులరూపుని గాంచె వింతగన్. ౧౫౭

చ. తొలుత జనించె సంభ్రమము । తోడనె లజ్జయు నంకురించె న
వ్వలఁ బ్రమదంబు నాల్కొనియె । వైళమ సాధ్వస మొక్కయింత యె
ట్టులొ తలచూపఁగల్గెను గనుంగడు వింతగ నవ్వియెల్ల న
వ్వెలఁది మనంబునన్ నిలువ । వేడుకఁ బూనుచు నుండె నెంతయున్. ౧౫౮

శివపార్వతీ సంవాదము.

చ. అతిథి గృహంబుచేరఁగ యథార్హముగా భజియింపనొప్పు నం
చతివ యెఱింగియుండియు మహాత్ముని నాతని జూచినంత నే
వితమునఁ బూజలం దనుప । వేదవిధుల్ ముదమొందునట్టి ప
ద్ధతులను నొక్కఁడే మదిని । దాఁకమి నూరక నిల్చియుండెఁ దాన్. ౧౫౯

ఉ. ఇంచుకసేపు నిశ్చలత । నే గనియుండి మహాభ్రమంబు మా
న్పించెడు జ్ఞానచండకరునిం గనఁజాలిన ప్రౌఢగాన వ్యా
పించినమౌగ్ధ్యమున్ వదలి । పెంపెసలారెడు భక్తి నూని సే
వించెను శాస్త్రపద్ధతిని । విశ్వవిభుం బరమేశు శంకరున్. ౧౬౦

మ. వనితాధర్మము సుంతయున్ సడలకే ♦ వర్తింప నర్హంబుగా
గనుపట్టన్ దలపోంచి తచ్చరణయుగ్మంబుం గటాక్షంబులం
గనుచున్ మెల్లఁగ నార్యవర్య! యెచటుం ♦ గానంగఁ బోఁగోరి యీ
వని కేతెంచితి రావిధంబు వినఁగా ♦ వాంఛింతు నిప్పట్టునన్. ౧౬౧

చ. ఉచితమయేని నే వినఁగ ♦ నొప్పనయేని శ్రమంబు దాన మీ
కిచటఁ బొసంగదేని వచియింపు మహాత్మ! మదీయపూర్వపు
ణ్యాచరితముల్ ఫలించు నని ♦ యాత్మఁ బ్రమోదము నొందుదాన నం
చచలకుమారి వేఁడుటయు ♦ నాకుహనా మునిసూనుఁ డిట్లనున్. ౧౬౨

శా. ఎందుంబోవఁ దలంపుగల్గు మది నొప్డే చేరియేయుండు మే
మెందేనుండిన నెల్లెడన్ నిలిచినట్లే చూడనైయుండు మా
నందాంభోనిధి నోలలాడుచును వింతల్ చూచు దుర్భ్రాంతిలే
కెందుం జూచినఁ గానవచ్చు మునిబృందేష్టంబులం దీర్చుచున్. ౧౬౩

ఉ. తోఁచినయట్లు చేయఁదగు ♦ తోరపుశక్తి చెలంగ నార్తులం
గాచుటయే వ్రతంబుగ జగంబుల ధర్మముఁ బాదుకొల్పఁగాఁ
జూచెదువారిఁ ద్రుంచుటయె ♦ శూరవిలాసముగా నెసంగు మా
కోచపలాక్షి! యిప్పు డిట ♦ కొప్పుగ వచ్చితి మీ నినుం గనన్. ౧౬౪

ఉ. నిన్ను గుఱించి యిందఱిమునిప్రవరుల్ వచియింప వింటి మో
కన్నియమిన్న! యీనియతిఁ ♦ గాంచిన నించుకచోద్యమయ్యె నే
కన్నెలు మున్ను పూనినటు ♦ కానఁగరాదు జడాత్ము లెవ్వరో
నిన్నిటు ప్రోత్సహించి రని ♦ నేఁ దలపోయుదు నెంతొ వింతగన్. ౧౬౫

చ. అరయఁగఁ గ్రూరబుద్ధులగు ♦ నట్టిశఠుల్ కఠినంపుఁ గార్యముల్
పరులకు నచ్చఁజెప్పి సులభంబులుగా మది నమ్మఁజేసి వా
రురుతరకష్టముల్ గుడువ ♦ నొయ్యనఁ జూచుచు సంతసించుచుం
దు రిది విలాసమై తనరుఁ ♦ దోయరుహానన! యట్టివారికిన్. ౧౬౬

ఉ. ఐనను బ్రశ్న సేయుదు నొయారము హెచ్చుగఁ జూపవొప్పు నీ
మేను నిరంతరం బిటులు ♦ మించినపూన్కి శ్రమంబునొందు న
ట్లో నలినాక్షి! చేయు టిదియొప్పునె యెవ్వనిఁగూర్చి యిట్టి కీ
కాననమందు నిష్ఠ గనఁగాఁ జనిఁ బూనితి వింత తెల్పుమా. ౧౬౭

చ. ఫలమది యెట్టిదో యొసఁగఁ ♦ బాల్పడువాఁ డతఁ డెట్టివాఁడొ తొ
య్యలి వచియింపుమా వినఁగ ♦ నాత్మయు సంభ్రమమొందుచున్న ద
ద్దలవియొ పొందఁ గాదొ నిజ ♦ మారయువాఁడ రహస్యమైనచోఁ
దెలుపుమటంచు నే నడుగఁ ♦ జెప్పన నేగెదఁ గార్యసంగతిన్. ౧౬౮

ఉ. వేలుగ నన్ దలంపకు సువృత్తవుగా మదిఁ దోఁపవచ్చితిన్
మీఱెడుకాంతుచే ననిన । మేచకకంధరుపల్కు లెన్ని బల్
నేలుపుకాఁ డితండగు వినీతునిపల్కులె యివ్వి; యెట్లుగా
మాఱు వచింపనౌనో యని । మానసమందుఁ దలంచి యంతటన్ ౧౧౯

చ. పరశివు సంస్మరించి మృదుభాషలఁ బల్కె గళస్వనంబు వీ
ణారవముమించ నో ప్రమథనాయకరూప! మహాత్మ! యేశతో
త్కరమునసుం దపంబునకుఁ । గాఁ బురికొల్పఁగలేదు నేనె శం
కరుని దయాకరుం గుఱిచి । గాఢతపం బొనరింప వచ్చితిన్. ౧౨౦

చ. జనకులు కూడదంచుఁ బలుసారులు పల్కుటెగాక పెండ్లిచే
యను దలపోసి నీకు హరి । యర్హుఁడు గాఁదగు నంచుఁబల్కి రే
ననయము శంకరుం బతిగ । నాత్మఁ దలంచెదుదానఁ గాన నా
తని వరియింపఁ గోరక స్వతంత్రత వచ్చితి నిష్ఠఁ బూనఁగన్. ౧౨౧

మ. తొలిమేనం బొనరించియున్న సుకృతుల్ । తోడ్తోడఁ బ్రోత్సాహముల్
గలుగంజేసెను గాన వచ్చితిని నాకాంక్షల్ ఫలింపంగ భో
గిలసద్ధారుని యోగిసంస్తుతుని సత్కీర్తిప్రభాజాలసం
వళితాశాంతుని భక్తరక్షకుని సేవం దన్పు నిష్టంబునన్. ౧౨౨

చ. అనుపలుకుల్ చెవిం జొరఁగ । నట్టె యహా యనిపల్కి నవ్వి త
న్వని బరికింపఁగా నిదియొ వేళ యటం చెద నిశ్చయించి యి
ట్లనియెను బాలవాదువుకదా నగుఁబాట్లగుఁగాదె నీవొన
ర్చినజతనంబు సత్ఫలదు । శ్రీపతినిన్ విడనాడి వెఱ్ఱివై. ౧౨౩

ఉ. ఇల్లనలేక బంధు వితఁ । డివ్విధి నాకనిచెప్ప నొక్కఁడేఁ
దెల్లముగాఁ గనంబడక । దీనులెకాని పొగడ్తగన్న భా
గ్యోల్లసితుం డొకండయిన । నొక్కపుడైన సఖుండులేకయే
యెల్లెడ సంచరించు నురగేంద్రవిభూషణుఁ గోరి తక్కటా! ౧౨౪

సీ. అభిజనసంపద । కాశించితో మహాభాగ్యంబు వీక్షించి । భ్రాంతిగనితో
సౌందర్యమును గాంచి । సంతసంబందితో మణిహారములఁ గని మమతగనితో
సౌధమ్ములకు మహైశ్వర్యంబు నొందితో బంధులఁ బరికించి । వాంఛగనితో
రతనంపురాసుల । కతిమోదమందితో సరసత కామోదనిరతిఁ గొనితో

తే. పరిజనంబుల నారసి । బాగటంచుఁ, బొంగితో యెడఁబాయనిముసుల నెంచి
చాల సుప్పొంగితో నీవు చేల వలచి, తెవ్విధినో భూతగణవృతునీశుఁ జెపుమ.

ఉ. కట్టను బట్టలేక తినఁగాఁ దగునన్నములేక హస్తిదా
దట్టపుఁజర్మముం దొడిగి । దారుణకాననవస్తురాజియే

పుట్టువువొట్టి భోజ్యముగ ♦ భూరిభయంకరభూతసంఘ మె
ప్పట్టున వీడనట్టి పరి♦వారముగా వనమే గృహంబుగన్. ౧౭౬

ఆ. గోచిపాత లేని ♦ క్షోణీసురక్షలే, యాశ్రితులుగ నుండు♦నట్టి శివుని
వలచి తతని కుండు♦భాగ్యంబు దేనిని, గాంచి చెపుము మదిని ♦ గలవిధంబు.

సీ. సోయగంబు ధనంబు ♦ ప్రాయంబు కులమును బంధురాజియుఁ బరి♦వారవితతి
ప్రాసాదములు విహా♦రమున కర్హంబులౌ నిష్కుటంబులుమఱి ♦ నిర్మలాంబు
పూర్ణసరస్సులు ♦ భూరిరాజ్యంబును గర్వంబులొసఁగు క్ష్మా♦కాంతు లెపుడు
కైవారములు సేయఁ♦గాఁదగు నమస్సలు వనపైనఁ దఱుగని♦తమియుఁ గల్గి

ఆ. యుండుహృదయనాథు ♦ నువిదలు కోరుట,ధర్మ మీజగానఁ ♦ దగినయట్టి
వందఱొప్పఁ దగిన♦యాచార మీయది, బాల! దాని మాన ♦ మేలు గాదు.

ఉ. చిన్నఁదనంబు దానిఁగని ♦ చెల్మిసహించెడుమాతృ మీవ్వయం
బు న్నెఱి వృద్ధిచేయుటకుఁ ♦ బూనిన యజ్ఞులబోధనంబు ని
ట్లన్నియు నీకుఁ బెట్టనిమ♦హామణి భూషణరాజిమై తగ
గన్నెరొ నీదుభాగ్యము నిఁక♦ నుతిచేయఁగ శక్య మెట్లగున్. ౧౭౯

ఉ. ఈశ్వరుఁ డిచ్చె నీ కిపు డ♦దృష్ట మనం దగియుండు సోయగం
బీశ్వరియే యనందగుదు ♦ వెన్నఁగ నీవిషయంబునందుఁ జూ
నశ్వర మిద్దియంచును మ♦నంబున నెంచిన వారు చెప్ప లో
కేశ్వరు విష్ణునిన్ వదలి ♦ యిట్లు వనిన్ వసియించితో చెలీ. ౧౮౦

ఉ. ఈవిషయంబునందు నిను ♦ నెంచఁగ మించెడునజ్ఞు లుండ రే
యేవిషయంబులం గనిన ♦ నిద్ది నిజ మ్మని నమ్ము మంబుజా
క్షీ! విను మొక్క మంచినుడిఁ ♦ జెప్పెద నీవగుమేలుకోరియే
పోవిడు మీవ్రతం బిపుడె ♦ పొమ్ము గృహంబున కెంతొ వేడుకన్. ౧౮౧

చ. జనకులు సంతసింప గుణ♦సత్తము లాదృతి నిన్నుఁ గాంచి పే
వనముల వేడ్కఁ బెంపఁ బరి♦వారము లార్తిఁ ద్యజింప నెచ్చెలుల్
మనములఁ గూర్మి నింపఁ గుల♦మండనమై తగుబంధుజాల మె
ల్లను వినుతింప నుండుము వి♦లాసమునన్ హరి నాథుఁ గోరకన్. ౧౮౨

చ. విచికిలగంధి! నీవు వను♦విందుగ శ్రీహరిపత్నివైన వా
నిచయము సంతసించు జన♦నీజనకుల్ పరిపూర్ణకాములై
ప్రచురధనంబు లబ్బినటు ♦ ప్రాజ్యతమాయతరాజ్య మబ్బి వ
ర్తిలెచటఁ గొఱంతలేనియటు ♦ లెంచి సుఖింతురు స్వేచ్ఛమీఱఁగన్. ౧౮౩

ఉ. ఇందఱుసంతసింపఁ జగ ♦ మెల్లను మోదము నొందు నట్లుగా
నం దరళాక్షి! యీతపము♦నం దగు ప్రీతిని మాని పొమ్మం శ్రీ

లందఱు నాథునిం గలిసి యథ్థావిధంబున దేవతార్చనం
బుం దమిఁ జేయఁగావలయుఁ బోలదె శాస్త్రమురీతివర్తిలన్. ౧౮౪

మ. పతిఁ జేపట్టకయుండు కన్యలు తపఃప్రారంభముం జేయఁగా
హిత మంచున్ వచియించు శాస్త్రములు లేవెందున్ సరోజాక్షి! నా
హితవాక్యంబుల నాలకించి తగ నట్లీవిప్డు సాగించుగా
క్షతపశ్చర్యను మాని శ్రీపతినిఁగూడం గోర్కిమై నుండుమా. ౧౮౫

చ. తను విది నశ్వరంబె యగుఁ దామరసాక్షి! యొసంగుజవ్వనం
బనునది బుద్బుదాభ మని యారయు మవ్వలఁ గోర నించుకై
నను మఱి రాదుసుమ్ము జతనంబునఁ గల్గినదానిఁ దృప్తిఁగా
ననుభవమందుఁ బూన్పక యహా! విడనాడెడువార లుందురే. ౧౮౬

చ. పలుకులు వేయునేటి కిఁకఁ బంతముమాని వృథాశ్రమంబులం
గలుగఁగఁజేయు పట్టుదలఁ గాదన కింతటఁ బాఱఁదోలి తో
య్యలి పితృమాతృవాక్యముల న్యాయ్యములన్ గ్రహియించి శ్రీపతిన్
జలరుహనేత్రు నాథునిగ సమ్మతిఁ గోరుము మేలుగల్గెడున్. ౧౮౭

### పార్వతి కపటమునికి శివమహత్త్వ మెఱిఁగించుట.

చ. అనుటయు శంభుదూషణము లౌనుడు లార్తిని బెంచుచుండఁగా
వినక శివాంఘ్రిపద్మముల వీడనిచిత్తము నించుకే మర
ల్పను బనిపూన కాగ్రహము పల్మఱుఁ జిత్తముఁ బైకొనంగ నుం
డిన నిసుమంత యాపుచు వడిన్ బలికెన్ గుహానామహేశుతోన్. ౧౮౮

క. పిలువనిపేరంటమునకుఁ, గలరయ్యా! పోవువారు కాదని చనినం
గలుగునె యట మర్యాదయు, నలుగురిలోఁ గల్గుఁగాక నగుఁబాటు లొగిన్.

క. ఈనానుడి నీయందుం, బూనందగు నన్వయింప బుధవర! నీవెం
దే నేగెదవో పొమ్మిఁక, నీనుడి విన నిచ్చగింప నేను నిజముగన్. ౧౯౦

చ. అడిగినవారికే తెలుప నౌ హిత మయ్యది వీటిఁబుచ్చి నీ
వుడుగక నా కొగిం దెలుపుచుండుట పాడియెగాదు నిన్నుఁబో
లెడు పురుషాళికిన్ హరుని లీల లెఱుంగఁగ శక్య మెట్టులోఁ
దడయక యింకఁ బొమ్ము దురితంబుల యార్జన మేల చేసెదో. ౧౯౧

సీ. కౌశేయకంబులు గజచర్మ మెవ్వానిదృష్టికి సమముగా నెసఁగుచుండుఁ
జాఱుగంధంబు భస్మము నొక్కభంగిగా నేమహాత్ముఁడు చూచు నేమహాను
మణిహారముల ఘోరఫణిహారముల నొక్కకరణి నేహరుఁడు చొక్కంగఁదాల్చు
నమృతంబు దారుణహాలాహలం బొక్కగతి నేశివుఁడు త్రాగుఁ గడుముదమున

ఆ. నట్టిసర్వసముని నఖిలేశు సర్వజ్ఞు, నమరసేవితాంఘ్రికమలు వేద
వేద్యమహిముఁ బరము విమలు శంకరు నీకుఁ, దెలియఁదరమె యేలపలికె దిట్లు.

ఉ. ఎన్ని భవంబు లెత్తిన నహీనవిభూషణుఁ గొల్చునట్టి భా
గ్యోన్నతిగల్గు జన్మ మది యుత్తమమైతగు నంచు జ్ఞానసం
పన్నులు నిర్వచింతు రది బాగని తోఁచెను నాకు నట్లుగా
నన్నియమంబుఁ బూనితిని నాథునిగా హరుఁ బొందుకోరికన్. ౧౯౩

చ. కరుణకుఁ దావలంబయి జగంబుల నెవ్వరు తన్ను వేఁడినన్
బఱుగునవచ్చి వారలకు భద్ర మొసంగుచు నిర్వికారుఁడౌ
పరమశివుండు నా కొసఁగు భద్రము లెయ్యది నిశ్చయంబు మా
నిరమణ! చాలు నింక శివునిం దెగడన్ జనవయ్య యింటికిన్. ౧౯౪

మ. తొలిజన్మంబున నీ వొనర్చినయఘస్తోమంబు నిన్నిట్లు శ్రీ
గళు దూషింపఁగఁ బ్రోత్సహించె నిది నిక్కం బంచు భావించెదన్
గలరే శంకరు నిందచేయుదురు లోకాలంబునందైన దు
ష్టులె దూషింపఁగఁ బూనువారలు కోపింపం బాపైకకృత్యాదృతిన్. ౧౯౫

మ. వినవయ్యా! మునిబాలకా! శివుని సత్ప్రవృత్తాంత మే నించుకే
వినిపింతున్ దను నెవ్వరేఁ దెగడి యావెన్కం క్షమింపంగ దే
యని వేఁడన్ క్షమియించి భక్తునిగనే యాత్మం దలంతున్ హరుం
డనఁ దాక్షిణ్యము దక్షుఁడే యగుఁ గృపాకారుండు నా నెన్నఁగన్. ౧౯౬

శా. ఎన్నేఁ దప్పు లొనర్చి యవ్వలఁ బ్రభూ యీతప్పులన్ జేసితిన్
మన్నింపందగు నంచు వేఁడగనె సమ్మానించు నుంతైనఁ దా
నెన్నం డాయపరాధసంఘముల విశ్వేశుండు నిర్ద్వంద్వుఁ డా
పన్నత్రాణపరాయణుండు వినవో [1]ప్రాగ్విద్యలం దన్నుతుల్. ౧౯౭

ఉ. జ్ఞానలవంబులేని మృతకల్పులు కొందఱు విష్ణు వొక్కఁడే
కాని శివుండు ముక్తిదుఁడు కాఁడని యందురు వేదరాశియే
పూని వచించు శంకరుఁడె ముక్తిదుఁ డౌ నని స్వప్రకాశుఁడే
యౌ నని భూతనాథుఁడగు నంచును వెఱ్ఱొకమాట యేటికిన్. ౧౯౮

చ. ఎవనికి నింక జన్మ మది యెన్నఁగ లేదో యతండె భక్తిచే
శివుని పదాంబుజద్వయముఁ జిత్తపదంబున నిల్పి కొల్వఁగాఁ
దివురు ననేకజన్మములఁ ప్రమ్మఁజాయు నతండె యీశ్వరుం
గలిసి శ్వాసంతతుల్ మొఱఁగుకై పడి పుట్టుచునుండు నెప్పుడున్. ౧౯౯

ఉ. ఎవ్వనిమన్యువాక్కత్రుటి నెల్లజగంబుల రూపుమాపునో
యెవ్వని సత్కృపాకణ మదెల్లర యార్తులఁ బాపజాలునో
యెవ్వనిభూషణవ్రజము నీశ్వరతన్ దగఁ దెల్పుచుండునో
యవ్వరమూర్తి శంకరు మహాత్మ్యము నెఱుంగఁగ నీకు శక్యమే. ౨౦౦

1 ప్రాగ్విద్యలు = వేదములు.

చ. పరులకు హింసఁగూర్చుటకె ♦ పాల్పడుక్రూరభుజంగరాజి యే
హరునకు భూషణంబులయి ♦ యాదృతిమీఱఁగఁ గొల్చుచుండు భీ
కరతరభూతరాశి కల♦కాలము సేవ లొనర్చుచుం డమిం
బరిచరు లట్టులుండు నల♦భర్గునిశక్తి నెఱుంగఁజాలుదే. ౨౦౧

సీ. ఈశుఁడై సర్వలోకేశుఁడై నతహృషీకేశుఁడై సర్వభూతేశుఁ డగుచు
దాతయై ధర్మనిర్మాతయై దేవతానేతయై దుష్టైకజేత యగుచు
వాదియై మునిహితాపాదియై యజశిరశ్ఛేదియై త్రిపురవిభేది యగుచుఁ
బాత్రుఁడై కార్ముకగోత్రుఁడై శ్రుతికృతస్తోత్రుఁడై నిర్మలగాత్రుఁ డగుచు
తే. శాశ్వతానందుఁడై మహాశాంతుఁ డగుచు,విజితకందర్పుఁడై జ్ఞానివేద్యుఁడగుచు
నలరు సర్వజ్ఞు సర్వగు ♦ హరుని నిట్లు, తూలనాడంగ నీ కెట్లు ♦ తోఁచె మౌని.

చ. గురువుల దేవతావళిని ♦ గొంకక తూలఁగనాడుజాల్ము ని
ష్ఠురహృదయుం గనుంగొనఁగఁ ♦ జొప్పడుఁ బాప మటంచుఁ బెద్ద లం
దురు పరమేశ్వరున్ హరుని ♦ దోఁచినయట్టులు నిందచేయు నీ
చరతుని నిన్నుఁ జూడ నఘసంతతి యబ్బును గానఁ బొమ్మికన్. ౨౦౩

చ. హితముదొఱంగి సర్వజగదీశ్వరుఁ దూలఁగనాడు నిన్ను మ
త్కృతసుకృతాయుధంబునఁ ♦ బరేతవిభుంగనఁ బుచ్చవచ్చుఁ గా
ని తపముకల్మియుం దఱుఁగు ♦ నిర్భరతావక దుష్కృతాగ్ని యే
నిను వడిఁ గాల్చు నం చెఱిఁగి ♦ నే నిపు డూరకయున్నదానఁ జూ. ౨౦౪

—— శివుఁడు ప్రత్యక్షమై పార్వతికి వరము లిచ్చుట. ——

చ. అనుచు రుడుగ్రహవ్యవహ ♦ నాయతకీలలుపర్వ దృగ్ద్వయం
బునఁ గనుపట్టఁ జూచుటయు ♦ భూతవిభుం డిఁక నూరకున్నఁ ద
ప్పును బని యంచుఁ దత్తనువుఁ ♦ బోవిడి యంతట నైజరూపముం
గనఁబడఁజేసెఁ బార్వతికిఁ ♦ గన్నులపండువుగాఁగ నత్తఱిన్. ౨౦౫

సీ. గంగాతరంగిణీ ♦ రంగత్తరంగరవంబులు కర్ణహితంబుఁ గూర్పఁ
గమ్రహిమాంశురేఖయు భూషణంబయి దృగ్ద్వయంబునకు మేలెంతొ నింప
ఫాలభాగమ్మున ♦ భాసిల్లు శుచినేత్ర మార్తులకష్టపనాళిఁ గాల్ప
రవిచంద్రరూపనేత్రములు భక్తాంతస్తమస్సంతతుల రూపుమాపుచుండ
తే. సారకరుణారసంబు విశాలనేత్ర, కమలయుగళాంతములనుండిసమయ మెఱిఁగి
యట్టెప్రవహించుచుండఁ జూపట్టుశివుని, భక్తరక్షణదీక్షుని ♦ బరమశుభదు.

చ. కనుఁగొని మత్పరివాహమున ♦ గాఢనిమగ్నమనస్సరోజయై
దనయొనరించినట్టి దగుదారుణభాషణముల్ త్రపాభరం
బును గదియింప వేగముగ ♦ మోమును వంచి మహేశుపావనాం
ఘ్రినళినయుగ్మముం గనుచుఁ ♦ గేవలభక్తి భజించుచుండఁగన్. ౨౦౬

సీ. తొలుదొల్త భయ ముప్పతిలి కంప మొదవ నాశ్చర్యంబుఁ దనువు విసంజ్ఞఁ జేసె
నద్దానిఁ బైకొని యమలభక్తి మహేశుపదములకడ నిల్వ మది నొనర్చె
నయ్యది పరికించి యతివేగముగ వాంఛ లాచిత్తవిశ్రాంతి నట్టె మాన్పె
నంతట బుద్ధికార్యం బెద్ది చేయునో యింకని తర్కింపఁ బింకమూనె

ఆ. నంతలోన వ్రీడ యన్నింటిఁ బైకొని, యెద్ది చేయ నిశ్చయింపఁ జాల
కుండఁ జేయఁ జాలి యుండె మహాదేవుఁ, డోలి వానిఁ గనుచు నుండె నెలమి.

ఉ. అంత హిమావనీధ్రతనయామణి యించుక శాంతినూని య
త్యంతకృపాసముద్రు నభయప్రదు శంకరుఁ దృష్టిఁ గాంచుచున్
సంతస మెంతయుం దను వెసం బురికొల్పఁగ మ్రొక్కి నిల్చి యీ
వింత ప్రసంగ నేల యని వేమఱు నెంచుచునుండ నీశుఁడున్. ౨౦౯

ఉ. సుస్మిత మాస్యపద్మమునఁ జొక్కి నటింపఁగఁ బర్వతాత్మజా!
విస్మయ మొందనేల? నిను నే విధులం బరికించి మెచ్చితిన్
సుస్మరణీయ మీ తపము చూడఁ గలట్టి మహర్షిరాజికే
[1]ఘస్మరయోగిరాశి నినుఁ గాంచి త్రపం గనువారు సుమ్మికన్. ౨౧౦

చ. వయసునఁ జిన్నదానవయి భక్తిభరంబునఁ బెద్దదానవై
నయమున మేలుబంతివయి నాతిరొ మించితి వీతపంబునన్
జయమును గాంచి తీవు పలుసారులు నిన్నుఁ బరీక్షచేసి మె
చ్చి యభిమతార్థముల్ గలుగఁజేయఁగ వచ్చితి నీదు చెంతకున్. ౨౧౧

క. పంచమహాభూతంబులు, వంచింపఁగ లేక నిన్ను వదలెననఁగ నీ
యంచితతప మిది యసదృశ,మంచున్ వచియింపవలెనె యన్నులమిన్నా. ౨౧౨

మ. ననుఁ బాణిగ్రహణంబు చేయుటకు నో నారీమణీ నీవు పూ
నిన మాన్పింపఁగ నెంచ ఱెన్నొ విధులన్ నేర్పొప్పఁగాఁ దెల్పి యా
వ్వనజాక్షుం బతి నీవు కైకొన మదిన్ వాంఛింపఁగాఁ జేయఁబూ
నినయారీతుల నే నెఱింగితిఁ జుమీ నీవాంఛితంబున్ గనున్. ౨౧౩

ఉ. మెచ్చితి నీదు నిష్ఠకు నమేయఫలంబుల నొందఁగోరి నీ
విచ్చటనుండ నీమన మడంకను మాన్పను గాంచనేమొ యే
పొచ్చెము లేక సుస్థిరతఁ బొల్చునొ యంచుఁ బరీక్షచేయఁగా
ముచ్చట నొంది యిప్పగిది ముగ్ధ! వచించితి నంచు నెంచుమా. ౨౧౪

చ. పలుకులఁ గాలముం గడుప బాగిదెఁ గాదు భవన్మనోరథం
బులు ఫలియింపఁ జేయు వరముల్ ప్రకటింపఁగ వచ్చితిం గదా
పొలఁతిరొ వేఁడు మిష్టవరముల్ త్రప నూనకు మింక నన్ను యీ
శులలితవాక్కులట్టి విన శ్రోత్రయుగం బొగిఁ దృప్తినొందఁగన్. ౨౧౫

1 ఘస్మరులు = కుక్షింభరులు.

చ. శిర సొకయింత నెత్తి విధుశేఖరు వక్త్రహిమాంశు నెంతొ యా
దరమునఁ గాంచి తన్నయనతామరసద్వయ విచ్యుతార్తిసం
హరణ కృపామృతార్ద్ర విమలాయతదృష్టులు సోఁక నెమ్మనం
బరుదుగ హాయిచెందఁగఁ గృతార్థగఁ దన్నుఁ దలంచుచుం దమిన్. ౨౧౬

ఉ. దోసిలివట్టి పల్కె దయతో నను బ్రోవఁగ వచ్చియున్న దే
వా! సకలేశ్వరా! దృఢతరాజ్ఞతఁ బల్కిననావచస్సులం
దోసములన్ క్షమింపు మిదె దోసిలియొగ్గి భజించుదాన న
న్నీసమయంబునన్ సఫలకృత్యగఁ జేయుము దీనరక్షకా. ౨౧౭

చ. మనసునఁ దొల్త నేపురుషుమండనుపై నిడునో పురంధ్రి యా
తనినె గ్రహింపఁగాఁదగును దప్పక నాథునిగాఁగ నంచు శా
స్త్రనిచయముల్ విధించు నని సాధుమతుల్ వచియింప వింటిఁ గా
వున నినుఁ గోరితిం దొలుత భూతపతీ! హృదయాధినాథుగన్. ౨౧౮

శా. ఈనాయూహ మరల్ప శక్యమగునే యెవ్వారికే నిద్ది యె
ల్లైనన్ సిద్ధిని గాంచదేని భవదీయాంఘ్ర్యర్పణార్థంబె యీ
మేనున్ యోగభవాగ్ని కాహుతిగ నొప్పింజేయఁగా నెంచి యు
న్నా నోదేవ! ననున్ గ్రహింపు సతిగా నాపుణ్యముల్ పండఁగన్. ౨౧౯

చ. తపము ఫలించు నెత్తఱిని దర్శనమిత్తువొ యప్పు డంచు శా
స్త్రపథముఁ జక్కఁగా నెఱుఁగు ధన్యులు పల్కుదు రట్టులే మహే
శ! పరమభాగ్యదాయకము సన్మునిముక్తిఫలప్రదంబునై
న పదయుగంబుఁ దావకము నాథ! కనుంగొని ధన్యనైతిఁగా. ౨౨౦

ఉ. నీవు పరీక్ష చేసెడు పనిం దగఁ బూనిన నే మునీంద్రుఁడే
నేవిధినైన నిల్పి కృతకృత్యత గాంచఁగఁ జాలునే యనం
గా వధు వెట్టు చాలు నిది గాఢభవత్కరుణాఫలంబె యీ
నీ విక నన్నుఁ జేకొనెడు నేర్పదియెట్టిదొ నాకుఁ దెల్పుమా. ౨౨౧

శా. నీపాణిగ్రహణంబె కోరితి మదిన్ నీరేజపత్రాక్ష! వా
ణీపేంద్ర ప్రముఖామరార్చితపదా నీపాదపద్మార్చన
వ్యాపారంబున సర్వకాలము ననున్ వర్తింపఁగాఁజేసి మో
దాపారాంబుధి నోలలాడ వర మిమ్మా! భక్తకల్పద్రుమా! ౨౨౨

చ. అనుచుఁ బ్రకంపమాన మృదుహస్తసరోరుహయుగ్మబంధయై
వినయవిభూషణం బమర వేఁడు హిమాచలపుత్త్రికామణిం
గనుఁగొని శంకరుం డనియెఁ గామిని నీ విటు నన్నుఁగూర్చి పా
వననియమంబు సల్పితివి వాంఛఫలింప వరం బొసంగితిన్. ౨౨౩

ఉ. నారదమౌని మేనయు మనంబును మార్పఁగఁ బూని యెన్నియో
సారులు నన్ను దూషణము సల్పుచు బుద్ధులు నేర్పి రట్లు వే
సారక నీదుతండ్రియును జక్రధరుం డధికుం డటంచు నే
భూరిదరిద్రదోషమును బూనితి నంచు వచించి రెంతయున్. ౧౧౪

ఉ. ఎంద ఱవెన్నిసార్లు వచియించిన వానిని లెక్కపెట్టకే
డెందమునందు నాసిరి గణింపక నన్నె వరించియుంట నే
నిందు నినుం గనంగ వరమీయఁగ వచ్చితిఁ జుమ్ము పార్వతీ!
ముం దొకచిత్రముల్ సురసమూహము గానఁగఁ జేయఁగాదగున్. ౧౧౫

శా. దానిం జెల్పెద నాలకింపు గిరిజాతా! నిన్నుఁ బ్రేమంబునం
గానంగాఁ జనుదెంచు నియ్యెడకు నాక్ష్మాభృత్ప్రభుం డెల్లియే
మేనాదేవినిగూడి నారదుఁడు మేల్మేలంచు వర్ణింప నం
తే నన్ దూఱుచు నీతపం బుడుప నేవే నీతులం దెల్పుచున్. ౧౧౬

మ. నినుఁ గొంపోయి యదే విధానమున నే నీరేజపత్త్రాక్షుఁ గై
కొనఁగాఁ జేయఁగఁ బూనువార లిరి నీకుం దెల్పఁగా నెంచితిన్
గనుకన్ నీవు స్వయంవరంబునఁ బతిం గైకొందు నంచుం బ్రతి
జ్ఞను జేయందగు దాని మార్ప నెటులే శక్యంబు గాకుండఁగన్. ౧౧౭

ఉ. వచ్చినబంధువర్గమున బాలు ద్వివర్షవయస్కు నొక్కనిన్
ముచ్చటమీఱ నీజననిముందఱ నుంచి యమర్త్యులందు నే
పొచ్చెములేనివాఁ డితనిఁ బూనిక నెత్తికొనంగ నేర్చునే
నిచ్చపలాక్షి నాదుహిత నీగిరిజన్ వరియింప నర్హుఁడౌ. ౧౧౮

మ. అని నీతండ్రి వచింపఁజేయు మటులే యంచున్ సురేజ్యాల్ ముదం
బున నాబాలుని నెత్తికోఁదలఁతు రెప్పొల్కిన్ బ్రయత్నంబుచే
సిన నెవ్వారి కశక్యమేయగుఁజుమీ చిత్తంబునం దెంచుకే
ననుమానింపకు మాకు మాపఁడు నితాంతస్వాంతదర్పుం డగున్. ౧౧౯

క. మానసపుత్త్రుఁడు నా కని, మానిని వలపోయు మతని మాధవుఁ డెత్తం
గా నేల చాలఁ డనునను,మానముఁ బూనకుము నమ్ము మాటను దీనిన్.

చ. హరిహయుఁ డబ్జసూతియు మురారియు నాతని నెత్తఁజాల రిం
కొరులు సమర్థులంచు మది యోజనచేయఁగనేల? నేనె యో
తరుణిరో! వాని నెత్తుకొని తావకవాంఛ ఫలింపఁజేయుదున్
హరునిసుభాషితంబు లెపుడైన ఫలింపక యుండవచ్చునే. ౧౨౦

ఉ. [1]ద్వాపర మించుకే మదిని బాదుకొనంగ నొనర్ప కిచ్చటం
గాపురముం బొనర్పఁ గుతుకంబును గాంచక తల్లిదండ్రులుం

1 ద్వాపరము = సందేహము.

దాపసుఁడున్ నినుం గనఁగ ॥ దాపును జేరకముండె కార్యదీ
ప్తాపరతంత్రపై మెలఁగు ॥ చాలశుభంబులు నీకుఁ గల్గుతన్. ౨౩౨

మ. ఇఁక నేఁ బోయెద నాసభన్ మరల నిన్ ॥ గాంచంగ నేతెంతు న
ర్భకుఁ డెట్టిండని యెంచఁబోకు మిభవక్త్రస్ఫూర్తిఁ జెన్నారు నా
దుకుమారుం డనినిశ్చయింపు మతనిన్ ॥ దోర్వీర్యసంపన్ను న
స్త్రకళాభిజ్ఞునిగా నెఱుంగు మెవ రెత్తుం జాల రబ్బాలకున్. ౨౩౩

చ. అతఁడు మదాజ్ఞ బాలకుని ॥ యట్లుగఁ దోఁపఁగఁ జేయుచున్ సుప
ప్రతతులు నిండియుండెడు సభాస్థలియందు స్తనంధయుండుగా
జతనము దీనిఁ గాంచుటకె ॥ సత్వము గన్పడకుండ నుండుఁజు
మ్మతనినె నీవు కోరుదు వహార్యమదాజ్ఞయె ప్రోత్సహింపఁగన్. ౨౩౪

ఉ. ఎల్లరు సమ్మతింత్రు హరిణేక్షణ! యీశపథంబు సంగతం
బెల్లవిధంబులం గనఁగ ॥ నీతని నెత్తుట లీలగా దె యం
చుల్లములం బ్రమోదరస ॥ ముప్పతిలన్ సమయంబు దీర్పఁగాఁ
జెల్లు నటంచుఁ బూనుదురు ॥ చిత్తములెల్లను దత్తఱంపడన్. ౨౩౫

చ. సమయ మి దెవ్విధిన్ సభను ॥ సాగునొ నాదగు భాగ్యమెట్టిచం
దమున ఫలించునో యెవఁడు ॥ తచ్ఛిశువుం బయికెత్తునో యటం
చు మనసునం దలంచుకొనుచున్ వగ నొందకు మేను బల్కిన
ట్లమరసభన్ ఫలించు నఖిలార్థము లొక్కకొఱంత లేకయే. ౨౩౬

ఉ నమ్ము త్రిశుద్ధిగాఁ బలుకు నాయది దీని మృగేక్షణా! మనో
జ్ఞమ్ముగ వీచువాయువులు ॥ చక్కనికోయిలకూఁతలున్ సుగం
ధమ్ములఁ గ్రుమ్మరించు సుమనస్తతిభారవినమ్రవీరు దో
ఘమ్ముల చాలనంబును నికామము నీకు శుభంబుఁ దెల్పెడున్. ౨౩౭

ఉ. మంగళముల్ చెలంగును హిమక్షితిభృద్వరకన్యకామణీ
యింగితవిద్వరిష్ఠ వసుకెల్లను దెల్లమయయ్యె నాకు నీ
యంగదలెల్లఁ బాసె నిఁక ॥ హాయిగ నుండుము కోర్కెలెల్లఁ బం
డెంగద యేగువాఁడను గడిందిమగంటిమిఁ జూపుదున్ సభన్. ౨౩౮

చ. అనుచుఁ గటాక్షవీక్షణము ॥ లల్లనఁ బర్వఁగఁ జేయుచున్ ద్రిలో
చనుఁ డపు డం దదృశ్యుఁడయి ॥ స్వర్ణగిరిం దగుమానిరాట్సభం
గనఁబడె; నంతటన్ గిరిజ ॥ కాంక్షితముల్ ఫలియించునన్న శం
భుని హితవాక్యముల్ తమిని ॥ బొంగఁగఁ జేయఁగ విశ్వసించుచున్. ౨౩౯

మ. హరపాదాంబురుహద్వయంబు మదిలో ॥ ధ్యానించు చుండెన్; గిరీ
శ్వరుఁ డాపార్వతినేమముం దలఁచుచున్ ॥ స్వాంతంబు పొక్కంగ ని

ర్జరమానీంద్రుఁడు ప్రోత్సహింపఁగఁ గళత్రం బట్టి దుఃఖార్తిచేఁ
బురికొల్పం జనియెం గుమారి నియమంబుం బూనునచ్చోటికిన్. ౨౪౦

హిమవదాదులు పార్వతికడకు వచ్చుట.

ఉ. మేనకయున్ సురర్షియును । మేలుదలంచుచుఁ గూడఁబోయి య
మ్మానినిఁ గాంచి రంతట హిమక్షితిభృద్వరుఁ డాత్మజామణిం
జానుగఁ జెంతఁ జేర్చికొని । స్వాంతము మార్దవ మొందునట్లు స
మ్మానముమీఱఁ బల్కెను బ్రమాదము లొందక కాన నుందువే. ౨౪౧

సీ. మృదుతమతనువల్లి । మేటిఝంఝావాతహతినిట్లు వాడెనే । యమ్మ కాన
సొగసుకీల్జడ ధూళిసోఁకుట బిఱుసయి యలరాకున్నదే । యమ్మ కాన
పున్నమచందురుఁబోలు నెమ్మొగ మెంతొ యార్తిని గుందెనే । యమ్మ కాన
పల్లవంబుల డిందుపడఁ జేయుపాదమ్ము లిమ్మాడ్కిఁ బొక్కెనే । యమ్మ కాన

తే. ఆఁకలియు దప్పియును నిన్ను । నలముకొనఁగ
నధికకష్టమ్ము లొందితే । యమ్మ కాన
యేటిగ్రహచార మిది కాన । నిట్టులుండఁ
దినఁగఁ గట్టంగఁ గొదువయయ్యెనె తలంపు. ౨౪౨

చ. కలుముల కాటపట్టగు [1]నికాయ్యము లెన్నియొ కల్గియుండఁగా
విలసితరత్నభూషలును । వేలకువేలుగ నొప్పియుండఁ గా
నల నివసించి యాకులఁ దినంగ ని దేదురదృష్టమొక్కొ యో
జలజనిభేక్షణా! తెలియఁజాల నిఁకైనను దీని మానుమా. ౨౪౩

శా. దీనిన్ మానఁగఁజాల నంచు మదిలోఁ । దీండ్రించుకోపాగ్ని నా
పై నం బర్వఁగఁజేయఁ జూచెదవొకో । బాలా! నినుం గాంచుచున్
నేనున్ మేనయు నిందె నిల్చి తపముం । జిత్రంబుగాఁ జేసి యీ
మేనుల్ వాయుదు మింతవట్టు నిజమా । [2]మేపుట్టువా! నమ్ముమా. ౨౪౪

చ. జనకులు నీనిమిత్తమయి । శర్మములన్ విడనాడి కానలో
వనటఁ గృశించి చచ్చుటయె । బాగని నీమదిఁ దోఁచెనె నీ
దు నియమముం ద్యజించి మముఁ । దోడ్కొని యింటికిఁ బొమ్ము పార్వతీ!
మనమున నెంచి యింకఁ దగుమాట రచింపుము మానిముందటన్. ౨౪౫

తరళము:—

జననియున్ జనకుండు కోరిక । సంతతిం గన నెన్నఁగా
ననువుగాని విధంబునన్ నియమావళిం గయికొంచు దే
వునిపదంబులఁ గొల్చి తత్కృపఁ । బొందువారు ఫలంబుగాఁ
దనయులం దనుజాతలన్ మదిఁ । దచ్ఛ్రమంబుఁ దలంపుమా. ౨౪౬

ఉ. కన్నదియాదిగాఁ బొసఁగుకష్టములెల్ల సహించి పెంచి యే

1 నికాయ్యములు = గృహములు. 2 మేపుట్టువు = పుత్త్రిక.

మన్న క్షమించి వారిదగుహార్దము స్వీయముగాఁ దదార్తిఁ దా
మన్నివిధంబులం గుడిచి యల్లన వృద్ధికిఁ దెచ్చుచుండు వా
రి న్నవబోఁడి సంకటపరీతమనస్కులఁ జేయు టొప్పునే. ౨౪౭

చ. బదులొనరించి తీర్చుకొన వచ్చుఁ బరోపకృతిం గృతజ్ఞుఁడై
సదమలగాత్రి! యేబదులుసల్పిన మాతృపితౄణ మింతయై
నఁ దలుగఁజాలునే? వెదకినం గనుపట్టదు దానిఁ దీర్చున
య్యది యెదియైన లోకముల నారయుమా భవదాత్మ దీనినిన్. ౨౪౮

ఉ. తల్లిని దండ్రినిన్ సరిగఁ దన్పఁగఁజాలిన దొక్కకార్యమే
యుల్లముఁ బల్లవించునటు లొప్పుగఁ దాను దదాజ్ఞలోన వ
ర్తిల్లుట, దానఁ దప్ప మఱిదేనను వారలఁ దన్పరామి ను
త్ఫుల్లసరోజనేత్ర! తలపోయుము చక్కనిత్రోవ నొక్కటన్. ౨౪౯

చ. పరులువచించుభాష లొకపట్టునసైన మనంబులోపలం
జొరఁబడనీకుమా యవి యశోభనముల్ పరిణామకాలమం
దురుతరదుఃఖదంబు లగుచుండు నటం చొగి నిశ్చయింపుమా
త్వరపడి యింకనైన మదుదారవచస్సుల నాదరింపుమా. ౨౫౦

ఉ. పెద్దలు పిన్నవారలకుఁ బెంపునుఁగూర్పఁగఁ గోర్కిమీఱఁగా
బుద్ధులు నేర్పఁబూనుదురు పోకడలెల్లను శాస్త్రరీతిఁగా
దిద్దఁగనే తలంతు, సుదతీ! విననొప్పదె వారివార్తలన్
సుద్దులు వేయునేల? మదిఁ జొప్పడఁ జేయుము నాతలంపులన్. ౨౫౧

ఉ. సర్వవిదుత్తముం డితఁడు సన్ముని నారదుఁ డిట్టివాఁడె యా
శర్వునిమాని లోకపతిఁ జక్రధరున్ బతిఁ గూర్పనెంచె నీ
యుర్వర నింక నిట్టిహితుఁ డుండునొకో మన కెందుఁ దల్లి! హృ
త్పర్వముగా వరింపుము సుపర్వగణేశ్వరు భార్గవీవిభున్. ౨౫౨

ఉ. నీమది నాటియున్నయది నింద్యమె యౌనని యెల్లవారలున్
భామిని! నాకుఁ దెల్పిరి సెబాసని వారలు మెచ్చునట్లుగా
శ్రీమహిళాధవున్ బతిగఁ జిత్తమునన్ గయికొమ్ము మాకు నెం
తో ముదముప్పతిల్లునటు లుద్యమమును బొనరింపు మింతటన్. ౨౫౩

చ. అనుచుఁ గపోలయుగ్మమును హస్తతలంబుల దువ్వుచున్ మనం
బునఁ గనుపట్టునుమ్మలికఁ బొంగెడునశ్రుకణాళి మస్తకం
బును దడుపంగ నున్నహిమభూధరవర్యుని బార్శ్వమందు ని
ల్చినజనయిత్రి మేనను నిలింపమునిన్ మెలమెల్లఁ గాంచుచున్. ౨౫౪

కవికంఠభూషణము:—

శిర మట్టె యెత్తి వగఁజెందెడు తండ్రిని తల్లినిన్ మహా
దరమొప్పఁ గాంచి మునితల్లజునిన్ వినయంబుమీఱ భ

_క్తిరతిఁ నమస్తతిని ॥ ధీవిభవంబు గనంబడంగఁ జే
సి రయంబు మీఱఁగను ॥ జేసె విధిఁ మరియాద వారికిన్.

మ. తలిదండ్రుల్ మునిపుత్త్రుఁడుఁ దనిసి రాశితన్వంగి మర్యాదకున్
గలిగెఁ వారికి నమ్మకంబు తమదోశకార్యంబు సర్వం బికన్
ఫలియించున్ గిరిజాస్వభావమును మాశర్వంగంటి మి ట్లంచుఁ న
వ్వాల శాతోదరి మెల్లమెల్లనఁ దమిన్ ॥ భాషించె నీరీతిగన్. ౨౫౬

చ. జనకునియాజ్ఞ మానిపరుశాసనమున్ దలఁదాల్చుదాన నై
నను వరనిర్ణయం బిపుడె ॥ నానుడులన్ వెలిపుచ్చ నెంచకుం
డని మిము వేఁడుదాన నభశయం బొసఁగందగు మీఁకు నాకు దై
వనియతి మీఱరా దనెడుభావము నామదిఁ దోఁచెడుం గడున్. ౨౫౭

చ. అనుటయు వార లానుడులశయందలి యర్థవిశేష మీశ్వరే
చ్ఛ నెఱుఁగఁజాల కాగిరిజ ॥ చక్రి వరింపఁగ నెంచియే వచిం
చె నిటు లటంచు నెంచి యటుశచేసెద మంచు వచించి వంత సి
శునిపదయుగ్మముం బలఁచుశచున్ ఫలసిద్ధిని గాంచఁ గోరుచున్. ౨౫౮

చ. మదిఁగల యర్థముం దెలుపశమాని తముం గనుసర్వమంగళన్
ముదమునఁ జూచి యాతుహినశభూధరుఁ డిట్లను నింట నున్న యా
సుదతులమిన్న లెల్ల నిపుఁశజూడఁగఁ గోరుచు నున్నవారు వా
వుద మిఁక జాల మేల నసశబోఁడి! యటం చొగిఁ బ్రోత్సహింపఁగన్. ౨౫౯

చ. తపమును మానిపోవుటకుఁ ॥ దా నెద సమ్మతిఁ గాంచనట్లు తోఁ
చుపగిదిగా నటించి మధుశసూదనునిన్ వరియింపనెంచ్చు నా
దుపరమభాగ్యరాశి యిటు ॥ పూర్ణముగా ఫలియించె నంచు భూ
ధ్రపతి తలంప మానమును ॥ దాల్చె మహేశ్వరునే తలంచుచున్. ౨౬౦

ఉ. జ్ఞానవిదుత్తముం డనఁగ ॥ సన్నుతిఁగాంచిన యల్లదేవతా
మానియు శంభునిచ్చమెయి ॥ మానినిదా తలఁ పిట్టిదం చెఱుఁగన్
గానకయుండె; నంతఁ దనశగారవిలిపుత్త్రికి సమ్మతించువో
పూవునిన దంచు నమ్మి తనశయుగ్మలినిన్ [1]బఱుతుఁ జమత్కృతిన్. ౨౬౧

క. ఆసన్న కెల్విగని పే, రాసన్ మేనయును బుత్త్రి ॥ నాదర మొప్పం
గా సదనమునకు రమ్మా, యీసుమధికనిష్ఠ నీకు ॥ నేలా జేలా. ౨౬౨

చ. శ్రమములపాలు చేయుటకె ॥ చాలిన యీతపమేల? యన్నశ
స్త్రములకు నేకొఱంతయును ॥ రాదుకదా ప్రమదామణీసమూ
హములు సదా నినుం గొలువ ॥ హాయిగ నుండఁగ రాదె చాలదే
కమలదళాక్షిరో! మనకుఁ ॥ గల్గినభాగ్యము భోగ్యమైనచోన్. ౨౬౩

1 బఱుతు = మెల్లగా గోఁకుట.

చ. ఇదిమొద లీవుమాఖ్యఁ గని యెన్నఁగరానిసుఖంబు లొంద నా
స్పదమయి యొప్పుప్రాణవిభుసంగతి నుండఁగ లోఁదలంపు మో
ముదితరో! తల్లిదండ్రులఁ బ్రమోదమహామృతరాశి నోలలా
డఁ దగును జేయ నీకని కడంకఫలింపఁగ బుజ్జగించినన్. ౨౬౪

ఉ. చూపులఁ గొంత లోఁబడినచొప్పుఁ గనంబడఁజేయుచున్ సవి
త్రీపదముల్ గనుంగొనుచుఁ దెల్వి మఱుంగుపడంగఁజేసి తా
నేపని చేయఁగాఁదగునొ యెన్నఁగఁ జాలనియట్టు లుండ; హృ
త్తాపమునం గలంగుచును దల్లి కుమారిక బుజ్జగించుచున్. ౨౬౫

చ. తెలియక యిట్టికష్టములు తెచ్చుకొనంగఁ దలంచి యెవ్వరో
పలికిన నాలకించి వగపాలయితే మృదుగాత్రి! యంచు మా
టలు వెతఁ దొట్రిలంగఁ గపటం బొకయింత యెఱుంగనట్టితో
య్యాలిఁ గొనిపోవఁగాఁ దగుప్రయత్నము సేయుఁడు నాథ! యంచనన్. ౨౬౬

తే. వ్యోమయానంబు సిద్ధమైయున్న దిందె
యెక్కుమా యని బతిమాలె నక్కొమరిత
నంత నాపదుఁ డల్లె చేయంగ నీకుఁ
దగు నటంచు వచించె నెంతయును బ్రీతి. ౨౬౭

ఉ. అందఱు తన్ను నిప్పగిది నాదృతి రమ్మని ప్రోత్సహింపఁగా
నందుల కెట్లొ యొప్పుకొని నట్లు నటించె హిమాద్రిజాత; యా
నందముమీఱ మేనయుఁ గనన్ మది నేవజనింపఁజేయు నా
సుందరి వస్త్రముఖ్యములఁ జూచి కనుంగవ నశ్రువుల్ తగన్. ౨౬౮

ఉ. సుంతగ దవ్వునన్ నిలిచి చూచుచు నెప్పుడు తమ్ముఁ బిల్తురో
వింతయలంకృతుల్ గొనుచు వేగమపోయి గిరింద్రపుత్త్రి నే
వింత మటంచు నెంచు సఖిబృందముఁ బిల్చినఁ జేరవచ్చి సం
క్రాంత ముదశ్రుబిందుకలికా సమలంకృత నేత్రయుగ్మమై. ౨౬౯

చ. గిరిజను జుట్టి నిల్చి యిటు కేవలనిర్దయ మమ్ము వీడి ని
ష్ఠురజపనిష్ఠఁ బూనుటనఁ జోద్యముగాదె తలోదరీ! యనన్
గరుణ చెలంగ నాసఖులఁ గాంచి మృదూక్తుల నూఱడించి భూ
ధరపతి వేగిరింపఁ బితృధామముఁ జేరఁగ నిచ్చగించినన్. ౨౭౦

చ. తనసుత నాసఖీజనముఁ దాఁ బురికొల్పుచు వ్యోమయాన మె
క్కిన మునితో గిరీంద్రుఁడును గేరుచు నెక్కినయంత యాన మొ
క్కనిమిషమాత్రఁ జేరెను నికాయ్యము నందలిబంధురాజి వే
డ్క నెదురువచ్చి పార్వతిని గాఢముదంబున గారవించుచున్. ౨౭౧

చ. తపము ఫలించెనమ్మ మదిఁ దార్కొనువాంఛలు పండెనమ్మ క

ష్టపడితివంచు నీమొగమె చక్కఁగఁ దెల్పుచున్నదమ్మ యి
ట్టిపనికి నిన్నుఁ బూనిచి సహింగన నెంచినవారి లెంత పు
ణ్యపురుషులో తగం దెలుపవమ్మ గిరీశ్వరపుత్త్రికామణీ! ౧౭౧

క. అని తల్లివంకవారలు, గనికరమున నశ్రువితతి గ్రమ్మెడుకనులన్
దనుఁ గనుచు వితర్కింపఁగ, వనజేక్షణ యుండె మోమువాంచి పలుకకే.

ఉ. వేలవుగాన శ్రీవిభుని వీరవరేణ్యుని మాని భూతరా
డ్జాలసమావృతున్ మునులసంగతి నుండువిరక్తు నుజ్ఝిత
శ్రీలలితున్ విషాక్తగళు సేవితభూధరసద్మ భూషిత
వ్యాళుని గోరితే యనుచు భామినియోర్తుక నవ్వె నయ్యెడన్. ౧౭౩

చ. శితిగళుఁగూడి శైలవరశృంగములన్ విహరింప నెంచితో
యతివరో! యీడుజోడయినయట్టివరున్ మహనీయభోగసం
తతి గలవాని గోరకొని ధన్యతఁ గాంచఁగ నెంచిలేదె దే
సతు లిక నవ్వరే యని విసంతులు కొట్టె నొకర్తు శైలజన్. ౧౭౪

ఉ. పొంగుచు ద్వీపిచర్మవరముల్ బరిధానముగా నెసంగఁ గౌ
రంగము కంచుకంబుగను రాజిలఁ గాననపుష్పహారరా
జిం గనువిందుఁ గూర్చుచుఁ బ్రసిద్ధిని గాంచిన శ్వేతకాయుముల్
సంగతినుండ వేడ్కఁగన స్వాంతమునం దలపోసి నిష్ఠఁ బూ
నంగ వనంబుఁ జేరితివొ నాతి సెబాసనె నొక్కలేమయున్. ౧౭౫

చ. ఒకత్రుటియైన నివ్వదలి యుండఁగ నోప నటంచుఁ బల్కెది
వకట! సరోజనేత్ర! గహనాంతరసీమల నింతకాల మీ
వొకతుకవే వసింప నెటు లోర్చితివో కరుణాంతసార్ద్రచి
త్తకలిత వాఁగదే యని నితంబిని యొక్కతె దూఱె మక్కువన్. ౧౭౬

మ. సురనారీమణు లంఘ్రిపంకజములన్ జొక్కంపుఁబ్రీతిన్ నిరం
తరముంగొల్వఁగ వేచియుండ గుణనానారత్నభూషాసము
త్కరముల్ కోరినయప్పుడాఁగ సుఖసద్మఖ్యాతనొప్పారు శ్రీ
వరుఁ డాత్మేశ్వరుఁడై చెలంగ మనుమా వామాక్షి! యింకైన నిం
కొరునిం గోరకుమంచొకర్తు సఖి యుద్యోగించె బోధింపఁగన్. ౧౭౭

ఆ. కడుపులోనిచల్ల కదలకుండఁగ నీక, నైన నింటనుండకమ్మ కొమ్మ!
సమ్మదమ్ముగూర్చుచతురని బతిఁజేసి,కొమ్మ యంచు నొక్కయమ్మ వేడె. ౧౭౮

మ. గహనంబందుఁ దరక్షుముఖ్యమృగసంఘుం బట్టె దుర్వారకో
పహతిన్ రేఁగి మహాధ్వనుల్ దెసల నింపన్ వాని నైరించి కా
మహరున్ నెమ్మది నిల్పి గాఢతప మోమ్మాడ్కిన్ విధిన్ సల్పితో
యహహా! యం చొకబోఁటిమిన్న పొగడెన్ హాస్యంబునం బార్వతిన్. ౧౭౯

చ. నలువురు నీవు పూనుజతనంబును గాంచి హసింప దిక్కులే
పలువలుగా శ్మశానమె నివాసముగాఁగఁ బిశాచరాజియే
కొలువుడుకాండ్రుగా మునులగుంపులె మిత్రులుగాఁ జెలంగుశ్రీ
గళుఁ బతిఁ గోరితే యని యొకర్తుక గేలియొనర్చెఁ బార్వతిన్. ౨౮౧

చ. అతివరో! నీవు చేసినప్రయత్నము లీమనజాతికెల్ల నీ
చతఁ గలిగించె నేమి యనఁ జాలుదు శ్రీయును రూపమున్ సుసం
తతియును బ్రాయమున్ శుభనిదానములై తగులక్షణంబులున్
వెతకిన లేనివృద్ధుఁ గడుబీదతనంబున నొప్పువానినిం
బతిగ నదెట్లు కోరితివొ బాలిక యంచనె నొక్కలేమ తాన్. ౨౮౨

చ. పలువురు సుందరీమణులు బాలశశాంకధరున్ మహేశ్వరుం
దెలియమి దూఱుచుండిన మదింగల తత్పదభక్తి వీడకే
పలుకకయుండెఁ బార్వతియు భామిను లంతట నామెచిత్తవృ
త్తులు మరలెం గదా యనుచుఁ దోరపువేడుక నుండి రవ్వలన్. ౨౮౩

ఉ. మానివరుండు తద్గిరికుమారిక శీలము గాంచి యెంతయున్
మానసమందు సంతసము మాటికిమాటికిఁ బొంగుచుండఁ దాఁ
బూనినకార్య మెల్ల నొకపోలికఁ బండె నటంచు నెన్నుచున్
శ్రీనిధిసన్నిధానమును జేరఁగఁ బోవఁగ నెంచి యిట్లనున్. ౨౮౪

చ. ధరణిధరేంద్ర! యిచ్చటి యుదంతము లెల్ల మురారిసన్నిధిన్
గర మనురాగ ముప్పతిలఁగా వినిపింపఁగఁ బోవువాఁడ గా
వ్యరతియుఁ బ్రోత్సహించె నను నాదృతిమై సెలవిమ్ము పోయెదన్
దరుణియు సమ్మతించు నిఁక దానవవైరి నటంచు నెంచెదన్. ౨౮౫

చ. అపుడపు డాతలోదరికి సర్వవిధంబున నమ్మురారిపై
నపరిమితానురాగ మెటు లాత్మ జనించునొ యట్టిరీతులం
గృపతోఁ లఁకాడఁగాఁ దెలుప నేదగుఁ జుమ్ము మహీధరేంద్ర! నీ
వె పరమభాగ్యవంతుఁడ వభీష్టము లొందుమ యింకఁ దత్కృపన్. ౨౮౬

ఉ. ఏమఱుపాటులేక సుత యెవ్విధి మార్పును గాంచఁజాలునో
నీమది నిశ్చయించుకొని నేర్పునఁ జక్కఁగ బోధచేయుమా
నామరియాదఁ గాచుజతనం బొనరింపుము పోయివచ్చెదన్
శ్రీమహిళామనోహరుని చెంతకు నిందలి వార్తఁ దెల్పఁగన్. ౨౮౭

ఉ. నావచనం బసత్యమయినన్ మునిసంఘమునందు దుర్యశం
బావహిలున్ నిజంబు, మరియాదయె పోయిన జీవితం బదే
యౌ విఫలంబు గాన నటులౌ నటుచేయక శ్రద్ధమీఱ నా
యీవచనంబు సార్థక మదెట్టులగుం బని యట్లు చేయుమా. ౨౮౮

మ. హరుని౯ దూఱకు మద్ది సత్ఫలము నీశయుంజాల దద్ధాన నీ
గిరిజారత్నము శోకమూని తనకోర్కి౯ బండునట్లే యొన
ర్పురతిం బూనును గాన నట్టిపనికిం జొప్పింప కెట్లో మహే
శ్వరుపైఁ బ్రేముడి తగ్గుచందమున సంభాషించు టొప్పుంజుమీ. ౨౮౯

చ. వనజదళాక్షువర్ణన మవాక్యగతిం బొనరించుచుండు న
ట్లొనరుపు కుడ్యదర్పణము లోక్యవిధంబున శ్రీవిభుం డొన
ర్చిన మహనీయకార్యములఁ జెప్పక చెప్పుచు నుండునట్లు చి
త్రనికరయుక్తి నుండఁదగు దానఁ దదాశయ మబ్బు మాటెఱుఁగున్. ౨౯౦

చ. పలికెడుపల్కులెల్ల హరిభద్రచరిత్రములై యొసంగఁగా
వలయును జిత్రముల్ నృహరివైభవముల్ దెలుపంగఁజాలున
ట్లలవడి యుండఁగావలయు నద్రివరా! బహుభాషలేల? యు
ష్ముల నెదిగాంచిన౯ విన విభు౯ హరిఁ దెల్పుచునుండఁగాఁ దగున్. ౨౯౧

ఉ. ఎల్లెడలం జెలంగుహరి యింతిమనోగతుఁడై నిరంతరం
బుల్లసిలంగఁజేయుపని యొప్పుగఁ బూనుము తన్నుతిప్రజం
బుల్లమునందుఁ జిత్తరువు నొప్పున నాటినఁ జిత్తవృత్తులే
మెల్లఁగ మార్పునొందు నిదె మేటియుపాయము శీతభూధరా. ౨౯౨

చ. సమయమెఱింగి యుక్తముగఁ జక్రిమహత్త్వము పాడుచుండుచం
దమున సఖీవ్రజంబునకుఁ దత్పరత౯ హితబోధ చేయు య
త్నమిది బయల్పడం దగదు దాన ఫలించును గార్య మెల్ల స
ర్వము తెలియంగఁజాలుదువు వచ్చెద యత్నము పంపు నత్తఱిన్. ౨౯౩

చ. అని మహతీనినాదమున నాత్మ నెసంగెడునోంకృతిస్వనం
బనుగతమై చెలంగఁ బ్రమదాంబుధి మున్గుచు నారదుండు త్రి
శునిపదముల్ హృదబ్జమునఁ జొప్పడియుండఁగ యోగశక్తిచెం
పున వియదధ్వమందు వడిఁ బోయెను గావ్యపరత్వ మొప్పఁగన్. ౨౯౪

మ. దివిషన్మౌని చనంగ మేనయు హిమాద్రిప్రష్ఠవిభుండు నాత్మల౯
వివిధాలోచన లొప్పఁ దన్నియమముల్ వేవేగ పాటింప నెం
చి విలాసంబులఁ బుత్రి జేలుతఱి నీచిత్రంబులం గాంచితే
యువిదా యంచు రమేశునాకృతుల నేకన్నో చూపుచుం జెప్పుచున్. ౨౯౫

చ. మనము విలోభితం గనెడుమాడ్కి నొనర్చుచు నుండి తద్విధం
బు నెఱిఁగియు౯ బ్రియంబున విభు౯ శశిశేఖరు లోఁ దలంచుచు౯
జనకులు సంతసంపడఁగఁ జక్రివిచిత్రచరిత్రగేయముల్
వినుచుఁ దదాకృతుల్ గనుచు వింతయె తోఁచమి నూరకుండెఁ దాన్ ౨౯౬

చ. కొమరితచిత్తవృత్తిఁ గనుఁగొంద మటంచుఁ దలంచు మేనయున్
హిమగిరినాథుఁడున్ మరల నెన్ని యొరీతుల విష్ణుదివ్యచి
త్రములను జూపుచున్ బహువిధంబులఁ దెల్పుచునుండి రింతరై
న మరలనట్టి చిత్తమున నాతియుఁ జూచుచు వించు నాదృతిన్. ౨౯౮

క. పరమేశ్వరు వచనంబుల, మరలన్ మరలం దలంచి మానస మెంతో
త్వరపడకయుండ నొప్పె ని,తరులకుఁ దెలియం దగనివిధం బమరంగన్. ౨౯౯

క. సర్వావస్థలయందును, శర్వుని పావనతమాంఘ్రిసరసిజముల హృ
త్పర్వముగం దలఁచుచు నా,పార్వతి సమయంబు తీర్పుపని యెటు లనుచున్.

క. శివవాక్యము మది నెన్నుచుఁ, బ్రవిమలయోగైకసిద్ధివలని ఫలము నా
భవసంగతియొకదా యం,చవధానముమీఱ నిశ్శ్రేయముఁ జేకొనుచున్. ౩౦౦

ఉ. చింతలుమాని యుండెఁ దమచెప్పినమాటలు సాదరంబు న
త్యంతము శ్రద్ధయున్ వెలయ నాత్మజయున్ వినుచుంట కెంతయున్
సంతసమంది లోఁబడినచందము తోఁచుట తల్లిదండ్రు లా
వంతయు శంకనొందక ప్రియంబున నుండిరి శంకరేచ్ఛచేన్. ౩౦౧

ఆశ్వాసాంత్యము.

క. శ్రుతిమంత్రహవ్యవాహా, హుతిసంప్రీతాంతరంగ హాహాహూహూముఖ్యా
ప్రతిమానగానవిద్యా, కృతిసంకీర్తిత సమగ్రకీర్తినిధానా. ౩౦౨

శా. ప్రత్యగ్రత్రిదశార్థనాశ్రవణ[1]వద్రప్రీతియుక్తాత్మకా
నిత్యప్రాభవసంప్రవృద్ధసుయశోనీహారరశ్మిచ్ఛటా
గత్యాత్మీకృతపద్మజాండనికరా క్రవ్యాదదుర్వారగ
ర్వాత్యాగార్థధృతాతిభీకర మహాశస్త్రవ్యూహారాజత్కరా. ౩౦౩

కమలవిలసితము:—

సురవరమునివరశుభఫలదానా
దరరుచిరతరహృదయవికచాబ్జా
హరి సరసిజభవ హరిహయ ముఖ్యా
మరపతి పరినుత మధురతమాఖ్యా. ౩౦౪

గద్యము. ఇది శ్రీమత్త్రిపురసుందరీ కరుణావాప్త గీర్వాణాంధ్రకవితాప్రాభవ, కాశ్యపాన్వయప్రభవ, శ్రీజనమంచి వంశాంబురాశికుముదినీమిత్ర, సుబ్రహ్మణ్యమనీషిపుత్త్ర, తాండవకృష్ణాపరాభిధేయ శేషాద్రినామధేయ నిర్మితంబైన సర్వమంగళాపరిణయంబను మహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ.

---

1 వద్రము = అత్యంతము.

శ్రీ ర స్తు.

# సర్వమంగళాపరిణయము

## తృ తీ యా శ్వా స ము.

క. శ్రీకాంతాహృదయేశ్వర, లోకేశ్వర శక్రమానితలోకార్చిత భా
గ్యాకరపాదాంబురుహా, శ్రీకలితాలాప చంద్రశేఖర దేవా. ౧

ఆ. అవధరింపు మవలఁదగు దివ్యవృత్తాంత, మాహిమాద్రితనయ యాత్మయందు
శంభువరము నమ్మి సమయంబుఁ ద్రోయుచు,నుండ నంత నారదుండు చనుచు.

చ. మనమున నెంచెఁ బార్వతి యమానుషచర్యల లోఁదలంచినన్
వనరుహనేత్రుఁ గైకొనెడుభంగియె తోఁపదు మానిదుస్తరం
బనఁదగు తత్తపంబునకు నాపరమేశ్వరుఁ డాత్మ మెచ్చి యే
మనివర మిచ్చునో విధి యహార్యగతిం దగుఁగాదె యెప్పుడున్. ౩

చ. జనకులవాక్యముల్ వినినజాడ రవంతగఁ దోఁచెఁ గాని యా
వనితదృగుత్పలంబుల ప్రభల్ కడు సందియమంద నాస్పదం
బును గలిగించె సమ్మతిని బొందినయట్లు నటించుచందముల్
కనఁబడెఁ గాని సూనృతముగా మదిఁ దోఁపదు చక్రిఁ గోరుటల్. ౪

చ. తొలుతనె చక్రి స్వాశయము దోఁపఁగఁ జేసెను గాని సందియం
బుల కవకాశలేశమును బోలదు పొందనటంచుఁ బూన్కిమైఁ
బలికితి నాదె భారము వివాహమునం దని చేసితిం బ్రతి
జ్ఞలు పలుభంగులన్ దెలియఁజాలకపోయితి విష్ణుమాయలన్. ౫

ఉ. నే నొనరించువాఁడ నొకనిం బని సాయ మొనర్పుచుండు నె
ప్పైనను వేఁడఁబోవ ననునట్టియహంకృతి నేనికుండు న
ద్దైవానికి వక్త్రభంగము సభాస్థలిఁ గల్గఁగఁ జేయుఁ గర్మమై
తానె చెలంగు దైవమని తప్పక నాయనుభూతి తెల్పెడున్. ౬

మ. పరమాత్ముం డిటు పంతమూనకుము నాపల్కుల్ మదిం జొప్పు మా
చు రహిం దెల్పఁగ వానిఁ జేకొనక కించుం బోలుచున్ గర్వినై
హరిభక్తవ్రజమందుఁ బూజ్యుఁడను నే నంచున్ మహాహంకృతిం
జరియింపన్ దగునే ఫలించె నదె యీచందాన దుఃఖాత్మతన్. ౭

మ. ఇఁకఁ జింతించిన నేఫలం బమరు నెన్నేరీతులం జూడ వె
న్కకుఁ బోఁ జెల్లదటంచుఁ దోఁచెడి మదిన్ । నాదౌ తపంబెల్ల దీ
నికిగా నొడ్డి హిమాచలేంద్రసుత, యానీరేజపత్రాక్షుఁ ద
ప్పక కోరంగ నొనర్చెదన్ జగతి నాపంతంబు నెగ్గించెదన్. ౮

చ. త్వరపడి యెట్టికార్యమును । బంతముమీఱి నొనర్పఁబూనరా
దరయక పూననే మరల । నయ్యది మిక్కిలి కష్టదం బటం
చొరులు హసింప మాను టది । యొప్పదు కష్టము లెన్నివచ్చినన్
బురుషుఁడు తా సహించి మదిఁ । బూనినకార్యము నిర్వహింపనౌ. ౯

ఉ. దైవమె కార్యభారమును । దప్పక తీర్చును బౌరుషంబు లె
న్నే వితథంబులౌట నరు । లెప్పనిఁ దప్పక తీర్తుమంచు నే
యేవిధిఁ బూనరా దనుచు । హీనమతుల్ తెగి పల్కుచుంద్రుగా
దైవమునమ్మి పౌరుషముఁ । దప్పినవాఁడె ధరిత్రి నల్పుఁడౌ. ౧౦

ఉ. పౌరుషమే ఫలప్రదము । భావుకదానచణంబు గాన నే
పూరుషుఁడైన దైవమును । బుద్ధిఁ దలంపక యుండఁజెల్లు నం
చూరక ప్రేలుచుంద్రు ధర । నుద్ధతు లయ్యది యొప్పుగాదుగా
పౌరుషదైవముల్ కలియఁ । బండును గార్యము లేనిచోఁ జెడున్. ౧౧

చ. కనుకనె నేను దైవమును । గాదన కిట్టిప్రయత్నముం దపం
బునకు ఫలంబుగా దివిజపుంజము మేలనఁ జేయఁ బూనితిన్
వనజదళాక్షుఁ డిద్ది ఫలవంతముగా నొనరించుఁగాక నా
పని కొనసాగఁ బోయెదను । భారము శ్రీహరి దన్నమ్మికన్. ౧౨

శా. కార్యం బిద్ది ఫలింపదేని భగవత్కల్యాణవిఘ్నంబు మ
న్మర్యాదాక్షతియుం బొసంగుఁ గనుకన్ । మానంబు గాపాడ నా
యార్యాచిత్తము మాఱ్పనొందునటులే । యత్నింతు నిద్దానికిన్
వర్యాత్మీయ తపోమహాధనమునే । వర్జింతుఁ జక్ర్యర్థమై. ౧౩

మ. ధనవత్సంతతి నుత్తమోత్తములు గోత్రం దాపసుల్ వారిపెన్
ధన మత్యుత్తమ మద్ది సుంతతఱుగన్ । దానన్ మహాకార్యముల్
పునరుజ్జీవితముల్ మహార్థములునై । పొల్పారుచుండుంగదా
వనజాక్షార్థము నే వ్యయింతు ధనమున్ । భాస్వత్తపోరూపమున్. ౧౪

మ. పరమేశుం డిసుమంత తృప్తుఁడయినన్ । భద్రంబు లెన్నే నిరం
తరముం గల్గుటె కాక తద్విమలపాదద్వంద్వదాస్యం బొగిన్
దొరకుం; గోరఁగ నర్హమైన దదెగా । తూర్ణంబుగా నాపరా
త్పరు దర్శింపఁగఁబోయెదన్ జని ఫలింపం జేసెదం బూన్కిమై. ౧౫

నారదునకు మునివేషమున శంకరుఁడు దర్శనమిచ్చుట.

మ. అని చింతించుచు నాలుగడ్గు లిడఁగా ♦ నాచోట సర్వర్తుపు
ష్పనికాయోజ్జ్వలమై మహాఫలయుతిన్ ♦ భాసిల్లి చూడంగ నిం
తని వర్ణింపఁ దరంబుగాని ప్రమదం ♦ బందించు పత్త్రిధ్వనుల్
తనరం బొల్చు తపోవనం బొకఁడు వింతల్ గూర్చుచున్ గన్పడెన్. ౧౬

చ. కనఁబడినంతనే మునినికాయ్య మిదా యని యెంచి దేవతా
మునియు నిదేల తప్పితినొ ♦ మున్ బలుతేఁపలు పోవుత్రోవ నీ
వన మిపుడే కనంబడినభంగి మనంబునఁ దోఁచెఁ జింతలే
మనమును గ్రమ్మియుండుటను ♦ మార్గముఁ దప్పితి నంచు నెన్నెనా. ౧౭

శా. ఆరామం బిదియంచుఁ దోఁచెడి నహా ♦ హారిప్రమాకీర్ణ మి
స్త్రైరాజ్యంబుననుంట గానఁబడ దింకేలా పృథాలస్య మీ
యారామంబున నున్న పుణ్యమతులన్ ♦ హార్షాభినిర్మగ్నులన్
శ్రీరామాప్రియపాదపద్మరతులన్ ♦ సేవించెదన్ భక్తితోన్. ౧౮

ఉ. రాఁగల శ్రేయముం దెలుపు ♦ రమ్యనిమిత్తము లంచుఁ బెద్దలే
బాగుగఁ దెల్పి రేనిపుడు ♦ పట్టినకార్యము పండునంచు నె
న్నేగతులన్ మనోజ్ఞమగు ♦ నీవనదర్శనజాత మోదమే
యూఁగు మదాత్మ నక్కటికనూని మఱింతగ నూఱడించెడున్. ౧౯

క. ఆకస్మికమగు ప్రమదం,బే కార్యము పండునంచు ♦ నెఱిఁగించెడు నా
కీకడఁ గావునఁ ద్వరపడి, యీకమ్రవనంబుఁ జొత్తుఁ ♦ గృష్ణుఁ దలఁచుచున్.

చ. అని తలపోయుచుం జనియె ♦ నవ్వనసీమకు నంత నక్కచో
మునితనయుల్ [1]పదింబదిగ ♦ ముద్దులుగుల్క విపంచికారవం
బున గళనాదముం గలిపి ♦ భూతవిభుం బరమేశు సత్కృపాం
బునిధి నమేయగేయములఁ ♦ బోల నుతించుచు నుండి రెంతయున్. ౨౧

మ. ఒకచో భూజలతాగ్రభాగములపై ♦ నొయ్యారముల్ మీఱఁగా
శుకముల్ చేడియ లింపుమీఱఁ బలుకన్ ♦ శ్రోత్రైకపేయమ్ముగా
సకలాంగంబులు తృప్తినొంద వినుచున్ ♦ సర్వేశు శ్రీశంభు ది
వ్యకపర్దోజ్జ్వలశీర్షునిం దలఁచుచున్ ♦ భాసిల్లుచుండెం గడున్. ౨౨

చ. హరిహరు లంబుజాసనుఁడు ♦ నాదిమతత్త్వమునుండి కల్గి రొ
క్కఁడవుఁడునే స్వతంత్రుఁడనఁ ♦ గాఁ దెలువారుదు నంచుఁ బల్కువాఁ
డరసిన నిందు లేఁడనుచు ♦ నాత్మల నమ్ముఁడు మీర లంచు నె
ల్లరకు మృదూక్తులం దెలుపులాగున గూయుచునుండెఁ [2]దిత్తిరుల్. ౨౩

1 పదింబదిగ = చక్కఁగా. 2 తిత్తిరి = తితువనుపిట్ట.

మ. శ్రుతులే తెల్పెడు సర్వ మీశ్వరునిదౌ § రూపంబె తద్భిన్నసృ
ష్టి తగం గాంచినఁ గానరా దని పరీక్షింపంగ నిమ్మాట సూ
నృతమే యంచు వచించుయోగితతి యిం § కేలా వితర్కంబు లం
చితమార్గం బిదె యంచుఁ దెల్పఁ దొడఁగెన్ § [1]జీరీతతుల్ గట్టిగన్. ౨౪

చ. రుచిరసువర్ణపత్త్ర నికురుంబము కన్నులవిందుచేయ వే
దచయము పల్కులన్ వెడల § దర్పకవైరి మహత్త్వబోధకో
క్త్యుచిత సదాశయంబులనె § యొప్పుగఁ గల్గిన గోరువంకగుం
పచోటున నుండె నెంతయును § హర్షము పాంథుల కబ్బఁజేయుచున్. ౨౫

శా. మింటంబోవుచు వ్యోమయానములపై § మేల్గూర్చుపీఠాళి వా
ల్గంటుల్ మించి విపంచికానినద మంజుకంఠస్వరం బించుకే
జంటంబాయక యొప్పఁజేయఁ ద్రిదశుల్ § సంతుష్టులై వించొగిన్
దంటం బోవఁగఁ గాంచె నారదుఁడు స్వాంతం బెంతో చిత్రంపడన్. ౨౬

ఉ. అంత వనంబునంతరమునం దొకచోట మహోటజంబు సం
క్రాంతసమీరబాలకము § కమ్రతరోన్నతభూజరాజము
త్క్రాంతమఖాగ్నిధూమము నికామవినిర్గతవేదనాదము
ద్భ్రాంతనిరీశవాద సురవర్యసమూహము నై కనంబడెన్. ౨౭

చ. కనఁబడినంతనే తనదుకార్యము పండినయట్టు లెంచి యి
మ్మునివరుఁ డెవ్వఁడో మహితమూర్తిగ నుండునటంచుఁ దోఁచెడున్
మనమునఁ గల్గుశంకలను § మానక తెల్పి మునీంద్రునానతిం
గొని చనువాఁడ నంచు మునికుంజరుఁ గానఁగ నేగె లోనికిన్. ౨౮

ఉ. ముంగిటనే కనంబడిరి § మూర్తిమదగ్నులె యిమ్మునీంద్రుస
త్సంగతిఁగోరి యివ్విధిని § ఛాత్రులుగా వసియించువార లె
న్నంగఁ దరంబె వీరల ఘనంబగు బ్రాహ్మణతేజమంచు లోఁ
బొంగెడు దేవమౌనికి సమూహముగా ద్విజబాలకోత్తముల్. ౨౯

సీ. ఒకఁడు యజుర్వేదమున్నతస్వరముగఁ బఠియించుచున్ భగవంతుఁ బొగడఁ
నొకఁడు సామశ్రుతి § నొప్పారఁబాడుచు సర్వేశుమహిమంబు § సన్నుతింప
నొకఁడు ఋగామ్నాయసూక్తులఁ బలుకుచు దేవాదిదేవుమూర్తితతి నెన్న
నొకఁ డథర్వశ్రుతినూహించి జపియించుచుఁ బరాత్పరుఁ బొగడుచుం జెలంగ
తే. నొకఁడు వేదార్థతత్త్వ మిట్లొప్పు ననుచుఁ
దనదుసహపాఠకులకు శాంతముగఁ దెలుప
నొకఁడు సర్వాత్మశక్తి యిట్లొప్పు ననుచుఁ
బలుకఁ దరమౌనెయం చొగిఁ § బలుకుచుండ. 30

1 చీరీతతుల్ = ఈలపురుపులగుంపులు.

మే. మఱియుం గొందఱు విప్రబాలకులు భీమప్రక్రమం బొప్ప ద
గ్గఱి తర్కోక్తుల వేదవాక్యముల నిక్కంబైనయర్థం బిదె
మఱి యొండెద్దియుఁ గా దటంచుఁ బలుకన్ మాఱొడ్డఁగా నోడి కొం
దఱు తూష్ణీకతఁ దాల్చి యొక్కపలుకైనం బల్కలేకుండఁగన్. ౩౧

ఉ. కొందఱు తర్కవాక్కుల నిగూఢతమశ్రుతతత్త్వ మిట్టిదౌ
నందఱు దీని నొప్పదగు నంచు వచింపఁగ నౌనె తర్కమే
చందమునం బ్రమాణ మనుజాలుఁడు మం చని మాఱుపల్కుచున్
ముందఱికాళ్లసంకెలులఁ బోలినయట్లుగ నార్భటింపఁగన్.	౩౨

ఉ. బొడ్డున జందెమున్ జొనిపి పోరికఁ బెట్టినయట్లు లించుకే
యడ్డును లేక మాటలకు నర్థమె తప్పము దూఱువారలె
గడ్డను గానవారలరె యఖండతరార్థముఁ జెప్పుడాని నే
మొడ్డెలు దూఱఁగా వినుడు నీమే యని కొందఱు విందు వొక్కఁగన్.	౩౩

చ. వల దిఁకఁ బోటులాట లని వారలనాప మఱొక్కకొంద ఱ
వ్వలి కనుపంగ సిగ్గుపడి బాగుగ మీ రిటు బుద్ధిచెప్పినా
ర లిఁక క్షమింపుఁడీ యనుచు రమ్యగళస్వన మొప్పఁ బల్క వా
రెలనగ వాస్యపద్మముల నెంతయుఁ గప్పఁగ నుండి రాదృతిన్.	౩౪

చ. స్వర మొకయించుకైన విధిసంగతిఁ దప్పక యుండఁగా మనో
హరముగ నొప్పుచందమున నందొకకొందఱు వేదపాఠ మా
దరమునఁ జేయఁగా విని పవిత్రులు తన్మయతం జెలంగి యో
గరతిని గాంచినట్లుగనె గాంచఁబడెన్ వనరాజశాఖలన్.	౩౫

ఉ. చల్లనివాయువుల్ పొలయ సారెకు మేనంబున కాపునింపుచున్
మెల్లఁగ మేన సోఁకుచు సమీరము లయ్యెడ పుష్పవాసనల్
చల్లుచు గంధవాహపదసంజ్ఞ యథార్థము చేయుచుండె న
ట్లుల్లము సంతసించునటు లొప్పెడు నాయుటజాంతరమ్మునన్.	౩౬

చ. చని యొకచోటఁ గృష్ణమృగచర్మము కుంజరనాథచర్మమున్
దనకొగిఁ గట్టఁ గప్పుకొనఁ దద్దయు వర్ష్మములై చెలంగఁ జ
క్కని దగు ద్వీపిచర్మము సుఖంబును గూర్చుమహాసనంబుగాఁ
దనర సమాధి నొప్పు మునితల్లజు నొక్కని గాంచె వేడుకన్.	౩౭

సీ. దక్షిణశ్రుతిని రుద్రాక్షమాలిక వ్రేల వక్షమ్మునన్ మణిబంధయుగము
నందు నూహింపరా సత్త్వయోపధుల పూసలసరమ్ములు వడి వెలయుచుండ
నాసాగ్రభాగమ్మునన్ దృష్టి యొప్పఁగఁ గటూర్ధ్వదేహభాగమ్ము చక్క
నిక్కియుండఁగ ముఖ మ్మొక్కకోటి బ్రధ్నకాంతిపుంజము నీనఁగా సమాధి

తే. యందుఁగల్గు పరాకుఁ బద్మాసనమ్మె, తెలుపఁ జిన్ముద్ర లుభయశాఖలఁ జెలంగ,
నాత్మనాత్మ నెధ్యానించునట్టి చిహ్నములనె యాకృతి తెలుపంగఁ బొలుచుమౌని.

ఉ. నారదుఁ డందుఁ గాంచి మునినాయకుఁ డీతఁ డెవండొ యద్భుతా
కారము గల్గి తేజము వికర్తనబింబ సహస్రకాంతులన్
జేరనఁ గుందఁజేయఁ గడువింతగ నిచ్చట నున్నవాఁ డిటం
జేరితిఁ బూర్వపుణ్యమున సిద్ధములయ్యె మదీయకృత్యముల్. ౩౯

చ. అరుదుగ నీమహర్షివదనాబ్జము కానఁగనయ్యెడున్ మహే
శ్వర మురవైరులం దొకఁడొ బ్రహ్మయొ కాఁదగునంచుఁ దోఁచు నిం
కొరుఁ డగునేని దీప్తి యిటు లొప్పునె యేదియొ కారణంబుగా
సురమునివేషమూనె ననుచొప్పు కనంబడుఁ జక్క నెంచినన్. ౪౦

ఉ. నామదిఁ గల్గుసంశయగణంబును బాపుకొనంగవచ్చు నే
మేమివిశేషముల్ తెలియనెంచిన నవ్వి యెఱుంగవచ్చు ని
చ్చో మహనీయరూపగుణశోభితునిం గనఁజాలితిన్ మదీ
యామలపుణ్యశేషమున నడ్గెదఁ బ్రశ్రయమొప్పఁ బ్రశ్నముల్. ౪౧

ఉ. ఇప్పుడు చిత్తపంకజ మభీష్టసురేశ్వరపాదపీఠమై
యొప్పఁగ నీమహామునియు నుత్తమమైన సమాధినిష్ఠతో
నొప్పెడునట్లు తోఁచెడి నదో యిపు డిప్పుడె యూర్పుపిండు రాఁ
జొప్పడురీతి కన్పడెడుఁ జూచెదగా కని యెంచునంతలోన్. ౪౨

చ. పరమసమాధి నప్పు డెడఁబాసినజాడఁ గనంగఁజేయు న
ట్లురవడి ముక్కురంధ్రముల నూర్పులు వెల్వడ మెల్లమెల్లఁగాఁ
గరయుగముద్రలన్ వదలి కన్నులువిప్పిన నారదుం డిదే
తరుణ మటంచుఁ బ్రశ్రయత దాపున కేగి నమస్కరించినన్. ౪౩

మ. "వనజాక్షాంఘ్రిసరోజయుగ్మభజనవ్యాపారసిద్ధి ర్భవే"
త్తని దీవించి సురర్షివర్య! యిఁక లెమ్మా! యంచుఁ బ్రేమార్ద్రసూ
క్తిని కాయంబున శ్రోత్రయుగ్మమును దృప్తిం బొందఁగాఁజేయఁ జ
య్యన సిద్ధాంజలి భాలమం దమరున ట్లమ్మౌనియున్ లేచినన్. ౪౪

తే. "ఉపవిశంతు భవంత అత్రోత్తమాస, నే" యటంచు వచించిన నేమ మలర
మునిసమాదిష్టమైన బృసిని సురర్షి, కూరుచుండెను నిర్భరకుతుక మొప్ప. ౪౫

ఉ. భాలమునందు వహ్నిరుచిభాసిలు నేత్రము మస్తకంబునన్
గ్రాలు జటాకలాపమునఁగల్గు మనోహరచంద్రరేఖనున్
శూలధరాజ్ఞ నారదుఁడు చూచుచునుండియుఁ జూడనట్టులే
బాలిశుఁడై మెలంగె భగవంతునియానతి దుస్తరంబెగా. ౪౬

శా. అంతన్ మౌనివతంసుఁ డంకురితహర్షాస్యాంకూర మాస్యంబునన్
వింతల్ గుల్కఁ నటింప నిట్లనియె మౌనివ్యాఘ్రశార్దూల! నీ
వెంతో ధన్యుఁడ వచ్యుతాంఘ్రిజలజాతేందిందిరప్రాయసు
స్వాంతాలంకృతవృత్తిసంయుతుఁడవై । సంచారముల్ యుటన్. ౮౭

ఉ. నీ విపు డెందుఁబోయెదవు । నిన్నుఁ గనుంగొన నేఁడొ చింత యి
ట్లావిలచిత్తుఁ జేయునటు । లారయఁ దోఁచెడుఁ జెప్ప నర్హమా
నే వినఁగోరుదుం జెపుమ । యెట్టివిధంబునఁ దోఁచు సూనృతా
నావిధి సాయ మేనగుదు । నన్నుఁ బ్రమోదరసాబ్ధి ముంచుచున్. ౮౮

ఉ. దేవమునీంద్రుఁ డిట్లనియె । దివ్యతపోమహిమోత్తమస్వసం
భావితమూర్తి వీరెఱుఁగఁ । బొల్పడనట్టివి గల్గునయ్య! య
వ్వేవయినన్ గృపారససమీహితదృష్టిని నన్నుఁ జన్వనే
యీవిధిఁ బ్రశ్న చేయు టని । యెన్నెద నింక వచింతుఁ జక్కఁగన్. ౮౯

నారదుఁడు కుహనాశంకరునకు స్వప్రవృత్తి నెఱిఁగించుట.

క. తెలిసియొ తెలియకయో నే, జలజాయతనేత్రునకును । క్ష్మాధరపతినై
చెలఁగెడు హిమగిరిపుత్త్రిక, నెలమిన్ సతిగా నొసఁగ । నెల్లరు మెచ్చన్. ౯౦

చ. అని శపథం బొనర్చితి నదంతయు సార్థకమౌ తెఱంగు నా
మనమునఁ దోఁపకున్నయది । మానిని శంకరునే వరింతు నొ
క్కని మఱి యెట్టివానిఁ గుతుకంబుననైనఁ గనంగ నెన్నఁ జ
మ్మని జతనంబునం బలికె । నప్పటినుండియు చింత పైకొనెన్. ౯౧

ఉ. కన్నియచిత్తవృత్తి తొలఁగగా మరలింపఁగఁ జాలువాఁడ నం
చెన్ని హితోక్తులెన్నియొ వచించితి నయ్యవి భస్మహోమమ
ట్లున్నతిఁ గాంచవయ్యె మఱియున్ దృఢచిత్తఁగ నామెఁజేయఁ జా
లె నన్నగుఁబాట్లుగా నది ఫలించె నిఁకేమని విన్నవించెదన్. ౯౨

చ. త్రికరణశుద్ధిగాఁగ సుదతీమణి పార్వతి నీలకంఠు నా
యకునిగఁ గోరెఁ జక్రిచరితాళి నవంతయు నాలకింప నెం
చక తన పట్టొకంతయును । సళ్లఁగనీయక యున్న దింక నె
ట్టికడఁకఁ జేయనౌనను కడింది విచారము పుట్టె నోమునీ! ౯౩

ఉ. కార్యము నిర్వహింతునని । కాఱులు పల్కితి నెన్నియేని యో
యార్య! రమాధినాయకుని । యంతికమందు; మహాత్ముఁ డాతఁ డీ
కార్యము పండునే యని నిరాకారము సంశయమందె మున్నె నే
నార్యను నీకుఁ గూర్తునని । యజ్ఞతఁ బల్కిన నొప్పె నెట్టులో ౯౪

ఉ. నిర్జరవర్యు లెల్లరు మునిప్రవరుల్ విని నే వచింపఁగా
దుర్జయ మీప్రయత్నమని । తోఁచెడునం చనరైరి నేను నా

వర్జనశక్తి నాగిరిజఽస్వాంతముఁ జక్రిని గోరఁజేయు నీ
కర్జము నాకశక్యమె మఽగంటిమిఁ జేయనెయంచు నెంచితిన్. ౫౫

ఉ. గర్వముపూని చేయఁబడుఽకార్యములన్నియు నిష్ఫలంబులౌ
సర్వము దేవదేవుకృప ఽ సాగునుగా యనునూహఁ జేయఁగా
నుర్వి ఫలించునన్న నుడి ఽ నొక్కటి లెక్కగొనంగనైతి నా
గర్వమె నన్ను నీస్థితికిఁ ఽ గావలెనంచును జేర్చె మానిపా! ౫౬

ఉ. మూరుత మెప్పుడో తెలుపఁఽబోలును నా కనిచెప్పె విష్ణు వా
ధీరుని మోసపుచ్చుటకె ఽ తెల్పినయట్లుగ నయ్యె నిప్పుడే
తీరునఁ గార్యభారమును ఽ దీర్పఁగఁజాల నటంచుఁ బల్కుదున్
నారదుఁ డింతయజ్ఞుఁడె యఽనన్ వినఁజాలుదు నెట్టు లోమునీ! ౫౭

చ. వనజజు చెంతకేగి శుభఽవార్తను చెల్పి ముహూర్తనిశ్చయం
బు నొనరుతున్ మదాగమనఽమున్ గనిపెట్టుమ యంచు డంబముల్
మనసున కెక్కఁ బల్కితిని ఽ మానిని నాపలు కొక్కఁడున్ వినం
గను దలపోయదయ్యె నిఁకఁ ఽ గ్రమ్మఱఁ బోయి వచింతు నెవ్విధిన్. ౫౮

ఉ. మానివరేణ్యా! నేనిపుడు ఽ మాధవుకార్యము పండునట్టులే
మేని యొనర్పఁగాఁదగునఽయే వివరింపుమ యింకమీఁదటన్
నేనిటు లెట్టికార్యము మఽనీషిహితంబుగ నాచరింపఁగా
నౌనొ వచింపు సుంతమఽరియాద పొసంగెడునట్లు సత్కృపన్. ౫౯

శా. గోవిందుండు మదీయయత్నమునకుం ఽ గోపంబు దీపింప న
న్నేవాక్యంబులఁ దూఱకుండునటు లాఽయీశుండు నాపైనఁ గ్రో
ధావేశంబున నగ్నినేత్రరుచులన్ ఽ వ్యాపింపఁగాఁ జేయకే
తా వైరాగ్యమునొందియుండునటు లాఽత్మన్ యుక్తి నూహింపుమా. ౬౦

చ. క్షితిని రసాతలంబునఁ బ్రఽసిద్ధివహించిన స్వర్గమందు నా
జతనము హాస్యరూపమునఁ ఽ జక్కఁగఁ బర్వకయుండునట్టు లే
వితమునఁ జేయనౌనొ పృథిఽవీసురమానివరేణ్యా! యెన్నుమా
హితమునె సుప్రసాదమని ఽ యెంచి యొనర్చెద సూనృతంబుగన్. ౬౧

ఉ. నారదుయత్న మింతయయిఽనన్ ఫలియింపకయుండు టెప్పుడే
నారయ నింతదాఁకఁ గలఽయార్యులు లేరనుటే నిజంబు నా
భూరియశంబు బ్రుంగ నసుఽవుల్ భరియించి యిఁకం జరింపఁగా
నేరుతునెట్లు? నాగతి ముఽనిప్రవరా! మది సుంత యెన్నుమా. ౬౨

ఉ. నీయుపదేశముంగొని ముఽనివ్రజ మానన నింకమీఁద ని
ట్లే యవివేకికార్యముల ఽ నెన్నఁడు సాహసమూని సుంతయే

చేయక సత్తపోనిరతిఁ జెందివసించెద నొక్కచోట ని
ష్ఠేయనువొప్ప నీవిపద హీనసముద్రము దాఁటఁగాఁ దగున్. ౬౩

చ. తెలుపు మటన్న నవ్వాలయ దేవమునీంద్రునితోడ నివ్విధిం
బలికె సెబాసురయ్య! మిము వంటిమహాత్ముల యత్న మెట్లు ని
ష్ఫలమగు జ్ఞానదృష్టిగల సాధువులై తగు మిమ్ముబోంట్లు కాఁ
గలఫలముల్ మదిం దలఁచి కాదె ప్రయత్న మొనర్తు రెప్పుడున్. ౬౪

ఉ. కొన్ని నిరంతరాయముగఁ గోరినయట్టులె సాగుచుండుఁగాఁ
కొన్ని మహాంతరాయములఁ గూడియు నెట్లొ ఫలించు నింకనుం
గొన్ని రవంతవిఘ్న మొనఁ గూడినయంతటనే నశించు ని
ట్లెన్నఁగరాక కర్మగతు లెవ్వరికేఁ దెలియంగరానివౌ. ౬౫

ఉ. ఐనను జ్ఞానదృష్టిగల యట్టిభవాదృశు లేమి చేయఁగాఁ
బూనిన నద్దియెల్ల ఫలముం గనకుండునె సంయమీంద్ర! యు
ట్లైనను నన్ను సంతసము నందఁగఁజేయఁదలంచి కోరుటల్
గాని మఱొండు కాదని నికామము తోఁచెడు నామనంబునన్. ౬౬

ఉ. మీ రొకకార్యమందు నెలమిన్ ననుఁబోలినవాని సాయముం
గోరు టదృష్టమే యనుచుఁ గొంకక నామదిఁ దోఁచి కినిఁ జే
కూరఁగఁజేయు నూహ మునికుంజర! చెప్పెద నాలకింపు సా
ధారణలోకవర్తన ముదాహరణంబుగ నెన్ని చూచినన్. ౬౭

ఉ. పెద్దలు కార్యభారమును బిన్నలపై నిడకుండఁ జేయఁగాఁ
దద్దయు న్యాయమౌ సకలధర్మవిదోఘము సమ్మతించుఁ జు
మ్మెద్దికమీఱఁ బిన్నలకు నొప్పినయట్టు లొనర్చు కార్యముల్
సుద్దముగా ఫలించుటలు చూడము లోకమునందు నాకపా! ౬౮

చ. అనుభవ ముండుఁ బెద్దలకు నయ్యది పిన్నల కుండఁబోదు కా
వునఁ దలిదండ్రు లాత్మజుల బుద్ధిని గైకొనకే తమంతఁ జే
యనె తలపోయుచుందురు హానివిపత్తులఁ బా రెఱుంగుటన్
దనయులుకూడ నాపిదప దానిఁ దలంపకయుందు రెన్నఁడున్. ౬౯

చ. తొలుత నసమ్మతింగనియు ధూర్తత దానికి నంతరాయముల్
గలుగఁగఁజేసియుం బిదపఁ గార్యము సాగ నిఁకేల కీర్తివాం
ఛలఁ బ్రతికూలముల్ సలుపఁ జాలు నటంచు దొరఁగి నిస్పృహత్వముం
గలుగఁగ నూరకుండుటయొ కాక మహావృతిఁ జూపుసంద్రరా. ౭౦

ఉ. కావునఁ బిన్నవారి నొకకార్యమునందును జొన్పినంతఁ జే
టావహిలున్ నిజంబిది; మహాత్మక! యట్లగుటన్ ముహూర్తమున్

గోవిదసమ్మతంబుగఁ దఽగుణ్ నియమింపఁగ నంతఁ బెండ్లికిన్
శ్రీవిభుఁ డేగుదేర సురఽరీకృతమై తగునట్లు సాగెడున్. ౨౧

చ. నలువురు పెద్దలేమయిన ఽ నన్ననకుందురె యంచుఁ గన్నెఁ దాఁ
దలఁచి పరిగ్రహించు రిపుఽదర్పహరుణ్ లలనామనోహరుణ్
నళినదళాక్షు శ్రీవిభు నఽనంతర మాతనిభాగ్యముం గనం
దొలుతటిభావ మామెయెదఁ ఽ దోఁపమి సంతసమార నుండెడున్. ౨౨

ఉ. మూరత మప్పు డేమయిన ఽ మూల్గినఁ బెండ్లికి వచ్చియున్నయం
భోరుహనేత్ర లెట్లయినఁ ఽ బొంకముగాఁగ సరే యటంచు నా
గౌరిని బల్కఁజేసి శుభఽకార్యము సాగఁగఁజేయకుండ రో
నారద! యేలసంశయగఽణంబునఁ జిక్కి తపింతు వింకనున్. ౨౩

చ. త్వరపడి బ్రహ్మదగ్గఱకొ ఽ దైవవిదుత్తముఁడైన దేవతా
గురువరు నంతికంబునకొ ఽ కోరినచోటికిఁ బోయి కన్యకా
వరులకుఁ దారకాబలము ఽ [1]వారిజమిత్రముఖోడుమార్గసం
చరబలముం జెలంగునటు ఽ చక్కనిలగ్నము నిశ్చయించుచున్. ౨౪

శా. ఉద్వాహంబున కేమికావలయునో ఽ యూహించి యర్థంబుగా
సద్వాద్యంబులు వైణికుల్ నటకసంఽజ్ఞం బొల్చునాకిన్నరుల్
మృద్వీకాదికవస్తువుల్ మఱియు మేఽల్మేలంచుఁ గొండాడును
ద్యద్వామాక్షులు దేవతామునులు మూఽర్తంబుం గనన్ రాఁదగున్. ౨౫

ఉ. మూర్తము వెండికొండదగు ఽ మూర్ధమునందును సాగు మీఱ లా
యార్తశరణ్యు శ్రీపతిని ఽ హర్షముమీఱఁగఁగూడి రాఁదగుణ్
గర్తను నేన మిమ్ములను ఽ గ్రమ్మఱ రమ్మనువారిఁ గూర్పఁగా
నేర్తునె యొంటివాఁడగద ఽ నెమ్మిని రాదగు నంచు నెల్లరన్. ౨౬

క. ఒకసారి పిలిచి రమ్మా!, సకలేశునిపెండ్లిఁ జూడఁ ఽ జను దెంతురు మా
నికలితులై దేవతలెల్లకడలనుండియు మనోవిఽలాసము పేర్మిన్. ౨౭

ఉ. ఏల దురంతచింతఁగొన ఽ నింక ముహూర్తము నిర్ణయింప జా
గేలయొనర్పఁ బొమ్ము సకఽలేశ్వరుమూర్ధముపైన భారముణ్
బోలఁగ నిల్పి కార్యమును ఽ బూని నిమిత్తమె నేను దేవదే
వా! లలి దీని సాగునటు ఽ లాత్మఁ దలంపుమ యంచుఁ గోరుమా. ౨౮

చ. వినయమె భూషణంబనుట ఽ వేయివిధంబుల శాస్త్రరాశిలోఁ
గనఁబడుఁగాదె దానిఁగొని ఽ కార్యములన్ నడిపింపు మవ్వలం
గనుఁగొనుదీవె యల్ల, శితిఽకంఠుఁడు దేని నొనర్పఁజాలునో
వనజదళాక్షుఁ డెవ్విధి విఽవాహమునన్ ఫలసిద్ధి గాంచునో. ౨౯

---

1 వారిజమిత్రముఖోడుమార్గసం, చరబలమున్ = సూర్యుఁడు లోనగు గ్రహములబలము.

మ. ఇఁకజాగేల మునీంద్ర! పొమ్మనిన నెంతే బుద్ధి నూహించి యిం
తకుమించం దగుయుక్తి లేదనుచు సిద్ధాంతమ్ము దాఁజేసికొం
చకలంకం బగుతన్మహత్త్వమున కత్యంతమ్ము హర్షించి యో
సకలేశా! పనిఁ బూనువాఁడ ననుచుర్ సందేహముల్ వాయుచున్. ౮౦

ఆ. మౌనిపతికి మ్రొక్కి మర్యాదమీఱంగఁ, బెండ్లిసమయమునకుఁ బ్రీతిమీఱ
రాఁగఁదగును మీరు రా నద్ది ఫలియించి,నల్లె తలఁతు సెలవె యనిన నతఁడు.

చ. చిఱునగ వాస్యపద్మమునఁ జిత్రగతుల్ దగ నాట్యమాడఁగా
నఱగొఱలేని భావము బయల్పడ నిట్లను మౌనినాయకా!
యఱమరలేనితావునకు హర్షముమీఱఁగఁ బోవు టొప్పఁగా
కొఱకొఱలాడు వారికడకుం జనుటొప్ప ద దెట్టివారికిన్. ౮౨

ఉ. నీవఁట పెండ్లిపెద్ద వలసీరజనేత్రుఁడు పెండ్లియాడఁగా
సేవకబృందసంయుతిని జెచ్చెర వచ్చెడునంట బ్రహ్మయుర్
దేవవిభుండు లోనయిన ధీరవరేణ్యులు వత్తురంట యం
దేవిధిఁ బెండ్లిసాగునొకో యేర్పడఁ జూడఁగ రాఁ దలంపమే. ౮౩

ఉ. తప్పకవచ్చి నిన్నుఁగని తామరసాక్షు వివాహచిత్రముల్
మెప్పుగఁ గాంచఁగోరుదు మమేయబలాఢ్యుఁడు విష్ణు వన్నవా
క్కప్పుడు తేటతెల్లమగు నార్యవరా! చని కార్యమెల్ల నే
రొప్పఁగ సంఘటింపుము మహోద్యమమూనియె యైన వెగమే. ౮౪

చ. అని పలుకంగ సంతసిలి యమ్ముని వీడ్కొని నారదుండు బ్ర
హ్మను గనఁబోవ నెంచెఁ ద్రిపురారియు నందె యదృశ్యుఁడయ్యె; నా
మునియును దవ్విచిత్రమును బుద్ధినెఱుంగక యట్లొనర్చి నెం
చి నియతిమీఱఁ బోయె సరసీరుహసంభవుఁ డుండుచోటికిన్. ౮౫

## బ్రహ్మనారదసంవాదము.

మ. తనకార్యంబు ఫలించునంచు మునిచంద్రప్రోక్త మయ్యెఁగదా
యని లోనెంచుచుఁ బోయె సత్యమనునాఖ్యం బొల్పులోకంబునుం
గనఁగా నంతట ముందుదోఁచె నజియుం గమ్రస్వరూపంబునం
గనఁగా నోచినవారికోరికలకుం గల్పద్రుమంబై తగున్. ౮౬

మ. అరిషడ్వర్గము నొంచి సిద్ధులయి యాహారేచ్ఛలర్ మాని ని
ష్కరమోదంబు నజస్రముం గనుచుఁ దాపం బన్నశబ్దంబు నే
వరుసర్ శ్రోత్రయుగంబునం బడమి భాస్వద్రూపులై యొప్పు స
త్పురుషవ్రాతముఁ గాంచె నారదుఁడు సొంపుల్ గుల్క పూదోఁటలన్. ౮౭

ఉ. అంతకు నంతకుర్ మదిని హర్షముపొంగఁగ నంతఁజొచ్చి యే
కాంతమునందు నున్నయజు నాయతతేజుని వేదవారముల్

వింతగ ధర్మముల్ తెలుప । వేడుకమై వినుచున్నవాని నే
చింతలులేక మోదరస।సిద్ధిని గాంచిన జ్ఞానరూపునిన్. ౮౮

చ. తనయుని గాంచి నంతనె పి।తామహుఁ డల్లననవ్వి రమ్ము నీ
మనమునఁగల్గు వాంఛితము । మానక తెల్పుము దానిఁదీర్తు నా
విని కమలోద్భవాంఘ్రులకు । విశ్వసుఖంబును గూర్చువానికిన్
ముని తమి మ్రొక్కి యిట్లనియె । భూతవిభూ! విను నాయుదంతమున్. ౮౯

చ. హిమగిరి,పుత్త్రి విష్ణువున । కిచ్చి వివాహము చేయునట్లు నే
ర్పమర ఘటించినాఁడఁద్రిద।శాధిపముఖ్యులు సమ్మతించి రీ
క్రమమున కింక మూరుతము । గావలె నిశ్చయ మద్ది యుష్మదా
స్యమునన వెల్వడందగిన । దంచు వెసం జనుదెంచితిం బ్రభూ! ౯౦

ఉ. సర్వసుపర్వసమ్మతము । చక్రిమనఃప్రమదావహంబు దృ
క్పర్వము లోకసిద్ధిదము । బ్రహ్మమునీంద్రగణానుమోదదం
బుర్వికి నూర్ధ్వలోకముల । కున్నతకౌతుక సంప్రదంబునై
శర్వన కీప్టసిద్ధి నిడఁ।జాలకయుండు ముహూర్తరత్నమున్. ౯౧

క. ఆలోచింపుము తండ్రీ, శ్రీలలనాధీశుఁ జూడఁ । జెచ్చెరఁ జననౌఁ
గాలవిలంబము లే దిఁకఁ, జాలపనుల్ గలవు నాకు । సర్వశరణ్యా. ౯౨

ఉ. కాలము నిర్ణయించి కుతు।కం బలరారఁగ వ్రాసియిచ్చినం
జాలు శిరంబునందు గురు।సత్తముఁ డిచ్చినసుప్రసాదముం
గా లలి నెంచి పోయెదను । క్ష్మాధరుఁ డింతకు వేచియుండు నిం
కేల వచింప సర్వము న।హీనమతిం దలపోయు నీకడన్. ౯౩

ఉ. ఒక్కటివిన్నవింతు దయ।యుంచి ముహూర్తము నిర్వహింప మీ
రక్కడి కేగుదేరఁదగు । హంసతురంగమమెక్కి వాక్సతిన్
దక్కినసేవకాళి ముని।తల్లజులం దగఁగూడి దేవ నా
యక్కఱఁదీర్ప నంచు నిదె । యంజలిపట్టియె విన్నవించెదన్. ౯౪

ఉ. క్రమ్మఱవచ్చి పిల్వ గురు।కార్యముఁ జక్కఁగ నిర్వహించునా
కెమ్మెయిఁ దీఱుపా టౌదవ।దేమొ యొకండనెగాదె యిప్పుడే
మిమ్ము ముహూర్తకర్తల న।మేయమహత్త్వముగల్గు తండ్రులన్
సమ్మతిఁ గోరువాఁడ గురు।సన్నిధి నింకను జెప్పనేర్తునే. ౯౫

చ. అనుచు శిరంబు పాదముల।యందుఁ దమిం గదియించి యున్నయా
తనయుని నారదున్ గరుణ । ధాతయు లేవఁగనెత్తి మోముఁ గ
న్గొని గురుకార్యకష్టముల।కుం దృపచెందుట కానరాఁగ ని
ట్లనియెఁ గుమార! యీగురు[1]మ।హంబును దీర్పఁగ నేల పూనితో. ౯౬

1 మహము = ఉత్సవము.

చ. అమరులు తద్విభుల్ మఱియు నర్షితముల్ గణియింపరాని శ
క్తిమహితులైన పార్షదులు కృత్యవిదుత్తము లెందఱేని యా
కమలదళాక్షు మ్రోలఁ గలకాలము భక్తిని గాచియుంద్రు శీ
ర్షములఁ దదాజ్ఞఁ దాల్చ మునిసత్తమ యెవ్వఁడు నిన్నుఁ బూన్చెనో ౯౭

ఉ. పుట్టిననాఁటఁగోలె గురుమోదమునన్ హరిగేయముల్ రసం
బుట్టిపడంగఁ బాడుచు మహోత్తమపూరుషులన్ గనంగ నీ
వెట్టిప్రయాసముం గనక యెత్తఱినేఁ త్రిజగంబులన్ గడున్
మెట్టుచునుందు వెల్లరును మేలని నిన్ బొగడంగఁ బుత్త్రకా! ౯౮

సీ. చారువిపంచికాస్వరమె నాదబ్రహ్మ మన్న భావంబున నలరుచుందు
నీవేటికో యిప్డు నీరజాక్షువివాహమహము చేయఁగఁబూని మలఁగుచున్న
వాఁడవో తుహినాద్రివర్యుఁడు వేఁడెనో నినుఁ బరీక్షింపనెంచినమురారి
కోరెనో తెలియంగఁ గోరెద నటుగాక పెత్తన మిద్దాని నెత్తిపెన

ఆ. నీవె వైచుకొంటివో పల్కుమా యన్నఁ, బద్మసంభవుని సుభవుని గాంచి
వినయమొప్పఁ బలికె విశ్వసృష్టిప్రియ, విష్ణుతుహినగిరులు వేఁడరైరి. ౯౯

చ. హిమగిరిఁ జూడఁబోయినపు డింతి కనంబడఁ బెండ్లిసేయుకే
సమయము పుచ్చువాఁడవె యొసంగెడుజవ్వనమన్న భూషణం
బమరఁ జెలంగు నింతుల కహా తగినట్టివరున్ బొసంగఁ జే
య మఱచియున్నతండ్రి రిపువౌ ననఁ జెల్లును ముజ్జగంబులన్. ౧౦౦

చ. తపసి యొసంగు మన్మథునిదర్పమె ప్రోగుగ నిట్టులొప్పు నం
చరయఁగ నింకనైనఁ దగినట్టి వరున్ గనుమంచుఁ బల్కితిన్
సరసిజసంభవా! తుహినశైలము నీవె వచింపు మప్పుడౌ
వరుని నటంచు నాపయినె వైచెను భారము దైవసంగతిన్. ౧౦౧

ఉ. అంతటఁ దెల్విమాలి వనజాక్షుఁడె నీసుకుమారి కెన్న న
త్యంతము సర్వభంగుల మహాప్తుఁడు లేఁ డికనట్టిఁ డొక్కఁడే
నెంత తలంచినం గనిన నీత్రిజగంబుల నంచు నెన్నియో
పంతము లాడితిన్ బదులుపల్కక యాతఁడు సమ్మతిం గనెన్. ౧౦౨

ఉ. కాని మఱొక్కభారమును క్ష్మాధరవర్యుఁడు నాశిరంబుపైఁ
దానుగ మోపె నీవె చని తామరసాక్షుని సమ్మతింప నె
ట్లైనను జేసి రమ్మనియె వందుల కేనును సమ్మతించితిన్
శ్రీనళినాక్షుకార్య మిదిచేసిన మేలగు నన్నయూహచేన్. ౧౦౩

ఉ. ఈపని కేను బూనుకొనుటే యపరాధ మటన్న నొప్పదన్
శ్రీపతిచెంతకుం జని విజృంభితరూపవిశేషయుక్తయా

నాపడఁతింగుఱించి మఱియాదనుమీఱక సంస్తుతించితిన్
నాపలుకుల్ తమిన్ వినుచు । నవ్వుచు నాపరమేశుఁ డిట్లనెన్. ౧౦౪

ఉ. కన్నియ యొప్పుకొన్నయదె । కాంతలు నాకుఁ గలారటంచు నీ
వెన్నితివే కుమారికడ । నీపలుకుల్ విననిచ్చగించెనే
యన్నగరాజపత్నియును । హర్షముఁ గాంచెనె దేవమౌని! నీ
వన్నియుఁ జక్కఁగా నరసి । యవ్వలఁ గార్యము నిర్వహించుచోన్. ౧౦౫

ఉ. నాకిపు డున్న భార్యలమనంబుల కెంతయు నొప్పిదంబుగా
నాకమలాక్షి తా మెలఁగ । నాత్మను సమ్మతిఁ గాంచఁజేయఁగా
నీకగునేని వచ్చెదను । నీవెనువెంటనె యే ప్రయత్నముల్
చేకొనఁ జేయ నన్నియును । సిద్ధముచేయఁగ నీదె భారమౌ. ౧౦౬

తే. ఉత్తరీయంబుతో వత్తు । నొప్పుకున్న, వారివంకలదీర్ప నీభారమె సుమి
యనియె నే నందులకు సరే యంటిఁగాని, భావికాలంపుశక్తి చూపట్టదయ్యె.

క. తలిరాకుబోఁడి నాపలు,కులకుం దలయొగ్గకున్నె । గోవిందుని ని
స్తులరూపమహిమ నొప్పం, దలఁపదె యని యెంచినాఁడ । దైవవశుఁడనై.

క. కనుకన్ సర్వంబును నే, నొనరించెద నంచుఁ బ్రతిన । యొప్పఁగఁ దుహినా
ద్రిని జూడఁబోయి తెల్పితి, విని యాతఁడు పూర్వమున్న విధమున నుండెన్.

క. ఆతని ప్రియపత్నియు న, న్నాతతిఁ గని యిట్లుపల్కె । నాత్మజ శ్రీశున్
బ్రాఁతిగఁ గైకొన నెంచదు, చేతమునం బ్రీతిఁ గోరు శ్రీకంఠు హరున్. ౧౧౦

తే. తెఱవ తాఁబట్టినట్టికుందేటి కరయ, మూఁడుకాళ్లే యటంచు మోమోటదక్కి
కూరుచున్న దిమరలుపఁగూడనట్టు, లింకమనయత్నమును మానుటే హితంబు.

క. అని పలుక నేనుఁ బార్వతిఁ, గని బోధించితిని దేవకాంతుమహత్త్వం
బును దేటతెల్లముగ నే,మనువాఁడ సనేమిర యనున ట్లయ్యె గురూ! ౧౧౨

ఆ. మఱల మరలఁ బోయి । మానిని కెన్నియో, గతులఁ దెల్పినాఁడఁ । గాని తన్వి
ఘోరతప మొనర్చెఁ । గ్రూరాటవిన్ దన, వాంఛితము ఫలింప । భక్తిమీఱ.

క. తపము ఫలించెనో లేదో, చపలాక్షిని దోడితెచ్చి । క్ష్మాధరపతి యే
మిపలుకఁ జాలకయున్నాఁ, డపరాధము నైపు మనుచు । నర్థించె ననున్. ౧౧౪

క. నేను నిరాశుఁడనై యే, మేనియతిం బూన దాన । హితముగలుగు నం
చానెలవుఁ బాసి వచ్చుచు, మౌనీంద్రుని గంటి నతనిమాటలవలనన్. ౧౧౫

క. ఇసుమంత యాశగల్గెను, వెస వచ్చితి నిన్నుఁ గాంచు వేడుక నిఁక నో
బిసరుహసంభవ! కార్యం,బు సమగ్రముగా ఫలించు । మూర్తము నిపుడే ౧౧౬

క. పరికింపు మాబలంబున, సరసీరుహనేత్రబంధుజాలము రాఁగాఁ
బరిహాసభీతి వాంఛను, మరలించుకొనంగ వలయు । మాట లిఁకేలా. ౧౧౭

చ. అనుపమసంపదల్ గలుగునట్లుగఁ జేయుముహూర్తమైన నా
వనరుహనేత్రునే పతిగ భామిని గోరును శంకరుండు ని
ర్ధనుఁడగుటన్ ముహూర్తమది తన్వి మరల్పఁగఁ జాలియుండు నం
చనుకొనువాఁడ నన్న విధి యాతని యజ్ఞత కుమ్మలించుచున్. ౧౧౮

చ. మదిని దలంచె నీముహాము మంచికిసాగ దటంచుఁదోఁచు ని
య్యదనునఁ గల్గురాశిబల మట్లు వచించెడు నజ్ఞునట్లు నా
రదముని యీతఁ డిప్పని పరాత్పరునిం దనియింపఁ జేయునం
చెదఁ దలపోయుచెల్లఁ గన నిందు రహస్యపు హేతు వేదియో. ౧౧౯

ఉ. ఉన్నటు దట్టుచున్నయది యుగ్రున కీవిషయంబునందుఁ గో
పోన్నతి యుండవచ్చు నది యుగ్రపలితాశనకీలవోలె సం
పన్నజగద్వితానమును భస్మము చేయకపోదు మూఁపతం
బిన్నవిధంబులం గనిన నిప్పుడు చెప్పక యుండు టొప్పగున్. ౧౨౦

మ. వల దీయత్నము మానుమన్న మతిపోవన్ మాని దుఃఖాబ్ధిలోఁ
పలుమున్గన్ మఱి పంకజాక్షునకు నొబ్బంగిన్ దలంపొప్పునో
తెలియంజాలను గాన నిప్పు డొకయుక్తిం బన్ని యీజాల్మునిన్
మెలమెల్లం బనుపంగనౌ ననుచు సుస్మేరంబు గన్పట్టఁగన్. ౧౨౧

ఉ. సంతస మట్టియుట్టిపడ సారససూతి వచించె నారదా!
యెంతవివేకహీనుఁ డితఁ డిత్తఱి నయ్యెనటంచుఁ దెల్పునీ
వింతలు పల్కవచ్చితివి విష్ణుని పెండ్లికి నేల మూఁపతం
బింతటికన్న వింతకలదే యొకమాఱు తలంపుమా మదిన్. ౧౨౨

చ. అరయఁ "దదేవ లగ్న" మనునార్యజనోక్తిఁ దలంపలేవొ శ్రీ
హరికిఁ దలంపుగల్గు సమయంబె సులగ్నము కాదె వేగమే
యరిగి రమాధినాథునకు నంతయుఁ దెల్పి తదాజ్ఞఁగొంచు ర
మ్మరుగఁ దలంచువారిఁ గొని యప్పుడె పోదము పెండ్లిఁ జూడఁగన్. ౧౨౩

క. పరమేశ్వరు పెండ్లికి నొక్కరుఁడు ముహూర్తంబు చెప్పఁగల్గునె దానం
బొరయదె మహాపరాధము, పరికింపఁగవలదె యింతపాటి మునీంద్రా! ౧౨౪

చ. అని తెలుపంగ నారదుఁడు న్యాయ్యములే యగుబ్రహ్మవాక్కు లం
చును దలపోసి నాకుఁ దగుచొప్పెఱిఁగించితి వింతెచాలు నిం
క నళిననేత్రు సన్నిధికిఁ గ్రక్కునఁ బోయెద విన్నవింతు నా
యనఘున కంత నాపరము నానతిఁ గైకొనివత్తు నోగురూ! ౧౨౫

మ. సెలవే నాపని మిక్కుటంబగుకృపన్ సిద్ధింప దీవింపుమా
జలజాక్షుండు మదుక్తులం గొనునొ యేచందంబునన్, దాని నా

కెలమిం దెల్పఁగ నీవె దిక్కనుచు నిన్నే నమ్మియున్నాఁడ ని
మ్ముల నుద్వాహము సాగి నాకుఁ బ్రమదంబుం గల్గఁజేయంగదే. ౧౨౬

చ. అనుచుఁ బితామహాజ్ఞఁ గొని యమ్ముని శ్రీవిభుఁగాంచఁ బోయి స
ద్వినుతము భక్తసంవృతము వీతరిపుప్రకరంబు తుంగభం
గనివహహీన శాంతజలగాధసముద్రమునౌచు నచ్యుతం
బనఁజను లోకవర్యము మహత్త్వవిశిష్టముఁ గాంచె నొక్కచోన్. ౧౨౭

మ. అదిగోలోకమునాఁ బ్రసిద్ధము పురాణాళిన్ మహానందదం
బది యే యోగులకెల్ల; నందుఁగలవా రశ్రాంతమున్ గృష్ణుస
త్పదకంజార్చనలోలుపాత్ములు కృపాపాథోనిధుల్ రాధికా
పదవిన్యాససులక్షితోత్తమ లసద్భాగ్యైక సందర్శనుల్. ౧౨౮

## గోలోకమహిమము.

మ. విరజాశైవలినీతటద్వయలస ద్ద్వీరున్మహామందిరాం
తరసంవాసులు శుద్ధసత్త్వగుణపాత్ర స్ఫారతేజఃకళే
బరు లానందరసాబ్ధినిర్మలత మాభంగోర్మికా డోలికో
త్కరకేళీ పరిమగ్నచిత్తులు సుధాధారాంధసుల్ నిర్మలుల్. ౧౨౯

క. అనుపమతత్త్వ జిఘృక్షౌఘును లుత్తమతర్కనిరతి గల్గినమేటుల్
వినయాభరణులునై శ్రీ, వనజాక్షకృపాప్తిఁ బొల్చువారు సతంబున్. ౧౩౦

క. అట్టింద్రున్ ధన్యులఁ గని, యెట్టిమహాసుకృతకర్మ మీమానులు తొ
ల్పుట్టువులను జేసిరొ గడుఁ, బట్టుదలల్ మీఱ దానిఫలమన నిదెగా. ౧౩౧

చ. అదియె ఫలాభిసంధిరహితామల కర్మవిశేష మన్న నే
యదనున నేచ్యుతిం గనక హరినిరంతర సంప్రమోదశ
ర్మద పదసంస్థితిం గనెడు మాడ్కి న దెయ్యది కల్గఁజేయునో;
త్రిదశులకైన దుర్లభము దివ్యమునౌ సుఖదంబ దెద్దియో. ౧౩౨

చ. అనుకొనుచున్ వియత్తటిని నన్నివిధంబులఁ బోలియున్నప్రో
దిని విరజాఖ్యఁ గాంచెను నదీతిలకం బది మౌనిరాక వే
డ్కను గొలుపంగ నయ్యతిథి గారవమొప్పఁగఁ బూజచేయ నె
మ్మనమున నెంచి భాగ్యమున మౌనివరుం డరుదెంచెఁ దానుఁగన్. ౧౩౩

చ. పిలువకపోయినన్ సుజనబృందము నిర్మలచిత్తమొప్పవా
రలఁ గన వచ్చు నంచును బురాణగణంబులు దెల్పు దాని ని
మ్ములఁ దలఁదాల్ప నెంచినటు భూరితరోర్మికరంబులన్ సుమం
బులఁ గొని యేగుదెంచి మునిముఖ్యునియంఘ్రుల నిల్పె నొయ్యనన్. ౧౩౪

ఉ. వారివిహారశీలుఁ డగువాయువు శీకరసంఘసంయుతిన్
దూరగతిప్రయాసమును దోడనె పోవఁగఁజేయ మౌనిజం

భారిపయిన్ బడింబడిగ నల్లనఁ బర్వఁగఁ బంచి యుల్లస
ద్వారిఁ దరంగహస్తములఁ బాదములం గడిగెం మహాదృతిన్. ౧౩౫

మ. ఫలభారంబున వంగి నిర్మలజలస్పర్శంబు కాంక్షించు నా
హాలఁ గల్పించుమహీజశాఖలఁ దరంగార్ద్రానిలస్పర్శనం
బుల దేవర్షిసమీపభాగమునకుం బోఁద్రోసి యీసత్ఫలం
బులఁ గైకొమ్మని వీచికామృదురవంబుల్ పొంగ వేఁడెం దమిన్. ౧౩౬

ఉ. దేవమునీంద్ర! నాపయి నతిప్రియభావముగల్గి వచ్చినా
రీవిధిఁ బిల్వకుండఁగనె యిద్దిగదా సహజోపకారసం
భావితశీలురై తగుభవాదృశయోగులవృత్తి యంచు భృం
గావళి ఝంకృతిప్రకట హారివచస్సులఁ దెల్పెఁ జక్కఁగన్. ౧౩౭

క. కొండంత దేవతలకున్, గొండంతగఁ బత్త్రిఁ బెట్టఁగూడునె తమిమై
నుండినదాని నొసంగితి, దండియటం చెంచుకొనఁగఁ దగు మౌనీంద్రా! ౧౩౮

క. అనుభావము జలపక్షుల, ఘనపతములఁ దెలిపె; నంతఁ గప్రభునికిఁ జెం
తనుగల యారామమ్మును, గనుఁగొనియెన్ నారదుండు సుకంపువగన్.

వసంతర్తువర్ణనము.

చ. సుకముని చూచుచుండఁగనె చూతమహీజము నూత్నపల్లవో
త్కరశరసంప్రసారణముఖంబున నాత్మపరాక్రమంబు నే
ర్పరుల కెఱుంగఁజేయఁగ దరస్మితమల్లనఁ గోరకౌఘసుం
దరరదనాగ్రదర్శనమునన్ వెలిఁ బుచ్చెఁ గురంటకం బొగిన్. ౧౪౦

చ. అపుడు గర్ణికారములు హారిసువర్ణసుమంబులన్ మహా
దరమునఁ గానుకపెట్టుచుఁ గృతజ్ఞతఁ దెల్ప శరౌఘముల్ మనో
హరసితపుష్పవస్త్రము మహార్హముఁ గైకొను మంచుఁ గానుకనీ
య రహి వసంతలక్ష్మి తమి నల్లనవచ్చెను గేసరప్పఁగన్. ౧౪౧

ఉ. ఆమనియందుఁ గోమల లతాయతపాలికలందు నూఁగుచున్
భూమిని రాలియున్నసుమపుంజముపై మృదులాంఘ్రు లుంచి యొం
తో మరియాద యుట్టిపడ నొయ్యన సంచరణంబుచేయు చా
రామగణాధిదేవత కరంబు విహారము సల్పె నెల్లెడన్. ౧౪౨

మ. వనలక్ష్మీమణి యేగుదెంచె నిదె పంచవాసాహ్వానహంబులే
యనఁ బొల్పారునికుంజపుంజముల భూషార్థంబు పుష్పవ్రజం
బును సంసిద్ధముచేయుఁ డిత్తఱి మహాభూజంబులారా! యటం
చు నితాంతం బొగి హెచ్చరించెఁ బరభృత్స్తోమంబు చెన్నేపునన్. ౧౪౩

మ. భవదీయాగమనంబు మాకును మనోవాంఛాప్రపంచంబులో
సువిశేషం బనఁగా నిదే యగుఁగదా సొంపన్న సదాపమే

యవురా! మాసుకృతంబు పండె నిపుడే యంచున్ బ్రమత్తద్విరే
ఫవితానంబులు ఝుంకృతి ప్రబలశబ్దస్ఫూర్తిఁ దెల్పెం దమిన్. ౧౪౪

సీ. చిలుకలముద్దుపల్కులు వందిమాగధ సూత వైతాళిక స్తుతులుగాఁగఁ
ప్రత్యగ్రసహకార పల్లవగ్రాస మత్తపికనాదములు గీతములుగాఁగ
మకరందపాన సమ్మత్తమధువ్రత పటుఝుంకృతుల్ తోడుపాటగాఁగ
క్ష్మాధరశిఖర నిస్సరదురుతరఝర బహుళధ్వనులు తాళపటలిగాఁగ

తే. మందమారుతచలిత కమ్రప్రతాన,నినులు హర్షంబుపైకొనంగను శిరంబు
లల్లనఁ గదల్చు నప్పేరటాండ్రుగాఁగ, వనమహాలక్ష్మి సభ సాగె ననుపమగతి.

ఉ. ఆమనిఁ గేలిసల్ప ముదమారఁగ వచ్చిన యవ్వనేందిరన్
గామితదాత్రి శాస్త్రవిధి గ్రాలఁగఁ బూజలఁ దన్పుకోర్కిమై
భూమిరుహంబులెల్ల ఫలపుంజముఁ గాన్కఁగఁ బెట్టి పత్త్రరూ
పామలతాళవృంతముల నల్లన వీచుచుఁ గొల్చె భక్తిచేన్ ౧౪౬

చ. సరసులు ఫుల్లతామరసచారుతమాసనముల్ ఘటింప నిం
దిర పరివారయుక్తముగ దేవతలెల్లను సన్నుతింప సు
స్థిరవిభవాభిరామయయి చేరిన నవ్వరటాళి లక్ష్మణో
త్కరములఁగూడి తద్యశముఁ గమ్రరుతంబులఁ బాడె వేడుకన్ ౧౪౭

మ. కలహంసాంగన లెంతొ వేడుకను బక్షంబుల్ గదుర్చ విప్పి యి
మ్ముల నాకాననలక్ష్మిపార్శ్వముల సొంపుల్ గుల్క వింజామరల్
బలె వీవంగఁ దరంగడోలికపయిన్ వ్యాకోచపద్మాంతర
స్థలసత్పీఠమునందునుండి మరియాదల్ మించ నూఁగెన్ దమిన్ ౧౪౮

మ. సలిలక్రీడలు చెల్ల భూమిరుహముల్ సమ్మృప్తసుచ్ఛాయశో
భల నొప్పారెడు స్వస్థలంబులను బుష్పప్రాయమా రత్నకం
బళముం జక్కనమర్చి యందలరునా పద్మాలయన్ బుష్పవృ
ష్టుల సంభావనచేసెఁ బక్షిరుతముల్ స్తోత్రంబులై యొప్పఁగన్ ౧౪౯

ఉ. తల్లిని గారవించు వనతల్లజముం గనువేడ్క మన్మథుం
డల్లనవచ్చె మందమలయానిలుఁ డెంతయుఁ ద్రోవచూప రం
జిల్లి శుకంబు లాత్మజయశీలము లోకులకెల్లఁ బల్కలం
దెల్లముచేయ నెం దయినదీ టన లేని సమృద్ధి యొప్పఁగన్ ౧౫౦

శా. కాంతాపాంగధనుస్సమాహితకటాక్షస్ఫారనారాచ సం
క్రాంతి ప్రచ్యుతధైర్యసార యువసంఘంబుల్ విమూఢంబులై
చింతావ్యాపృతిఁ జిత్తముల్ కలఁగ సంసేవించెఁ గందర్పు ని
శ్చింతామోదముఁ గూర్పు మింకనయినన్ శ్రీపుత్త్ర! యం చార్తిమై. ౧౫౧

చ. అనుపమసంపదం గులుకు నామనియం దలరారు నవ్వనం
బునుగని చోద్యమంది యిది పూర్వము నాకనినప్పు డిట్టులుం
డినయటు తోఁప దిత్తఱి గణింపఁగరాని సమృద్ధి యొప్పఁగాఁ
గనులకు విందుఁగూర్చుచు నికామముఁ బొల్చె విచిత్రరీతులన్. ౧౫౨

చ. తలఁప వసంతకాల మనితప్పక తోఁచెడుఁ బెండ్లికిద్ది ని
స్తులసమయంబు శ్రీహరికిఁ దోయ్యలిఁ గూర్పఁగఁజాలు యత్నముల్
సలిపెద మీఁదదైవమె యొసంగెడుభారము మోయువాఁడు ని
శ్చలమతి శ్రీపతిం దలఁచి శంక యొకించుకలేని పూన్కితోన్. ౧౫౩

చ. మునిపతి పల్కినట్టివిధమ్మును గనఁ గార్యము పండునంచుఁ దోఁ
చెను బరమేష్ఠి మూర్తమువహించినకి యత్నము చేయుమంచుఁ జె
ప్పెనుగద జాగిఁ కేల? రిపుబృందముఁ జెండు హరిం బరాత్పరుం
గని జతనంబుఁ దెల్పి శుభకార్యము సిద్ధి గనంగఁ జేసెదన్. ౧౫౪

ఉ. ఇంతకు మున్ను చూచినవి యీయెడ కా వనసంపదయుం దనో
క్కింత మనంబునం గదిరె నీయెలదోఁటలు క్రొత్తక్రొత్తగా
వింతలుఁ గూర్చుచున్నయవి విష్ణుమహత్త్వము లిట్టివంచు వే
దాంతు లెఱుంగలేరన నహా యిఁక నే నెఱుఁగంగఁ బ్రోడనే. ౧౫౫

ఉ. ఒక్కక్షణంబులోన జగదోఘము గల్గఁగఁజేయఁజాలు వే
ఱొక్కక్షణంబులో సివలనో వ్వెసలారఁగఁ జేయఁజాలు నిం
కొక్కక్షణంబులోన నెదిరంబుం గనరానటు చేయఁజాలు ని
మ్మక్క! రమేశుచిత్రములు నారయఁజాలు నెవండు సృష్టిలోన్. ౧౫౬

శా. వైకుంఠంబును వేఱులోకముగ సంభావింప నైనట్టు ల
స్తోకస్వీయమహత్త్వశక్తి భగవంతుం డిద్ది గావించెనో
కాకున్నన్ గిరిదుర్గనిమ్నగలు నిక్కం బెన్నఁగాఁ గ్రొత్తగా
నాకుం దోఁచునె నిండు శ్రీపతియు నున్నాఁడంచునుం దోఁచునే. ౧౫౭

ఉ. ఆరయ శ్రీనికేతనుని యాలయవర్యము లున్నయట్టులే
సారెకుసారెకున్ మదిఁ బొసంగెడుఁ జిహ్నములెన్ని యేని యీ
సారి వినోదపాత్రములె చాలుగఁ దోఁచుచునున్న వెన్నియో
యారఁ! రమావిభుండు నను నా వ్రతమ్మె పరికింప నెంచెనో. ౧౫౮

శా. కాని మ్మింకఁ బ్రయత్నముల్ సఫలముం గావింపఁగా నెంచెదన్
శ్రీనాథుండె సహాయుఁడై కనుఁగొనన్ సిద్ధించు నెట్లైన నే
నైనన్ మానక చేయఁబూనుటయె కార్యంబౌను లోకంబులం
దేనే మిన్నగ నుండ నెంతుఁగవె యొట్లీయత్నముల్ మాననో. ౧౫౯

చ. సురవరమౌళిరత్నరుచిశోభిత పాదసరోరుహుండు శం
కరుఁ డురుసత్వశాలి శ్రుతికల్పితరూపుఁడు వాసుదేవుఁ డా
ధరసుతఁ బెండ్లియాడఁ బ్రమదంబును బూనె నటన్న నింక నె
వ్వరుసఁ బొసంగు విఘ్నములు వాని నిఁకేల తలంప నామదిన్. ౧౬౦

ఉ. నూతనలోకమే యిది యనూనమహత్త్వవిరాజితంబు గా
నీతతిఁ దోఁచుచున్నయది యిందు రమాపతి యుండనోపు నా
చేతమునన్ని నిశ్చయము చేసెదు భక్తవరేణ్యు లిందు సం
ప్రీతిగ నున్నవారు బహురీతుల వీరితపస్సు పొల్చెడున్. ౧౬౧

ఉ. ఒక్కయెడన్ గణంబులుగ నుండి జగత్పతిపాదపద్మముల్
చక్కఁగ నిర్మలాత్మల నొసంగెడుభక్తిని నిల్పి వానినే
దక్క మఱొం డెఱుంగక నితాంతము ధ్యానము చేయుచున్నవా
రొక్కెడ నొక్కరొక్కరుగ నుండి నుతించుచు నున్నవా రొగిన్. ౧౬౨

ఉ. కొందఱు వృక్షమూలములఁ గోరికమైఁ బరమేశు నీశు నా
నందరసాలవాలుని ననంతమహత్త్వముగల్గువాని సం
క్రందనముఖ్యవందితుని గమ్రతనూరుచి మించువాని న
య్యిందిరతోఁ జెలంగునటులెంచి జపించుచు నున్నవా రిటన్. ౧౬౩

ఉ. కావున దేవదేవుఁ డిటఁ గాపురముండును సంశయంబు లే
దీవఱ కేనుజూచినది యీయదియే యయియుండుఁ గార్యవే
గావిలమానసుండనయి యద్ది మఱొక్కఁడుగాఁ దలంచితిన్
శ్రీవిభుఁ డుండుచో టిదియె చెచ్చెరఁ బోయెద నంచు మానియున్. ౧౬౪

మ. పరమేశా! నినునమ్మినాఁడ నిఁక నాపంతంబుఁ జెల్లింప నె
వ్వరు దిక్కుందురు? నీవుతప్ప ననుచున్ భావించుచున్ భూరుహాం
తరమార్గంబునఁ బోయె దేవముని పంతంబుల్ సముద్రంబు దు
ర్భరభంగార్భటిఁ బర్వకాలమునఁ బై పైమించు నట్లొప్పఁగన్. ౧౬౫

వ. చనిచని యయ్యుపవనాంతరంబున నొండొండం బెనంగి మనోహరాండజమం డల నిబిడంబులై సుందరరుతంబుల శ్రవణానందంబు గల్పించుచుఁ బంచవర్ణ బహువర్ణ దర్శనపాత్రంబులగు శుకనికరపరివేష్టితశాఖాగ్రంబులఁ జెలంగుచుఁ గిలకిలార్భటుల సంచలనశీలంబులై యొండొంటిం దాఁకుచుఁ బోరుచు మరల ననునయించుచు భూరుహాంతరంబులకు దాఁటుచు మరలి నివాసంబుల నచ్చెరువుగఁ జేరుచుఁ జూపఱ కెంతయు వినోదంబుఁ గల్పించు శాఖామృగసంచయంబుల నించుకే నంతరంబులేని మహాశాఖలం గనంబడుచు, సువర్ణప్రసూనంబుల స్వర్లోకవాసుల నారాధింపం బూనురీతిఁ గనంబడ నంబరంబునకుం బెరిగిన మృదుశాఖాంతంబుల వెలుంగుచు ఖరకరకిరణనికరంబులం గ్రిందికిం దిగక

యుండ నాపుచుండు నాకు జొంపంబులం బెంపుసంపాదించుచుం బతత్త్రినీడం బులం జెలంగుచు బహువిధనీడోద్భవంబులకు శరణ్యంబులై యాతపపరితాప విషణ్ణపాంథులకు నిలయంబులై యలరుచు సర్వర్తుపల్లవ కుసుమ ఫల విసరం బుల విభూషితంబులై ఛాయాపుష్పఫలంబులం బ్రధానంబులనం బ్రఖ్యాతం బులై వెలయు మహామహీరుహంబులం గాంచి యానందించి యవ్వలంబోయి పోయి కుడుంగంబులు నయనపర్వం బాపాదింప నచ్చోట నిలిచి భూరుహ పంక్తుల నాశ్రయించి స్వీయాశ్రయత్వబలంబుం దెలుపుచు మనోహరాకృతులం దగి మలయానిలకిశోరస్పర్శంబునం జలించుచుం దమకోమలతనుత్వంబుం బ్రక టించుచు నార్తవధర్మంబులం బుష్పవతీత్వంబున వెలయించుచు సహజసుగంధి త్వంబున జాత్యుత్కృష్టతం గనంబఱచుచు మరందధారా సమాస్వాద నాసక్తి సంవేష్టిత సముదంచితచంచరీక సంచయప్రతిపాదిత బహుళశర్మంకారకంబుల వదాన్యత్వంబుం దేటపఱచుచు లలితగతులం జెలంగుమనోజ్ఞలతాభామినీ నికు రంబంబుం గాంచి పరమామోదంబునంది యచ్చోటు వదలి చనిచని యంబర చుంబిశిరోభాగంబులం దమమహోన్నతత నెఱింగించుచుం బ్రసూనవిసు విస్మయ రాసదృశ పరిమళ సంతర్పిత సరసజననాసావివరంబులై పరిపక్వఫలపటల సు ప్రదానశీలంబులై యాశ్రితవాత్సల్యంబు లలి వెలయించు భూమిరుహసము దాయంబులం గనుపండువు చేయుచు, నిరంతరపరమేశ్వర శ్రీకృష్ణకథా గేయం బుల నానందించుచుం బరవశత నృత్యంబులు చేయుచుం దన్మయత్వంబు గలిగి యుండు గోపకుమారవారంబుల నెసంగుచు, నాదబహుళంబై శాశ్వతామోద ప్రదంబై సర్వర్తుధర్మసంభృతంబై యనుపమానంబై యొండెనుం దనకు జోడు లేక విమల యశస్సాంద్రంబై యుండుబృందావనంబుం గని మహానందసాగరం బున మునుంగుచుం దత్పరిసరప్రవర్తిత విరజాతరంగిణీ వీచికామాలికాసమా గతశీతవాతప్రసారంబున మై మఱచుచు నవ్వలం జని నగరంబుంగని రాజమార్గం బునం గొంత దవ్వరిగి యరిగి యంత. ౧౬౬

## శ్రీకృష్ణమందిరవర్ణనము.

సీ. కని విని యెఱుంగని కమ్రరత్నంబులం జెలువారు కుడ్యమండలము గలిగి
శిల్పకళానల్పకౌశలముకు విభవంబుం గనంజేయు ద్వారసంఘములు గలిగి
తారకాచక్ర మీగతావునే యుండునని తెల్పు ధ్వజసంఘాతములు గలిగి
రవిచంద్రు లరుగుమార్గ మ్మిది యని చూపు చారువాతాయనసమితి గలిగి
తే. కన్నులకుం బండువుంగూర్చుకనకకలశపంక్తులను గల్గి యొండెనుంబడయరాని
సంపదల మించుశ్రీకృష్ణసౌధరాజి, వేడ్క మిన్నందం గన్పడఁగవిబుధమునియు.
సీ. పురుషార్థచయ సురభూరుహ రూపాయ భక్తజనత్రాణపరతమాయ
పాపాటవీ దవపావకాకారాయ శాశ్వతవిజ్ఞాన సాగరాయ

అజ్ఞానభీతికృదంధకార వ్యూహసంప్రభేదన సహస్రకిరణాయ
సంసృతిసాగర సలిలసమ్మగ్న జనావననౌకాయితాహ్వాయాయ

ఆ. మంగళాలయాయ మానసచాంచల్య, జలద మథన వాయుసన్నిభాయ
వాంఛితార్థదాయ భద్రదసౌధాయ, దేవసేవితాయ తే నమోఽస్తు.

చ. ఉదవసితేశ్వరా! సుకృత మెప్పుడుజన్మము లెన్నియెత్తియో
సదమల కర్మసంతతులఁ జాలుగ నెన్నియొనర్చిరో కనం
గఁ దగుదువీవు నిన్నెలమిఁ గాంచినయంతనె ముక్తి యబ్బిన
ట్లె దలఁపనౌ రమాధిపతి యింపుగ నిన్ను సమాశ్రయించుటన్. ౧౬౯

చ. ఇదివఱ కెన్నిసారులో నిరీహుఁడనై నినుఁ గంటిఁ గాని య
య్యదనున నిట్టు లొప్ప విపు డర్థమొకండు దలంచి వచ్చితిం
గద యలవాంఛితార్థము నికామము పండఁగఁజేయఁగోరి యి
ట్లుదయసరోజమిత్రతతు లొప్పెడునట్లుగఁ బొల్చి తిచ్చటన్. ౧౭౦

మ. ఎవ రేకోర్కుల నిన్నుఁ గాంతురొ తదీయేష్టంబులం దీర్పన
ట్టివిధిన్ దర్శన మిత్తువీ వనుచు విం టెన్ శేముషీభూషితుల్
వివరింపంగ నదేవిధంబుగ నినున్ వీక్షింపఁగాఁ గంటి భా
ర్గవికిన్ స్థానముగా మదీయహృదయాకాంక్షల్ ఫలింపన్ గడున్. ౧౭౧

చ. నినుఁ గనినంతమాత్రమున నిర్మలభావము లెల్లఁ బైకి ను
బ్బినయటు లొప్పెడున్ గనుకఁ బెన్నిధిఁ గాంచినపేదవోలె నె
మ్మిని గనుచున్నవాఁడ నలమేచకకుంతలఁ బద్మనేత్రఁగా
ప్పను దలపోయు యత్న మది బాగుగఁ బండునటంచుఁ దోఁచెడున్. ౧౭౨

చ. శతమఖముఖ్య దిక్పతుల సంయమివర్యుల నింకఁగల్గు స
త్కృతులను గోటివారము లదేపనిగాఁ గనినాఁడఁగాని య
ప్రతిమముదంబు నిప్డు గనుభంగిని గాంచిన వాఁడఁగాను శ్రీ
పతివరసౌధమా! యిఁకను భద్రములే యగునంచు నమ్మెదన్. ౧౭౩

ఉ. ముద్దియమిన్నయోర్తు తనపూనిక సాగఁగఁజేయఁబూనఁ గాఁ
బెద్దతనంబుగల్గి మునిబృందమునన్ యశమూనియున్న యే
నద్దిర దానిమాన్పి తగినట్లుగ నామె మెలంగఁజేయున
ట్లొద్దియుపాయమో వెదకనేఁ బరిహాసముచేయరే సురల్. ౧౭౪

ఉ. ఇన్నిదినంబులే బ్రదికి యిట్టిపనుల్ నెఱవేర్పలేనిచో
మన్నన గాంచువాఁడనె యసామర్థ్యసమూహమునందు శక్తియే
మున్నది వీని కంచు నను మోషలు గేలి యొనర్పకుందురే
వెన్నుఁడు నవ్వకుండునె వివేకము చాల దటంచుఁ బల్కుచున్. ౧౭౫

మ. ఇఁక నాలస్యము సేయ కిందుఁగల సర్వేశుఁ గృపారాశి, సే
వకచింతాహరణప్రవీణు సకలవ్యాప్తాత్మభాసుఁ సమ
స్తకళాభిజ్ఞుని శ్రీనికేతనుని సందర్శించి నాకార్యముం
సకలంబుం వినిపించి యాజ్ఞఁగొని వే సాధింతు నాపూనికన్. ౧౨౭

క. అని మనమునఁ దలపోయుచు, వినయంబు విభూషణముగ వెలయఁగ ద్వరతోఁ
జని ద్వారభూమినుండెడు, ఘనమూర్తుల భూరిశాంతికలితులఁ గనియెన్.

ఉ. వారును సౌమ్యరూపముల ద్వారమునం దిరుపార్శ్వసీమలం
జేరి తదేకచిత్తముల శ్రీహరియాజ్ఞను నిల్చి కాచుచుం
సారమనీషు లీశ్వరుని సన్నిధి కేగఁ దలంప వారిదౌ
కోరిక విన్నవించి హరికూర్మి యెఱింగి ప్రవేశపెట్టుచున్. ౧౨౮

ఉ. ఏమఱుపాటులేక పరమేశు నభీష్టముమీఱఁ గొల్చుచుం
ధీమహిమమ్ముగల్గి గుణతేజమునం వెలుఁగొందుచుండఁగా
నామునిఁ గాంచి యిద్ది సమయంబె కదా భగవంతుఁ దేవుం
శ్రీమహిళాధవుం బరముఁ జిత్తముపొంగఁగఁ జూడ నిత్తఱిన్. ౧౨౯

మ. చిరకాలంబున కీజగంబు గన నాచింతల్ తొలంగెం బరా
త్పరు దర్శింప నభీష్టజాలము లొగిం బండుంగదా యంచు నా
తురతం బొందెద లోనికేఁగఁగను దోడ్తో మీర లీశాజ్ఞనె
వ్వరుసం బొంది యనుగ్రహింతురొ కృపావారాసులై నా కిటన్. ౧౩౦

చ. మునినగుటం జగత్ప్రభువుముంగిట నేగతిగా మెలంగఁగాఁ
జనునొ యెఱుంగఁ జాల నదె సైచి నఖుం గమనించి శ్రీనికే
తనుపదపంకజాతయుగదర్శన మబ్బఁగఁ జేయుఁ డంచు నె
మ్మిని గనఁ జేయు వాగ్వితతి మించఁగ వేఁడిన ద్వారపాలకుల్. ౧౩౧

చ. మతివిభవంబు గన్పడెడుమాడ్కిని నమ్ముని గారవించి స
మ్మతిఁ దగుపీఠ మిచ్చి మునిమండన యిమ్మెయిఁ జూచుచుండ న
చ్యుతునకు విన్నవించి సకలోత్తము నానతి నొంది వచ్చి శ్రీ
పతిపదసన్నిధిం గదియుపద్ధతిఁ దెల్పుడు మంచుఁ బల్కుచున్. ౧౩౨

ఉ. అంతొకఁ డేగి దేవముని యాగమనంబును విన్నవింప శ్రీ
మందిరుఁ డిద్దె నారదుని మామకసన్నిధిఁ జేర్పుఁడంచు నా
జ్ఞం దమినీయ దాని శిరసావహియించుచు నేగుదెంచి దా
నిం దెలుపంగ సంతసము నృత్యముసేయఁగ లోనఁ జొచ్చుచున్. ౧౩౩

చ. తనమది నిట్టులెంచె మునితల్లజుఁ డేమని యానతిచ్చునో
వనరుహసూతి యెవ్విధిని బల్కునొ వానిని దెల్పుచుండఁ జ

క్కనిగతి మాటలాడెదను ఽ గార్యము పండెడుఁగాక యంచు నా
తనిముఖసీమనుండి నుడి ఽ తానయి వెల్వడున ట్లొనర్చెదన్. ౧౮౪

చ. అదియె ఫలింపఁజేయుఁ బనిఽనంతయు నాజతనంబు సద్యశః
ప్రథమయి యొప్పుఁగా కనుచుఁ ఽ బల్కులు లోనఁదలంచు చేగి శ్రీ
సదనుని పాదపద్మములఽసన్నిధి వ్రాలి మహాత్మ దీనభ
ద్రదుఁడవు నిన్నుఁగాంచిన నిఽతాంతము పండును వాంఛితార్థముల్. ౧౮౫

మ. అని ప్రార్థించిన శ్రీనికేతనుఁడు తఽద్వ్యాపార మూహించి చ
య్యన లెమ్మా మునివర్య! యేటి కిటు లఽత్యార్తుండువోలెన్ మొగం
బున దైన్యంబు గనంబడంగ నిట నిఽప్పోల్కిన్ వచింపంగ నే
లనుచుం బల్కుచు లేవనెత్తి కడు నెఽయ్యం బొయ్యనన్ గ్రమ్మఁగన్. ౧౮౬

మ. తగుపీఠంబునఁ గూరుచుండుమని హఽస్తద్వంద్వముం జాఁపి చూ
పఁగ నాకార్యము పండునింక ననుచున్ ఽ భావించి కూర్చుండి విం
తగ నొప్పారుతదాస్యపంకజముచంఽదం బింతయే నూహకున్
దగులన్ శక్యము గామి సందియము డెంఽదంబందు నిండారఁగన్. ౧౮౭

ఉ. వింతగ నొప్పుచున్నయది ఽ విశ్వతతీశ్వరుమోముఁదమ్మి నా
స్వాంతము సంశయప్రబలఽసాగరమందు నిమగ్నమయ్యెడున్
జింతలు పైకొనం గడఁగెఁ ఽ జేయు నదేమని తోఁపదింక నే
నింతయు దాఁపకుండ వచిఽయించెద సర్వవిదంతికంబునన్. ౧౮౮

మ. అపరాధం బిసుమంతయేని జగదీఽశాత్మస్థలిం బొందకుం
డు పథం బేదియొ యట్టిమార్గమున నేనున్ వర్తిలంగాఁ దగున్
గృప నొందం గలవాఁడ నట్టులయినన్ ఽ గీర్తింతు రద్దాని నే
తపసుల్ గావున దాఁపకుండఁ దెలుపం ఽ దానే యెఱుంగున్ దుదిన్. ౧౮౯

చ. అని తలపోసి భక్తిమెయి ఽ నంజలిపట్టి మహానుభావ! ప
ద్మనయన! నీదునానతిని ఽ దాల్చి శిరంబున నాహిమాచలం
బునకు జవంబునం జని ప్రఽభుప్రియవార్తను దెల్ప నాతఁడున్
మనమున హర్షమందెఁ దనఽమానిని దానికి సమ్మతింపఁగన్. ౧౯౦

సీ. దాఁపక వచియింతుఁ ఽ దత్పుత్రి కామణి శంకరుఁగోరినఽజాడఁ దెలియ
నొక్కిచెప్పితిఁ గాని ఽ యక్కమలాక్షియుఁ బ్రోడగామిని దానిఽ పోడిమి గనఁ
జాలదయ్యెను గాని ఽ స్వాంతంబునం దిసుమంత యొప్పినయట్టు ఽ లరసినాఁడఁ
దల్లిదండ్రులయాజ్ఞ ఽ దాఁటనేరదు గానఁ దనపట్టుదలవీడి ఽ తమివరించు
తే. మిమ్ము నంచని యలపరఽమేష్ఠికడకు, నరుగుచుండఁగ నొక్కదిఽవ్యాశ్రమంబుఁ
గంటి నందొక్కమునిపతి ఽ కమ్రతేజుఁ, డలరు నాతని గనినాఁడ ఽ నర్హరీతి.

క. వాచంయమివర్యుఁడు నే, యాచింపకమునుపె నాదునాశయములనే
సూచించు కనులతుదలన్, జూచెన్ నేనంత దానిచూ ప్పెఱిఁగి మదిన్. ౧౯౨

చ. మనసుననున్నదాని నణుమాత్రము దాఁపక విన్నవింప నా
మునిపతి సత్ఫలం బొదవుఁ బొమ్మని తెల్పెను దాన నాతనిం
బినుమడిగాఁగ బ్రహ్మకడ కేఁగి ముహూర్తము నిశ్చయింపు మం
టిని భవదిష్టమే యదగునే మరలన్ వచియింపనేలనెన్. ౧౯౩

చ. అడిసరిగాఁగఁ దోఁచె హృదయంబున నాకును గాన నిప్పుమీ
పదములఁ గాంచవచ్చితిని బార్వతిఁ గూర్పఁగఁ బూను యత్నమీ
యది ఫలసిద్ధినొందునటు లార్తిహరా! తలపోయనయ్య యీ
ముదితయు సమ్మతించువిధము దలపోయుము నెమ్మనంబునన్. ౧౯౪

చ. అన దరహాసచంద్రికలు హారిముఖంబునఁ గ్రమ్మనిట్లనున్
వనజదళాక్షుఁ డోయనఘ! పల్కితివీ వలయున్న మిన్నఁగో
ర్తను సకలప్రయత్నములతోఁ బనిఁజేర్పఁగ నేన చాలు నీ
మనమున సమ్మతింపుమని మంచిది కాఁదగునంచు నొప్పితిన్. ౧౯౫

చ. ఇపుడు వచించురీతిఁగన నేదియొ విఘ్నము గల్గినట్టు లూ
హ పొడమెడున్ విరించిముఖు లాజతనంబు ఫలింప దంచునెం
చి పనిపి రిట్లు నిన్ననుచుఁ జిత్తమునం దలపోయువాఁడ ని
ట్టిపనికిఁ బూననేలొకొ, కడిందివిచారము నొంద నేలొకో. ౧౯౬

శా. ఎందో యొక్కెడ నున్ననన్నుఁ బలువుం ద్రిక్కార్య మిట్లౌటనే
నిందింపన్ వెలి కీడ్చితీవు తొలుతన్ నేఁబట్టితిన్ యత్నమే
కుందం బొందక సాగునే యనుచు నీకున్ సాధ్యమే యంచు ని
స్సందేహంబుగ సాగునే జతనమున్ సాధించువాఁడం జుమీ. ౧౯౭

ఉ. ఆకులపాటులేక ముదమారఁగనుండుము పర్వతాత్మజన్
నీకు ద్వితీయఁగా నెసఁగ నేనె యొనర్తును బెండ్లి పెద్దనై
నీకడ కేఁగుదెంతు మదినిం బరికింపుము నా ప్రతిజ్ఞ నం
గీకరణిన్ వచించితికదే యిపు డిట్లు వచింప నేలొకో. ౧౯౮

చ. నలుగుర నవ్వునట్లు నను నారద! నీ వొనరింపఁజూచితే
కలహమె నీకు భోజనము కాఁదగునా పరిహాసకృత్యమున్
పలుపుట కిద్దియే మొదటిసారిది గాఁ దలపోయ నన్ను నే
పలుకుము నీస్వభావమును పార్వతి సమ్మతి నొందఁజేసితే. ౧౯౯

ఉ. నీవగుమోముఁ జూడఁగనె నెమ్మి తొలంగ విచార మెక్కన
ట్లై వలఁపంగ నయ్యెడి వచేటికొ నేఁ దెలియంగఁజాల నిం

కేదియొకప్పుఁగాఁ దగునొ యెట్లొనరింపఁగఁ గార్యసిద్ధియౌ
నో వలపోయుమా తగినయుక్తిని బన్నుము నేర్పు నీదెకా. ౨౦౦

శా. మున్నెన్నో పనులందు మెప్పుగొని యేయముంగూడ నబ్రంబుగా
నున్నాఁడా భువనంబులం దితనితో నూహింపఁ దుల్యుం డటం
చెన్నో సారులు మెచ్చుచుండఁ దగునీ విక్కార్యమం దిట్లు సం
పన్నత్వంబు వొలంగనుండుట తలంపన్ రా దిదేమో మునీ. ౨౦౧

ఉ. కన్నె ఫాలాక్షునిం దనకుఁ గాంతునిగా వరియింపనుండ నా
సన్నుతనాయతేక్షణలు కోరినయందఱు పత్నులై సతం
బున్నయమౌని యిష్టసుఖముల్ కలిగించుచునుండ నద్రిజా
పన్నునిఁ గోరఁజేయ కపటంబును బట్టితివో యెఱుంగఁజూ. ౨౦౨

ఉ. నారద! యింతదాఁకఁ గదనంబులు గల్గఁగఁజేయుపాండితిన్
భూరియశంబు నొంది మునిముఖ్యుఁడవై తగునీ వదేలొకో
నేరుపులేనికార్యమున నిల్చి ప్రతిజ్ఞ నొనర్చి యిట్లు ని
ష్కారుఁడవై వగంబొగులఁ జాలితి వేమనువాఁడ నిన్నిటన్. ౨౦౩

ఉ. పూనినకార్యమెల్ల ఫలమొందఁగఁ జేయఁగఁ జాలువాఁడు శ్రీ
జాని యఖండశక్తిఁ దగుచక్రముఁ దాల్చినమేటి యంచు న
న్మానులు సన్నుతింతు రది మాయఁగఁ జేసెను నీప్రయత్న మో
మానిమహేంద్ర! యింక నెటు మన్ననగాంతును ముజ్జగంబులన్. ౨౦౪

చ. ఇదివఱ కెన్నఁడేని మది నెంచినకార్యము సాగకుండ నీ
మదమున నిష్ఫలంబయినయట్టులె యైనది లేదు నిశ్చయం
బిది యని నీవెఱుంగవె యదేటికొ నిష్ఫలమయ్యె నిప్పు డే
మిది తెలుప వచ్చినాఁడవో యమేయతపోధన! విప్పి చెప్పుమా. ౨౦౫

ఉ. పాఱఁగనేల యింకఁ బరితాపము గల్గఁగఁజేయు వార్తయే
నోపిక వింటఁగాని నిను నెక్కుటియుం గతినంపుఁబల్కు నే
నాపరమేశుసాక్షిగ వచించెదను వీడి వచింప నమ్ము మీ
యాపద యేరికిన్ గొఱకె కోపింపుమ యున్నది యున్నయట్లుగన్. ౨౦౬

ఉ. శక్రముఖుల్ గల్గు కాలమున సర్వవిధంబులఁ జేయుయత్నముల్
నిక్కలకీర్తి సాగ నొకనిం బటిమాయట యుండకుండు స
త్కార్యముఁ జేయఁబూనినను గాలము ప్రత్యయమైన నెందతే
నక్కట వోవఁసాగినను వక్రమెయౌ విధిచర్య యద్దిరే. ౨౦౭

చ. జపనము చేయకుండినను సాగి ఫలంబిడఁ గొన్నికార్యముల్
జపనము సల్పినన్ సులభసాధ్యములే యగునట్టికార్యముల్

ప్రతిఫల మీయకే చెడు నీభంగుల మైతగు దైవ మంచు నీ
వితమునఁ దెల్పు నిద్ది మునివృత్రహరా! పలుమాట లేటికిన్. ౨౦౮

ఉ. ఏది యెటుండినన్ జతన మెద్దియొనర్చితివో వృథంబుగాఁ
గాదగునంచు నయ్యది నిశ్శాపము నిష్ఫల మయ్యెనంచు నిం
కేది యొనర్పనో యనుచు నెంతయు యోజనసేయు వానిని
ట్లేఁ దలపోయువాఁడ భవదీప్సిత మెద్దియొ నాకుఁ దెల్పుమా. ౨౦౯

క. మోమోటమి వదలి మునీ, యేమాడ్కి నొనర్పనిష్ట మెంచితివో ఫలం
బేమియు లేదని తోఁచిన, చో మానుమ దుర్యశంబుఁ జొరఁ దలఁపకుమా.

క. ఈపనికైనదె యనమతి, యీవిశ్వత్రయమునందు నెంతయు నిండెన్
దేవమునీ! యిది పాయఁగ, నేవిధమునఁ జేయఁదగిన దేదియుఁ గలదే. ౨౧౧

క. తెలుపుమ యట్టు లొనర్పఁ, బలయొగ్గిన నిట్టులనుచుఁ బలుకుచు మెదలో
పల వేఱుగాఁగ మనకుం, గలిగినదుర్యశము వోవఁగా వలఁపు మింకన్. ౨౧౨

క. అని విన్నఁదనము వేఁడుచు, గనఁబడఁగాఁ జేసి పలుకు కాంచనచేలుం
గని నారదుండు వెత మన,మున ముంపఁగ నింధనంబు వోలికి నుండెన్. ౨౧౩

క. కొంతసమయంబు నిట్లే, చింతాకూపారమగ్న చిత్తుండయి యొ
క్కింతజతనంబుచే స్మృతి, వింతగఁ బొడసూప నెంచి యెన్నిక గనుచున్.

క. ముందును వెనుకఁ దలంపక, యెందే నాపూనినపని యెటుసాగకయుం
డందగునె యటం చెద నా,నందము నిండంగఁ బొగడుకొనన్ స్మృతితప్పన్. ౨౧౫

క. ఈపని యేమాత్రంబని, యాపార్వతి నాడుపల్కు లాలింపక యె
ట్లే పోవఁగలదొ చూచెద, నాపట్టినపట్టు జయమునఁ బొగడుకొన్నే. ౨౧౬

క. చలపట్టి యెట్టులైనన్, జలజాక్షున కీయమాఁట జాణఁగఁ జేయం
గలనంచు గర్వమూనితిఁ, బలికితి నేఁ దోఁచినట్టు భంగుల నెల్లన్. ౨౧౭

క. మొదటనె యీశ్రీపతి యా,సుదతీమణి చిత్తవృత్తి యెవ్వెడఁగెనొ యే
మొ దనకు సతులుం గలరని,యె దానఁ దచ్చిత్తవృత్తి యేమెఱుఁగనుచేన్.

క. మఱియును మఱియును బెక్కుగు, తెఱఁగుల నేఁగూర్చి నీకుఁ దెలిపి నటంచున్
నెఱి శపథమ్ములు పల్కితి, గుఱుతుగ నామాట కిన్ని గొనకుండుటచేన్.

క. శపథం బిసుమంతఫలం, బపు డీయకపోయె విష్ణు విడిచిపెడన్ నన్
శపియింపఁ బూనియున్ మం,చిపలుకులన్ స్వామి యంబుఁ జెప్పఁ దప్పెన్.

క. నాయొనరింపం దగునని, యేయెడియో తోఁచ దిప్పు డీశ్రీపతికిన్
నాయొనరించిన యనమతి, మాయంగాఁ జేయకున్న మన్ననయున్నే. ౨౨౧

క. కావున నాతప మెల్లన్, శ్రీవిభునకు నాన్వయించి శిక్షించునదె
ట్లో వెర వయ్యది దలఁచెద, నీవిశ్వవిభుండు మెచ్చ నెల్లెడ పొగడన్. ౨౨౨

క. తపముఘనంబుగ మునులకు, నెపు డుండుంగాదె నే నిఁకేలా వెఱవన్
   శపథంబూని వ్యయించెద, నపరిమితతపోధనంబు నంతయు హరికై. ౨౨౩

క. దానన్ హైమవతమ్మృడు,మానసముఁ మార్పునొందు మామక కార్యం
   బౌ నావంతకాలంతం, గానికి ధన్యుండ నౌదుఁ గా యటమీఁదన్. ౨౨౪

క. తగుసమయంబున ద్రవ్యం,బు గణింపక వ్యయ మొనర్చు బుధవరుపోల్కిన్
   దెగి నాదుతపోధన మి,ప్డు గిరీంద్రకుమారికొఱకుఁ బూని వ్యయింతున్. ౨౨౫

క. తపనీశోమలచిత్తం, బపుడగ మార్పంగఁ జాలునంతట లక్ష్మీ
   శ్వరుకోర్కి పండు నాపూ,న్కి రహిన్ లోకత్రయమునఁ గీర్తింపఁబడున్.

క. ఇచ్చో నూరకయుండిన, సచ్చరితము నాది లోకజాలంబుల ని
   ష్పచ్చురమగు మునిసంతతి, కెచ్చటనే గౌరవం బదే లేకుండున్. ౨౨౭

క. మునిజనగౌరవవిత్తం,బును గావఁగ నాతపంబు బ్రుంగిన నొప్పం
   గ నగుంగాని మహాముని, జనగౌరవహాని కేను సైపంజాలన్. ౨౨౮

క. పరమేశ్వరార్పణముగాఁ, జిరకాలార్జితతపంబుఁ జెందిన పెద్కం
   గరము వ్యయించెద నయ్యది, స్థిరసత్ఫల మీయకున్నె శ్రీహరికరుణన్.

క. ఫలములఁ గోరినకర్మం,బులకంటె ఫలాభిసంధిఁ బోవిడిచిన ని
   ర్మలకర్మము లత్యుత్తమ,ములుగా వచియించు శాస్త్రములు చక్కంగన్. ౨౩౦

క. నాపూనిన యీకార్యం, బాపరమేశ్వరునికొఱకె యగుఁగావున సు
   వ్యాపారమె యగు దానన్, శ్రీపతి కరుణించుఁ దపము చెందును వృద్ధిన్.

క. అదియె తపనఫలమన నెయ్యది శ్రీశుని దృష్టిఁ జేయ నర్హంబగు శ
   స్తమ్మద మయ్యదియే శాశ్వత, మదియే యద్దానికంటె నధిక మ్మెదియా. ౨౩౨

క. అని యిట్లు పెక్కుభంగులఁ, దనమది యోజించి భక్తి దామోదరునిం
   గని యిట్లు పల్కె దేవా,వినఁ దలఁచితొ నాదునోట వృత్తం బెల్లన్. ౨౩౩

క. అవివేకియగు బాలిక, భవదీయమహత్త్వ మారసి పాటింపఁగలే
   క నిషిద్ధవిధముల నెవ్వరి, నవలీలమది నెన్ని పల్కెఁ దా నవినీతుల్. ౨౩౪

క. వానిని మన్నింపఁగ విజ్ఞానమునన్ నీయమేయసత్త్వ మెఱుఁగు న
   ట్లానెలఁతఁ జేయు నట్లుగ, మేనాంబికిఁ బంచినాఁడ మిహికాహార్యన్. ౨౩౫

క. వారలు ప్రాపుట్లున్నన్, గోరిన మన్నించి నిన్నుఁ గాంక్షింపంగా
   నే నెప్పుడు జేసియుంటిని, శ్రీరమణా! మూఁపతము సిద్ధిప్రదమున్. ౨౩౬

క. నిపుణ వాక్కులుండిరొ, వె వెడలఁగ నాలకించి విబుధమునులకున్
   మహేంద్ర ప్రభృతులకున్, వారికి వినిపించి శైలకన్యని కడకున్. ౨౩౭

క. క్రమపించుమీఁదఁ జని లగ్నముఁ జెప్పి వివాహమునకుఁ గావలసిన కా
   ర్యములెల్లఁ జక్కఁబఱుపన్, సమాధిపుం బ్రోత్సహించి సర్వవిధములన్.

క. జతనము ఫలింపఁగాఁ గని, యతివేగము డెగుదెంచి । యవ్వార్తల న
చ్యుత! నీకు విన్నవింతును, శతధృతిముఖ నిర్జరేంద్ర । సముదయములతోన్.

క. మన మెల్ల నరుగవలయున్, వనితామణి యబ్బురపడి । స్వకృతక్రియ లె
ల్లనువదలిచి సిగ్గునొందఁగ, మునులెల్లన్ మోదవార్ధి । మున్గఁగఁ బూన్కిన్.

క. చేయింతు వివాహంబును, గాయజరిపుఁ డచ్చెరువును । గాంచఁగఁ బ్రమథుల్
నాయత్నమునకుఁ గుందఁగ, నీయాత్మయు సంప్రమోదనీరధి మున్గన్. ౨౪౧

క. తరువాత భవత్పావన, చరణసరోజద్వయంబు । సమధికభక్తిన్
శిరసునఁ బూజించి గిరీశ్వరునిం దమినొందఁజేసి । చక్రి! యరిగెదన్. ౨౪౨

క. కందరరాజి మనోహర, మందిరమునుగాఁ దలంచి । మామకచిత్తేం
దిందిరము యుష్మదంఘ్ర్యర, విందమ్ముల వదలకుండ । విహరింపఁగన్. ౨౪౩

క. ధ్యానైకయోగనిరతిన్, బూనఁగ నొనరించువాఁడ । ఫుల్లాబ్జాక్షా!
సూనృతమిది యిఁక నిక్కే, యే నేపనిఁబూన నమ్మికమీ యీయనుమింకన్. ౨౪౪

క. చిరకాలమునుండియుఁ ద్వచ్చరణాంబుజసేవఁ జేయఁజాలితి నాపైఁ
గరుణావలోకనమ్ములఁ, బరఁగింపుము ధన్యుఁడ నగువాఁడ మహాత్మా. ౨౪౫

క. భవదమలకృపకుఁ బాత్రుం, డెవఁ డగునో ధన్యుఁ డాతఁడే యగుఁ దండ్రీ!
యవమతి నీకుం గూర్పంగ వలతునే వాఙ్మనసులఁ । గాయముచేతన్. ౨౪౬

క. మది వేఱుగఁ దలపోయకు, మిది నాపనియగునె నీవెయేకద ముక్తి
ప్రద! సర్వజ్ఞుఁడవయ్యున్, మది నేమియు నెఱుఁగనట్లు । మాటాడుదుగా.

క. నీవెఱుఁగని యర్థంబు ల, వేవిశ్వంబునను గలవె । యేలా స్వామీ!
శ్రీవాసుదేవ! త్రపఁ గన, నీవిధి నొప్పింపఁ దగునె । యీనేరకునిన్. ౨౪౮

క. ఏమియెఱుంగని నన్నున్, స్వామీ! యీరీతిఁబల్కఁవచ్చునె నిన్నే
కామితదాత వటంచున్, నామది నెఱనమ్మినాఁడ । నాకేశవిభూ. ౨౪౯

క. ఇంకం బరిశీలింపఁగ, నుంకింతువొ యేమొ యనుచు । నూటాడుమటన్
బంకేజనయన! తగునను, శంకారహితునిగఁ జేయఁ । జనుఁ గృపచేతన్. ౨౫౦

క. అని మఱియు మఱియు వేఁడెడు, మునిపతి వీక్షించి యతని । బుద్ధి విషాదం
బును బాపనెంచి యద్దానవ యతని యహంకృతిని నీటుప హరి దలఁచెన్.

క. గురుతర తపోవ్యయంబునఁ, బరమేశ్వరుఁ గొలిచియున్న । పార్వతి హృదయం
బు రహిన్ మార్పఁగ నెంచెడు, సురముని పరహంకరణపురఁ పా ప్రపదంగన్.

క. తలపోసి యవ్విధంబును, దెలిసికొనంజాల నట్టి । తెరవపుర నెలమిం
బొలయఁగ నతనికిఁ దృప్తిఁయుఁ, గలుగన్ బలికెన్ స్మితంబు । కడలుకొనఁగన్.

క. ఏమయ్యా! నానుడులకు, నీమది దూపిల్లెనేమొ । నిర్జరమాన!
నామాటలఁగల తత్త్వం, బేమని యూహింపఁ బూన । కిటు లనపగునే. ౨౫౪

చ. మానిసు లెల్ల ధర్మహితమార్గములన్ నడిపించి బాలురన్
మానితశీలసంపదల మానక యుండఁగ దిద్దుచుండు రా
జూనిక మెచ్చఁగాఁ దగును జో విరిబోఁడుల నట్టివారి నీ
వేనయదూర వర్త్రమున నెట్టులు వర్తిలఁజేయఁ బూనితో. ౨౬౬

ఉ. చిత్తమె శుద్ధమై యలరఁ జెప్పెడిదే మిఁక నెల్లకర్మముల్
సత్తపముల్ ఫలించునటు సాధుఫలంబుల నీయఁజాలు నా
యుత్తమచిత్తముం గలఁచి యొప్పునొనర్పఁగఁ జేయఁబూని తే
విత్తజె నిద్ది మంచిదగునే యొకమాఱు దలంచి చూడుమా. ౨౬౭

ఉ. గౌరి దలంచినట్టిపనిఁ గాదని తద్మతి మార్పఁజూచి తో
నారద! యిద్ది పాపమె యనంజనుఁగాదె సమస్తధర్మముల్
భూరుహమెట్లు మూలములఁ బొల్చునో యట్టులె యంగనామణీ
సారసమాశ్రయంబున నొసంగును దానిఁ దలంప నక్కటా! ౨౬౮

ఉ. స్త్రీలు కువృత్తలైనఁ గులశీలములెల్ల నడంగు ధర్మమే
మూలనొ డాఁగియుండు నఘముల్ తలలెత్తును వంశగౌరవం
బోలి నశించు శ్రాద్ధవిధు లొయ్యన బ్రుంగును గావున న్గుణ
స్త్రీలను మన్ననం దనుపఁ జెల్లును లోకహితార్థమై మునీ! ౨౬౯

ఉ. సారసనేత్ర యొర్తుక యశాస్త్రపథంబున సంచరింపఁగాఁ
గోరికనొంద నట్టితతిఁ గొంకక యాసువతిన్ మరల్పఁగాఁ
గోరఁగనౌను గాని యఘకూటమునం దిరుగంగఁ జేయు వా
ఛారతి నొందనౌనె యది సాధుహితంబగునే తలంపఁగన్. ౨౭౦

మ. తనుకున్ నీ విపు డెంచినట్టిపని యొక్కాలంబునం దైన న
జ్జనదూష్యంబగు నట్టిదే యగు నదేచందంబునం జూచినన్
మునివర్యా! యింకనైన మానుము తపంబున్ బూన్కి నిచ్చించి దై
వను నీకట్టును దీర్పనేల? యిటు చింతింపంబు నీకేటికో. ౨౭౧

మ. సురమౌనీంద్ర! హితోపదేశ మిటులేఁ జొక్కంపుఁ బ్రీతిం బొన
ర్పు రయంబొప్పఁగ వేఱుగాఁ దలఁచి కార్యం బిట్లు భగ్నంబు సే
సె రమానాథుఁ డటంచు నెంచకుము; నీచిత్తం బదెట్లంగిరాఁ
జరియింపం దలపోయు నట్టులె ప్రతిజ్ఞం జెల్లఁగాఁ జేయుమీ. ౨౭౨

మ. నిను నిందింపఁగఁ బూనియేని పని దీనిన్ సాగకుండంగఁ జే
యను బూన్కింగనియేని యిట్లనను నీయాత్మన్ నితాంతంబు పొ
ల్చినవాంఛం దలపోసినాఁడ నదియున్ సిద్ధించునో లేనొ యే
లని యిట్లాడితి నైన నీదగుమహాయత్నంబు సిద్ధించు నేన్ ౨౭౩

ఉ. చిత్తమునందుఁ జేర్చకుము ⸗ సిద్ధతపఃఫల మెల్లదానిచే
నుత్తలపాటుగాంచి మఱియొక్కఫలంబు నొసంగఁజాలకే
యత్తఱినే యడంగు ననియాత్మ నెఱుంగుము; కార్యజాల మా
యుత్తమకర్మమూలమున ⸗ నొప్పి ఫలించు నటంచు నమ్ముమా. ౯౭

ఉ. నేను నిమిత్తమాత్రమె యనిందృఫుఁగర్మమె సత్ఫలంబు నీ
నౌను సమర్థ మంచుఁ దనయాత్మను నమ్మునతండె కార్యసం
తానము సాగఁజేయు నని ⸗ తత్త్వవిదుల్ పలుకంగ నెప్పుడే
మానీ! వినంగలేదె యదె ⸗ మామకవాక్య మటంచు నెన్నుమా. ౯౮

శా. కాలం బింతకు మూలహేతువగు నొక్కం బిద్ది మానీశ్వరా!
యాలస్యం బిఁకనేల నాదగువివాహంబందు నీవింతకే
చాలంగా శ్రమ మూనినాఁడవని నాస్వాంతంబు చింతించు నిం
కేలాపల్కులు కార్యసిద్ధియగు నొక్లే సల్ప నల్లెన్నుమా. ౯౯

శా. పూనంగాఁ దగ దెట్టికార్యమయినన్ ⸗ బుద్ధిన్ విచారించియే
తానుం బూనినకార్యముల్ వదలఁగా ⸗ ధర్మంబెకా దెట్టులే
నైనన్ దాని ఫలింపఁజేయఁదగు నం ⸗ చార్యోత్తముల్ పల్కుచుం
ద్రీనీతిన్ విడనాడరాదుగద మానీశా! య దెబ్బంగులన్. ౧౦౦

శా. నామర్యాదను గావఁగాఁదగును దానన్ నీదువిఖ్యాతి యా
భూమిన్ స్వర్గఫణీంద్రలోకములఁ బెంపుంగాంచి వర్ధిల్లు నీ
కామం బద్దియె కాదె వేఱొకగతిం ⸗ గార్యంబు పాడైన న
న్నేమాన్యుల్ దలపోయ రిద్ది నిజ మం ⸗ చెన్నందగున్ నారదా! ౧౦౧

శా. ఈవింకం దుహినాద్రి కేగి యఁలభూభృన్మౌళిజా మానసం
బేవింతల్ గనఁజేయుచుండునొ యదే ⸗ వృత్తాంత మాలింపనే
దేవుం బెండిలియాడ నన్విహము నేతీర్మానముం జేసి సం
భావింపం దలపోయుచుండునొకొ తత్త్వం బెల్లనున్ శ్రద్ధతోన్. ౧౦౨

శా. తల్లిం దండ్రిని దత్సఖీగణము నేతత్సత్యముల్ జక్క నే
సల్లాపంబులఁ గోరఁగాఁదగునొ యహాచందంబునం గోరి వా
రెల్లం జెప్పెడివాక్కులన్ విని తదీయేష్టంబ దుద్వాహసం
పల్లాభప్రదమేని క మ్మిచటికిన్ ⸗ భద్రంబు చేకూర్పఁగన్. ౧౦౩

సింహరేఖ:—

దేవమాని యాపుపంత్రి!, భావ మించు కంతమైనన్
భావుకంబుఁగూర్ప కుండన్, బోవు నంచు నీకుఁదోఁచెన్. ౧౦౪

క. ననుఁ జూడఁగరాక తపో, వనమునకుం బొమ్ము పెనఁ ⸗ వాంఛ గలిగినన్
నినుఁ జూడ నేనె వచ్చెద, ననుమానముమాని యనఁగుమం చాపటిమున్.

క. ఆమాటలు చెవినాట ని, కామము వగ గ్రమ్ముకొనఁగఁ గదల మెదలఁగా
నేమాడ్కిఁ జాల కమ్ముని, భూమీశుఁడు ప్రస్తరంబుపోల్కిన్ నిలిచెన్. ౨౯౬

సీ. మనసు చింతార్ణవమగ్నమై యుండుటఁ గన్నులు శ్రీహరిఁ గానవయ్యె
నేమి చేయఁగ వచ్చు నిఁక నని తోఁచమి నాలుక మాటాడుజోలి మాలె
నుత్సాహమను వస్తువుఱుగతి నెటొ పోవఁ దనువెల్ల నిస్సారతన్ వడంకె
నపరాధసాధ్వసం బంతటఁ గ్రమ్ముట శ్రవణమ్ము లెది వినఁజాల వయ్యె

ఆ. నొక్కదాని వెనుక నొకటిగ జ్ఞానక,ర్మేంద్రియములు స్వస్వవృత్తి మాన
స్థాణువై యిడి యనఁగఁ జాలె నమ్మునితను, వచ్చెరువుగఁ బంకజాక్షునెదుట.

ఉ. కారణ మేమొ కాని మునికాంతునికన్నులు మాత్ర మశ్రువుల్
సారెకు సారెకున్ వెడలు చందముఁ గన్పడఁ జేయుచున్ మహా
భారవృషత్తుగా నొకయవస్థను బొందిన పంచభూత సం
చారముగల్గు వస్తువె నిజం బిదియం చెఱిఁగించె నయ్యెడన్. ౨౯౮

చ. తనువు గలట్టివారలకుఁ దప్పక కల్గెడు ఖేదమోదముల్
వనరుహసూతికైన నిటువంటివి కల్గకయుండ శక్తి పెం
పున నొనరింప లేఁడట ప్రభుండ నొనర్పఁగ నట్లనంగ నే
ర్చిన పురుషుండు గన్పడునె సృష్టి నదెందు నదెట్లు చూచినన్. ౨౯౯

ఉ. అట్టులమర్త్యమాని దురితాంతమునన్ ఫలమందు మూర్ఖన
ట్టిట్టులు చూచినం దెసవు నించుకయేఁ దెలియంగఁ జాల క
ష్టట్టున నార్తినొందుటలు పద్మదళాక్షుఁడు చూచి యద్దిరే
యిట్టిమహాత్ముఁ డిట్లువెత లియ్యెడ నొందుట లెన్నఁ జోద్యమా. ౩౦౦

చ. ఇతరుల కెట్లొ ధర్మము లహీనపుఁగర్మగతుల్ శ్రుతీరితా
ప్రతిహతభంగులం బలుకు ప్రౌఢుఁ డితం డగుఁగాదె పూర్వ మీ
విత్తమున నాత్మకార్యమున వేఱిఁడినై తనకృత్య మెద్దియో
మతిఁ దలపోయలేక యిటు మ్రాన్పడియుండెడు నార్తుఁడై కడున్. ౩౦౧

చ. పరులకు ధర్మముల్ తెలుపుపట్లఁ బొందితి యబ్బియుండు నె
ల్లరకును భూరిధర్మతతులన్ బరికించి తపస్కరీతి నా
చరణమునందుఁ బొందితి నెసంగుట కొందఱకే పొసంగు నా
పరమతులే మహాత్ములనువా రని శాస్త్రము లెల్లఁ దెల్పెడున్. ౩౦౨

చ. ఇతరులఁ జేయఁ బూనిచి తదిద్ధపథంబునఁ దాను వర్తిలన్
మతిగొన కుండువారె కృపణమాలిన పండితమానులంచు శా
స్త్రతతి వచించు సజ్జనులు తా రెటు తెల్పుదురో యొనర్తు ర
వ్వితమునఁ గర్మపద్ధతుల విశ్వమునం దలవారె సజ్జనుల్. ౩౦౩

ఆ. పశ్యతోహరు లనఁబడువారు తమనుడి, యొరులకే యటంచు నూహచేయు
వార లగుదు రిద్ది నారదమునియందు, నన్వయింపఁగఁ దగు నంచుఁ దోఁచు.

చ. కలహము లెన్నియో కలుగఁగా నొనరించి హితంబు దాననే
కలుగఁగఁజేసి దేవమునికాంతుల మెప్పును గన్న ప్రోడ యి
ట్లలవునఁ జిక్కి ప్రాన్పడియె నక్కట! యింకఁ బరీక్ష యేల యి
మ్ములఁ బురికొల్పి యెంతొ తమిఁ బొందఁగఁజేసి పరీక్ష చేసెదన్. ౩౦౫

ఉ. అత్తఱినేని తత్త్వ మిది యా నని యెంచఁగఁ జాలఁడేని త
చ్చిత్తము దీర్పరాని వగచింతలవంతలఁ గుందఁజేసి యా
యుత్తలపాటుమూలమున నుత్తమమార్గముఁ గాంచఁజాలు స
చ్చిత్తము జ్ఞానదృష్టియు విచిత్ర మనందగుదాని నిచ్చెదన్. ౩౦౬

ఉ. నాపదపంకజద్వయ మనారతముం దమిఁ గొల్చు నీతఁడే
యాపగిదిన్ మహాజ్ఞత నిదేగతి నుండిన దుర్యశంబు నా
కే పలువుండ్రు గల్గునటు లెన్నొ విధంబులఁ బల్కుచుండ్రుగా
యాపలుకుల్ వినందగునె యార్తిని భక్తుఁడు పొంద నర్హుఁడే. ౩౦౭

ఉ. ఈతఁడు నీటఁబాసి విధి నెంతయుఁ బూనిక చేసినట్టిదా
నాతప మెల్ల నిప్పనికి నారయలేక వ్యయింపఁజూచె ని
ట్లీతఁడు బల్మిఁ బార్వతిని నెల్లవిధంబుల మార్పునొందఁగాఁ
జేతయె గర్వముం దెలుపుఁ జెల్లునె యియ్యది మాని కత్తఱిన్. ౩౦౮

ఉ. ఈగరువంబుచేతనె యహీనతపోధన మెల్లఁ బాడగున్
సాగదు మానివాంఛ యిది సాధుపథంబునుగాదు గాన నిం
కేగతినైన నీతని నిరీహునిఁ జేయుటె నాదుకృత్యమే
యాగద యట్లొనర్పఁగఁ బ్రయత్న మొనర్చెద నెల్లభంగులన్. ౩౦౯

ఉ. మద మడఁగంగ నొక్కటియె మార్గము కష్టదశం బరాభవం
బు పొలుతఁ గల్గినన్ బిదపఁ బోవుఁ బసంతన యమ్మదంబు దా
నఁ దగును జిత్తశాంతి యదె నాపదపంకజసేవకున్ ఫలం
బది స్థిరతం గనందగినయట్టి పథంబున వీనిఁ ద్రిప్పెదన్. ౩౧౦

చ. అనుచుఁ దలంచుచున్ వనరుహాక్షుఁడు సుస్మిత మాస్యపంకజం
బున నటియింప నిట్లనియెఁ బూజ్యతమా! మది నేమియెంచితో
కనుఁగొన నెట్లు శక్య మగు గాఢముదబ్ధినిమగ్నచిత్తతం
దనరినయట్లు తెల్లమగు దానివిధంబు నెఱుఁగఁ జెప్పుమా. ౩౧౧

క. నీవనుభవించు సంతస, మీవిష్ణువె యనుభవించు నెన్న నభేదం
బే వఱలు మనకు నిరువుర, కివిషయం బెఱుఁగుదువె యెన్నొగతులన్. ౩౧౨

క. అనుమానము మేల నీ నెమ్మనమున నిపు డేమితోఁచి మాటాడకయుం
డినయట్లు చేసెనో దా, నిని దెల్పుము వీనులార నేను వినియెదన్. ౩౧౩

క. నీపూనినకార్యం బది, యేపట్టునఁగాని వ్యర్థ మేల యగు నదే
నాపట్టినకార్యముగా, దా పాడుగునేని ఖ్యాతి యడఁగుంగాదే. ౩౧౪

మ. కనుకన్ నీ వొనరింప దీక్షఁ గొను నాకార్యంబు నాత్మైకశ
క్తిని సాధింపఁగ నేఁ దలంతు నెపుడున్ ధీరుండవై నిల్వుమా
పనియుం దానె తనంతసాగు దివిషత్పాలైకయోగ్యంబుగాఁ
గనఁగాఁ జాలుదు నీవె యచ్చెరువు గల్గన్ దాపసుల్ మెచ్చఁగన్. ౩౧౫

శా. ఎన్నో దుర్ఘటకార్యముల్ మఱొక రేమేఁ దోడ్పడంబూనిరా
కున్నన్ నీవె స్వకీయసత్యవిలసద్యోగైకశక్తిన్ బొన
ర్పన్నే నే కనులారఁ గాంచనొకొ దేవవ్రాతముల్ మెచ్చవో
యన్నా! నీవలనం గదా దివిషదోఘార్తుల్ కడున్ మాయుటల్. ౩౧౬

శా. ఆనీ విప్పుడు లేనిపోనివెత నిట్లార్తింబడం గారణం
బె నింతే నెఱుఁగంగఁజాల కిట నిన్నే నిట్లు ప్రశ్నింపఁగాఁ
బూనంగావలసెన్ ద్వదాశయము లోపప్పల్కిం బ్రవర్తించెనో
వానిం దెల్పుము కార్యసిద్ధియగు నావ్యార్తం ద్వరం దెల్పెదన్. ౩౧౭

చ. మునివర! యొక్కమాట మును ముందుగఁ దెల్పెద నద్ది నీవెఱిం
గినయదె యైనఁ గార్యభరసంకీర్ణమనస్కుఁడవౌట విస్మృతిం
గనితివొ యేమొ యన్నిఁటను గర్మము దొడ్డది దానిత్రిప్పలం
గొనక ప్రవృత్తి సల్పుటకుఁ గొంకనియాతఁడు లేఁడు సృష్టిలోన్. ౩౧౮

శా. ఏయేకాలమునందు నెవ్వ రెవ రేమేరీతులన్ శర్మముం
గాయక్లేశము నొందఁగాఁ దగుదురో కర్మంబె యవ్వారి న
ట్లాయారీతుల వానిఁ బొందఁదగు నట్లాత్మీయశక్త్యున్నతిన్
జేయున్ దైవమనన్ నిమిత్తమె సుమీ సిద్ధాంతమే యిద్దియా. ౩౧౯

చ. కనుకఁ బ్రయత్నమే మనది గాఁ దగుఁ దత్ఫల మబ్బఁజేయున
ప్పని యలకర్మరూపిణిగ భాసిలు నాదిమశక్తిదే యగున్
మనజతనంబు పండునొ క్రమంబునఁ బండినయట్టులుండి యం
తన ఫలియింపకుండునొ నితాంతము నమ్మఁగరాదు నారదా! ౩౨౦

చ. పురుషుఁడు కార్యభారమును బూనినయప్పుడె తత్ఫలంబదె
వ్వరుసనొ కల్గినం గలుగు పమ్మయిపోయినఁ బోవు నంచు సు
స్థిరమతి నిశ్చయించుకొని తేకువఁ బూనిన దుఃఖమొందకే
పరమసుఖంబు గాంచు నిది పథ్యముగాఁ దలపోయుమా మదిన్. ౩౨౧

చ. హితము మదర్థమై తపము నే వ్యయమొప్పఁగఁ జేసినైన లో
కతతులు మెచ్చఁజేయుటకుఁ గా జతనం బొనరించు నీకు దే
వతలు సహాయభూతు లగువార లటంచు వచింపనేల నీ
మతి యిటు కాతరంబగుటమాత్రము చిత్రముగాఁగఁ దోఁచెడున్. ౩౨౨

ఉ. జ్ఞానులలోన నుత్తముఁడ వెసంగుతపస్వులలోన మేటి ప్ర
జ్ఞానిధులందు నగ్రగణనంబున కర్హుఁడవు యోగివర్యసం
తానమునం గనిష్ఠిక సతంబును లెక్కిడ నొందఁ జాలువాఁ
డౌను సురర్షి యన్న నుతి నందినవాఁడవు గావె నీవనన్. ౩౨౩

చ. కలహము లన్నపేరున జగంబులఁ గ్రాలెడు సాధురాజికిం
గలుగఁగనున్న కష్టములఁ గన్పడనీయక పాఱఁదోలు ని
స్తులమహిమాన్వితుండవు వసుప్రముఖాఖిలదేవవారముల్
దలఁతురు నిన్నె యెల్లపుడు తమ్మొగిఁ గాచినధర్మమూర్తిగాన్. ౩౨౪

ఉ. అట్టిఁడవైన నీ విపు డహార్యమనస్థిరతాధనంబుఁ బో
వట్టి యపారదైన్యమునఁ దత్తఱమందుచు నిట్టులుండ నేఁ
డెట్టిమహాపదల్ గలిగె నెట్టులువాపఁగవచ్చు నంచు లో
గుట్టు లెఱుంగరామి వగఁగుందెడు నామది యేమిచెప్పుదున్. ౩౨౫

ఉ. చేసినయత్న మించుకయు సిద్ధిని గాంచకపోయె నన్నయా
యాసమునన్ మొగంబు చెలువారకయున్నదొ వేఱుకారణం
బో సురమౌనివర్య! యిట నొక్కలవంబును దాఁపకుండ సం
త్రాసముమాని తెల్పుమ యెదంగలభావము సత్వరంబుగన్. ౩౨౬

చ. అది నెఱవేఱుమార్గముల నన్నివిధంబుల నిశ్చయించి నీ
మది కుతుకంబునొంద ననుమానము లన్నియుఁ బీడిపోవ నీ
యదనునఁ దెల్పువాఁడఁ ద్రిదశావళి నీవెటుచెప్పినన్ ముదం
బొదవఁగ నట్లచేయుఁ దల లొగ్గఁగఁ జేసెద నేర్పుమీఱఁగన్. ౩౨౭

చ. అని యనురాగ ముట్టిపడునట్లు వచించిన నానుడుల్ మనం
బును శ్రుతిరంధ్రమార్గమునఁ బూతసుధారసధారలట్లు చ
య్యనఁ బరితాపహీనముగ నట్లొనరించిన నించుకింత తె
ల్వినిగని మ్రోలనున్న యలవెన్నునిఁ గాంచి గతాభిమానుఁడై. ౩౨౮

ఉ. విన్నఁదనంబు మోమునకు వింతవికారముఁ గూర్ప శీర్షముం
గ్రన్ననవంచి విష్ణుపదకంజములం దనచూడ్కి నిల్పి తాఁ
బన్నినయట్టి పన్నుగడ బైటపడెంగద యేమిచేయనౌ
నన్నభయంబు పైకొనఁగ నార్తశరణ్యుఁడు వెన్నుఁ డిట్లనెన్. ౩౨౯

మ. నను గాపాడుత సుంతయేని మదిలో నాతప్పులన్ వీని నె
ల్లను లెక్కింపక కార్యసిద్ధియగు సల్లాపంబులన్ జేసెఁ గా
వున భీతిం బొరయంగ నేల కపటంబుంబూని సర్వజ్ఞు చెం
తను వర్తించుటకంటె నొక్కయపరాధం బుండునే యెందునే. ౩౩౦

మ. అభయం బిచ్చెఁ దనంతనే సకలలోకారాధ్యుఁ డావిష్ణువీ
ప్రభు వింకన్ భయమేది కార్యమును దీర్పం బూనుదున్ స్వేచ్ఛఁగా
నిభరాడ్గామిని మంజుచిత్తగతమోహావృత్తిన్ మరల్తుం దపో
విభవం బింత కొఱంతగాంచనివిధిన్ విశ్వేశునాజ్ఞం ద్వరన్. ౩౩౧

మ. అని యోజించి జగత్పతిం గనఁగ నాస్యం బింత పైకెత్తి యి
ట్లను దేవా! చపలత్వమూని యపరాధాళిం బొనర్పంగ నెం
చిననాతప్పుల సైచితివు కరుణన్ సిద్ధించె నట్లేకదా
పనులెల్లన్ సెలవైనఁ బోయెదఁ గనం బ్రాలేయశైలాధిపున్. ౩౩౨

మ. అతఁడీపాటికె పుత్త్రికాహృదయ మత్యంతంబు మార్పుంగనన్
జతనంబుం బొనరించియుండును వయస్యల్ నిత్యమున్ దావకా
ప్రతిమైశ్వర్య విచిత్రచర్యల నుతింపన్ భావముల్ మాఱు ట
ద్భుతమే నిమహిమాళి యెన్నఁదరమే భోగీంద్రతల్పా! హరీ! ౩౩౩

ఉ. నేనట కేగినంతటనె నెమ్మిని బార్వతి నీదురాకకై
మానస మావృతింబొదల మంజులతావకరూపచిహ్నముల్
బూని యొకర్తుకే తనదు పూనికమానినయట్లు తెల్పఁగాఁ
పా నొకసల్లతోదపసితంబున నుండు నటంచు నెంచెదన్. ౩౩౪

ఉ. అచ్చటివార్త సుంత హృదయంబునఁ దోఁచిన నిప్పు డేనుబో
నిచ్చ చెలంగుఁ గార్య మిక నెల్లవిధంబుల సాగు సంతసం
బెచ్చఁగఁ బంకజాతు నెలవిమ్ము విరాన చనంగ నామదిన్
ముచ్చట గాంచుచున్నయది మూపత మెప్పుడొ నిశ్చయింపనా ౩౩౫

చ. అని త్వరఁబూని యామహతి నచ్చటనే యిడిపోవు విస్మృతిం
గను సుకుమారిఁ గాంచి మురఘస్మరుఁడున్ దరహాసచంద్రికల్
మునిపయిఁ జర్వ నిట్లనియె మూరుత మెన్నఁడొ నిశ్చయించి వే
పనుపుము దూత నొక్కనిని బంతము చెల్లినయట్లె యెంచెదన్. ౩౩౬

చ. పలుమఱు నీవునచ్చట నిబద్ధిగఁ జెప్పెద నామనంబునం
గలఁగెడు ఖేద మింత యనఁగాఁ దగకుండు నదేటి కిట్టులీ
పలసటనొంద దూత యొకఁ డచ్చటివార్తలఁ దెల్పఁజాలదే
కలుగునె ఖేద మింతయినఁ గాని మనంబున నీకు నాకునున్. ౩౩౭

శా. ఈనాఁడో సుముహూర్త మప్పటికి నేయే పెండ్లిసంబారముల్
దేనో వాని గ్రహించి మిత్రవితతుల్ ధీమద్వరుల్ బంధుసం
తానంబుల్ తమి వెంటరాఁ గదలి యోనారాయణా! రమ్మనం
గా నే రానొకో యిన్నిసార్లు తిరుగంగా నేల మౌనీశ్వరా! ౩౩౮

మ. పలుకుల్ వేయు నిఁకేల వేగచని యప్పద్మాక్షిదో నాశయం
బెలమిం గాంచిన చర్యలన్ నుడులఁ గాదే నిశ్చయింపంగనాఁ
దెలియంగాఁదగు నల్లె నీమదికి సంతృప్తిం గడుంగూర్చునేఁ
దెలుపంగాఁదగు వేఱుగానయిన నింతిన్ మాను టొప్పంగవా. ౩౩౯

ఉ. నామదిఁ దోఁచినట్టులుగ నారద! నీ కెఱిఁగించినాఁడ నిం
కేమి వచింపనో నెఱుఁగు దీవె సమస్తము నెల్లవెంటలన్
గామిని మానసం బెఱిఁగి కార్యముఁ దీర్పుము నానిమిత్తమై
సామముమాని భేదమునఁ జక్కఁగఁ గార్యముఁ దీర్ప మూనుమా. ౩౪౦

క. సీమంతినిదో చిత్తము, కోమలముసుమీ రవంత కొదువఁగఁదోఁపన్
గా మాఱుచుండుఁ గావున, నో మునివర! చక్కఁగఁ దెలియుము నేర్పుమెయిన్.

మ. హిమభూభృద్వరపుత్త్రి పాండితిన దెంతే వాసిగన్నట్టి ప్రో
డ మునీ! తన్మహిమంబు నింత వినినాఁడం బూర్వ మెవ్వారొ చె
ప్ప మహాయోగవిభూతిఁ గాంచి మునిభూపశ్రేణి వర్ణింపఁగీ
ర్తిమనుంగాంచిన సాధుశీలయఁట బుద్ధిం జక్క యోజింపుమా. ౩౪౨

శా. నాయందుంగల ప్రీతిపెంపున లసన్నారీమణిన్ బార్వతిన్
మాయారూపిణిగా నెఱుంగక వచోమాధుర్య మేపారఁగా
నేయత్నంబుననైన లోఁబఱుప నీవేమేని యోజింతువో
కో యాయూహలు నిష్ఫలంబులగుఁ జుమ్మో నారదా! నమ్ముమా. ౩౪౩

క. నామాట లివ్వినిగమ, స్తోమములుగ నమ్మి పోయి సుంతయు మదిలో
నేమఱుపాటొందక యా, హైమవతీభావ మెఱిఁయి యరయుము మౌనీ.

క. జననీజనక వయస్యుల, యనూనహితవాక్యతతుల నాలించి మనం
బును మార్చుకొనియె యుండెను, నని తోఁచెను నట్లునైన నతివేగముగన్.

క. దూతముఖంబున మూరత, మేతఱి యుక్తంబటంచు నెల్లసుధాంధో
వ్రాతములకుఁ దోఁచునో నీ, వాతఱి నంగీకరించి యాశుభవార్తన్. ౩౪౬

క. నాకుం దెలియం జేసిన, వే కదలి ముహూర్తమునకు విబుధవరులతో
లోకేశప్రముఖులతో, నీకడ కేతెంతు సురమునిప్రవర! తమిన్. ౩౪౭

తే. పెండ్లిపెద్దవు నీవౌటఁ బ్రీతిమెఱయ, నెట్లు చేయుంగ ననుతువో యొక్క విబుధు
లట్లె చేయంగఁ దలలొగ్గి యక్కరిత, నర్తిలుదు రెల్లభంగుల భక్తులగుట.

క. చను మిఁక వేగమ తుహినా,ద్రిని గనఁగా నీదుదూత । తెచ్చినవార్తల్
ననుఁగొని రానోపును నిలు,పునుజుమ్మీ నాయదృష్ట।మునుబట్టి మునీ! ౩౪౯

క. ఈసంతోషంబున మహా, తీసంజ్ఞికమై తనర్చు । దివ్యవిపంచిన్
బూసి చనునట్లు తోఁచెడి,నోసంయమివర్య! కోప। మూనకు నాపైన్. ౩౫౦

ఆ. కార్యసిద్ధియగుత । గౌరీహృదాశయ, మంబుజాసనాదు । లాదరింపఁ
గా ఫలించుఁగాక । గరళకంఠుం డమృ,తగళుఁ డగునుగాక। దైవకృపను. ౩౫౧

క. అనిపంచిన నిర్భరముద,మున మహతిన్ మీటుచున్ వి।భున్ శ్రీనాథున్
వనరుహనయనుం దలఁచుచుఁ, జనియెన్ దుహినాచలంబు । చక్కటి కెలమిన్.

క. పరమేశ్వరుండు శ్రీపతి, సురమునివిభ్రాంతి నెన్ను।చున్ గౌరీసుం
దరి దృఢతమ నియతికి న,చ్చెరు వందుచు నెమ్మదిన్ వసించెన్ బురినిన్. ౩౫౩

క. జ్ఞానము తపమ్ము యోగము, మానికి నొకయాఁడుదాని । మానసవృత్తిన్
బూని యెఱుంగం జేయం, గానీయవు తెల్వి దుష్ట । కాలబలమునన్. ౩౫౪

క. కాలమె యన్నిఁటికంటెన్, బోలం దలపోయఁ బ్రబల।ముగదా దానిం
బోలునది యొక్కఁడును లే,దేలోకమునందు దైవ।మే యదియగుటన్. ౩౫౫

క. దానికి నేనును శంకరుఁ, డానీరజసూతి లోఁగి । యనువర్తింపన్
గా నీనారదుఁ డనఁగాఁ, దా నెంత మహత్తరంబు । దాఁ గాల మగున్. ౩౫౬

క. అనియోజించుచుఁ గాఁగల, ఘనకార్యం బిట్టిదగును।గా యని తనలోఁ
గనికని యానందించుచు, వనరుహనయనుండు స్వీయ । భవనవరమునన్. ౩౫౭

క. దినములు పుచ్చుచు భక్తుల, మనములఁ బరికించి వాని।మార్పులు చక్కం
గనుఁగొనుచుఁ దగినఫలముల, ననుకంపం గూర్చుచున్ మ।హత్త్వము పొదలన్.

క. గోలోకంబునఁ గ్రీడా,జాలంబులఁ దేలుచున్ బ్ర।శాంతమె తనకుం
జాలినభూషణమై తగ, శ్రీలం దేలంగఁ దనదు।సేవకు లెల్లన్. ౩౫౯

క. అతులితవేదాంతౌఘ వి,హితనైజ మహత్త్వ మెల్ల।యెడలన్ వెలుఁగన్
స్మృతలోకవితతిపాలన, హితుఁడై తనుఁదానె సతత । మెన్నుచు నుండెన్. ౩౬౦

ఆశ్వాసాంత్యము.

క. హరివరవరద మహిష్ఠా, శరనికరవిదారణైక । సంగతమోదా
కరుణాశరధీ కృతఘ్నీ, పరిహృతరిపువర్గ స్వవశ।పరిణతదుర్గా. ౩౬౧

ఉ. సర్వసుపర్వ మృత్యుకర । చండమహాద్యుతిమాలికావృతా
ఖర్వ దిగంతరాళ గురు।కాయ హాలాహల పాన సమ్మదా
శర్వ సమస్తభక్తజన।సంతత శర్మద సద్వరప్రదా
గర్వితదైత్యవార పరి।కల్పిత నాశన ఫాలలోచనా. ౩౬౨

మణిగణనికరవృత్తము:—

పురహర భవహరఽమునిజనవరదా
హరి శతధృతి హరిఽహయముఖవినుతా
పరమపురుషధృత ఽ పదకమలయుగా
వరమతి విదిత విఽభవ, గురుకరుణా. ౩౬౩

గద్యము. ఇది శ్రీమత్త్రిపురసుందరీ కరుణావాప్త గీర్వాణాంధ్రకవితాప్రాభవ, కాశ్యపాన్వయప్రభవ, శ్రీజనమంచి వంశాంబురాశికుముదసీమిత్ర, సుబ్రహ్మణ్యామనీషిపుత్త్ర, తాండవకృష్ణాపరాభిధేయ శేషాద్రినామధేయ నిర్మితంబైన సర్వమంగళాపరిణయంబను మహాప్రబంధంబునందు తృతీయాశ్వాసము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ.



శ్రీరస్తు.

# సర్వమంగళాపరిణయము

## చతుర్థాశ్వాసము.

క. శ్రీపతివాక్పతిపౌలో, మీపతిముఖపూజ్యమాన । మృదుపదకమలా
శ్రీపతికృతనిజభక్తా, వ్యాపాదితదుర్జనా మహాదేవ! విభూ. ౧

వ. మహాప్రభూ! తరువాతివృత్తాంతం బవధరింపుము. ౨

### హిమవన్నారదులు రహస్యముగ మాటలాడుట.

మ. కమలాక్షుం డిటుసాగనంప భగవత్కల్యాణగేయంబులన్
మది నుప్పొంగఁగఁ బాడుచున్ మహతినాదై వాఱు విఖ్యాతిలో
కములం గాంచిన యవ్విపంచికయుఁ దాద్ధానక్రియాలోలుప
త్వముఁ గాంచం గమకించునట్లు విధిగా । దంత్రీధ్వనిన్ దెల్పుచున్. ౩

చ. మనసు లమైకపూర్ణమయి । మాధవునందె లయింప యోగవా
కినిధి మునుంగు యోగిపతికీర్తిని నారదుఁ డొక్కచోఁ దనం
తన నిలుచున్ వియచ్చరవరతంసు లిదేమని చోద్యమందుచుం
గనుఁగొనఁ గొంతసేపటికిఁ । గ్రమ్మఱఁ బోవు నభఃపథంబునన్. ౪

ఉ. తాళరసంబు వీణనిరవంబునఁ జేరుచు నొక్కనిస్వనం
బోలిఁ జెలంగుచందమున । నొప్పుచునుండఁగ నోంకృతిస్వరం
బే లలి మించె నిట్టు లని యెంచఁగ నిండె నభంబు నెల్లెడన్
వ్యాళము లట్టి భోగతతు । లల్లన విప్పి వినంగఁబూనఁగన్. ౫

ఉ. ఎచ్చటినుండి తాఁ బయన । మెత్తఁగఁ జేసెనొ యెందుఁ జేరఁగా
నిచ్చ నొసంగునో తెలియనీయని గానరసప్రమోదతన్
సచ్చరితుండు నారదుఁడు । సత్పథమందుఁ జరించుచున్ మహీ
భ్రోచ్చతటంబుఁ జేరె మది । నొప్పుతలంపులె మేను నీడ్వఁగన్. ౬

ఉ. కన్నులు మూసినన్ మనసు । గాంచుతలంపులె యెన్ని కన్నులో
యన్నటు లాలకించము మహాజనమొప్పఁగఁ గోర్కలెట్టితా
వున్నెఁ జేరఁగల్గునటు । వూనెనొ యచ్చటఁ జేర్చుచుండు యో
గోన్నతశక్తి యద్దిరొ మహోత్తమ మయ్యది యెన్నిచూచినన్. ౭

మ. అది లేకున్నయెడం బదద్వయము సత్త్వాధిక్యముంబట్టె పో
వఁదగుంగా యది యోగశక్తిమెయిఁ బోవంజాలిన ట్లెప్పు డ
ప్పుడు గమ్యస్థలసంప్రవేశ మన సంభావింపఁగా శంక కా
స్పదమే కానని యోగసత్త్వమన శ్రేష్ఠం బెందు యోజించినన్. ౮

చ. మనసున నీస్థలంబునకు § మార్గమిదే చన నంచు నెంచి యో
గనిరతిఁ బూని కన్నులను § గట్టిగమూసి పరేశుపాదముల్
గనుఁగొనుచున్నఁ జాలు క్షణకాలమునం దటఁ జేరియుండు దా
నినె వచియింత్రు పండితులు § నిర్మలఖేచరినా సువిద్యగన్. ౯

ఉ. దానిబలంబునం జనియెఁ § దా డవిషన్మునిపుంగవుండు శ్రీ
జానినిమిత్తమై గిరిజకాస్వాంతము మాఱియెయుండునం చొగిన్
మానసమందు నెంచుచు; క్షమామాధవుఁ డమ్మునిరాకఁ గాంచి లో
నూనినయవ్విచార మపు § డొక్కటెఱుంగునఁ దోఁపకుండఁగన్. ౧౦

క. లేనిమహోత్సాహంబును, దానూని కళత్రయుక్తిఁ § దన్మౌనిఁ గనం
గా నేగి యాతిథేయము, చే నెంతయు గారవించి § చేమోడ్పుతగన్. ౧౧

క. అమరర్షివర్య! మీయా, గమనమునే కోరుచుండఁ § గా వచ్చితి రి
మ్మముఁగనఁ గరుణన్ గావున, సమస్తకార్యములు సుఫలీకృతములె యయ్యెన్.

క. ఏకొఱఁతలు లేకుండఁగ, నే కార్యములెల్లఁ బండు § నికఁ దను మోహాల్
శ్రీకలిత భవాద్భుతముని, నాకేశాగమనమున ముదమునం గల్గెన్. ౧౩

క. తమ రిందుండి ప్రయాణము, కమలాక్షునికడకుఁ జేయఁగా సాహసచి
త్రము లెన్నియని వచింప న,శమె నాబోంట్లకు మానిసత్తమ దైవా. ౧౪

క. సుంత వచించెద నాసుత, నెంతయు బోధించితిమి సమీహితనీతిన్
వింతగ మాటపుంగనెం ద,త్స్వాంతము తమయాశయముల § బట్టెనయో.

క. ఆవటుకుఁ దల్లియును నే, నేవిధముగ మాటలాడ § నెంచి పలికినన్
దా విముఖియగుచు విను నిప్పు,డావిధముగ నుంతయూఱట నట్టులె తొట్టెన్. ౧౬

క. ఏమి వచించిన వినుచున్, మోమున నొకవింతచెలువమును దాపడ నిలుపన్
గామిని దానం దోఁచెను, నామది నీయూహ మానినామణి! కిందే. ౧౭

క. ఐన నొకప్పుడు చేష్టలు, దానిన్ బోలఁగనించుచుండుచు § పెక్కురు మదిలో
మానసము నిట్టిదని యను, మానింపం జాల నొంతమాత్రం బైనన్. ౧౮

క. ఏదెట్టు లుండినన్ సుత, ఖేదము మానినవిధంబు § గాంచిత్తుర్ నా
కే దోఁచె నింక మీమది, కేది సముచితమొ చేయుఁడట్లో దానిన్. ౧౯

క. దానిం దలపోయుండు మీ, మానసమున దృష్టపడిన § మంచిదె యనుచున్
దానినె భగవద్వాక్యము, గా నెంతుం దలచుదాల్చి § కొనియెదమిక నంతున్.

చ. అనుటయు నెమ్మనంబు ప్రమదాంబుధిమున్గగ నచ్యుతోక్తి పం
డెనుగద యంచుఁ బల్కులు గణించుచు దానినె విశ్వసించుచున్
వసుపని ముజ్జగంబుల నితాంతము కీర్తినొసంగఁజాలు నం
చును దలపోసి సుస్మితపుసొంపు మొగంబునఁ జిందులాడఁగన్. ౨౧

క. తానొకటి దలఁప దైవము, మానసమున వేఱొకండు మాటఁ దలంచెన్
నానుడి యిది నేటికి నిజ,మై నెగడె నటంచు నెంచి యల్లనఁ బలికెన్. ౨౨

శా. ఏమేమీ జనకోక్తులన్ వినఁగఁ దానెంచెంగదా నేటికం
చీమాటల్ శ్రుతులం బడన్ మన మ,దెంతేఁ జల్లనయ్యెంగదే
నామాటల్ భవదాత్మజాత కిపు డోన్నం దృప్తి నీఁజాలుటల్
క్షేమప్రాప్తికి హేతుభూతములెయౌఁ జెప్పంగ నేలా యిఁకన్. ౨౩

క. పరమాత్మానుగ్రహ మి,క్కరణిన్ ఫలియించె నిదియొ కాదె యదృష్టం
బుపతర మని చెప్పంబడు, ధరణీధరవర్య! యేల తామస మింకన్. ౨౪

చ. త్వరపడి పెండ్లికిం దగిన వస్తుగణంబును గూర్పు నిర్జరో
త్కర మమరేశ వారల కళాగారవరంబుల నేర్పఱింపుమా
సరసిజసంభవాదులకు సౌధములన్ విడుదుల్ ఘటింపు శ్రీ
వరునకు నుండనర్హ మగువస్త్వ మనుత్తమ మొంతొ పూనికన్. ౨౫

ఆ. సంఘటింపు మింక సన్మహార్తము సమీ,పమున నుండఁగలదు భాగ్యరేఖ
లుల్లసిల్లునట్టు లొప్పఁగాఁదగుఁ బెండ్లి,యత్న మనుచు నేల యనువదింప.

చ. త్రిజగములందు నిట్టిదగురీతిని బెండ్లియె సాగినట్లుగా
నిజముగ మే మెఱుంగ మని నిర్జరపత్నులు చెప్పుకొంచు నీ
దు జతనమున్ మదిన్ సతము దోఁచుచునుండఁగ మెచ్చుకొంచు నిం
క జరగునొక్కొ యిట్టి వనఁగాఁ దగులాగునఁ బెండ్లిచేయుమా. ౨౭

శా. నాకున్ లోకచయంబులందు యశ మేన్నంజాలున ట్లొప్పఁగా
నీకున్ శాశ్వతకీర్తి యబ్బునటు లానీరేజపత్త్రాక్షుఁ డెం
తో కారుణ్యముమీఱ నిన్ను మది నెన్నో రీతులన్ మెచ్చఁగా
శ్రీకంఠుం డిది యేమటంచు వెఱఁగుం జెందంగ నుద్వాహమున్. ౨౮

మ. ఒనరింపం దగు నించుకేఁ గొదువ యిట్లొప్పెంగదా యిందునం
చనుమానింపఁగనైనఁ జాలనటు లోయద్రీశ్వరా! పెండ్లినే
యను బూనందగు నేను బాసటగఁ గార్యవ్రాతముం దీర్చెదన్
వనజాక్షుం గరుణింపఁజేయుదని నాభావంబుగా నమ్ముమా. ౨౯

చ. అని యిటు లాత్మసంభ్రమ మహార్యముగాఁ గనుపట్టఁ బల్కున
మ్మునిఁగని యాహిమాచలవిభుం డెలనవ్వు నడంపఁబూని న

ట్లనియె సురర్షిచంద్ర! యిటులాతుర మొందెదవేల నాపనూ
బును బరికింపకే యిఁక సుపుత్త్రిక యూహల విన్నవించెదన్. ౩౦

ఉ. మానుడు లాలకించుతతి మంచివిగా గ్రహియించినట్టులే
గానఁగనౌను గాని చెలికత్తియ లొక్కటిఁగూడి యుండఁగాఁ
దా నెదియో వచించునటఁ దప్పకవైరి యనూనసంస్తుతుల్
వీనుల కింపుఁబెంప విన వేడుక మోపెడునంట వింటివే. ౩౧

ఉ. నాసుత యోగశాస్త్రమున నారద! మిక్కిలిపాండితిం దన
భ్యాసమునందుఁ బొందియు మహాత్ములసత్కృపఁ గల్గియున్న దే
దోసము నామెయందుఁ గనఁ దోఁపదు చక్కఁ బరీక్షచేసినన్
వేసరితిన్ హితోక్తులను వేమఱు జెప్ప యిఁకేమి చేయుదున్. ౩౨

ఉ. కామినులెల్ల రెంతొ తమకంబున శ్రీపతిపై మహత్త్వముల్
వేమఱు జెల్పుచుండినను వింతగఁ దా విన నొల్లకెట్టులో
భూమిని గాంచుచున్ వినుచు భూతపతిప్రియవార్తలన్ వినం
గా ముదమొందు నట్టులుగఁ గాంత కనంబడుచుండు వారికిన్. ౩౩

చ. పలుమఱు నీవిధంబుఁ గని భామినులెల్లను మేన మువ్వటం
బెలుపుచునుండ వింటిఁ బలుకేమలు నారద! యున్నదున్న య
ట్టులు వివరించినాఁడను గడుంగడు వింతగ నాదుఁ దోఁచుటన్
బలుకులు వేయునేల కనుకట్టదు ప్రీతి సరోజనేత్రునై. ౩౪

ఉ. మాటలచేత దాని లవమాత్రము దెల్పదుగాని చేతలం
బోటి యెఱుంగఁజేయు నిజమంబు వెడందుఁ డిదె యంచుఁ గాన నీ
లాటివిగాదె మానసములం దగునూహలఁ దెల్పుచుండు నా
బోఁటికిఁగూడ నింక మిముబోంట్లకుఁ దోఁచుట చెప్పనేటికిన్. ౩౫

ఉ. ఈ వెటనుండి వచ్చితివొ యిచ్చటి కిప్పుడు పద్మనేత్రుఁ డే
భావముఁ దెల్పె నీకు నదిపాలనచేయుటె కృత్యమౌఁగదా
యేవిధిఁ దెల్పఁబూనితివొ యీమనయత్నము సాగునట్టు లో
దేవమునీంద్ర! తెల్పుమ మదిం గల చింతలు పోవునట్లుగన్. ౩౬

చ. నలువురు నన్ను నిన్నుఁ గనినవ్వకయుండఁగఁ గార్యమెన్న స
త్ఫలము నిడంగఁ జాలునటు బాగుగ నెంచి వచింపవయ్య! నీ
బలమును నమ్మి యిత్తునని పల్కితిఁ గన్యను విష్ణుమూర్తికి
ప్పలుకు ఫలింపకున్న నగుబాటగు నంచు విచార మొందెదన్. ౩౭

ఆ. నీవె ప్రోత్సహింప నేను నౌ నంటిని, గాని వేలుగాదుగద మహాత్మ!
కార్యనిర్వహణముగాదె ప్రధానమ్ము, దానిజెలఁగఁ దెలుపు మే నొసఁగుదు.

క. నీమాట వేదవాక్కుగ, నే మది నెఱనమ్మినాఁడ ॥ నింత నిజమును
మ్మీ! మౌనివర్య! యింక నీ,వే మే నొనరింపు మన్న ॥ హిత మనునూహన్.

తే. అల్లె యొనరింతు ననుటయు ॥ నద్రివరుని
వాక్కులం గొంత సంశయ ॥ మెక్కుమొగిని
మదికిఁ దోఁపఁగ నించుక ॥ మౌన మూని
మ్రాన్పడినయట్టు లుండెడు ॥ మానసమున. ౪౦

క. తలపోసె నిట్టు లీయది, జలజాక్షుని యాజ్ఞకున్ వి ॥ సంవాదిగఁ దొ
య్యలిచేష్టలఁ గన్పట్టెడు, జలజాసనుఁడే యెఱుంగఁ ॥ జాలున్ దీనిన్. ౪౧

చ. హరి వచియించెఁ దొల్త నను ॥ నార్తిని బ్రుంగఁగఁ జేయకుండు మ
త్తరుణియు శంభుఁ గోరెనఁట ॥ తద్వ్రతభంగము చేయ న్యాయ మె
క్కరణి నగున్ బ్రయత్నము నిఁకన్ విరమింపుము చాలుఁజాలు నీ
వరుసఁ బరాభవంబు మును ॥ వచ్చిన దెప్పుడులే దదెట్టులే. ౪౨

చ. అని వచియించి నాదయిన ॥ యార్తిని గాంచి కృపాంతరంగుఁడై
వనట దొలంగఁ జేయునటు ॥ వల్కె నొకో యనునూహ యిప్డు నా
మనమునఁ దట్టెడున్ దుదను ॥ మాధవుఁ డెంతొ చమత్కృతుల్ దగన్
నను నలరంగఁజేసి తన ॥ నాఁడెముఁ జూపియె పంపె నద్దిరా! ౪౩

ఉ. ఇంతయుఁ జూడ నీనను న ॥ దెవ్విధినేఁ దలవంపుగా జగం
బంతటఁ ద్రిమ్మరంగఁ గను ॥ నాదృతిఁ గాంచెను విష్ణువంచు నా
స్వాంతము తెల్పుచున్నయది ॥ సత్యమె కాఁ జను నిద్ది కానిచో
నింతిమనంబు మార్పుగన ॥ కే యిటులుండునె? యేమిచేయుదున్. ౪౪

చ. త్వరపడి జ్ఞానహీనత ని ॥ తాంతము గర్వము పైకొనంగ శ్రీ
హరికిని సర్వమంగళ మ ॥ హాయతశక్తిని గూర్తునంచు నేఁ
జరిగితి నిట్టులట్టులు మ ॥ దిం దలపోసి మదీయగర్వసం
హరణ మొనర్ప నిట్టులు ప్ర ॥ యత్నము శ్రీహరి చేసెనేమొకో. ౪౫

ఉ. ఐనను నీ వొనర్చెడు ప్ర ॥ యత్నము నిష్ఫల మెట్టులౌ మునీ
మానినిచిత్త మిప్పటికి ॥ మాఱియెయుండు నటన్న యర్థముం
గానఁబడంగఁ బల్కెఁ దుదిఁ ॥ గావున నీవిధి నెంచుటల్ మద
జ్ఞానమహత్త్వమే గద య ॥ నం దగియుండునుగాదె యిత్తఱిన్. ౪౬

మ. తొలుతం గార్యము నిష్ఫలంబగునటుల్ ॥ తోఁపంగనే చేసి య
వ్వల నద్దాని ఫలింపఁజేయుటకుఁ దా ॥ వాంఛించెఁ గాఁబోలు నా
జలజాక్షుం డని యిప్పు డెంచుటకు నౌ ॥ శక్యంబు గాకున్నన
ప్పలుకుల్ వెన్నుఁడు తెల్పునే యనృతముల్ ॥ పల్కంగఁ దా నెంచునే. ౪౭

శా. తానే బుద్ధిని మార్చుకొన్న బుధసంతానంబు వ్రీడాకరం
బౌ నట్టుల్ తనుఁ బల్కునేమొయని యీశయద్రీంద్రుసత్పుత్త్రియున్
మానస్ఫూర్తి చెలంగ నెంచి సుధులన్ మన్నించుచున్ శంభునిన్
శ్రీనాథున్ మది సమ్మతించు ననియే చింతింపఁగా రాదొకో. ౪౮

మ. హరియే నిక్కము తెల్పఁగాదె చివరన్ హర్షంబుగల్గంగ స
త్వర మాభూధ్రవరేణ్యుఁ గానఁజని యాతన్వంగి చిత్తాబ్జ మే
వరుసన్ మాఱినదో యెఱింగి తుదకున్ భద్రంబు చేకూర్చు సు
స్థిరలగ్నంబును నిశ్చయించుచుఁ బ్రవృత్తిన్ దానినిం దెల్పుమా. ౪౯

చ. పలుమఱు నీదురాక మదిఁ బాటిల చింతయు సంతసంబు నీ
వలసట నొందనేల తుహినాచలమందున నిల్చి దూత వా
ర్తలఁ దెలుపంగఁ బంపుమని దానిరహస్యము లోఁ దలంప నీ
చెలువ తనున్ వరించునని చిత్తమునం దలపోసినట్లు గా. ౫౦

ఉ. ఆవిధమెల్ల నింతకు హిమాచలవర్యుఁ డితం డెఱుంగఁ డం
చీవఱకన్నమాటలనె యేర్పడుచున్నది శంకనొందియే
నావిలచిత్తవృత్తినయి యార్తి మునింగితి నింక నైన మే
నావరపుత్త్రిఁ గాంచి కడున్యాయముగాఁ దగునట్లు పల్కెదన్. ౫౧

ఉ. దాన గిరీంద్రపుత్త్రి యుచితంబుగ నెవ్విధి స్వాశయంబులం
దా నెఱిఁగించునో యెఱిఁగెదన్ మఱి యప్పటి కెట్లు చేయఁగా
నౌనొ తలంచి చేసెద రమాధిపుఁ డాత్మఁ దలంచినట్టి దే
మైనను గాక తప్పదుగదా పలుచింతలఁ బూన నేటికిన్. ౫౨

మ. అనుచున్ స్వాంతమునం దలంచి హిమశైలాధీశునిం గాంచి యి
ట్లనియెన్ మాన్యతమా! త్వదుక్తులకు ధైర్యం బెంతో యూటాడె నై
నను నాయత్నము నిష్ఫలంబయిన దెన్నండేని లే దింతకున్
మును గానం దరళాక్షిఁ గాంచి విహితంబుం దెల్ప నూహించితిన్. ౫౩

ఉ. ఆవల దైవమే పనిచినట్లగుఁ బౌరుషముం బొనర్పనే
నేవిధినైన నందులకె యిప్పుడు వచ్చితిఁ బార్వతిం గనం
గావలయున్ దదుద్యమము క్రన్ననఁ జేయు మటన్న మౌనిరా
డ్భావము వ్యర్థమే యనుచు స్వాంతమునం దెలుఁగంగఁ జాలెదున్. ౫౪

ఉ. అపుడేమన్నను మౌనిచిత్తము దురంతార్తిం గనుం గాన మా
నిపుడే కన్నియతోడఁ బల్కినయెడన్ నిశ్చింతమౌ నావటన్
దపసీయాంబకుఁ డేమిచేయఁగఁ బ్రయత్నం బూనియున్నాఁడో యె
ట్టిపనుల్ సాగునొ మౌనివంకఁగన నాదెందంబు నేమించెదన్. ౫౫

ఉ. ఊరకయుండి నారదుని యుద్యమ మెట్లు ఫలించునో ప్రియం
బార సరోజనేత్రుని మహాశయ మెవ్విధిఁ గార్యదీక్షచే
భారముపూని సిద్ధి గనుపట్టఁగఁ జేయునొ చూచుచుండెదన్
దీపఁజాల నెద్దియును ǂ దేవునిపై బరువుంచి యుండనొ. ౫౬

ఉ. తామరపాకుపైఁబడియు ǂ దాని స్పృశింపకయే స్పృశించిన
ట్లే మనుజాళి గాంచునటు ǂ లెంతయుఁ బొల్పుపయగికణంబునా
నేమఱుపాటులేక యొకయించుక చింతను గాంచకుండెదన్
భామినిదొ సదృష్ట మెది ǂ పాటిలఁజేయునొ యట్లగుంగదా. ౫౭

ఆ. ధర నదృష్టమునకుఁ ǂ దిరుగు సీఁతకు లోఁతు, లే దటన్న నుడికి లేదు బదులు
కాన నట్టులుండి ǂ కాంచెద సర్వంబు, కార్యసిద్ధి దైవకల్పితంబె. ౫౮

క. కుమ్మరపురువట్టులు నే, నిమ్ముని కార్యంబ దెల్ల ǂ నెలమింగనుచం
దమ్మునఁ గాంచుచు నుండెద, నుమ్మలికముఁ బూనఁ గార్య ǂ మొప్పదు దానన్.

క. అని తలఁచి యుత్తమాంగం,బున నమ్మునీంద్రువాక్యములను దాలిచి యి
ట్లనియెం బిలిపించెద నా, తనయను హితబోధ చేయఁ ǂ దగుదురు మీరల్.

చ. అవినయమూన దింతయు మహాత్ములఁ గాంచిన సంతసించు వా
రవితథవాక్కులంచుఁ గొనియాడు నదేముపదేశ మిచ్చినన్
బ్రవిమలవేదవాక్కులుగ ǂ భావనచేయును గాన నిర్జర
ర్షివర! యనుగ్రహంబునకుఁ ǂ జేడియ పాత్రగ నెన్ను మీ మదిన్. ౬౧

ఉ. ఏ ముపదేశమిచ్చెదవొ ǂ యెవ్విధి నాదుహితృస్వభావమున్
వే మరలింతువో య దెటు ǂ విష్ణువు నెమ్మది నింతయేని నా
పై మరియాద తప్పనటు ǂ పన్నుగడల్ తగఁ బన్నువాఁడవో
యే మెయి నీమహోత్సవ మహీనపథంబున సాగఁజేయుదో. ౬౨

ఉ. అన్నిట నిన్నె నమ్మి మరియాదలఁ గాంచఁ దలంచినాఁడఁ బా
ల న్నను ముంతువో జలము లన్నను ముంతువొ నీదె భార మీ
వన్నిట నేప్పు కాఁడ నని ǂ యాత్మ నెఱుంగుట విశ్వసించితిన్
సన్నుతమై చెలంగునటు ǂ సల్పుము కార్యము మౌనిచంద్రమా! ౬౩

ఉ. ఒక్కతె యున్నదిప్పు భవనోత్తమమం దని వింటిఁగాన మీ
రక్కడ కేగుదెంచు టది ǂ యాత్మకు మంచిగఁ దోఁచు నేని మీ
రక్కటికం జనంగఁ దగు ǂ నాయమ నిచ్చటఁ జేర్పుమన్న నే
నిక్కడ నున్నయట్లె యిపుడే యొనరించెద నన్న మౌనియున్. ౬౪

ఉ. ఇంపుక లోఁదలంచి యిదియే తగినట్టియుపాయ మంచు యో
జించినఁ దోఁచుచున్నయది ǂ చిన్నది యున్నెడ కేనుబోవుటే

మంచిది కూడరమ్ము తగుఁ మాటల నాయమఁ దేర్చి యెట్టులేఁ
గాంచనచేలుఁ గోరునటుగా నొనరించెద నేర్పు పెంపునన్. ౬౯

క. నీరమణీమణి చెంతం, జేరినచో నుత్తమంబు సిద్ధించును శ్రీ
నారాయణు కార్యం బన, నారీతి నొనర్పువాఁడ నని గిరిపతియున్. ౭౦

క. సేవకుల కాజ్ఞ యిడ వా, రావిధ మెల్లన్ వచింప నంతర్గృహమం
దావేశింపం జేసిన, స్త్రీవారము దానిద్వారసీమఁ జెలఁగుచున్. ౭౧

క. తెలిపిరి మేనాంబకు నా, జలజాక్షి కుమారిఁజేరి సంయమిరాకం
దెలుపుచుఁ బూజాద్రవ్యం,బుల సిద్ధముచేయఁ బంచి మునుకొను నెలమిన్. ౭౨

క. పతికిం దెలియంజేసిన, నతులితముదమంది యామహర్షిని గని నా
సుతయును జననీయుతయై, మతిఁ గోరెను మిమ్ముఁగాంచి మాటలు వినఁగన్.

క. అంతగపురమును బావన, మొంతయు సంపద్విశిష్ట మేవేళల శ్రీ
మంతము నగుచున్ సురముని, కాంతేశ్వర! వృద్ధినొందఁగాఁ జేయఁ దగున్.

క. నాకన్యక హృద్భావం, బేకరణిన్ మార్పునొంద నిపుడొనరుప నే
యేకమ్ర వాక్కులను మా, సీ! కడుఁ జోద్యముగఁ బల్కు నేర్తువొ తెలియన్.

క. నీవెఱుఁగని ధర్మంబులు, నీవెఱుఁగనిచిత్రవాక్కు లెందేఁ గలవే
పావనమతి! యిపు డేగతి, నావెతలన్ మాన్పుదువొ యనన్ విని మునియున్.

క. చిఱునవ్వు మోమునకు నొక, గఱువతనం బీయ నద్రికాంతా! వినుమా!
గఱిగొఱ లేకుండంగా, నెఱిఁ బల్కెద నీకుమారి నెమ్మిం గనఁగన్. ౭౩

క. సమయోచితహితమితవా,క్సముదయముల మానసంబుఁ గరఁగి రమానా
థు మదిని దలంపఁ జేసెద, హిమవంతా! చూడవయ్య! యీమాటతమున్.

క. లోకజ్ఞానము గలదో, నాకదియే లేదొ యీక్షణంబునఁ దెలియం
జీకాకునొందు నీమది, ప్రాకటముద మొందఁ జేయఁ బాల్పడుదుఁ జుమీ. ౭౪

క. కనుమూసి తెఱచునంతట, వినఁ జాలుదు వాకుమారివృత్తాంతం బం
చును బల్కుచు నంతఃపుర,మును జొచ్చెను నిర్జరేంద్రముని తమకమునన్.

చ. మునిపతిరాకఁ జేడియలు ముందుగఁ దెల్పఁగ మేనకాంబ య
ర్చన లొనరింప వస్తుతతిఁ జయ్యనఁ జేకొని పోయి వందనం
బును దమిఁజేసి యర్ఘ్యముఖపూజనముల్ పొనరించె మేనకాం
బను గరుణైకదృష్టిఁ గని భద్రము లబ్బఁగ నిచ్చె దీవనల్. ౭౫

క. దయచేయుం డని మేనాం,బయు వేఁడఁగ లోనికరిగి భాసురమణిపు
ష్పయుతంబయి మృదుహాటక, మయమగు పీఠమున వేసమానియుఁ బ్రీతన్.

ఆ. కూరుచుండి భక్తి గౌరి వందన మాచరింప నిష్టములు ఫలింపవలయు
ననుచుఁ బ్రీతిమీఱ నాశీర్వదించుచుఁ, గూరుచుండఁ బనిచెఁ గోరికఁగన.

ఉ. మేనయుఁ బుత్త్రిఁగూడి మదిరమించెడుభక్తిని గూరుచుండఁగా
మ్మౌని యనామయం బడిగి । మాధవువార్తలఁ దెల్పఁబూని య
మ్మా! నినుఁజూచి నాఁడుచని । మంచిముహూర్తమునందు శ్రీవిభుఁ
గానఁగఁబోయితిన్ మునుపుఁగాంచని లోక మొకండు కన్పడెన్. ౮౦

శా. అమ్మా! యేమని పల్కువాఁడ మును పెన్నడైనన్ వినన్ రానిదై
సమ్మానింపఁగ నగ్రగణ్యమయి ప్రాంశుచ్ఛ్రిత్నసౌధావళిన్
సమ్మోహావహ చిత్రగేహవితతిన్ । సంస్తుత్యమై నూత్నలో
క మ్మొక్కండు కనంబడెన్ మదిని నిక్కం బంచు నూహింపుమా. ౮౧

చ. స్తుతి యిదిగాదు నామదికిఁ । జోద్యముగాఁ గనుపట్టె నద్ది య
ప్రతిమము సర్వలోకముల । పైదని చెప్పఁగనొప్పుఁ దన్మనో
జ్ఞత యిటులుండు నంచు నల[1]చక్రివిభుండును బద్మజాసనుం
డతనికళత్త్రముం బలుక । నర్హతనొంద రటన్న న్యాయ్యమే. ౮౨

మ. పరికింపంగ వినూత్నమే యనుటయే । స్పష్టంబుగా నయ్యెన
చ్చెరువుం బొందితి మున్నదెన్నఁడయినం । జెప్పంగ నేవిన్న య
ట్లరయం దోఁపకయుండెఁ జొచ్చితిని ధైర్యంబూని యెట్లో తదం
తరమం దోగిరిజా! మనోజ్ఞతమసౌధం బొందు గానంబడెన్. ౮౩

ఉ. అందుఁ గలట్టిరక్షకులె । యాదరు సిద్ధతపస్విలంచుఁ దోఁ
చెం దరుణీమణీ! వినుము । చెప్పెద లోపలి కేగునంత శ్రీ
మందిరుఁ డక్షియుగ్మము సమస్తశుభంబులఁ గాంచునట్టిదా
చందమునం గనంబడియె । సాధుజనావనదీక్షు యేర్పడన్. ౮౪

చ. చరణములందు వ్రాలి వనజప్రభవాత్మజ! కావవయ్య! యా
దరమున నంచుఁ బల్కితిని । దానవసూదనుఁ డంత నాపయిం
గరుణను మట్టిసాఁచి దయఁ । గాచెద లెమ్మని లేవనెత్తె నో
తరుణి! యదేమిచెప్పుదు నతం డొనరించిన యాతిథేయమున్. ౮౫

ఉ. నారద! నీప్రయత్నము వినం దలపోసితి నింతలోన నీ
చారుతరోక్తులన్ వినఁగఁజాలు నదృష్టముగల్గెఁ బల్కుమా
మూరత మెప్పుడో జతనముల్ పొనరింపఁగఁ గాల మున్నదే
నీరజసంభవాదుల కనింద్యచరిత్రుల కీవె తెల్పితే. ౮౬

మ. అని యేమేమొ దయాంతరంగమున నన్నా శ్రీవిభుం డెంతొ మో
మునఁ జూపస్మిత మట్టి సర్వ సకలంబున్ దానె యైయుండి య
జ్ఞునిపోల్కిన్ దగి ప్రశ్నచేసె వినుమీ । క్షోణీధరేశాత్మజా!
మనమం దెంచితి నీతలంపు నదియే మాత్రంబు బాగుండమిన్. ౮౭

---

1 చక్రివిభుండు = ఆదిశేషువు, పద్మజాసనుఁడు = బ్రహ్మ.

శ్లో. మోమోటంబును మాని పార్వతియు మిమ్ముం జేకొనం బూనె నం
చే మేమో వచియించితిన్ సమయ మెంతే మోదముం గూర్పటన్
శ్రీమంతంబుగ దోచుటన్ హరియు దా చిత్తంబునం బొంగిన
ట్లే మోముం గని నిశ్చయించితిని జామ్మీ పల్కు లింకేటికిన్. ౮౮

శా. ఆసంభాషణముల్ సమగ్రముగ నీకావింప నే జెప్ప నె
న్నో సంవత్సరముల్ చనున్ గనుక నే నొక్కింత సారార్థము
ల్లాసం బెంతయు నెమ్మనంబు బురికొల్పం బల్కితిన్ జాలదే
యోసుభ్రూ! సుముహూర్తనిశ్చయము చేయుంగాక నీతండ్రియున్. ౮౯

క. వినవే "శుభస్య శీఘ్ర", మ్మనుసూక్తిని పార్వతీ! సుధాశను లెల్లన్
మనముల నువ్విళ్లూరుచు, గనులారం గాంచకోరికల్ పొలయంగన్. ౯౦

క. ఎపుడా సుముహూర్తము దెల్పుపత్త్రికయు గానబడునొ హా జనుభూ
ధ్రపతికుమారిక పెండ్లికి, దపనీయమణీకలాపశతతి గొని యనుచున్. ౯౧

క. కని పెట్టియున్న వారి,కనియంతయు నిర్వహించుభారము నాదే
యనవచ్చు నోతలోదరి!, వినిపింపుము యింకనైన విమలాశయమున్. ౯౨

ఉ. నీముఖపద్మవిచ్యుత వినిర్మల వాగమృతంబు గన్నయు
గ్మామలమార్గమూలమున నాత్మను దృప్తిని గాంచ జేయుగా
కో మహిళామణీ! యనిన నొయ్యన మేనయు బుత్త్రితోడ న
మ్మా! మునిపల్కు లెంతయును హర్షము నింపెడు మాకు నిచ్చలున్. ౯౩

చ. వలయునటంచు మాని బహుకాలము లెచ్చటికేగుదెంచి నీ
వలన సరోజనేత్రునకు బాంధవముం గలిగించి మమ్ము వ
ర్థిల నొనరింపబూనెను మఱి దలపోయక నీమనంబునం
గల యభిలాషముం దెలుపు కాంతుసు బూనక యుండు టొప్పునే. ౯౪

చ. జనకుడు నీతలం పెఱుగజాలక చింతల గుందుచున్నవా
డన నిక నాదుమాట యిటులంచు వచింపగనేల? నీతలం
పును విని వస్తువారముల బొందుగ గూరిచి బంధువారముల్
దనియగ బెండ్లిచేయ దగ దా నెద గోరెడు నీదుతండ్రియున్. ౯౫

ఉ. ఆతడు చిన్నవాడ మునియాటలమొందగ నింతదాక నీ
చేతమునందు గల్గునది చెప్పక దాచగ నేల తల్లిరో!
యీతడ నైన దేటపడ నీయది యిట్టు లటంచు బల్కు మా
చేతములెల్ల జల్లపడ జేయగదమ్మ సరోజహాసనా! ౯౬

సీ. శ్రీసమృద్ధియు సుఖస్థితియు సౌందర్యరేఖయు సకలారోగ్యభాగ్యము వాస్త్వ
శాసదత్వమ్ము సంస్తవనీయవిద్యయు దివ్యహర్మ్యములును భవ్యసుఖని

వాసమ్ములగు సుపవనములుఁ గేళీమహీధ్రముల్ గాయకు ఽ లెన్నొ దాస
దాసీజనములు సు ఽ త్తమప త్తనంబును వ్యోమయానమ్ములు ఽ ను త్తమతమ

ఆ. రత్నభూషణములు ఽ రమ్యయశగకీర్తు, లిట్టి వింకఁగలుగు ఽ నట్టి వెన్నొ
చెలఁగుచుండ సుండు ఽ చెలువుఁడె కాంతకుఁ,దగిన మగఁ డటంచు ఽ దలఁపవలయు.

క. అమ్మా! యిన్నియు నొకచో, నెమ్మెయిఁ దగియుండు నంచు ఽ నెంచకుమా సౌ
ఖ్యమ్మున నుండం గోరిన, సమ్మాధవుఁ గోరికొనుమ ఽ యన్నియు నుంటన్. ౯౮

ఉ. ఆమహనీయుఁ డల్లుఁడయి ఽ హరివిమానము నెక్కి నిర్జర
స్తోమముగొల్వ నిచ్చటికి ఽ సొంపుగ రాఁ గనులారఁ గాంచఁగా
నోములు మేము పూర్వజని ఽ నోచియొయుండిన నీదు మానసం
బామురవైరిఁ గోరుకొను ఽ నంచుఁ దలంతుము సర్వకాలమున్. ౯౯

క. మా పూర్వజన్మసుకృతం, బాపాటిది గాకయున్న ఽ నన్యుఁడు నీకుం
జూపరిగాఁ గన్పడుఁజు,మ్మీ! పంకజనయన! మాట ఽ లింక వేయేలా. ౧౦౦

క. ఈవిషయంబుల నెల్లన్, భావింపుము నీదుమదిని ఽ బర్వతనాథుం
డేవిధమున నీకార్యము, వేవిధముల సమ్మతించు ఽ విబుధు లలరఁగన్. ౧౦౧

క. హితముల వీనిం గఱపుట, మతివిభవము గల్గియుండు ఽ మానిని వగుటన్
బ్రతిఫలము చక్కనగు నను, విత మాత్మం దోఁచుటనె వి ఽ భీతమృగాక్షీ! ౧౦౨

క. తలపోసి సుంత మదిలోఁ, బలుకుము "యిదమిత్థ" మనుచు ఽ బార్వతి! యనఁగాఁ
దలఁపులు ప్రతివచనమ్మును, బలుకన్ వలదనుచుఁ బట్టు ఽ పట్టుటకతనన్. ౧౦౩

క. ఏమియుఁ బలుకక గిరిజయు, మోమ మఱవంచుటయు దాని ఽ మునివర్యుండున్
హైమవతీజననియుఁ దమ,వౌమదులన్ జేలస్వాశ ఽ యంబుం దెలుపన్. ౧౦౪

క. మందాక్షమ్ముపడ వం,చెం దనముఖపంకజంబు ఽ స్త్రీజనసహజం
బుం దెలుపఁజాలుదానిని, ముందటిభావంబు దెలుపఁ ఽ బూనదుగాదే. ౧౦౫

క. అని నిశ్చయించుకొని రా,తనుజాతం దల్లి తనదు ఽ దాపునకుఁ దటా
లున రాఁగఁ దిగిచి మస్తం,బును దువ్వుచు మూరుకొనుచు ఽ మోదాశ్రుతతుల్.

క. పుత్త్రీరమునఁ బడఁగా, నీత్రప నీ కేటికమ్మ ఽ హృదయంబున నే
పాత్రునిఁ గైకొనఁ దలఁచితో, యీ త్రిజగములందు నెద్ది ఽ యేఁ గోరుదువో.

చ. తలఁచినయంతలోపలఁ బదార్థ మదెట్టిదియైనఁ జేర్పఁగాఁ
గల జనకుండు గల్గ నెది ఽ కాంక్షయొ తెల్పక సిగ్గుపెంపునం
దల యిటువంచి యూరక వి ఽ తాకుపడం గత మేమి? తల్లిరో!
పలుకు మటన్న నేమియును ఽ బల్కక ప్రాన్పడినట్టు లుండఁగన్. ౧౦౮

ఉ. మానియు నావిధంబుఁ గని ఽ మన్నన యొంతయుఁ దోఁచునట్లుగా
మేనను జూచి పల్కె నిటు ఽ మించినలజ్జను గూరియున్న యీ
మానినిచి త్త మెంతయును ఽ మాఱినదంచుఁ దలంపనయ్యె నిం

కైనను సంశయం బుడిగి యత్నము చేయఁగవచ్చుఁ బెండ్లికిన్. ౧౦౯

చ. తనమది శ్రీపతిం దవిలెఁ దప్పొనరించితిఁ బొత్తనంచు నీ
మన కెఱిఁగింప జంకి తనమస్తక మొయ్యన వాల్చెఁ జుమ్ము నీ
తనయను బల్కరింప కిఁకఁ దన్మహయత్నముఁ జేయఁబూన్పుమా
యనుపమరీతిఁ బెండిలి యహా! యనునట్లు లొనర్పఁగాఁ దగున్. ౧౧౦

ఉ. శ్రీవిభుఁ డల్లుఁడై సురలుసిద్ధులు సాధ్యులు కిన్నరోత్తముల్
దేవవిభుండు తక్కఁగల దిక్పతులున్ విధిముఖ్యులున్ మునీం
ద్రావళి తన్నుఁగొల్వ ముదమారఁగఁ బెండ్లికిఁ దర్లిరాఁగ నీ
వే వరవర్ణినీ! కనుదు వెంతయు వేడుకపిచ్చులింపఁగన్. ౧౧౧

ఉ. కన్నులు రెండుగాఁగ విధి కల్పనచేయుట తెల్వి లేమి నే
మన్న వినోదముల్ గనెడునప్పుడు వానిని వృద్ధిచేయుశ
క్తి న్నెఱి నిచ్చియున్న నదె తెల్వియనం జనుఁగాదె యీమహా
బన్న నపూర్వమా ననుచు నాత్మఁ దలంతువు నీవె సువ్రతా. ౧౧౨

ఉ. ఎన్నిగృహంబులున్న నికనెన్నియొ కావలెనంచుఁ దోఁచు నా
వెన్నునిరాక యిట్టిదని వేయిశిరంబులు గల్గు శేషుఁడే
యెన్నఁగఁజాలఁ డన్న మఱియెవ్వఁడు శక్తుఁడగుం త్వదీయభా
గ్యోన్నతి యెట్టిదో తెలుప నోపుదునే యిటు రిత్తమాటలన్. ౧౧౩

ఉ. తల్లిని దండ్రిఁ జేడియలఁ దాఁ బ్రియబంధువులన్ నిరంతరం
బెల్లవిధంబులన్ దనుపనెంచిన నీసుత శ్రీనికేతనున్
వల్లభుగాఁగఁ గోరె వనవచ్చుఁ గదా హరిణాయతేక్షణా!
యుల్లము పల్లవింపఁ బతినుద్యమ మూనఁగఁ బ్రోత్సహింపుమా. ౧౧౪

చ. తనయహృదంబుజాతము నితాంతము మెత్తని దెంతకే శ్రమం
బునకు సహింపఁజాలదు తపోవిభవంబును గన్నదౌటనో
య్యనఁ దనయంత మేలుకొని యాత్మవిభున్ వరియించునంచుఁ వ
జ్జనకుఁడు వేచియుండుట ప్రకటంగవశంబున నే నెఱింగితిన్. ౧౧౫

ఉ. అన్నులమిన్న యాహా యిటులంచు హృదీశున కిష్టు దెల్ప సౌ
ఖ్యోన్నతి నొందఁజేసి తొరిరయెప్పఁ బ్రయత్నము చేయఁబూన్పురే
వన్నది నేఁడుచేయఁదగు నంచుఁగదా జను లాడుచుందు రీ
కన్నిట నేర్పుగల్గుటఁ బ్రయత్నమునం బది చూడఁగాఁదగున్. ౧౧౬

తే. కంజనేత్ర "శుభస్య శీఘ్ర"మ్మటన్న
నానుడిన్ వినియున్నదానవని నమ్మి
నాఁడఁ గావున నద్దాని నావిషయము
నను ఫలింపఁగఁ జేయుమా నయము మెఱయ. ౧౧౭

చ. ఇఁకఁ బలుమాటలేల? హరిణేక్షణ! పెండ్లిప్రయత్నమెంతో వే
డుక నొనరింప నెల్లరు కడుంగడు మెచ్చఁగలారు నేను గౌ
తుకము భరింపరామి మదిఁ దొందఱపెట్టఁగ నర్తనంబు స
ల్పక నిలువంగ నోర్తునె యపారముదంబుధి మున్గకుందునే. ౧౧౮

చ. సమయ మదెప్పుడో యనుచు స్వాంతము వేగిరపెట్టుచున్నదీ
యుమయు మదుద్యమంబు ఫలమొందఁగఁ జేయఁదలంచె నింక వ్య
ర్థముగను గాలముం గడుప రాదుగదా తొరఁబూని సర్వయ
త్నము లొనరింపఁగాఁ దగువిధంబునఁ జేయఁగఁ బూనుటొప్పఁగా. ౧౧౯

ఉ. ఇంతకు ముందుఁ బెండ్లికయి యేను బ్రయత్నము చేయకుంట నీ
కింతగఁ జెప్పఁగావలసె నిట్టివి మీ రొనరించియుండుటన్
జింతలపాలుగామి నిటు చెప్పుట యేటి కటంచుఁ దోఁచుటల్
వింతలుగావు గాని నను వేఁచెడునీపరితాప మార్పఁగన్. ౧౨౦

చ. త్వరపడు టొప్పఁజుమ్ము వనితామణి! యీవిధమెల్ల నెంచి శ్రీ
వరునకుఁ బెండ్లిపత్త్రికను బంపుటకై పతి వేగిరింపు మీ
తరుణము సర్వమంగళనిధానము గావున నానిమిత్తమై
ధరణిధరేంద్రు యత్నపరతంత్రునిగా నొనరింపుమా దమిన్. ౧౨౧

ఉ. నేనును భూధరేంద్రునకు నీదుహితృప్రియకాంక్షఁ దెల్పఁగాఁ
బూని చనంగనెంచెద విభుం బురికొల్పఁగ నీవె యర్హ వం
చేను దలంతునంచుఁ దొర నెంతయుఁ బల్కులతోట్రిలంగ న
మ్మౌని వచింపఁగా విని హిమక్షితిభృత్సతి యెంతో వేడుకన్. ౧౨౨

ఉ. ఓమునివర్య! నీనుడుల నొప్పుగ మౌళిధరించి యిప్పుడే
మే మొనరింపఁగాఁదగునొ యెట్లు విభూతికి నీడుసేయనౌ
నో మఱియాదఁ గాంచుటులో యటులే జతనం బొనర్పఁగా
భూమిధరేంద్రు వేఁడుకొని పూన్చెద యుష్మదభీష్టసిద్ధికాన్. ౧౨౩

క. మీయాశీర్బలమున నే, యీయత్నము సాధుఫలదమే యగునంచున్
బాయని విశ్వాసమున ము,నీ! యెదనమ్మితిని భర్తృనిశ్చయ మిదియే. ౧౨౪

క. ఇదె పోయెద నానాథుని, మదినిం బురికొల్పెదను రమానాథుని బు
ద్ధి దమింబొంపఁగ యత్నం, బిదె సాగునటంచు నమ్ముమీ సురమౌనీ! ౧౨౫

చ. అని వచియించి దేవముని సల్లన వీడ్కొని పుత్త్రివాంఛితం
బును మునిపల్కినట్టి దని బుద్ధిని నమ్మి మహాముదంబు నె
క్కొనఁ బతిచెంతకేగె; మునికుంజరుఁ డుత్కటహర్షపూర్ణుఁడై
చని హిమభూధరేశ్వరుని సన్నిధి నుండె ముదబ్ధి మున్గుచున్. ౧౨౬

ఉ. మేనయు భర్తృదర్శన మహామేయఫలప్రద మంచు నెప్పుడున్
దా నెదయందు నెంచు ప్రమదామణి గావున దాని కర్హమౌ
పూనికఁ జార్వలంకృతిని బొల్చుచు రాజమరాళయానమున్
గానఁబడంగ వచ్చెఁ జెలికత్తెలు ముందటఁ ద్రోవఁజూపఁగన్. ౧౨౭

చ. మునివరసంయుతుండయి ప్రభూతముదంబునఁ బెండ్లిమాటలన్
దనజతనంబుఁ దేటపడఁ దానయి చేయుచు మౌనివాక్కులన్
విన శ్రుతియుగ్మముం బనుచు వీతకళంకుని నాథుఁ గాంచి యొ
య్యనఁ జని నిల్చెఁ బార్శ్వమున హారిహిరణ్మయయంత్రపుత్త్రినాన్. ౧౨౮

చ. జతనము దేనిఁబూన మదిసంతసమందుచు నున్నవాఁడొ త
త్ప్రతిఫల మట్లు తోఁచిన నితంబిని మిన్నను గాంచి సంతసం
బతిశయమై చెలంగఁ దనయంతికమందును గూడఁ జుండ నం
చితకరసంజ్ఞ చేసి సతి చెంతను మెల్లఁగఁ గూడుచుండఁగన్. ౧౨౯

ఉ. దేవమునీశ్వరుం డరుగుదెంచినకార్యము వింటివే తనూ
జావిషయంబునం దిఁకఁ బొసంగఁగఁ జేయు నదెద్ది యంచునీ
వోవరవర్ణినీ! దలఁచితో కో యదెద్దియొ తెల్పుమా వినం
గావలతున్ ముదంబొసఁగఁగల్గు నటన్న మహాశయుబ్బుటన్. ౧౩౦

ఉ. నారదుఁ డేగి పుత్త్రిక మనంబునఁ గల్గినకోర్కెయిట్టి దం
చారసి వచ్చి తెల్పుననునాస మదెంతగఁ బ్రోత్సహింపఁగా
నోరమణీ! తలంచునను నొక్కట హర్షమహాబ్ధిముంపఁ జే
కూరెను నీదురాక మదిఁగొంకక తెల్పుము తత్ప్రవృత్తులన్. ౧౩౧

చ. అనుటయు మందహాసము ముఖాంబుజమం దొకవింతకాంతి సం
జననము నొందఁజేయ మృదుసాధువచస్సుల నిట్లు తెల్పెఁ గూఁ
తునభిమతంబు; దేవమునిధూర్జటి రాకకు సంతసిల్లె మ
న్నన లొగిఁజేసి నేనును గనంగఁ దదంతికమందె యుంటిటన్. ౧౩౨

చ. పరమకృపాబ్ధి సాధుజనభద్రదుఁ డ శ్రీహరి సమ్మతించున
క్కరణిని దెల్పెఁ జిహ్నములఁ గన్నియ; మౌనియు సంతసిల్లినీ
కు రమణివాంఛఁ దెల్పుటకె కోరి ననుం ద్వరపెట్టె నింక స
త్వరమ వివాహయత్నము నితాంతము చేయఁగ నొప్పుఁగా విభూ! ౧౩౩

ఉ. శ్రీవిభుఁ డల్లుఁడౌనఁట యశేషవిభూతిని బొల్పుమీఱునా
దేవత లాతనిం గొలిచి తృప్తి నొసంగఁగ వత్తురంట యొం
తోవిభవంబు మించఁ దమి యొప్పుగ నెమ్మది సందడింప నే
హావళి లేర్పఱింపఁ దగునయ్యయిచోటుల నవ్వ మాగటన్. ౧౩౪

ఉ. వచ్చెడువారికెల్లరకు వస్త్రవరంబులు సర్వవస్తుసం
పచ్చటులంబులై తనరుభంగి నొనర్పఁ దగుంగదా యికం
బొచ్చెము లేని ప్రీతి మెయి భూధ్రవరా! సకలప్రయత్నముల్
మెచ్చుకొనంగఁ జేయఁదగు మిక్కిలి గారవ మబ్బు దాననే. ౧౩౫

చ. అని తనుమధ్య పల్కవిని యాహిమవద్గిరివర్యుఁ డెంతయున్
దనమది సంతసిల్లి మునితల్లజుఁ గన్గొని దోసిలొగ్గి యి
ట్లను దుహితృప్రియంబు చెలువారెడునట్టు లొనర్పువాఁడఁ గా
వున సుతయొప్పిదంబు వినఁబొంగెడు చిత్తము దానిఁ జెప్పవే. ౧౩౬

చ. తొలుత నసమ్మతిం గనినతొయ్యలి యిత్తఱి సమ్మతించి నీ
పలికినరీతి లోకగురుఁ బద్మదళాక్షునిఁ బెండ్లియాడు న
ర్మిలి గను టెంతయున్ మదికి మెచ్చొనఁగూర్చెడు మౌనివర్య! యే
పలుకుల సమ్మతిం దెలిపెఁ బార్వతి వాని నెఱుంగఁ బల్కుమా. ౧౩౭

చ. అని యడుగంగ సుస్మితము హారితరంబుగ వక్త్రరంగమం
దు నటన యొప్పఁ జేయ ముని ధూర్జటి యిట్లనియెన్ గిరీశ నీ
తనయయు లజ్జ పెంపున నితాంతము మౌనము చే నెఱుంగఁ దె
ల్పెను మదుదీరితంబునను బ్రీతియొసంగెడునంచుఁ దేటగన్. ౧౩౮

చ. ఇదివఱ కాహరింగుఱిచి యేఁబలుకంగ నిజాశయంబు స
మ్మదమునఁ దెల్పుచుండు బహుమానము శంకరునందునుంట ని
య్యదనున దానిమాని త్రిదశాధిపవందితపాదపద్ము శ
ర్మదు హరిఁ గోరుచందమును మాటలఁ దెల్పక తెల్పె సన్నలన్. ౧౩౯

మ. తన కిష్టుండగువానిఁ దెల్పుటకు మందాక్షంబు గైకొంట స్త్రీ
జననైజంబుగదా! మహీధరవరా! సర్వేశ్వరుం బ్రాణనా
థునిగాఁ గైకొను టుత్తమం బనుమదుక్తుల్ సంతసంబొప్పఁ గై
కొనుటం దెల్పెను సిగ్గునన్ దనదువాక్కుల్ వెల్వడం జాలమిన్. ౧౪౦

ఉ. ఇంతకుమించినట్టి గుఱు తెన్నఁగ నుండునె వేఱదెద్దియేఁ
జింత యికేల శైలవర! శీఘ్రము పెండ్లిప్రయత్న మెల్లరున్
సంతసమందఁ జేయఁదగు శంకరుఁగింకరు లోఁదలంప కా
వంతయు సంశయింపక మహావిభవంబు చెలంగుచుండఁగన్. ౧౪౧

ఉ. శ్రీవిభుఁడంట దేవపతిసిద్ధమునీంద్రులఁగూడి యల్లుఁడై
గ్రావముఁ జేరవచ్చునఁట కంజభవాదులు పెండ్లివేడుకల్
వేవిధులం గనంగఁ దమభీరువులం దమిఁగూడి వచ్చి నీ
పావనసత్కృతిం గొనెడువాంఛఁ జెలంగుదురంట యద్దిరే! ౧౪౨

చ. ఇఁకఁ బలుకంగ నేల వచియించెద నున్నదియున్నయట్లు నీ
దుకలిమి కర్మమార్గగతిని దోయజనేత్రుని గారవింపనౌ
సకలవిధంబులన్ దమిని సల్పుము మంచిప్రయత్న మిద్దియే
ప్రకటవిభూతికిన్ ఫలము పర్వతనాయక! యెన్ని చూచినన్. ౧౪౩

ఉ. ఇట్టులు గాదె యుండఁదగు నెన్న నదృష్టము లోకమందు నే
పుట్టువునందుఁ జేసితివొ భూరిఫలంబు లొసంగుకర్మముల్
గట్టులఱేఁడ! మూఁడగుజగంబుల మేటిపొగడ్తఁ గాంచి వీ
పట్టున నెల్లదేవతల బాగుగ మెప్పుగనంగఁ జేయనౌ. ౧౪౪

చ. విడుదుల నేర్పఱింపు కనుకవిం బొనఁగూర్చెడునట్టులెల్లచోఁ
బడయఁగ నర్హమైనెగడు వస్తుసమూహము సేకరింపు మె
ప్పు డెవరి కేదియిష్టమయి పొల్చునొ యట్టి పదార్థమద్ది చే
పడెడు విధంబునన్ నిలుపు పల్వుర భృత్యులఁ గార్యపటులన్. ౧౪౫

చ. మునినగు నేను గార్యభరమున్ దెలుపంగ వలంతి నెట్టులౌ
డును మును పెన్నఁడైన సుదతుల్ పురుషుల్ పరమోత్సవాళిఁ బా
ల్గొని యొనరింపఁ జూచుటకుఁ గూడ నొకప్పుడు నోచనైతిఁగా
గనుక నిటుండఁగావలయుఁ గార్యము లంచు వచింతు నెవ్విధిన్. ౧౪౬

ఉ. పుట్టుకనుండి మౌనినయి భూతపతిన్ బరమేష్ఠి శ్రీవిభుం
దొట్టిసుపర్వనాయకుల ధూర్తసురారి మదాపహారులన్
బట్టుదలం గనుంగొనుచు వార్తల లోకహితంబుగోరి యు
న్నట్టులె తెల్పుచుం దిరుగునట్టి సుపర్షిని నన్నెఱుంగవే. ౧౪౭

చ. ధరణిధరేంద్ర! యిట్టిఁడగు తాపసవంశ్యుని నన్నుఁ బెంక్షిదౌ
భరము నెఱుంగనట్టి వనవాసిగణాగ్ర్యుని లోకు లెట్టియా
చరణములందుఁ బొల్తు రనుజాడ నెఱుంగని ఛాందసున్ మహా
త్తరమహమందుఁ జేయఁదగుదానిని బ్రశ్నముచేయఁ బాడియే. ౧౪౮

క. నే నెఱిఁగించినవేవియొ, వానిం దలపోసి మదికి వచ్చినవానిన్
జానుగఁగొని తక్కినయు, వ్వానిం దగనెంచి కార్యతత్పరతం గనుమా. ౧౪౯

క. ఏచెట్టులు చేయందగు, నాదిత్యులు మెచ్చునట్టు లద్దాని నటుల్
శ్రీదయితుఁడు సంతృప్తుఁడు, గాఁదగుగతిఁ జేయవయ్య కార్యం బెల్లన్.

చ. అని మరియొక యుట్టిపడునట్టులుగా వచియించి వేడ్క ని
ట్లను దుహినాచలేశ్వర! మహావిభవంబు ప్రసిద్ధమౌనటుల్
వనరుహపత్త్రనేత్రుఁడు వివాహమునొప్పును గాంచి విస్మయం
బును గనునట్లొనర్పు మిఁక మూపరత మెప్పుడొ తెల్పెదం ద్వరన్. ౧౫౦

చ. కమలభవుండు గీష్పతియుఁ గమ్రసమస్తగుణాకరంబుగాఁ
బ్రమద మొసంగునట్టిదిగ భాసిలు లగ్నము నిశ్చయింతు రా
సమయముఁ దెల్పువాఁడఁ బలుచాతురిమీఱఁగఁ బెండ్లికిం బ్రయ
త్నము నొనరింపుమా మది నితాంతమునన్ ద్వరపెట్టెదుంజుమీ. ౧౫౨

చ. సరసిజగర్భుచెంగటికిఁ జయ్యనఁ బోయెద లగ్ననిశ్చయం
బు రమణఁ జేయఁగోరఁగను భూధ్రవరేణ్య! వచింప నర్హమా
నసన మదాశయంబుఁ దమివర్ధిలఁగా వినిపించితింగదా
యరిగెద నింక నాకు సెల వాదృతి నిమ్మని మౌని వేఁడినన్. ౧౫౩

ఉ. భూధరపుంగవుండు మదిఁ బుట్టినసందియ మింతయేఁ దనర్
బాధయొనప్పుచుంట మునివర్యన కేమియుఁ దోఁపకుండ నే
గాథనొ చెప్పిపంపఁదగుఁగా యని యోజనచేసి యాత్మలో
సాధకబాధకంబులను శాస్త్రవిధిం బరికించి యిట్లనున్. ౧౫౪

ఉ. నీవయఁగల్గ నెట్టిపనినిం దలపెట్టిన తెప్పపాటునన్
బ్రోడిగఁజేయఁ జాలుదు విభుత్వముగల్గుట నెల్లతావులన్
నావగునాజ్ఞ సాగు మునినాయక! లగ్నము నిశ్చయించి యా
శ్రీదయితుండు మెచ్చునటు చేయుము దాననె పండుఁ గార్యముల్. ౧౫౫

ఉ. ముగ్ధకుమారి చక్రిఁగొనఁ బూనె నటంచు వచించినట్టి యా
సుద్ది నిజంబెయన్న తమసూనృతవాక్కులె నమ్మినాఁడ న
మ్ముద్దియ యొల్లకుంటఁగద పుట్టె మనోవ్యథ యింతదాఁక ని
ష్డద్ది తొలంగఁ గానఁ దగునట్లు ప్రయత్నము చేయఁబూనెదన్. ౧౫౬

ఉ. నీనుడియొక్కఁడే ఋతము నెమ్మిని గల్గఁగఁజేయునంచు నా
మానసమందు నమ్మి సురమండల మెంతయు సంతసింప నా
చేనయినంతదాఁకఁ ద్వరఁ జేయుదుఁ బెండ్లిప్రయత్న మిందు నే
డే నొకలోటు కల్గకయె యిప్పని సాగ నొనర్తు నారదా! ౧౫౭

ఉ. కూఁతుమనోగతం బెఱుఁగఁ గోరఁగ మానితి నీనుడిన్ శ్రుతి
వ్రాతముగాఁగ నెంచితిని వచ్చునె దీనికి లోప మంచు నా
చేతము నమ్మియున్నయది చెప్పెడిదేమి ముహూర్త మిప్పుడం
చేతఱి నాకుఁ దెల్పుదువొ యేమఱ కన్నియుఁ గూర్తు మౌనిపా! ౧౫౮

ఉ. అన్నిభరంబులున్ భవదహార్యమనోబల మాశ్రయించియే
యున్నవి కాని నావయిని నొక్కటి నిల్వఁ దరంబుగాదు సం
పన్నుఁడ వన్నిటన్ త్రిదశపాలకపూజిత! భక్తవర్య! నీ
వన్నదిమాట పాడినది యాఁ దగుపాట యటంచు నెన్నుమా. ౧౫౯

ఉ. ఏమని యానతిచ్చెదవొ । యేవిధి నేనిఁ జేయఁ బూన్చెదో
యోమునినాథ! యక్కరణి । యొప్పని చేసెద వేలుమాట నే
నేమెయిఁ బల్క వేలుపని । యెద్దియుఁ జేయఁదలంప నీవెకా
యీమహ మెల్లభంగుల సురేంద్రముఖుల్ గొనియాడఁ జేయఁగన్. ౧౬౦

ఉ. పేరున కేను గార్యమును । బెంపువహింపఁగఁజేయ నీవు చే
కూరిన భాగ్యయోగమునఁ । గూడితి మీయెడఁ గన్యకామసం
బారసి తెంచుఁ బల్కితిక।దా పలుమాట లిఁకేల పెద్దవై
శ్రీరమణుండు మెచ్చునటు । చేయుము యత్నము నేను దోడ్పడన్. ౧౬౧

ఉ. జ్ఞానిగణేశ్వరుండయిన । సారసగర్భునినోట లగ్న మి
ష్టా ననుమాట వెల్వడిన।యంతన శిష్యుని బంపవయ్య యో
మౌనివరేణ్య! సుంత యను।మానము లేక వివాహవస్తుసం
తానముఁ గూర్చి మిమ్ములను । దార్కొన సిద్ధముగాఁగ సుండెదన్. ౧౬౨

ఉ. గేహవరంబు లెల్లరకుఁ । గీర్తిదముల్ గను దోఁపఁజేయ సు
ద్వాహవిధానముల్ త్రిదశ।తల్లజు లెల్లరు మెచ్చునట్లు నా
యూహ చెలంగఁ గూర్చెద నొ।హో యని మౌనులు సన్నుతింప స
న్నాహము లొప్పఁజేసెదను । నారద! నీవగు మెప్పు గాంచెదన్. ౧౬౩

ఉ. కన్నియమాట నీయడి।యోగాని య దెవ్విధి నాదిగా దటం
చెన్నియె యిట్లు పల్కితి న।హీనవిభూతిఁ బ్రయత్న మేను నీ
యెన్నినరీతి నేవిషయ।మేఁ గొఱఁతం గనకుండఁ జేయువాఁ
డ నన్నుఁగూర్చి సుంతయు నె।డంద విచారము నొందఁ బోకుమా. ౧౬౪

ఉ. నాయెడలోప మింతయుఁ గ।నంబడకుండఁగఁ జూచుకొందు న
బ్జాయతనేత్రయాశయము । దారయుభారము నీవటం చొగిన్
వేయివిధంబులం బలుక । వేసటనొందను జమ్ము వేగమే
యాయజునంతికంబునకు । నర్మిలిఁ బొమ్ము మహర్షిచంద్రమా! ౧౬౫

చ. స్మితముచెలంగ నివ్విధిని । జెప్పఁగ నారదుఁ డాత్మఁ గౌతుకం
బతులితరీతి మించ నిపు । డంబుజసూతిని గానఁబోయి శ్రీ
పతికి వివాహలగ్నము శు।భప్రదమై తగునట్లు కూర్పుమ
ప్రతిమవిభూతిఁ బెండ్లికి సు।పర్వులు వత్తు రటంచుఁ బల్కెదన్. ౧౬౬

చ. సరసిజసూతి చారుగుణ।సంపద నొప్పు ముహూర్త మెంచి శ్రీ
వరునకు నీకుమారికకు । [1]భద్విజరాజబలంబు లుండఁగా
గురుకవిముఖ్యఖేచరుల।కుర్వ బలముల్ చెలువారునట్లు [2]ఖే
శ్వరబల మొప్పఁ జెప్పిన జ।వంబున నీకు నెఱుంగఁజేసెదన్. ౧౬౭

1 భద్విజరాజబలంబులు = తారాచంద్రబలములు. 2 ఖేశ్వరబలము = లగ్నాధిపతిబలము.

చ. కమలదళాక్షునిం గనఁగఁ గ్రక్కునఁ బోయి సువార్తఁ దెల్పి ల
గ్నమునకు నెట్టివిఘ్నములు గల్గకయుండఁ బ్రయాణయత్న మా
యమరులుచేయఁ బూన్చెద మహార్షులతో హరిఁగూడి వచ్చెదన్
హిమగిరివర్య! నీపనులనెల్లను సిద్ధముచేసి యుండుమా. ౧౬౮

ఉ. ఎత్తఱి మంగళధ్వను లవెంతయు దూరమునుండియే భవ
చ్చిత్తము పల్లవింపఁ దమిఁ జెంద వినంబడు నప్డె నీవు న
త్యుత్తమబంధురాజిఁ గొని యుత్తమరత్నవిభూషణాళితో
వత్తువుగాక లోకసమవాయపతిన్ గొనిరాఁగ వేడుకన్. ౧౬౯

మ. మరియాదల్ వచియింపనేల యిఁక నోశైలాభృద్వరేణ్యా! శచీ
వరముఖ్యామరనాథులన్ మునితతిన్ బ్రహ్మాదులంగూడి యా
హరి రా నెట్లు చరింపఁగావలయునో యట్లే కడున్ శ్రద్ధతోఁ
జరియింపం దగు నంచుఁ దెల్పెదను వాక్చాపల్య మొప్పారుటన్. ౧౭౦

మ. తనయంగూర్చి విచార మింతయును జిత్తంబందు నూల్కొల్ప కీ
పని మేమానొకొ యంచొగిం గలవరంపా టొందఁ కింకన్ మనం
బున నుత్సాహము పొంగ యత్నముల నింపుల్ గుల్కఁ జేయం దగున్
జనువాఁడన్ సెలవే యటంచు మదిలో సంతోష మొప్పం జనెన్. ౧౭౧

చ. కరమునఁ దాళశబ్దములు క్రమ్మ తరోంకృతినాద యుక్తిమైఁ
బరఁగ విపంచికాస్వనము పంకజలోచనుఁ బ్రీతుఁ జేయఁగా
సరిగ "మురారి కృష్ణ పరమాత్మ నిరంజన సాధురక్షకా
పరమకృపాసముద్ర" యని పల్కుచు మోదసుధాబ్ధి మున్గుచున్. ౧౭౨

చ. తనజతనంబు పండెనని తాఁ దనలోనన యెంచుచున్ రమే
శుని ముద మొందఁ జేయఁదగుఁ జొప్పిదెగా యని నిశ్చయించుచున్
వనరుహసూతిఁ గాంచి త్వర భద్రము లొందఁగఁ జేయు లగ్నమున్
మనమున నెన్ని తెల్పు మట త్న్మాధరవర్యుఁడు వేచియుండెడున్. ౧౭౩

క. తెలుపంగ వలయులగ్నము, జలజాక్షుఁడు పెండ్లికొఱకు శక్రాదిసురా
వళి నిన్నుఁగూడి చనఁగా, నెలమిం గనఁజేయవలదె నెల్లర గిరియున్. ౧౭౪

క. కనుకన్ హిమగిరికడకుం, బనుపంపగు దూత నొకనిఁ బ్రాల్మాలక యం
చును దెల్పె తొందరించెద, వనజాసను నతఁడు తెల్పువాఁడు లగనమున్.

క. పరమక్షేమాస్పదమై, నిరుపమమై లగ్నశుద్ధి నెగడు జగమునన్
హరముఖులు విస్మయంపడ, జరగు ముహూర్తంబు దేవసన్నిధి వేడ్కన్.

చ. అని తలపోయుచుం జనియె నంబుజగర్భుని చెంత కంత స
న్మునులును దేవవర్యులును నూత్నమహోత్సవ మొప్పఁ దన్నుఁ గొ

ల్వ నలరు దేవసత్తముని బ్రహ్మ యనంగఁ బ్రసిద్ధిగన్న వే
దనికరవక్త్రునిం గని ప్రదక్షిణపూర్వకవందనంబులన్. ౧౭౭

చ. నిరుపమభక్తిఁ జేసి పదనీరజయుగ్మము గాంచుచుం హృదం
తరమునఁ బెండ్లిమూరుతముఁ దాఁ దలపోయుచునుండె; నంత నా
సరసిజసూతి దేవమునిసత్తముభావము లోఁ దలంచి శ్రీ
హరిదగు భావమెంచి స్మితమాస్యమునం జెలువార నిట్లనున్. ౧౭౮

ఉ. మోహమున న్నాతురంపడెడు పోలిక కన్పడుఁ గార్యభార ము
ద్దామముగాఁ బయింబడినఁ దత్తఱ మందుచునున్నయట్లు నీ
దౌ మరియాద దెల్పెడు నయారె యిదేమిటి వింతయంచు నే
నేమెయి నెంచినం దెలియ దుంచుకొనైన సురర్షిచంద్రమా! ౧౭౯

మ. తెలియం జెప్పుము త్వత్సమాగమనరీతిం జక్కఁగా నంచు నా
జలజాక్షప్రియనందనుం డడుగ నాచందంబుఁ దెల్పంగ ని
స్తులమోదంబొగిఁ బైపయిం బొలయఁ దోడ్తో సుస్మితం బంపరిం
ప లలిం బల్కె ముహూర్తముం దెలుపు నాభావంబు నీపైఁ బడెన్. ౧౮౦

చ. త్వరపడి నిశ్చయింపు గిరితల్లజుఁ డెంతయుఁ బొందరింప నీ
పరిసరసీమఁ జేరితిని బద్మదళాక్షుఁడు సంతసింప ని
ర్జరవరు లౌననంగ మునిరాజులు మెచ్చఁగ నేనుగూడ న
బ్బురపడ నంచుఁబల్కుటయుఁ బొంగెడుసంతసముం నటించుచున్. ౧౮౧

ఉ. హాటకగర్భుఁ డిట్టులను నార్య! సురర్షివరేణ్య! యింతలో
బోటిమనంబు మార్పుగనఁ బూనికొ నొనర్చిన నీదుమత్కృతిం
మాటలఁ దెల్ప శక్యమె తుషారమాధరపుత్రిక చిత్తదార్ఢ్యమీ
పాటియె యంచుఁ దోఁచుమిని బల్కితి నవ్విధి నద్ద నిస్పృహన్. ౧౮౨

ఉ. ఇప్పటి నీదుమాటలనె యేర్పడె నామది సంతసంబు నీ
చెప్పినయట్లు లగ్నము సోధించెద; ముంబొకసందియంబు నే
రొప్పఁగఁ దీర్పు మవ్వల ముహూర్తముఁ దెల్పెద నద్రికన్యయే
యప్పరమాత్ముఁ జక్రి మరియాద గ్రహింపఁగ నుత్సహించెనో. ౧౮౩

ఉ. నీవును దల్లిదండ్రులును నీరజనాభునిఁ బెండ్లియాడ నె
న్నోవిధులం గలంగునటు లొక్కమొగిం బరికొల్ప నక్కటా!
యీవిపరీత మెందయిన నింతగఁ జిత్తముగాల్పఁ జూడ నే
దేవిధినైనఁ దప్పదని యెంచి సరే యని యింటి యొప్పెనో. ౧౮౪

ఉ. ఉన్నదియున్నయట్లు మది నొండొకభంగిని దోఁచునేమొ యం
చెన్నక చెప్పవయ్య విని యేను ముహూర్తము నిశ్చయించి నీ

మన్నన గాంచువాఁడఁ బలుకమాట లికేల యనంగ నారదుం
డు న్నగుమోము భావముఁ గడుంగడుఁ దెల్పఁగ నూరకుండినన్. ౧౮౫

చ. వనజభవుండు పే మఱియుఁ బల్కె మునీశ్వర! యూరకుండ నే
లని తలపోయ సందియము నాస్యమునందగు సుస్మితంబు గాం
చినఁ బ్రమదంబుఁ దోఁచెడిని జెప్పఁదగుం దృర మీఱ నన్ని ని
ట్లనియె సమస్తముం దెలియునట్టి ప్రభుండవుగావె యోవిధీ. ౧౮౬

చ. తలఁచినయంతనే ఫలము తానుగ నొందఁగఁ జేయఁజాలు నో
జలరుహసంభవా! ననుఁ బ్రసంగవశంబునఁ బ్రశ్న చేయుటల్
తలఁపఁగ హాస్యభాజనమె తత్త్వముఁ దెల్పితిఁగాదె ముందె యి
మ్ములు సుముహూర్తముం దెలుపు పోయెద శ్రీపతిచెంత కిప్పుడే. ౧౮౭

ఉ. అన్నులమిన్న వారిజదళాక్షుని బెండిలియాడ సమ్మతిం
చె న్ననుఁ జెంతసుంచుకొని చెప్పఁగలట్టినుడుల్ భవిష్యద
భ్యున్నతిరీతియుం దెలిపె నొప్పుగభూధరపత్ని మేన నే
నున్నయటుల్ వచించితి మహోత్తమలగ్నము నిశ్చయింపుమా. ౧౮౮

చ. అనుటయు వింతసర్వాలయ నాత్మఁ దలంచె నితండు మౌనివ
ర్యనిచయమందు మేటియను నాఖ్యను బొందియు నింతవెఱ్ఱియా
నని తలపోయనైతి నిపు డయ్యది నిశ్చయమంచుఁ దోఁచె శ్రీ
శునిదగు నాశయం బెఱుఁగుటచొప్పును గూడ నెఱుంగఁ డక్కటా! ౧౮౯

చ. మలినమనస్కుఁ జేయునొకమాటు వివేకము వృద్ధినొందుచుఁ
వెలయఁగఁజేయు నొక్కతఱి వింతగఁ జింతలపాలుసేయఁగాఁ
దలఁచు నొకప్డు కర్మ మది దానికి సాటి యదే జగంబులం
గలుగదు వేఱుసాటి యనఁగాఁ బొడకట్టదు నాదు సద్దిరే. ౧౯౦

ఉ. ఏరికిఁగాని కర్మగతు లిట్టిదటంచు నెఱుంగరానివై
పారములేని దైవగతిభంగిఁ జెలంగెడుఁ గానఁ గర్మమే
సారెకుసారెకుం దలఁప శాశ్వతమౌ పరతత్త్వమంచు నే
నారసి నిశ్చయించితి మహర్షి యితం డెఱుఁగంగఁ జాలమిన్. ౧౯౧

ఉ. ఐనను వాంఛఁబూని యితఁ డాసుముహూర్తము నిశ్చయింపఁగాఁ
బూనుచుచున్నవాఁడు నను; బొంకెద నించుక దాన దోషముల్
గానసగుంగదా యని నికామభయంబును బొందనేల యే
మైన స్వలాభముం గనఁగ నాత్మఁ దలంచినఁ గల్గు దోషముల్. ౧౯౨

చ. ఇతరుల కెన్నదష్టము లకావ్యాధిఁ గల్గకయుండు దేన ను
న్నతఫలరాజియుం దన కనంతరమైన లభింపకుండు నా

వితమునఁ బల్కువాక్య మది వేయివిధంబుల సత్యదూరమై
క్షితిదగి యుండినన్ గలుగఁజేయదు పాపఫలంబు సుంతయున్. ౧౯౩

చ. వినఁగఁ బ్రియంబుగాఁదగుచు విశ్వనుతింగను సత్యమై చెలం
గినవచనంబె పల్కఁదగుఁ గేవలసూనృతమైన నప్రియం
బనఁదగు నట్టిదైన నదియారయఁగా ననృతంబెయా నటం
చును దనరారున్యాయమిది సూనృతవాక్యమునందుఁ జక్కఁగన్. ౧౯౪

ఉ. ఈవిధ మాత్మలక్ష్యముగ నెన్ని మునీంద్రునితోడఁ బల్కెదన్
శ్రీవిభు చెంత కేగునటు చేసెద నంచుఁ దలంచి యిట్లనున్
దేవమునీంద్ర! నీపలుకు దివ్యము సంతస మబ్బఁజేసె నిం
కేవిధమైన సందియ మోదించుకయైనఁ బొసంగ దాత్మలోన్. ౧౯౫

ఉ. ఒక్కటిచెప్పెదన్ దలఁపు మోముని! నీహృదయంబునందు నే
నిక్కడనుండి మూరుత మదియ్యది యుక్త మటంచు వేడ్కపెం
పెక్కఁగఁ జెప్పినన్ జలజనేత్రుఁ డీయది యాలకించి పెన్
మక్కువనొందునో మఱొకమాట వచించునొ యెట్లు చెప్పనో. ౧౯౬

చ. ప్రతిపద మేమహాత్ములకొ రాజులకో దివిజాళికో గడున్
దితిజులవంక బాధ లొగిఁ దీర్పగరానివి కల్గెనన్న వా
ర్త తనకుఁజేరినంత నవతార మదేభువనంబునందొ య
చ్యుతుఁడు కొనంగ నెంచిన మహాద్భుత మిదెట్లు ఫలింపఁజాలెడున్. ౧౯౭

మ. పనులే విట్టివి లేకయుండు నెపుడో భావింపఁగాఁ జాలువాఁ
డనె మౌనీశ్వర! నీవెఱుంగవొకొ దాక్షిణ్యం బస్మదీయంబు వే
చని పద్మాక్షునిఁ బ్రశ్న చేయుము భవత్స్వాంతంబునం దెప్డు క
న్యను బెండ్లాడు తలంపొ తెల్పుమని; శ్రీనాథుండు నవ్వానికిన్. ౧౯౮

ఉ. ఏమని యుత్తరం బిడునొ యెవ్విధి నిప్పనిఁదీర్పఁ బూనునో
యామెయిఁ జేయు టుత్తమమె యానని తోఁచెడు నాకు నీవునున్
బ్రేమభరంబు దాల్చినను బెండ్లికిఁ బెత్తన మెంతపూనినన్
ధీమహితుండవౌట నొకతేప సుమంత తలంచి చూడుమా. ౧౯౯

క. మునినాథా! లోకంబుల, ననుచుంద్రు "తదేవలగ్న" మని యద్దానన్
గననగు లక్ష్మీపతియం, ఘ్రినళినసంస్మృతియె యదియె కీలకము గదా. ౨౦౦

క. నీ వెఱుఁగవొ యీకీలక, మీవిధమున నుండునను చు నెఱుఁగనియట్టుల్
నావలన వినఁగ నెంచితొ, దేవవిభుం గానఁబొమ్ము తీరెడు మొ యనన్. ౨౦౧

ఉ. ఔననఁ గావనంగఁ దన కప్పుడు తోఁపకయుంట నూరకే
తా నిలుచుండె నారదుఁడు ధాతృమహాశయు మెచ్చినంచు లో

లోనఁ దలంచుచున్ జలజలోచనుపాలికిఁ బోవు టొక్కఁడే
కాని మఱొక్కఁ డెద్దియును । గార్యముగాదను నూహపర్వఁగన్. ౨౦౨

ఉ. మోమొకయించు కెత్తి నలుమోములవేలుపుఁగాంచి నీనుడిన్
స్వామి! ధరించినాఁడఁ దలఁ । జక్రిని గానఁగఁబోవువాఁడ నం
దేమయినన్ ఫలంబలరునే మఱి వచ్చెద లేకయున్న న
ట్లేమునులుండు కానలకు । నేగెద ధీజడిమమ్ము పోవఁగన్. ౨౦౩

చ. తెలియుదు నేను సర్వమును । ధీమహిమంబుగలట్టివాఁడ నం
చలపుచు గర్వయుక్తిఁ దల । కర్మముగానిపనిన్ జగాన ని
ట్టు లొనరుపంగ నెవ్వఁడు గడున్ దిటవొప్పఁగఁ బూనునంచు వే
ల్పులు వినుతింపఁజేయుటకుఁ । బూనితి దైవము నెన్న కాత్మలోన్. ౨౦౪

చ. తగినవిధంబునన్ దలఁచె । దైవము శాస్త్రి యొనర్ప నాకుఁ జ
క్కఁగఁ బనిసాగినట్టులె నిజకామము తోఁచుచు నుండెఁగాని యె
ప్పగిదిఁ దలంచినం జెడెను భంగియె కన్పడ కాశఁ బెంచుచున్
దగి తుద కిట్లు వీఱిడి యితండని దోఁపఁగఁజేసె నక్కటా! ౨౦౫

చ. వెనుకకుఁ బోవ నోయి గత భీతిని ముందున కేగ నూయి నాఁ
జనునుడి సంగతంబయిన చందము నామదిఁ దోఁచె నిప్డు శ్రీ
శునికడ కేగినం గరుణఁ జొప్పడఁ బెండ్లిమువార్త మెడ్డా చె
ప్పినఁ బయనంబుచేయుదును । బెత్తనమంతయు నీదెగా యనున్. ౨౦౬

చ. గిరిపతిచెంతకుం జనినఁ । గేవలభక్తి నమస్కరించి యు
త్తరు వెటువిత్తురో యటు పదార్థము సిద్ధమొనర్తు నేవి యె
క్కరణి నొనర్పుమన్నఁ గుతుకంబున నట్లె యొనర్చువాఁడ నీ
చరణములాన వేఱొకఁడు సల్పను భారము నీదెగా యనున్. ౨౦౭

ఉ. అంతట నూరకుండక ప్రియాత్మజ సమ్మతిఁ గాంచఁజేయుటల్
చింతలమాన్పుటల్ హితముఁ । జెప్పుట లన్నవి మీవె సుమ్ము నా
కెంతటికార్యమున్ సలుప । నెత్తఱి నుత్తరువిత్తురో యశే
షంతముమీఱఁ జేసెదను । భారము సర్వము నీదెగా యనున్. ౨౦౮

ఉ. కావున నామదిం గలుగుగర్వ మడంపఁగ దైవ మిందఱన్
గావలె నంచు నిట్లు పలుకంగ నొనర్చె నటంచు నెంచెదన్
శ్రీవిభుచెంతకుం జనెదఁ । జిత్తమునం గలదెల్లఁ జెప్పెదన్
భావ మెఱింగి యెట్లొనరుపం దగు నట్టులె నే మెలంగెదన్. ౨౦౯

క. పరమేశ్వరుకార్యం బని, స్థిరకీర్తి నెసంగెడు నని । తెలివకు సౌఖ్యా
కరమని యీయత్నంబునఁ, దిరిగితి నిందాఁక నామదిం గలతృప్తిన్. ౨౧౦

తే. ఒకటి నేఁ జేయఁబోవ వేఱొక్కఁ డయ్యె
దైవయత్నం బది విపరీతమగునేని
పౌరుషంబెల్లఁ దలఁప నిష్ఫలమె యగును
నాఁగఁ దగుసూక్తి లెక్కింప నామనమున. ౨౧౧

క. మనసునఁ గల్గినగర్వం, బనునది యింతయును దెచ్చె ననఁగలదే యె
వ్వనినైన నీదుదోషం,బని యాత్మకృతాపరాధ మనఁ దగుఁగాదే. ౨౧౨

క. ఒక లిక్కార్యంబున నా,కు రిపులెయ్యై విఘ్నములను కూర్చెనుచు నె
వ్వరుసం బల్కుడు నేటికిఁ, బరితాపం బింకఁ బోయిన చ్చెదఁ దండ్రీ! ౨౧౩

క. సెలవిమ్ము పంకజాక్షుని, గలుషఘ్నుని గానఁబోయి కార్యం బిది యి
ట్టులుసాగె నింక నేమని, సెలవిత్తువొ యట్లె నేను జేయఁ దలఁచితిన్. ౨౧౪

క. అని విన్నవింతు నవ్వల, వనజాక్షుం డెవ్విధమునఁ బల్కు నటులె నే
నొనరింతు మరలఁ జూడం, గను వత్తునొ రానొ చెప్పఁగాఁ జాల విధీ. ౨౧౫

క. తలవ్రాఁతయట్లు జీవిత,ములుసాగును దానిమాన్పఁ బూనఁగ వశమే
జలజాసన! మాబోంట్లకు, సెలవిమ్ము పరీక్షయిద్ది జీవితమునకున్. ౨౧౬

చ. అని తలసోఁక మ్రొక్కి వినయంబు కనంబడ వెన్కకే క్రమం
బునఁ బదముల్ తడంబడఁగ బుద్ధిస్థిరత్వము గాంచనట్లు తోఁ
చునటులు పోవుచుండఁ గని చొక్కపుప్రీతిఁ గనంబడంగఁ జే
యను వలపోసి యిట్లనియె నాస్యమునన్ స్మిత మంకురింపఁగన్. ౨౧౭

ఉ. పుత్త్ర! యిదేటివింత నగుమోమునఁ జింత కనంబడంగ వే
దత్రయపాఠసంభవముదం బడఁగంగఁ గలంతమీఱఁ దా
పత్రయబాధితుండువలె భావము తోఁపఁగఁ జేయుచున్ మహా
త్రిత్రప లట్లె పైకొనఁగ దీనత నొందుట కేమిహేతువో. ౨౧౮

ఉ. నాదగుభావ మిట్టిద యనంజనునంచుఁ దలంపఁజాల కా
శ్రీపయితుం గనంగఁజని చెప్పినయట్లు మెలంగువాఁడ నే
దేది స్వకీర్తిమో ఫలము లెల్లను దానికి నర్హమైనయ
ట్లే వగుచుండునంచు నిపు డెంతయు నార్తిని బొందె తేటికో. ౨౧౯

చ. విను మొకమాట చెప్పెదను విహ్వలతంగన కాలకింపుమా
తనయ మువహార్తనిశ్చయము ధాత యొనర్చుట శ్రీవిభుండు దా
నిని దలఁదాల్చు నెంతయును నిండ్యముగాదె తలంపు మీఁదె యా
త్మను; గనుకన్ రమావిభునిదాపున కేగుమటంచు నెప్పితిన్. ౨౨౦

ఉ. చిత్తమునందుఁ దోఁచినటు చేయ సమర్థుఁడు చక్రపాణి స్వా
యత్తములే సమస్తవిషయంబులు శ్రీపతి కట్టుగాన న

త్యుత్తమ మాపరేశుకడ § కొప్పుగఁబోయి వచించుటంచు నే
నిత్తఱిఁ బల్కితిం దనయ § యియ్యది వేలుగ లోఁ దలంచితో. ౨౨౧

క. నీవూనినకార్యం బిది, యేపగిదిం దలఁచిచూడ § హీనంబనియే
చూపట్టె నాకు ననుచుం, దాపసవర! యెంచినావె § తత్త్వ మరయకే. ౨౨౨

క. హరికొఱకు నీవుపూనిన, వరకార్యం బెవ్విధమునఁ § బండకయుండున్
సురలు నుతింపఁగ సాగును, బరికించితి నింతవట్టు § పరమర్షివరా! ౨౨౩

క. దామోదరకాంక్షిత మది, యేమెయినున్నదియొ దాని § నెఱుఁగఁగవలదే
కామితదాతగదా యతఁ, డేమని వచియించు నట్టు§లే చేయఁదగున్. ౨౨౪

క. ఇంకొకవిధముగ నీమది, శంకావళి కుండఁజాలు § స్థల మొసఁగక యా
పంకరుహాక్షునికడ నిశ్శంకన్ మాటాడి కార్య§సఫలత గనుచున్. ౨౨౫

క. మరలి చనుదెమ్ము దేవో, త్కరములతోఁగూడ శైల§కాంతుగృహమునన్
జరుగువివాహము చూడఁగ, నరుగుద మని బుజ్జగించు§నట్టి పలుకులన్. ౨౨౬

క. తనయుని మదిఁగల సంశయ,మును బోవఁగఁజేయ దేవ§మునియుఁ గలఁత యన్
వనధిమునిఁగియు రవంతగఁ, దనమదిలో నూఱడిల్లి § ధాతపనుపఁగన్. ౨౨౭

క. మును తాఁ జూచినలోకం,బునకుం జనె వ్యోమయాన§మున నవ్విధముం
దనమది నెంచి రమాధవుఁ, డనుకంపన్ సురలుగొలువ § నాస్థానమునన్. ౨౨౮

క. వేంచేసియుండె; నారదుఁ, డంచితగతిమీఱఁ బోయి § యట విరజాఖ్యం
గాంచిన శైవలినీమణి, చెంత మహావైభవములఁ § జెలఁగెడు పురమున్. ౨౨౯

చ. కనుఁగొని సంతసంబడరఁ § గాయజుతండ్రిని గాంచినట్టులే
మననము చేయుచున్ జని సమస్తజగత్ప్రభు లోకసాక్షి నాఁ
బనరుమహాత్ముఁ జక్రధరు § ధర్మమయుం గని తత్పదాబ్జముల్
వనరొసలంట మ్రొక్కి ప్రమదంబున సన్నుతిఁ జేసి యిట్లనున్. ౨౩౦

శా. నీమాహాత్మ్యము లిట్టివం చెఱుఁగఁగా § నీరేజగర్భాదులే
వ్యామోహంబును గాంతురన్న నిఁక నేలా మత్ప్రతీకాశులే
మేమే నెంచఁగఁ జాలువారలె రమాధీశా! పరంధాముఁడన్
నామం బెన్నఁగ నీకెయర్హమగు వింతల్ గూర్చు నీచెయ్దముల్. ౨౩౧

ఉ. ఏమియెఱుంగనట్లు నటియింతువు శ్రీధర! యొక్కమాటు నీ
ధామమహాత్మైకతేజమున § కందని దెద్దియులే దటంచు వే
దామలవీథినిం దిరుగు§నార్యులకే తెలియం జెలంగు దు
ద్దామవిభూతి నొక్కతఱి § దాసుఁడ నజ్ఞుఁడ నీకు మ్రొక్కెదన్. ౨౩౨

ఉ. ఇచ్చట నుందువొక్కతఱి § నెంతయుఁ బ్రీతిని గూర్చునట్లుగా
ముచ్చటమీఱ నొక్కయెడ § ముం దెవరేఁ దలపోయనట్టి య

త్యచ్ఛవిభూతులం జెలఁగు । చుండుపురంబున నుండు వాదృతిన్
సచ్చరితా! భవద్వసతి । సత్యముగా నెఱుఁగం దరంబొకో. ౨౩౩

మ. ఫలియింపందగనట్టి కార్యము ఫలింపంజేయ శక్తుండవై
సులభంబౌపని దుర్లభంబుగనె తోఁచుం దేవ నాయూహలం
గలుగంజేయ వలంతివై సకలసంక్రాంతాత్మ తేజుండవై
ఖలవర్గారి యనంగనొప్పు నిను వేఁడ్కం గొల్తు నశ్రాంతమున్. ౨౩౪

శా. దేవా! నన్నుఁ బరీక్షచేయుటకుఁగా । దీక్షాక్రమం బొప్పఁగా
నీవే పూనిన నెప్పుడైన నెటులే । నిల్వంగ శక్తుండనే
భావంబందుఁ గృపాతిరేకమును జూ । పన్నం బాడియౌ నాపయిన్
నీవేతప్ప మఱొండు నే నెఱుఁగ నో । నీరేజపత్రేక్షణా. ౨౩౫

ఉ. ప్రొద్దిని రెండుగట్టుల విరాజిలునట్లుగఁ దోఁచుఘాసముల్
గాదన కర్మిలిం దినెడు । కాంక్షల నిట్టటు పాఱుచున్ మనో
హ్లాదముమీఱఁగా మరలి । ప్రాప్పుషుధేనువుభంగి నేను దా
మోదర! పెండ్లికార్యమున । నూహలు పైకొన గర్వముక్తితోన్. ౨౩౬

చ. తిరిగితి నింతదాఁక గత । ధీవిభవుండనె యైతి నింకనై
న రహితచిత్తజాడ్యునిగ । నన్నొనరించి కృపారసంబుపైఁ
బరఁగెడు నట్లొనర్చి ముని । వారమునం దలయొత్తికొంచు సం
చరణముచేయఁగాఁ దలపు । స్వాంతమునం దొకమాఱు శ్రీపతీ. ౨౩౭

ఉ. మూరుత మెప్పుడం చడుగఁ । బొమ్మను నీకడ కబ్జయోని పే
సారకరాఁగ సాగుఁగద । శంకలు లేవుకదా వివాహమున్
దారసి నిశ్చయించితివె । యన్నముహూర్తము నీకరంబునన్
భారమునిల్పి రమ్మనిన । వచ్చెద నంపవు నీవు మాధవా! ౨౩౮

ఉ. ఏమియుఁ దోఁచకున్న నచ । లేశ్వరు చెంతకుఁ బోయి సిద్ధమే
నీమహితప్రయత్న మన । నీవెటు చెప్పిన నట్లచేసెదం
గామినియాశయంబు గనఁ । గాఁదగు భారము నీదె కాదె నే
నేమియు నుండ నాజ్ఞయను । నేమని పల్కుదుఁ బద్మలోచనా. ౨౩౯

చ. ననుఁ జపలాత్ముఁగాఁ దలఁచి । నాదగుయత్నము నిష్ఫలంబుగా
నొనరుపఁబూని రెల్లరను । నూహయె తోఁచెడు నింతకంటె నో
వనరుహనాభ! నాగళము । వాలునఁ ద్రెంపఁగరాదె యట్టి నా
మనమున సంతసంబునిడు । మానక యప్పని నాచరింపవే. ౨౪౦

చ. నలువును నవ్వచుల్ బలుక । నామన మెంతయు మండుచుండు నేఁ
బలుకఁగ నేల యింక నిటు । బాధలఁ గుందకయుండఁ జేయుమా

జలరుహనేత్ర! నీచరణసారసముల్ దలపోయుచుండ్ వనం
బులఁ దనుయాత్ర సల్పెదను బుద్ధియు వచ్చె నిఁకేమి యాజ్ఞయో. ౨౪౧

మ. మరలం బొమ్ము ఫలించుఁ గార్యమను నమ్మాటల్ దగంబల్కి ని
ర్భరలజ్జం గనఁజేయ కింకనయినన్ రాజీవపత్రాక్ష న
న్నరుణం గాంచి పరాభవంబునకు లక్ష్యం బేను గాకుండఁగాఁ
బరమేశా! దరిఁ జేర్చవయ్య, కరుణాపాథోధి వీవాటచేన్. ౨౪౨

ఉ. చాలుఁ బరీక్షలెల్ల స్ఫుటసారసలోచన! యర్వాశిక్ష యీ
వేళకు లోనసయ్యె బలువింతగ నెన్నియొసారు లింక నేఁ
జాలునటంచుఁ దోఁపదొకో సన్మునివర్యులు నవ్వుచుండఁగాఁ
గేలి యొనర్పనేల? పరికింపుము వేఱొకసారి యాత్మలోన్. ౨౪౩

ఉ. బుద్ధియె లేక యిప్పునికిఁ బూనితి శంకరుఁ గ్రిందుచేసి నిన్
బెద్దగఁజేయ నెంచనని వేయివిధంబుల నీపదాబ్జముల్
నిద్దపుఫాలముం దగుల నే నతులం బొనరించి పల్కుదున్
ముద్దుకుమారపరీతిఁ బ్రియముం గనఁజేయుము దీనరక్షకా! ౨౪౪

చ. అనుచు వినీతి యుట్టిపడునట్టులు పల్కి శుగశ్రుధారలం
గనుఁగవ దొప్పఁదోఁగఁ జనఁగాఁ దలపోయుసురర్షిఁ గాంచి నె
మ్మనమున వింతసంతసము మైకొన నాతనిఁ బ్రోత్సహించి కా
ర్యనిరతిఁ బూనఁజేయఁ దగునంచుఁ దలంచి వచించె నివ్విధిన్. ౨౪౫

శా. దేవర్షిప్రవరా! యిదేటివిధమో దీనత్వముం బొందఁగా
నీ వూహించినదేమొ దోఁప దెటులే నే నెంచినన్; నీవు రా
నేవేళం బయనంబు చేయఁదగునో యేవేవి గైకొంచు నే
యేవారిం గుమిఁగూడియుంచు నొగి నూహింపంగ నీవివ్విధిన్. ౨౪౬

చ. పలుకుచునున్నవాఁడ విపరీభావ మెఱుంగఁగఁగోరి వేడ్కకై
పలుకుటకో నిజంబుగనె పల్కఁగఁ గారణ మున్నదో మనం
బెలమిని వీడకుండ వచియింపుమ యున్నదియున్నయట్టు లీ
జలరుహనేత్రుఁ డించుకయు ఛద్మముఁ బూనఁడు నమ్ము మానుడుల్. ౨౪౭

ఉ. హైమవతీనితంబినియు నాత్మను శంకరునందు మున్నుదా
నేమరియాద నుంచినదొ యిప్పుడు దానిని వీడినన్ను నెం
తే మమతం దలంచినదె యేర్పడఁ దెల్పుము దాఁప కించుకే
నామది తత్తఱంపడెడు నారద! నీనుడు లాలకింపఁగన్. ౨౪౮

ఉ. మూర్తము నిర్ణయింపుమనఁ బొమ్మని నాకడ కబ్జయోని ని
న్నార్తిఁగనంగఁ బంపుటకు నంతటికారణమేమొ యిప్డు నా

యార్తజనావనాహ్వయ మొపార్థముగాక చెలంగునట్లు స
త్కీర్తి స్థిరత్వముం గనఁగ ధీవిభవంబునఁ జేయఁ బూనెదన్. ౨౪౯

చ. వగవకు మింక నీపనికి భంగముచేసెడువార లెవ్వ రీ
జగమున నుండు రేఁ గనెద శక్తిని దేనిని బూని వారలా
ప్పగ నిటుచేయఁ బూనిరొ ప్రభుత్వముమీఱ నెదుర్కొనంగనీ
పొగడికఁ గోరిచేసెదను బో పలుమాట లిఁకేల పల్కఁగన్. ౨౫౦

మ. మరలంబోయి పితామహుంగని జగన్మాన్యుండవౌటన్ [1]సుఖే
చరదృష్టంబయి సద్గుణాకరముగా జ్ఞానిస్తుతిం గాంచునె
వ్వరుసన్ లగ్నము నట్టిదాని ద్రిజగచ్ఛ్రప్రదంబౌ నటుల్
త్వర నిర్మింపు మదాజ్ఞ నంచు మునిచంద్రా! తెల్పుమా యవ్వలన్. ౨౫౧

ఉ. ఆతనిచర్య యెట్టిదని యారయువాఁడ ముహూర్తనిశ్చయం
బాతతసౌఖ్యమొప్పునటు లాపగమేష్టి వచించునేని సం
ప్రీతి సుపర్వవర్యులను బెండ్లికిఁ బిల్చి మునీంద్రసంఘమున్
ఖ్యాతిఁజెలంగుదేవతల నచ్చరమిన్నలఁ బిల్వుమా మునీ. ౨౫౨

ఉ. ఇంతవచింపనేల యెవరెవ్వరు రాఁదగు నంచు నీదుచి
త్తాంతరమందుఁ దోఁచునో మహామునినాయక! వారినెల్ల నొ
క్కింతయు సంశయింపక మఱెవ్వరినే నడుగంగఁబోక నా
కెంతయుఁ దృప్తిగల్గునటు లెల్లరఁ బిల్వుము పెండ్లిపెద్దవై. ౨౫౩

ఉ. నీవొనరించినట్టిపని నే నొనరించినయట్టులే యగుం
గావున శంకకున్ మనసు కాపురమయ్యెడురీతిఁ జేయ కో
దేవమునీ! వివాహమును ధీవిభవంబు చెలంగఁజేయుమా
దైవము నీకు ముందుగ నితాంతము తోడ్పడఁ బోవుచుండుతన్. ౨౫౪

చ. వలసినవస్తువారముల వాసవుఁ డిచ్చునుగాక రత్నరా
సుల వరుణుండు హేమమయసుందరభూషణరాజి యీశు నె
చ్చెలి ధనదుం డొసంగెడిని జిల్లరవస్తువు లేవియైనఁ గా
వలసిన హవ్యవాహనుఁడు వాఁడిక యీఁగలఁ డెప్పుడడ్గినన్. ౨౫౫

సీ. పౌలోమి లోనగుపద్మనేత్రలు మనపక్షమునం దమితపరిషదిల్లఁ
దరలివత్తురుగాక సురమునీ! నీవేగి పిలిచినయంతనె పెండ్లికార్య
మునకు భంగము చేయఁబూనువా రెవ్వరిక త్రిజగంబులందు సందియముమాని
కమలజుకడకేగి యమలముహూర్తము సిద్ధాంతముగ వేగ చేసికొనుచుఁ

తే. జెప్పినట్లు పనుల్ దీర్చి శీఘ్రముగనె, రమ్ము నేనును బెండ్లికార్యమ్మునకును
సిద్ధపడియెద నెట్టులో చెప్పవలెనె, యింటఁగల్గెడు చిక్కుల నెల్లవిప్పి. ౨౫౬

1 సుఖేచరదృష్టంబయి = శుభగ్రహములచేఁ జూడఁబడినది.

శా. ఐనం జెప్పెదఁ గొన్నిఁటిన్ ద్రిదశవర్యశ్రేణికిం జెప్పఁగా
మానంబించుక తగ్గుఁగాన దివిషన్మౌనీంద్ర! చాంచల్యమున్
బూనంగా వలదిందు; నావల నదేప్పోల్కిన్ మరల్పంగరా
కే నిల్చున్ స్థిరమై జగంబులను దూ జెప్పాట దూష్యంబె కా. ౨౫౭

మ. తొలిభార్యం గద నేనటంచు సిరి తోడ్తోఁ దక్కుభార్యాగణం
బుల నెంతే క్రుధ నీసడించు మఱియాపూబోఁడు లొక్కొక్కరుం
గలహింపంగఁ దలంచుచుందురు మహాకార్యంబుగా దీనఁ జూ
డ్కులు నిల్పందగియుండు నాకు నెపు డెట్టుల్ నిల్పనోఁ బోరఁగన్. ౨౫౮

మ. ఒకరామామణి యందగత్తియల నే నొక్కర్తుకన్ మిన్న నం
చెకసక్కెంబులు పల్కు వేఱొకతె నన్నే కాదె మన్నించునా
థుకటాక్షంబని తోడిచేడియల నే దూఱున్ సురర్షీంద్ర! యిం
కొకపద్మాస్య యకారణేర్ష్యఁగొని యత్యుగ్రంబుగా నన్ననున్. ౨౫౯

సీ. ఒకతుక నవ్వుచు నొగిమాటలాడంగ నింకొక్కలేమ న న్నీసడించు
ననురాగభరమున నంగనయోర్తు నన్ లాలింప వేఱొక్కలలన దూఱు
నాతియోర్తుక నాకుఁ బ్రీతిమ్రొక్కుదు ననవేఱొక కోపన కాంచుఁ బిఱుసుఁ జూడ్కిఁ
జాలకాలంబాయె సరసఁ జేరి యటంచు నొకతె పల్క వలదం చొకతె గేలు

తే. నొకతె నవ్వఁగ వేఱొక్కయువిద యేడ్చు
సరసముగఁ బల్క నొక్కర్తు విరసభాష
ణముల నింకోర్తు నాదుమనముఁ గలంచుఁ
బలుకులేటికి నాదురవస్థ లివని. ౨౬౦

మ. వినవయ్యా! మదుదంతమున్ సకలమున్ విశ్వాస మొప్పారఁగా
వనితాసంఘము నొక్కరీతిగఁ దమిన్ వర్తింపఁగాఁ జేయ నె
వ్వనికే శక్యముగాదు నేనన నెటో వర్తించుచున్ వారి నె
మ్మనముల్ గాసిలకుండఁ జేయుచునె సమ్మానంబునుం గూర్చుచున్. ౨౬౧

చ. మెలఁగుచునుందు నట్లయిన మేచకకుంతలలందుఁ గొంద ఱె
ట్టులొ తగవేది యీసునఁ గడున్ మితిమీఱెడు పౌరుషంబునన్
గలఁగినచిత్తముల్ స్థిరతఁ గాంచఁగఁ జేయఁగలేక క్రూరతం
బలుకుచునుండ్రు దానఁ దలవంపులు నాకగు నప్పుడప్పుడున్. ౨౬౨

ఉ. ఇంతగఁ జెప్పుటెల్ల భవదీప్సితమెట్లొ యడంగఁజేయ నీ
చెంతను యుక్తిఁ బన్నితిని నీ! యని కొందల మందఁబోకుమీ
కాంతలనంగ నెంత త్రిజగంబుల సుస్థిరతం జెలంగ నే
పంతము మీఱఁ జేయఁగల ప్రౌఢుఁడ నంచును నీవెఱుంగవే. ౨౬౩

ఉ. ఇందఱు కిన్నరూపులుగ నేఁగనుపట్టఁగ నేర్తు నీదుప
ద్దుం దగురీతిఁ జెల్లునటు తోరపుశక్తిని జేయువాఁడ నా
సుందరి కెద్దివాంఛితమొ చోద్యము నీమనసొందునట్లు దీ
ర్పందలపోసినాఁడ మునిపాలక చింతలు వాసిపొమ్మిఁకన్. ౧౬౪

చ. అని వనజాయతేక్షణుఁడు హర్షము పైకుబుకంగఁ జేయు న
ట్లనుపమవాక్సుధం జిలుక నాయమరర్షియు సంతసిల్లి య
ప్పని ఫలియించినట్లుగనె భావనచేయుచు దోసిలొగ్గి శ్రీ
శుని వినుతించె నివ్విధిని శ్రుత్యనురూపవచస్స్తుతిం గడున్. ౧౬౫

సీ. యజ్ఞరూపుండవు యజ్ఞేశుఁడవు యజ్ఞఫలమవు తద్భూరిఫలముననుభ
వించువాఁడవు నీవె చంచలాత్ములుచేయు కర్మములకు నైహికఫలములను
నిశ్చంచలాత్ములు నియతిమీఱ నొనర్చుకర్మములకు జని గాంచనట్టి
శాశ్వతానందపరసతిరూప ఫలముల నొసఁగువాఁడవు నీవె బిసరుహాక్ష!
తే. వేదమయుఁడవు సత్యసంవేద్యరూప,విభవుఁడవు సర్వలోకప్రవృత్తశాస
నుఁడవు తేజోమయస్వరూపుఁడవు దేవ,దేవ! నారాయణా! మహాదేవ! కృష్ణ!

చ. నిను వినుతింపనేర్తురె యనింద్యచరిత్రుఁడ వీవు లోకపా
వనుఁడవు శ్రీవిభుండవు దివస్పతిముఖ్యనిలింపవర్య సం
ఘనుతమహాఘనాశకర కామితదానచణాహ్వయా మహా
త్మ! నిను నుతించువాఁడనె నితాంతము భక్తి యొసంగఁజేయుమా. ౧౬౭

ఉ. సారసగర్భుచెంగటికిఁ జయ్యనఁబోయెద విన్నవింతు నీ
వారమణీయవాక్కులఁ బ్రహర్షము పొంగఁగ నంత నాయజుం
డారసి లగ్న మెయ్యది జయప్రద మంచు వచించు దాని నా
ధారుణిభృద్వరేణ్యునకుఁ దక్షణమే యెఱిఁగించి యవ్వలన్. ౧౬౮

చ. త్రిదశుల నింద్రముఖ్యులను దిక్పతులన్ బిలిచి మెచ్చి దేవతా
మదవతులన్ శచీప్రముఖమానినులన్ బిలిచి మెచ్చి రాజ్ఞి తా
దవ నటు లప్సరోగణము దాఁదగు శ్రీవిభుపెండ్లి కంచుఁ బి
ల్చెద మఱి వచ్చువా రెవరు లేరు గదా యని విన్నవించెదన్. ౧౬౯

ఉ. పెండిలిసాగు మంచుమఱి ప్రీతి సపుత్త్రకళత్త్రమిత్త్రులై
యండజరాజవాహను మహామహిమాఢ్యుని బ్రీతుఁ జేయఁగా
రండు నివాసముల్ శిఖరిరమ్యతమామల సానుభూములం
దుండుఁడు యథార్హరీతి నని యొప్పుగఁ బల్కెదఁ బద్మలోచనా. ౧౭౦

ఉ. ఆపల నీమహాంఘ్రికమలాంతికముం గనవచ్చెదన్ మనో
భావము వెల్లడింప నని పల్కె సురర్షి మహాత్మ! యింక నేఁ

బోవ ననుజ్ఞ యే యనిన ఫుల్లసరోరుహనేత్రుఁడుం గృపా
ప్రావృతభావ ముట్టిపడ నార్య! కృతార్థుఁడవౌచు రాఁదగున్. ౨౭౧

మ. నినుఁగాంచన్ మది వేడ్కఁబొంగ నిచటన్ నే వేచియుందుం జుమీ
చనినట్లే మఱి రాఁదగున్ జతనముల్ సల్పంగ రా దంతకున్
మునివర్యా! మరియాదకుం దగినయప్పోల్కిన్ వివాహోత్సవం
బునకున్ యత్నము చేయఁగాఁదగునుగా పొమ్మా తమిన్ రమ్మిటన్. ౨౭౨

ఉ. లేనగ వాస్యపద్మమున లీల నటింపఁగ నిట్లుపల్కు వి
జ్ఞానమయాంగు శ్రీవిభుని సన్నుతిఁ జేయుచు వేడ్కఁబోయె నా
మౌనివరేణ్యుఁ డాత్మ బహుమానము గాంచినయట్టు లెన్నుచున్
దా నళినాసనుం గనఁగ దానవసూదను లోఁదలంచుచున్. ౨౭౩

ఉ. అచ్చట సృష్టికర్తయు మహర్షులు తన్ గొలువంగ నోలగం
బిచ్చ చెలంగఁ జేయుచునె యెన్నె మదిన్ మునివర్యు రాక పై
పెచ్చుగ నాత్మశీర్షమునఁ బెండ్లిముహూర్తము నిశ్చయింపఁగా
ముచ్చటఁ బల్కె తన్ గుఱిచి పొమ్మని పల్కిన శ్రీశు నెన్నుడుల్. ౨౭౪

చ. సరిసరి పంకజాక్షుని విశాలమనస్స్ఫుటభావ మెట్టిదం
చరయఁగఁజాల కీమునియు నాత్రమునం దనుఁ బెండ్లిపెద్దగా
హరి వచియించినంతటనె యయ్యది నిశ్చయమంచు నెన్నుచుం
బరుగిడుచున్న వాఁ డిటకు బాలిశుఁడున్ వలె నెంతవింతయో. ౨౭౫

ఉ. ఒక్కెడ సన్నుతించి మఱియొక్కయెడం బరిహాసమాడి తా
నిక్కడనక్కడం జెలిమి నెట్లొ కనంబడఁజేయుచున్ గడున్
వాక్కలహంబుఁ గూర్చి సురవారము సన్నుతిచేయ మించుచున్
బెక్కువిధంబులన్ యశము విశ్వములం గనె నెల్ల రౌ ననన్. ౨౭౬

ఉ. ఇప్పుడు నట్టులే జరుగు నీశునిమాని హరిన్ వరించు మేల్
తప్పక యొందుఁ బార్వతి; నితాంతము లజ్జ మదిం బెనంగఁగా
నప్పరమేశుఁ డెందునొ పరిహాస్యముగా వసియించు నంచుఁ దా
నిప్పరమర్షి యెంచె నని యేర్పడుచున్నది సుంత యెంచినన్. ౨౭౭

ఉ. ఇంతకుమించినట్టి దని యేర్పఱుపం దగుమౌఢ్య మీజగ
త్సంతతిలోపలన్ వెదుకఁ దా నొకఁడే కనుపట్టునే కటా!
యింతటి మౌనియిట్టు లగునే తలపోయఁగఁ గర్మమొక్కటే
యెంతయుఁ బొల్చు సాటియనఁ నెయ్యది లేక నితాంతశక్తిచేన్. ౨౭౮

శా. శ్రీనాథుండును నారదున్ జపలుగాఁ జేయంగఁ దా నెంచి యో
మౌనీ! బ్రహ్మకడన్ ముహూర్తమును సమ్యగ్రీతి నొప్పారున

ళ్లే నిర్మింపఁగఁజేసి రక్షించుట కెంతేఁ బూన్కి దేవాళితో
నేనున్ నీవును బోవనోఁగద యనున్ నేర్పంతయుం గన్పడన్. ౨౭౯

శా. మాయామోహితుఁడౌట నిమ్మునియు నమ్మాటల్ సువిశ్వాస్యముల్
పాయం ద్రోయఁగరాదు వీని ననుచున్ బల్మాఱు లేతెంచి నిం
కేయాలస్యము చేయకుండ లగనం బెంతేఁ జమత్కారమౌ
రా యంచున్ సురలెల్ల మెచ్చుకొన సిద్ధాంతంబు చేయందగున్. ౨౮౦

చ. అని నను హెచ్చరించుటకు నల్లన వచ్చెదు నిమ్మునీంద్రుఁ డీ
తనిమది నొవ్వఁబల్కుటయు ధర్మముగాదు మృదూక్తులందు నుం
డినధ్వనిఁబట్టి భావమును నేర్పుమెయిన్ గ్రహియించుజాడయే
కనఁబడ దింతదాఁక నిటఁ గల్గినచర్యనుబట్టి యెంచినన్. ౨౮౧

ఉ. ఐన మఱొక్కసారి విషయంబును దీని నెఱుంగువాఁడ నీ
మానియుఁ జింతనొందనటు మాధవుచెంతకుఁ బోయి చెప్పఁగాఁ
బూనెడు బ్రహ్మ లగ్నమని భూరిరుషం బలుకంగనోచ న
ట్లూనిన నేర్పునం బలుక నొప్పుఁ జమత్కృతి యెంతొ యొప్పఁగన్. ౨౮౨

చ. ఇదియె యుపాయ మింతకు నెదే మఱియొక్కఁడు గానరాదు మం
చిదిగ వివాహ మిద్ది సరసీరుహనేత్రుని సమ్మతంబుచే
సుదతికి నిష్టమైనటులు సోమకళాధరుఁ డెన్నినట్టులే
తుదకు సురర్షికిం ద్రపయె తోడ్పడసాగెడు నిశ్చయంబుగన్. ౨౮౩

చ. అని తలపోసి దేవముని యాననముం దిలకించి మెల్లమె
ల్లన మరియాద యుట్టిపడునాగునఁ బల్కె నెబాసురయ్య ప
ట్టును నెఱవేర్ప నీవలెఁ గడుసుం బొగడొందినవార లెందు నేఁ
గనఁబడువారె నారద! యఖండతపోనిధి వీ వొకండవే. ౨౮౪

ఉ. అట్టిఁడవయ్యు లగ్నవిషయంబున నించుకగాఁ బ్రమాదమున్
బట్టితి వంచు నేఁబలుకవాఁడఁ గ్రుధం గొన కాలకింపులో
గుట్టుల నేరికే నెఱుఁగఁ గూడునె నీవగుశ్రద్ధఁ జూడ నీ
పట్టునఁ బూనె శ్రీవిభుఁడు పంతము నిర్జర మానినాయకా! ౨౮౫

చ. అదియెఱుఁగంగఁ జాలక మహామతివయ్యుఁ జలంబుమీఱ నే
యదనున నిందునందు మరియాదఁ దలంపక సంచరించుచున్
మదిఁ బరితాప మూనితివి మంచిదె యీయది సుంతయొప్పుమా
త్రిదశులు నవ్వరొక్కొ మునిధీరుఁడు దీనత నొందె నంచొగిన్. ౨౮౬

చ. మతివిభవం బదెందు నిటు మ్రాన్పడితో మునినాథ! యేల య
జ్ఞతఁ గనినాఁడవో యిటులు చక్రికి లగ్న మిదే జయప్రదం

బతులిత భావుక ప్రదము । నౌ నని చెప్పుటయెట్లొ సుంతయెం
చి తెలియఁబూనరాదె మునిచిత్తము సర్వమెఱింగెడుంగదా. ౨౮౭

చ. తలఁచినదే తలంపుగను । దా నెదిచేయఁగఁబూన నప్పుడే
ఫలదముగాఁ జెలంగునదె । పంతముగాఁ ద్రిజగంబులందునన్
సులభముగాని పెద్దియును । జూచిన లేనిదిగాఁ జెలంగు ని
స్తులగుణశక్తియుక్తునకుఁ । దోయజనేత్రున కేను పెద్దనే. ౨౮౮

ఉ. ఇత్తఱి లగ్నమంచు వచియించెడువాఁడనె పూజ్యభంగి నే
యుత్తములైన మెత్తురె యదుత్తమమార్గమె యెంచి చూడుమా
చిత్తములో మఱొక్కమఱి । చెప్పెద నొక్కరహస్య మద్దియొ
క్కెత్తుగఁ బక్కకార్యము లవెల్ల నొకెత్తుగ నిశ్చయింపుమా. ౨౮౯

చ. చని యట దేవదేవుఁగని । సర్వవిధాద్భుతశక్తివంచు నిన్
మనమున నెన్నఁజాలని యమర్త్యమునిన్ నను సత్కృపామృతం
బునఁ దనియంగ మోహమును । బూనకయుండఁగఁజేసి కావుమా
యని వినయంబుమీఱునటు । ప్రార్థనచేయుము భక్తిపొంగఁగన్. ౨౯౦

ఉ. ఎల్లరు పెండ్లిమూరుత మదెప్పుడు సాగునొ యన్నయాశచే
నుల్లము లుల్లసిల్లఁ దమయూహలు పైపయి సాగుచుండ ను
త్ఫుల్లసరోజనేత్ర! తొరపూనిన నీపయనం బెఱుంగ నే
యెల్లపు డెంచువారు తమరెప్పు తలంచితిరో చనన్ వదిన్. ౨౯౧

ఉ. ఏలినవారు పెండ్లి కెపుడేగెదరో యపుడే ప్రయాణమై
యోలి విమానపంక్తిపయి । యుగ్మలులం దమిఁగూడి రాఁగ దే
వాళి తలంచుచున్నది మహాత్మ! రమేశ! తదేవ లగ్నమం
[1]చాలతిచేసి యచ్చరలహర్నిశముల్ తమిఁ బాడుచుంద్రుగా. ౨౯౨

మ. పరమాత్మా! పయఁగావనయ్య నను నీభావం బెఱుంగంగ నె
వ్వరు శక్తుల్ గల రిజ్జగంబుల నికన్ । వ్యాజంబు చాలించి యా
ధరరాజన్యునికోర్కి తీర్పఁగ ననున్ । ధన్యాత్ముగాఁ జేయఁగాఁ
ద్వరగాఁ బెండ్లికిఁబోవ నెన్నుమ మదిన్ । బ్రహ్మాదులున్ దోడరాన్. ౨౯౩

మ. పయనం బీక్షణమందు నౌనను లసద్భవ్యోక్తి నాలించి తోఁ
బయనంబై చనుదేర నెంచుచునె దేవశ్రేష్ఠు లున్నారు దే
వ! యమోఘేచ్ఛుఁడెగాదె మీఁదగును దైవంబన్న బ్రహ్మమ్మనన్
వియదాకారమటన్న నీవెకద యోవిశ్వాత్మ, సర్వేశ్వరా! ౨౯౪

మ. "భవదిచ్ఛానుమతం ముహూర్త మతులం భద్రప్రద" మ్మంచు నే
ను విరించాదులు నెంచువారము మునీంద్రుల్ గూడ నిట్లే తలం

---

1 ఆలతి = రాగాలాపము.

త్రు విభూ! పెండ్లిప్రయాణముఁ జరపం దోడ్తో నాజ్ఞయిమ్మింక స
ర్వవిధస్తుత్యముగాఁ జెలంగుత గిరీంద్రంబందు మర్యాదతోన్. ౨౯౫

శా. దేవా! యేదియనుజ్ఞ యంచుఁ గడునీలీలన్ వేఁడుమా భార్గవీ
దేవీవల్లభుఁ డంత నుత్తరమురీతిన్ దెని గైకొంచు నో
దేవర్షీ! వచియించు దాని వినఁగా దెల్లంబగుఁ సర్వమున్
నీ వద్దానిఁ బురస్కరించుకొనియే నేర్పాని భాషింపుమా. ౨౯౬

చ. త్రిదశమునీ! సమస్తమును దెల్లముగాఁగ నెఱుంగఁజాలు నీ
కుఁ దగినమార్గ మీయది యగుఁ జనఁగాఁ దగనంపు బోధచే
యఁ దరమె యేరికే ననుచు నాత్మ నెఱుంగుదు నట్టులైన నే
ముదుకుఁడఁగానఁ దెల్పితిని బుద్ధిఁ దలంచి యొనర్పు మట్టులే. ౨౯౭

మ. భగవంతుండు సమస్తముం దెలియు దైవంబన్న నాతండుగాఁ
గ గణింపంబడుఁగాదె యాతఁ డెఱుఁగంగాలేని దేముండు నే
జగమందైన వివాహకార్య మెపుడే సాగింపఁగా నెంచుఁ జ
క్కఁగ సాగించెదునప్పుడే తలఁపు మింకన్ జ్ఞానదృష్ట్యాస్థితిన్. ౨౯౮

మ. చనవయ్యా! తడవేల యింక నచటన్ జక్రిప్రియంబైన యి
ష్పని శ్రీనాథుని యిచ్చపెంపునను తత్ప్రాలేయశైలేంద్రు నె
మ్మన మానందరసాంబురాశి మునుఁగన్ మాయా సమస్తేష్టముల్
కొనసాగున్ మదిగల్గు సంశయ మడంగున్ బొమ్ము మాహేశ్వరా! ౨౯౯

చ. తలఁపులు వేఱుమాని సుకతల్లజు చెంతకుఁ బొమ్ము సర్వమం
గళములు సాగుఁ జింతలు వికావికలై చను నీదు వాంఛితం
బులు నెఱవేఱు నన్న మునిపుంగవుఁ డెంతయుఁ బొంగి బ్రహ్మక
ల్కు లకుటిలంబులే యనుచుఁ గొంకొకయింతయు లేక యుట్టనున్. ౩౦౦

చ. అమరుల దిక్పతివ్రజము నట్టులె మానులఁ దత్సతీసమూ
హము మఱియుంగలట్టి సుగుణాఢ్యులఁ బెండ్లికిఁ బిల్వ రాఁదగున్
సమయమునన్ మిముఁ మఱొకసారియు బిల్వఁగవచ్చువారు లే
రమలకృపాతిరేకమున నందఱు రాఁదగు నంచుఁ బిల్వఁగన్. ౩౦౧

క. హరి యాజ్ఞాపించెంగద, సరసీరుహజన్మ! యట్టిచందమ్మున ని
ర్జరముఖులం బిల్వకయే, యరిగినఁ జేవాట్లుపెట్టి కిన్కఁ గసునే ౩౦౨

క. దీనికి నేమియుపాయం,బో నీవెఱింగించినంత నుద్యమ మట్లో
గా నేఁ బోయెదనన విని, యోనారద! తెల్పవాఁడవొకొ యెఱుఁగన్. ౩౦౩

క. నారాయణుకార్యంబన, నారయ నీకొక్కనికె ప్రియమౌనఁ దగునే
కోరి ధరింతుము నేను బలారాతియుఁ జక్రధరునిమహాజ్ఞ శిరమునన్. ౩౦౪

క. కనుకఁ దదుద్వాహము లో, కనికరముల కెల్లఁ గల్పకం బగుఁగాదే
మునివర! నీ వేగుము నే, నును వాణియు సురలమునులనుఁ బిల్తు మొగిన్.

క. సురకాంతామణులన్ యక్షరమణులన్ దేవభోగికాంతల మఱి కి
న్నరముఖులన్ బిల్తుము శ్రీ, హరి కుద్వాహమ్ము సాగునప్పటి కేమున్. ౩౦౬

క. ఎల్లరఁ దోడ్కొని హిమగిరి, వల్లభుపురిఁ జేరుదుము భగవత్సహితుం డై
ఫుల్లసరోరుహనేత్రుం, డుల్లము పొంగంగఁ బార్షదౌఘముతోడన్. ౩౦౭

క. పతగేంద్రారూఢుండై, సతులెల్లం గొల్వ వేడ్కసంధిల్లఁగఁ బ
ర్వతరాజుగేహమున కున్నతిమీఱన్ వచ్చుఁగాక నాటిఁ గొనంగన్. ౩౦౮

క. మే మెల్లరముం గూడఁగ, నోమానీ! వేచియుందు ముద్వాహార్థం
బే మేమి వలయునో యా, యామంజులవస్తువితతి నవహితమతి నై. ౩౦౯

క. కొనివచ్చెద నీచెప్పిన, పనులన్నియుఁ జక్కఁ జేయుభారము నాదౌఁ
జని మూహుతంబుఁ దెల్పుట, యనునప్పని నీదు భారమా సురమానీ! ౩౧౦

క. చింతడిగనాడి యా శ్రీ, కాంతునికడ కరుగు మనినఁ గంజజునుడు ల
త్యంతముదంబును నింపం, జింతాజ్వర మెటకొ పోవఁ జిత్తం బలరన్. ౩౧౧

క. టంకృతినాదము మహతీ, పంకరుహాక్షీముఖైకభవమయి యానం
దాంకంబయి వ్యాపింపఁగ, శంకరమిత్రుని గనంగఁ జనియెన్ మునియున్.

క. అరుగుచుఁ దనలో నౌరా!, సరసీరుహసూతి తెల్పెఁ జక్కని పథమున్
హరికి ముహూర్తం బిదియని, తరమే తెల్పంగ లోకతతి నేరికినేన్. ౩౧౩

క. సర్వము తానై తానే, సర్వమునకు వెలిగఁ దోఁచుసరణి కనఁబడన్
శర్వాదులు తనుఁ గొల్వఁగ, సర్వజ్ఞుఁడు వెలయుచుండు సర్వస్థలులన్. ౩౧౪

క. విష్ణువసు వేసతగునటు, జిష్ణుప్రముఖుల్ స్వకీయచిత్ర మహితరో
చిష్ణుశరీరములం గని, సోష్ణీషులు నగుచుఁ బాదయుగమున వ్రాలన్. ౩౧౫

క. వారలకు జ్ఞాన మొసఁగుచు, భూరిమహత్త్వం బతుల్యముగఁ గ్రాలంగా
శ్రీరమణుఁడు గోలోకా, గారంబున నుండుఁ బోయి కాంచెద భక్తిన్. ౩౧౬

క. తెలిపెద సర్వము దానిన్, జలజాక్షుం డాలకించి సంతోషమునం
బలుకుఁ బ్రయాణం బిపుడని, కులగిరిరాట్టునకు దానిఁ గుతుకం బలరన్.

క. అంతేవాసి ముఖంబున, నంతయుఁ దెలియంగఁ జేయ ననువుపడును నా
పంతము ఫలించు శ్రీశా, నంతమహత్వంబు జగమునన్ వ్యాపించున్. ౩౧౮

క. ఆలస్యం బిటఁ జేయుట, యేలా సత్వరమపోయి హితవార్తల నా
శ్రీలలనాచిత్తేశుని, మ్రోలన్ వినిపింతు ననుచుఁ బోయెం గడఁకన్. ౩౧౯

క. కరధృతతాళములు మనో, హరనిస్వనములను దెసల వ్యాపింపఁగఁ జే
య రమావల్లభు గేయము, ల రమణఁ బాడుచునుఁ బోయె లలితగతితగన్.

క. కరుణాకర! భక్తజనో, త్కరపాలన చతుర దేవగణవందిత శ్రీ
కరపాదసరసిజా! సాధురతా గోవింద క్షీరతోయధిశయనా! ౩౨౧

క. పరికింపుము నాహృదయముఁ, ద్వరగొని వారింపు నాహృదయతాపం బి
త్తరుణమున నీవుదక్కఁగ, శరణము వేఱొండు లేదు చక్రి దేవా! ౩౨౨

క. పురహరుభక్తులు నన్నుం, బరిహాసము చేయకుండఁ బటుశక్తిని నీ
చరణాబ్జభక్తు పంతముఁ, బరమాత్మా! నెగ్గఁజేయ వలయుం జుమ్మీ. ౩౨౩

క. అనిపాడుచు శ్రీహరిపద, వనరుహములఁ దనదుమదిని బాదుకొలిపి వే
చనియెం గోలోకంబున, కనుపమమహిముం గనంగ నాత్మఁ దలఁచుచున్. ౩౨౪

క. దృగ్గోచర మయ్యె సుహృ, ద్దుర్గమ్యము సర్వలోకదీప్తిదము గరు
దృగ్గమను ప్రియావాసము, తగ్గని సిరు లలరుచుండఁ దగు నది యెదుటన్.

క. అసదృశమై గురుతేజో, విసరసమాక్రాంత లోకవితతియగుచు శాం
తసముద్రంబై రాధా, బిసరుహదృగ్వసతియగుచుఁ బెంపుం గనుచున్. ౩౨౬

సీ. పరమపవిత్రమై పాపప్రతానసీ నిశితలవిత్రమై నెగడఁజాలి
సన్నుతిపాత్రమై సర్వత్రజైత్రమై విమలచారిత్రమై వెలయఁగల్గి
మంగళాస్పదమయి శృంగారసదనమై స్థిరతరానందమై చెలఁగమించి
భవదోషహరణమై భవహృదాభరణమై పావనశరణమై పరఁగ నెంచి

తే. భక్తలోకనివాసమై పరిఢవిల్లి, శాంతసత్వశరణ్యమై వింతనొప్పి
యనుపమానప్రభాఢ్యమై తనరుచున్న, కమ్రగోలోకవరమును గాంచెమౌని.

చ. అరుదగుదాని యాకృతిమహత్త్వముఁ జక్కఁగఁ గాంచి సంతసం
బురుతరమై చెలంగఁ దనయుత్తమకార్య మిఁకేల పండ దా
సరసిరుహాయతాక్షుని విశాలకృపన్ వడిసంచు నెంచుచున్
సురముని దానిఁ జొచ్చి రుచిసుందరమందిర మందుఁ గన్పడన్. ౩౨౭

చ. వడివడిఁ జొచ్చి తన్నుఁగన వచ్చినపార్షదరాజి గౌరవం
బడరఁగఁ గాంచి సుస్మితముఖాబ్జము క్రొత్తరుచుల్ దగం బయ
ల్పడునటు చేయుచుండ నొకభంగిని సంశయ మంకురించి పెన్
దడ గలుగంగఁజేయ నొకతట్టున సంతస మట్టె యుబ్బుచున్. ౩౨౮

ఉ. సందియమేల నీసుకృతిసాగక యుండునె యన్నభావ ముం
గ్రందుగఁ దోఁపఁజేయఁగ సుకాలమిదే భగవంతుఁ జూడ నం
చుం దడవేమి చేయకయె సూనశరాసనుతండ్రి చెంతకున్
మందగతుల్ తనున్ వదల మౌనిశిఖామణి యేగి ముందటన్. ౩౩౦

చ. హరిఁ బరమేశ్వరుం గనియె నమ్మునిరాక నెఱింగియుంట శ్రీ
వరుఁ డెదురేగి రమ్ము మునివర్య! జగంబున నీవువచ్చుటన్

బరమముదంబు నెమ్మదిని భాసిలెఁ జొమ్ము ముహూర్తమున్ గుణో
త్కరముగ నిశ్చయించెనొకొ కంజభవుండది వేగ తెల్పుమా. ౩౩౧

చ. పిలిచితివే వియచ్చరులఁ బెండ్లికి రమ్మని కార్యభారముల్
గలవిలపాటుగూర్పఁ ద్వరగాఁ జనుదెంచినవాఁడవో కదా
పలుకులు వేయునేల? సురపాలకుఁ డాదిగనున్నవారు నీ
కెలమి చెలంగఁ దోడ్పడుదురే కద సందడివేళ నారదా! ౩౩౨

ఉ. ఊరకయున్నవాఁడ విపు డొక్కకృతిన్ జరపంగఁ బూనియున్
నేరుపుమీఱఁ గార్యము లనేకము లున్న నదెట్టు లుండునో
నారద! నీవచస్సుల వినంగఁ ద్వరంగనునన్ను నేఁచ కా
సారసగర్భుఁ డాడిన వచస్తతిఁ దెల్పి ముదంబుఁ గూర్పుమా. ౩౩౩

ఉ. మోమునఁ దోఁచు విన్నఁదనమున్ గనఁ గార్యముపండినట్టి రూ
పేమియుఁ గానరాదు తొర యెంతయు నేఁచెడు నెమ్మనంబు నే
నేమని యెంచనౌనో తగదే యిటు లూరకయుంట నారదా!
యోమునినాథ! తెల్పు మిఁక నున్నదియున్నటు నిర్విచారతన్. ౩౩౪

చ. అని తను హెచ్చరింప ముని యాహరి నల్లనఁ గాంచి స్వామి! నీ
కనఁ దెలియంగరానివన నారయఁ గల్గునె పద్మజుండు తె
ల్పనుగలఁడే ముహూర్తమును బాగిది యోగిది యంచు నిశ్చయిం
పనుగల శక్తిమంతుఁడె యపారమహత్త్వము నీదె గావొకో. ౩౩౫

చ. తెలిసియు నేమియున్ మదికిఁ దెల్లముగానటుగా నటింప నో
జలరుహనాభ! యేల? మునిసత్తముఁడన్ గద నే నటన్న క్రొ
వ్వలరఁగ నున్న నన్నుఁ గృపావర్ధిలఁ గావుము నాదుగర్వముల్
తొలఁగెఁ ద్వదీయదివ్యపద తోయరుహంబులఁ గొల్వ వచ్చితిన్. ౩౩౬

చ. తిరిగితి సిగ్గుమాలి గతధీవిభవంబునఁ బెండ్లిలగ్న మా
సరసిజసూతి తెల్పు ననుసంతస ముబ్బఁగ నింతదాఁక నో
పరమకృపాసముద్ర! ననుఁబట్టిన యీదురహంకృతిన్ మహా
దరమునఁ బోవఁజేయుము నితాంతము భక్తి యొసంగఁ జేయుమా. ౩౩౭

చ. తలఁచినయంత నేపనియుఁ దానె ఫలించుఁగదా మహాత్మ! నీ
యలఘుతమప్రభావ మదియా యజశంకరముఖ్య దేవతా
వళి కయినం దలంప నొకభంగిగనైనను శక్యమెట్లగున్
గళితము నాదు గర్వమని కాంచనచేల! తలంచి ప్రోవుమా. ౩౩౮

చ. శ్రుతులు తదంతముల్ తెలియు చొప్పెఱుఁగంగ నశక్యమంచు సం
తతము వచించుచుండఁ బరతత్త్వము నేన యెఱుంగువాఁడ నం

చతులితగర్వమూని చతురాననముఖ్యులకాజ్ఞ చేయ స
మ్మతిఁ గొనినట్టి నాదయినమానసగర్వ మడంగ నేటికిన్. ౩౩౯

చ. తెలియక నేనొనర్చిన ప్రతీపమనర్గళధరలేని యిట్టిత
ప్పులఁ గృప నెన్నకే ననుఁ బ్రభూ! యికఁ బ్రోవుము కార్యసిద్ధికా
వలయునటంచు నెన్నుము వివాహపువేడుకఁ జూడఁగోరి నా
తలఁపు ఫలింపఁజేయు మికఁ దామరసాక్ష! మహత్త్వ మేర్పడన్. ౩౪౦

చ. మనమున నజ్ఞకార్య మిది మంచి దటంచు నొనర్చినాఁడ నం
చనుతలఁ జెప్పుకల్లు నపుడాదృతి మీఱఁగ వానిఁ బ్రోతు వో
వనజదళాక్ష! నీదగు స్వభావమిదౌ నని నే నెఱుంగుదున్
గనుక విగర్వనన్నుఁ గృపఁ గాలముపుచ్చక ప్రోవ నెంచుమా. ౩౪౧

ఉ. నావిని యామురారి మునినాథునిమూర్తి నెఱింగి యిట్లనున్
దేవమునీ! యిదేటికో, మదిపం బరితాపముగల్గఁ బల్కెదో
యావిధి లగ్నమిప్పు డగునంచు వచింపక సాగనంపె నం
చీవిన యోక్తులే తెలిపె నింక విచారము మాని యుండుమా. ౩౪౨

ఉ. నాదగునాజ్ఞ నయ్యమరనాయకుఁ డాదిగఁ గల్గువారు స
మ్మోదముమీఱఁ దాల్ప విధిముఖ్యులు నీపదసంబురీతిగా
నేఁడియుఁ దప్పకే నడువ నెంచెదనట్టు లొనర్చినాఁడ నీ
వేని యెటుండనో ననుచు నెంచెదవో యటు లే నొనర్చెదన్. ౩౪౩

శా. పంచాంగంబును బాఱఁజూచి గ్రహసంపత్త్యుత్కటంబై బలో
దంచత్సౌమ్యఖగేశతన్ దగునవాంశాఢ్యంబునై విస్ఫురున్
గాంచంజాలని లగ్న మొప్పదగు నక్షత్రంబు పై తెల్పు మే
కాంచద్ధస్తముఖామరుల్ గన వివాహాంచోత్సవుల్ చేసెదన్. ౩౪౪

చ. ఒకరిని వేఁడనేల? సకలోద్యమముల్ తమయంతసాగు న
ట్లొకపరి నెమ్మదిం దలఁతు నూహా యదే సకలంబుసాగఁ జే
యక క్షణ మూరకుండఁగలనా నగవేటికి నీకు నారదా!
సకలము నాయధీన మనుసజ్ఞానము నీకును దేలకల్గదో. ౩౪౫

తే. ఇంతమాత్రకు జరిగించు నేటులయనిన, బ్రహ్మముఖదేవతాధీశ భావము లెటు
లున్నవో యని పరికింప సుమ్మమునుగ, గాని వేఱొకనికయిక కాదు మౌని!

తే. ఎల్లనిర్జరనాథుల యుల్లములను, దెలియఁజాలితి నే నిక దేవమౌని
పల్కు లికనేల కార్యంబుఁ బట్టుపలను,బూని సాధింత మెల్ల నాశ్చర్యపడంగ.

తే. చింత లెవ్వియు నీమది స్థితముఁ గాంచ,నుండఁబోలు బ్రోలుమా నీమనోత్తమాంగ
మందు నిల్చెనుగాదె కాలభైరవ మెల్ల, నెట్లు ప్రఖ్యాతి గాంతువో యెల్లదిశల.

తే. నీవె తలపోసికొనవయ్య నిర్జరముని, వర్య! యిటునటుచూడక వైళమ తగు
మూహుతంబును నిశ్చయింపుము మదాజ్ఞ,సర్వమును సాగుఁ జెప్పినచందమునననె.

ఆ. అనుచు హెచ్చరింప నమరమానియుఁ దన,పట్టినట్టిపనియు ఫలమునొందు
కాలమరుగుదెంచెఁ గా యని తలఁచుచుఁ,బోయె నిశ్చయంబు చేయ దాని.

ఆశ్వాసాంతము.

క. పరిశుద్ధస్ఫటిక విభా, సురదేహా సర్వలోకశుభసందోహా
కరచారుమహితవిభవా, గురురూపా ధృతమహాహి కూటకలాపా. ౩౫౧

మ. అరిషడ్వర్గవినాశకారణ పవిత్రాఖ్యా, మదేభాంగసం
వరణోద్దామ పరాక్రమప్రజిత దేవవ్రాత నక్తంచరే
శ్వర నిర్మూలన సంగతప్రమద తచ్ఛర్మాంబరాదాన క
ర్మరతా; చక్రిముఖార్చితాంఘ్రియుగ పద్మా వేదవేద్యాహరా! ౩౫౨

మాలినీ:—

అమలసుగుణహారీ హర్షభూమీవిహారీ
శమనదమనమోదా సంతతత్యక్తఖేదా
సమదదనుజకాలా సాధుసందోహలోలా
ప్రశమితసురతాపా రమ్యసంవాసనీపా. ౩౫౩

గద్యము. ఇది శ్రీమత్త్రిపురసుందరీ కరుణావాప్త గీర్వాణాంధ్రకవితాప్రాభవ, కాశ్యపాన్వయప్రభవ, శ్రీజనమంచి వంశాంబురాశికుముదినీమిత్ర, సుబ్రహ్మణ్య మనీషిపుత్త్ర, తాండవకృష్ణాపరాభిధేయ, శేషాద్రినామధేయ వినిర్మితంబైన సర్వమంగళాపరిణయంబను మహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ.



శ్రీ ర స్తు.

# సర్వమంగళాపరిణయము

## పంచమాశ్వాసము.



క. నిర్మలరజతాచలరా, ట్కర్మదమణికూటనటవిటపిమూలలస
ద్ఘర్మమయపీఠగుహగజ, చర్మకృతావాస! మౌనిసన్నుతదేవా! ౧

వ. మహాప్రభూ! తరువాతి విచిత్రభవన్మహిమైకబోధకవృత్తాంతం బవధరింపుము.

శా. శ్రీరాథేశ్వరు మందిరంబునఁగనం జిత్రంబుగా యత్నముల్
ప్రారంభించిరి పెండ్లిమూర్తమున కన్యారీతులన్ జేయ సం
భారంబుల్ సమకూర్పఁగాఁ బడియె గ్రావ శ్రేణులోయుంచు నె
వ్వారుం జూచుచు సమ్మతంపడఁగ దేశశ్రేణు లెంతో తమిన్. ౩

ఉ. నారదుఁ డెన్నినట్టిలగ్నంబు సమీపమునందె వర్తిలన్
శ్రీరమణుండు మానిపతి చెప్పినయట్టులె చేయుఁడంచు గం
భీరరవంబునం బలికెఁ బెండ్లికిఁ బిల్వఁగఁబోయి రెందఱో
సారపదార్థసంచయము సల్పగనాఁగవ యుంచు నిష్ఠసల్. ౪

ఉ. వేడుకమించ నొండొరులఁ బిల్చుచు వస్తుచయంబుఁ గూర్చుచున్
గూడికమీఱ స్వనికిఁ గొంకకచేయుచు రత్నరాసులం
బోడిమిమీఱఁ గూర్చి సుకపుంగవపూజితపాదపద్మునిన్
వేడి కనంగఁ జేయుచు సువిస్తృతమోదముఁ గూర్పఁజాలుచున్. ౫

ఉ. భోజనవస్తువారముల భోగపదార్థతతిన్ మనోజ్ఞస
ద్వాజికదంబకంబు గజసంఘసమూహము స్యందనా వి
భ్రాజితరత్నసంఖచిత రమ్యవిమానగణంబుఁ గూర్చి రెం
తో జతనంబుమించునటు లూహలు నైకములుఁ [illegible] ౬

ఉ. అచ్చెరమిన్న లెల్ల సముదాధిపవానతి మాతలంటఁ బెన్
ముచ్చటఁ బాల్చి శ్రీహరికిఁ బూని [illegible] లోనప్పుడే [illegible]
[illegible] నిదే యదృష్టమని [illegible] గదా మనకెల్ల [illegible]
స్పచ్చుపడంగఁ జేరిరి ముదాసుకధాజాసు [illegible] ౭

చ. ఎవ రెవ రెట్టి కార్యముల ◊ నెట్టు లొనర్పఁగవచ్చునో యటుల్
సవిధిగఁ బార్షదోత్తములు ◊ సర్వవిధంబులఁ గట్టుపాటు ల
త్యవహితచిత్తముల్ పొలయ ◊ నట్టు లొనర్చిరి వానిమీఱకే
దివిజసరోజనేత్రలు విధిజ్ఞతమించ నొనర్చి రాదృతిన్. ౮

మ. ఇది వైకుంఠముగాదు మున్నెపుడు మౌనీంద్రోత్కరంబైన ని
ట్టి దశం బొల్చుటఁజూచినారె పరిపాటిన్ మించి నూత్నంబుగాఁ
గఁ దగెన్ దీనిమహత్త్వమిద్ధి నవలోకంబే యగున్ గాని ప్రాఁ
తది గాదంచును నిశ్చయించిరి సురల్ ◊ తచ్చిత్రసమ్మోహితుల్. ౯

మ. పరమాత్ముండును దుర్విభావ్యమయి యొప్పంజాలుచున్ వైష్ణవీ
పరితోవ్యాప్తయశంబు గాంచి విభవభ్రాజిష్ణుతం బొల్చి దు
ర్భరమై యొప్పెడుమాయఁ గప్పిన మునీంద్రస్తోమముల్ దేవతో
త్కరముల్ పెండ్లికిఁ బోవుయత్నముల లోఁగం జాలె నద్దక్కటా! ౧౦

మ. తనపై భారము సర్వమున్ నిలిపె నాదామోదరుం డంచు నెం
చు నిలింపర్షియు దేహవిస్మృతిని గాంచున్ బొంగు నొక్కొక్కవే
ళను శంభుం డిఁక నీవివాహముచఁ జాలం డాత్మమోదంబుఁ గాం
చ నటంచుం దలపోయు దైవి తను నేఁచన్ బుద్ధివిభ్రంశతన్. ౧౧

చ. మునిని బరీక్షచేయుటకుఁ ◊ బూని రమేశ్వరుఁ డాత్మమాయఁ గ
ప్పిన నొడలే యెఱుంగక తపించుచు నద్దియె కౌతుకంబుగా
మనమున నెంచుచున్ దనదుమాటయె సాగు నటన్ననమ్మికం
గనుచుఁ జెలంగుఁగాని మునికాంతుఁ డెఱుంగఁడు చక్రియూహలన్. ౧౨

చ. హరుని వితాకుచెందునటులౌనె యొనర్పఁగ నేరికైన నం
చరయఁగఁజాలియున్ దనమహత్త్వము మాయయడంగఁ ద్రొక్క నీ
శ్వరు నొకదేవతుల్యునిగ ◊ భావమునం దలపోసి శైలజన్
హరికిని గూర్ప నెంచె నిఁక ◊ నజ్ఞత దీనిని మించియుండునే. ౧౩

చ. శతధృతి యొక్కఁ డీవిధముఁ ◊ జక్కఁగ నెంచియు శంభువాంఛితం
బితరుల కించుకేఁ దెలియ ◊ నెట్టులుశక్య మటంచు నెంచియా
హితమును దాఁచి తాను బది◊వేలవిధంబుల దేవమౌని సం
గతి మెలఁగంగ నెంచినటు ◊ కాలముపుచ్చుచు నుండె నేర్పునన్. ౧౪

క. హరిహరులకు భేదంబనఁ, బొరయునె యిదియేటిపెండ్లి◊మూర్తం బని ని
ర్జరులును దలంపనేరరు, హరి గప్పినమాయ తమ్ము ◊ నలముకొనంగన్. ౧౫

క. అల్లగిరిజాతఁ గైకొను, ఫుల్లసరోజాక్షుఁ డంచుఁ ◊ బొంగుచు మును లు
త్ఫుల్లమన స్సరసిజులై, సల్లాపములం దె గడుపఁ ◊ జాలిరి దినముల్. ౧౬

క. ఆవిధ మంతయుఁ గనుచున్, వేవిధములఁగాంచినన్ | స్వవిషయ మితరు లి
ట్లీవిధి సాగంగల దని, భావింపఁగ రానియట్లు | వర్తిలె హరియున్. ౧౭

క. సురలం దొక్కొకపని కొ,క్కరుగా నియమింపఁబడుచుఁ | గౌతుకమునఁ గా
ర్యరతిన్ మెలఁగుచుఁ బెండ్లికి, నరుగం దలపోయుచుండి | రాసమయమునన్.

## మేనాహిమాచలసంభాషణము.

క. హిమగిరినాథుండు నమ,ర్త్యమహాని యటుపోయి సుసమయంబుఁ దెలుపుదున్
సుముహూర్తమునకు వలసిన, సమస్తవస్తువులఁ గూర్పఁజను నని చనియెన్.

క. ఇంతకు రాదుగదా వృ,త్తాంతం బేదియును మానితల్లజునంకన్
వింత యిదిగాదె మునిదగు, పంతమునకు విఘ్న మొందు | పాటిలియుండున్.

క. కన్నియ యొక్కరుఁ గోరిన, సన్న సరోజాక్షుఁ డెఱుఁగఁ | జాలఁడొకో స
ర్వోన్నతుఁ డాతం డిప్పని, నెన్నక యంగీకరించునే మునినుడులన్. ౨౧

క. బహుపత్నీసంయుతుఁ డా,యహిరాట్శయనుండు నాదునాత్మజచిత్తం
బహిరా డుర్భాషణునందే, విహితంబుగ నుండఁగోనఁగ | వేడ్కంగనునే. ౨౨

క. ఆవిషయంబు నెఱుంగక, దేవర్షి ప్రమోద మూని | దీనిఁ దెలుప సం
భావించినట్టు లుండఁగ, నావిధ మెఱుఁగంగలేక | యత్నించెనొకో. ౨౩

క. కానీ యేవిధిసాగునొ, దీనిం గనుఁగొందు ననుచు | దితిజారియుఁ బెం
పూనిననూహల నుండుట,మానియు నెఱుఁగండొ యేమొ | మతిప్రభడూలన్.

క. ఇం కేనే యొనరింపఁగ, శంకన్ విడనాడవలెనొ | సన్మునినుడులే
వంకఫలింపఁగఁజాలున్, శంకరు నిష్టం బదెట్లు | సాగునొ యెఱుఁగన్. ౨౪

క. ఏయత్న మింతదనుకం, జేయక నేనున్న బంధుచిత్తంబులు నన్
మాయికుఁడని నిందింపక,యే యుంతునె చేయఁదగిన | దేదియొ యింకేన్. ౨౬

క. నవలావణ్యకలాపం,బవురాయని మెచ్చఁదగినయ ట్లొప్పఁగ నై
మవతియుఁ బ్రౌఢగ నలరం,గ వచ్చునే పెండ్లిచేయకయె యుండంగన్. ౨౭

క. విహితంబగు పద్ధతి నా,దుహితృనభిప్రాయముఁ గొని | తోడనె దానిన్
బహిరంగపఱుప కాదృతి, వహించి చర్చింపఁదగు వివాహవిషయమ్మై. ౨౮

క. కన్నియయాశయమే యిఁక, నెన్నటికే సాధుఫలము | నిచ్చెడునని నా
కెన్నియొ భంగులఁ దోఁచెడు, నన్నా! యిఁక నూరకుండ | వగు నేత్రోవన్.

క. నాకాంతయు నీవిషయం, బేకాంతమునందుఁ జెప్ప | నెంచుట తలఁచన్
నాకున్నయట్లె కలఁతయు, నీకార్యమునందుఁ గల్గియే యుండుఁగదా. ౩౦

క. కనుక నిఁకన్ మునిపతియా,జ్ఞను బాటించుచునె యల్పసమయము గడుపం
జను నంతఁ గన్నెయిష్టం,బునె తెల్పఁగ నేఁ దలంపఁబోలునుగాదే. ౩౧

క. హరుఁ డల్లుఁడగుచు నిచ్చటి, కెటు దెంచునొ చక్రధరుఁడె | యల్లుఁడగుచున్
గరమరుదుగ నేతెంచునొ, యరయంగాఁజాల నైన | మది యెక్కుడుగా. ౩౨

క. అని తుహినాచలవర్యుఁడు, తనమది యోజించు చుండు దరుణంబున నా
తనిసవ్యకరము కంపిం,చెను సవ్యాంఘ్ర్యక్షు లదరెఁ జిత్తము కలఁగన్. ౩౩

క. ఈరీతి దుర్నిమిత్తము, లారంభములై యుదారమగు తద్హృదయ
స్ఫారజ్ఞాన మడంపం, గోరిక లిట్లట్లు పొరల గోత్రేశుండున్. ౩౪

క. మనము వికావికలై యుం,తనరానివెతం గనంగఁ నష్టతఁడు తలం
చినదానికి భంగము గ,ల్గునుగా యని నిశ్చయించుకొనుచుండంగన్. ౩౫

క. పతగంబులు రుతముల మా,నితల్లజుని యాశయంబు నిష్ఫలదం బ
చ్యుతుభావ మెఱుఁగక యసం,గతముగ నిప్పనికిఁ బూనెఁగా యని తెలిపెన్.

క. పక్షిరుతంబులయర్థం, బక్షయముగ నెఱుఁగఁజాలు నాతఁడు నిర
పేక్షించి యట్లయగునా?, త్ర్యక్షుని బెండ్లాడఁ గలదె తెఱవ యటంచున్.

క. తలపోయుచు నిఁక నెయ్యవి, గలుగంగాఁగలవొ కార్యగతు లయ్యవి య
ట్టులుసాగునొ కనుఁగొనియెదఁ, దలమే దైవమును మార్పఁదలఁచు టెవరికేన్.

క. నాతనయ యదృష్టం బది,యేతెఱఁగున నలరునొ యటులె సాగును నా
చేతమునందలి శంకా, వ్రాతము విడనాడువాఁడ రయమున ననుచున్. ౩౮

క. తనయిష్టదేవతా నుతు, లొనరించుచునుండె దైవ మున్నది కార్యం
బును దీర్ప నేల శ్రమములఁ, గనఁగా నను నూహ పొలయఁగా సుఖముండెన్.

ఉ. మేనయు నొక్కనాఁడు మది మించినకోరికఁ బ్రాణనాయకున్
గానఁగవచ్చి పెండిలి యిఁకన్ జిరకాలము పుచ్చకుండఁగా
నే నొనరింప నంటిరికదా మును పిప్పుడు తత్ప్రియత్నముల్
గానఁగరాదు చేసినటు కారణమేమొ యెఱుంగ నింతయున్. ౪౦

ఉ. నారదుఁ డేగి వేగ లగనంబు పితామహుఁ డెన్నఁ డౌననున్
జేరఁగఁ బంపువాఁడ నొకశిష్యునిమూలముగాఁగ దాని నం
చూరక పల్కిపోయినటు లూహజనించెడు నింతదాఁక నె
వ్వారిని బంపకుంటఁ, దరువాతివిధం బెదియో తలంచితే. ౪౧

ఉ. సారసయగకలాపమున సన్నుతశీలమునన్ సువిద్య వి
స్తారతపోవిభూతి సుయశంబున మించెడుకన్యకామణిన్
గోరికమీఱ సద్వరునకున్ విధియుక్తి నొసంగి జన్మముం
జేఁగనీని సత్ఫలముఁ జెందుటయే మన కర్హమౌఁగదా. ౪౩

ఉ. మానమటంచు మేషమని మించినపట్టుదలన్ గణించుచున్
మానులమాటలన్ వినుచు మంచిది మంచి దటంచుఁ గాలమి
ట్లూనినదుర్దశన్ గడపుటొప్పునె నిద్రయు భోజనంబు నె
ట్లౌను హితంబు లిత్తఱిని నైనను బూనుము తీర్పఁ గృత్యమున్. ౪౪

ఉ. చిన్నది కోరినట్లుగనె ♦ చేయుటయో మఱితల్లిదండ్రులా
కన్నియ కీడుజోడయిన ♦ కాంతునిఁగూర్చుటయో పొసంగు ని
ట్లున్న సనాతనాచరణ ♦ మొయ్యన వీడి నిజేచ్ఛ నీటిలో
నెన్నక నానపెట్టినటు ♦ లీశ! కుమారముసుండఁ జెల్లునే. ౪౫

మ. మది నాహారములున్ విహారములు వేశ్మవ్రాతముల్ చిత్తశ
ర్మద వస్తువ్రజ మింకనుం గలమహార్హస్థానముల్ పెండ్లికొ
ప్పిదమైయుండు కుమారి యింట వగలున్ ♦ పీడింపఁగా నుండఁజూ
చుదశం గాంచినతల్లిదండ్రులె కదా ♦ క్షోణిన్ నృశంసుల్ విభూ! ౪౬

శా. ఏతన్మాత్రము నీవెఱుంగనిదికాదే బేలనై యుంట నా
చేత న్నుండఁగనీని కారణమునన్ ♦ జెప్పంగనూల్కొంటి నీ
వేతాదృగ్గుణరత్నభూషితుఁడ వంచెన్నంగ లేదంచనున్
శీతాద్రీశ్వర! సుంతనామనవి నీచిత్తంబునం బెన్నుమా. ౪౭

మ. అని బోధింప హిమాచలేంద్రుఁడు ప్రియాబారంగ నాప్రేయసిం
గని సన్మానముమీఱఁగాఁ బలికె; నిక్కంబె భవద్వాక్యముల్
ముని శిష్యుండును రాఁడు హేతువెదియో ♦ పూఁబోఁడిరో యింతదాఁ
క నదే యెన్నుచు నున్నవాఁడ నటలోగ్నంబున్ వితర్కించుచున్. ౪౮

శా. కాలక్షేపము చేయుచున్ మునులసాంగత్యంబునన్ సత్కథా
జాలంబుల్ పచరింపఁగా వినుచు నీకార్యంబుఁ జింతింపఁగాఁ
జాలండో, హరిసమ్మతింపమి మహాశంకల్ తనున్ నొంపఁగా
వ్యాలోలాత్మత నెవ్వొనిల్చెనొ పురాహం బిద్ది చంద్రాననా! ౪౯

మ. మనమింతేఁ దొరఁబూన శాప మిడునామౌనీశ్వరుం డంచునో
వనితారత్నమ! తోఁచుచున్నయది తద్భావంబునన్ వెన్నయే
యనవచ్చుంగద సుంత గాసిలఁగఁజేయన్ మాన్పఁబొందఁగఁ
చ్చు నదెబ్బంగిఁ బ్రసాదముం గనునొ యంచున్ భీతిఁ గందెంజుమీ. ౫౦

శా. మానిస్వాంతము కోమలం బది యవేమాడ్కిన్ దురారాధ్యమే
యా నోమానిని కత్తిసా మనెడువాక్యంబుంట యాలింతువా
దే నే నద్ది యెఱింగియే సకల మీవే తప్పనౌఁజూ మ్మటం
చానాఁడే వచియించినాఁడ మునివాక్యం బింక రాకుంపటన్. ౫౧

మ. ఎదిచేయం దగునింకఁ బెండ్లివిషయం ♦ బిట్టౌనటం చింతకై
నఁ దలంపం బనిపూనలేదు మును మేనారాయమబుం బేర్కొనన్
గఁ దనంతం జనుదెంచి నారదుఁడు నిక్కం బెటుసాధింతు స
మ్మదమంచున్ దుద కెన్న నిదుహింత నామాటల్ చెవిం బెట్టుమా. ౫౨

శా. అంచుం బల్కెను దానినమ్మితిని లేమా! లగ్నసిద్ధాంత మి
ట్లంచుం దెల్పెడు భార మామునిదిగాదా దానికై వేచి యి
ట్లెంచన్ రానివెతల్ మదిం గలఁపఁగా నేయత్నముం జేయకే
కించుంబోలి త్రపాభరం బొగిననుం గీడ్పాడు నొందింపఁగన్. ౫౩

క. తలయెత్తి తిరుగఁ బూనిన, నలువురు ననునట్లె కాంచి నవ్వుదురని యో
లలనా! యున్నాఁడను నా, తలఁపులు వ్యాపింప విఘ్న దైవ మెదిరిగాన్. ౫౪

క. ఏమగునో యీకార్యం, బామానియు విషమకార్యమందున్ నన్నున్
దా మెలఁగఁజేసె నేటికొ, యేమెయి యోజింపఁ దోఁప దించుకయు మదిన్.

క. దీనన్ లాభం బింతయు, మానీంద్రున కెన్న లేదు మహిళామణిరో
తానయి వచ్చియె నన్నుం, బూనుచుట యనంగ వింతసో యెటు లెన్నన్. ౫౬

క. నాపనిచిన శిష్యుఁడు మీ, రేపని యెటుచేయఁదగునొ యెప్పుడు లగ్నం
బో పలుకు నంతదనుకన్, జూపెట్టియె యుండుమ యనుచుం జెప్పి చనెన్. ౫౭

క. ఇంతకు రాఁడట నేమే, వింతలు పుట్టెనొకొ దేవవిభుఁ డేమనెనో
పంతము గెలువమిఁ జింతా, క్రాంతమనస్కుం డగుచును గానకుఁ జనెనో. ౫౮

క. మనమింక నూరకుండం, జనదని యేకార్యమైన సలిపిన మునియుం
జనుదెంచునే మహాపద, లొనఁగూడుం దోఁపకున్న దోకమార్గంబున్. ౫౯

క. ఇంకం గొన్ని దినంబులు, శంకలు విడనాడి మాని సత్తము రాకం
బంకజనయనా! కోరుచు, గింకరులం బోలియుంట కీర్తిదముసుమా! ౬౦

క. అప్పటికిని రాకుండినఁ, జెప్పకయే పెండ్లి మనము చేసినయట్లే
తప్పు మనపైనమోపఁగఁ, జొప్పడ దెబ్బంగినైన సుందరవదనా! ౬౧

క. కొన్ని దినంబులు సాగఁగఁ, గన్నియ యేవాంఛఁగనునొ కాదనక యదే
యన్నివిధంబులఁ దగునని, క్రన్ననఁ జేయుదము దానఁ గలుగవు ముప్పుల్.

క. భగవంతుఁడు మన కయ్యది, తగియుంటం దప్పు గాఁగఁ దలపోయం డం
చు గణించెద నోసుదతీ, తగు నీకును సుంత యోర్పు ధైర్య మ్మిచటన్. ౬౩

క. అని నొక్కి నొక్కి పల్కిన, విని మేనయు నవ్విధంబు విహితమెయగు నం
చును దలఁచి యూరకుండెను, వనితలు నాథానురూపవర్తనలుగదా. ౬౪

క. కొలఁది దినంబులు సాగెను, గలవిలపా టెక్కుడయ్యె గ్రావపతికి న
ట్టులె తత్సాధ్వికి నయ్యది, తలపోయంజాలె శైల తనయయు మదిలోన్. ౬౫

### పార్వతి స్వాభిప్రాయముం దెలుపుట.

చ. జననియుఁ దాతయున్ దనప్రసంగము నే సతతం బొనర్చుచున్
మనములు కుంద నుండుగతి మానక తానును లోఁదలంచుచున్
మునిపతిపంత మెన్నుచును భూతవిభూక్తుల నమ్మి యొక్కనాఁ
డనియెను దల్లితోడ హృదయాంతర సంగతభావ మేర్పడన్. ౬౬

శా. నన్నుంగూరిచి చింతనొందుగతి నెన్నన్ వింతగాఁ దోఁచెదన్
మన్నింపదగు నాదుమాటలకు నాకమానీశు వ్యాపారముం
గన్నుం జింత యొసంగుఁజుమ్ము జననీ! కామారిపై నాస మా
నన్నుం ద్రిప్పఁగఁజూచుఁ గాదె తగునే న్యాయంబొకో మానికిన్. ౬౭

మ. నొసటం దొల్తనె వ్రాసియుండు విధి యెన్నంజాలకే దాని జం
తుసమూహంబు విచారముం గను మనోదోషం బనంజెల్లు దా
ని సమస్తంబును గర్మమే నడపు దానిన్ మాన్పఁగా మార్పఁగా
బిసరుహాదు లశక్తులే యన నికన్ వేతొక్క పల్కొప్పునే. ౬౮

ఉ. ఈవిధ మీవెఱుంగనిదె యేటికి నిట్లు విచారమూన నా
జీవిత మెట్టిదో యనుచుఁ జింతిల నంచు నహర్నిశంబు నే
నీవిధమే తలంతు నను నెల్లవిధంబుల వృద్ధినొందున
ట్లీవును దండ్రియున్ సతత మెంతు రొనర్పఁగ నింత నిక్కమా. ౬౯

ఉ. ఐనను నాయదృష్ట మిటులంచుఁ దలంపఁ దరంబుగామి నీ
వైనను దండ్రియైన మది నారయ కివ్విధి నింతవంతలం
బూని కృశింపనేల? మునిపుంగవుమాటల బేలువోవఁగా
మానక దానినే దలఁప మంచిదియే యిదియేమి వెఱ్ఱియో. ౭౦

ఉ. ఏపనులైన మాని విసుగే జనియింపని యట్టిరీతిగాఁ
దాపసుమాట లెన్నుచును ధైర్యముపోవఁ గృశింపనేలొకో
నాపలు కొక్కఁడైనను వినం దగదంచుఁ బ్రతిజ్ఞ చేసి నా
రో పలుకంగరాదె యిఁక నోపికనూనుఁడు దైవ ముండెడున్. ౭౧

ఉ. కాదని మీరు చేయుపని కానఁగరా దిసుమంతయైన న
న్నే దలపోయుచున్ సమయ మెన్నుచునుండినఁ బొంక్కి యానొకో
నాదయితుం డెవండో యని నాకుఁదనైన నెఱుంగఁజాలునే
మీఁద నదే యెఱుంగనగు మించిన దే మిపు డిట్లుచింతిలన్. ౭౨

చ. జానుగఁదండ్రిఁ దెప్పుము విచారముమాని సుఖంబుహొందు మో
మానిని నీవటంచు నుమ మంచినుడుల్ పలుకంగ నంతటన్
మేనయుఁ బుత్రిభావమును మేఁనిమెచ్చుచుఁ బ్రాణనాథునిం
గానఁగఁబోయి తెల్పె సుతకప్రనయోక్తుల విస్మయమ్మునన్. ౭౩

శా. గ్రావాధీశ్వరుఁ డంతయున్ విని తమిన్ గన్యామణింజేరి యు
మ్మా! పీనుల్ ఫలవంతముల్ గలిగె భాగ్యం బిట్లునీసూక్తులన్
బ్రావీణ్యంబు వినం గనంగఁ దనయా! పల్కంగనేలా యిఁకన్
నీవాంఛల్ ఫలియించు కాలమునకే నే వేచియుండుం జుమీ! ౭౪

చ. తెలిసియు శాస్త్రరీతులను ఽ దెల్ప నెఱింగియు స్వానుభూతిమై
ఫలమును గాంచఁజేయ నిదిఽపొందితి యున్నను లేనియట్లెకాఁ
దలఁచితి నిప్డు నీనుడుల ఽ తత్త్వ మెఱింగితి నింకమీఁద నీ
పలుకులు వేదవాక్కులని ఽ భావమునం దలపోయుదుంజుమీ. ౨౫

చ. తొలిజనియందె కాక తమిఽతోఁ బలుజన్మములందు మంచి వా
ఫలములు గల్గఁగోరుచుఁ దఽపంబుల నెన్నిటినో యొనర్చి త
త్ఫలముగ నిన్నుఁగంటి నిఁక ఽ ధన్యుఁడ నంచుఁ దలంచువాఁడ నీ
తలఁపు ఫలించుగాక పరఽతత్త్వము తోడగుఁగాక యెప్పుడున్. ౨౬

చ. తనయెడఁ గుందుమానునటు ఽ తప్పక నీజనయిత్రి కిప్డె నే
నొనరుతు నేవిచారముల ఽ నొందనుజుమ్మి కమీఁదఁ దల్లిరో
పనియెటు సాగునో విధిని ఽ బట్టి కనుంగొనుచుందు సాక్షిమా
త్రునిగ ననుఁ సతంబు తలఁఽతుఁ సుఖమొందుదు నిర్విచారతన్. ౨౭

ఉ. కర్మమె సర్వకార్యము లఽఖండమహత్త్వమునం బొనర్చు నం
చర్మిలి నిశ్చయించుకొని ఽ యాత్మయు శాంతమునం జెలంగ నే
శర్మమొ కష్టమో యెపు డెఽసంగిన దానిని బొందువాంఛమై
మర్మ మిదే స్వకర్మగతిఽమార్గమునం దని యెంచుచుండుదున్. ౨౮

కుసుమవిచిత్రము:—

తలఁపను జుమ్మింఽతయు మునిమాటన్, బలువగ లొందన్ ఽ బటుతరధైర్యం
బు లలిఁ జెడంగన్ ఽ బొనరుచుఁగానన్, సులలితబుద్ధిన్ ఽ సొగియుదు నింకన్.

కవిరాజవిరాజితము:—

మునియరుదేరఁగ ఽ ముందటిమాటల ఽ మూరొకన నెన్నక ఽ మోమున బల్
వినయముతోఁ బఁగ ఽ వేడుక హెచ్చఁగ ఽ వేఁడుదు నేపని ఽ విం దొనఁగూ
ర్పను వినిపింతువొ ఽ బాగుగ సల్పుదుఁ ఽ బట్టియు సమ్మతిఁ ఽ బల్కినచో
నవిని యామని ఽ యాదృతిదోఁపఁగ ఽ నాడెడుపల్కుల ఽ నన్నిఁటినిన్. ౩౦

ఉ. నీవును విందుగాదె మఱి ఽ నీకెటుతోఁచిన నట్లెపల్కుమా
దేవమునీంద్రుఁ డత్తఱిని ఽ చెల్వునొ యేమని దానినెన్ని నీ
భావముకేతి వర్తిలుమఁ ఽ బల్క మఱొక్కవిధంబుగాఁగ నే
నేవిధిఁ గార్యమున్ జరపనెంతునొ నీవె కనుంగొనం దగున్. ౩౧

ఉ. ఇన్నిటి కేమిగాని భవఽదీప్సితమే కొనసాగునంచు నే
నెన్నుదు నిప్డు నీ విచట ఽ నింతగఁబల్కిన మాటలందునేఁ
గన్నవి నీదువాక్యపుడు ఽ కాదనృతంబని యట్లుగాన సం
పన్నుఁడ నన్నిచందములఁ ఽ బావనుఁడన్ నినుఁ గూఁతుగాంచుటన్. ౩౨

మ. అని సంతోషము పొంగుచుండ నుడులత్యానంద మింపొందఁగా
ర్పునవై యొప్పఁగఁ బల్కఁగా విని హిమాంశుభ్రాజమానోత్తమాం
గుని నార్తావనదీక్షు సాధుజనపక్షుం ద్ర్యక్షునిన్ నెమ్మనం
బునఁ దా నెంచుచుఁ దల్లిదండ్రుల ముదంభోరాశినిన్ ముంచుచున్. ౮౩

చ. తనమది నేవికారములు తట్టకయుండఁగ నాతిమిన్న శం
భుని కయిఁబట్టు టెప్పుడని బుద్ధిఁ దలంచుచునుండె; శీతభూ
ధ్రనృపతి దేవమౌనిలపితంబులనెల్లఁ దలంచుచున్ మఱే
పనియును జేయఁదోఁపమిని బార్వతిసూక్తులనే స్మరించుచున్. ౮౪

ఉ. నారదురాకఁ గోరుచు ననంతరకృత్య మదెట్లు సాగునో
సారసనేత్ర వాంఛితము సత్ఫలమందునొ యెట్టులంచు వే
సారక చింతచేయుచుఁ బ్రసంగము లెవ్వియుమాని పెండ్లిసం
భారములెల్లఁ గూర్చుపని స్వాంతమునం దలపోయుచుండెఁ దాన్. ౮౫

ఉ. అచ్చటివారలెల్ల నచలాధిపుఁడేజతనంబు మాని యే
ముచ్చటలైనఁ జేయక సముద్రునిరీతి గభీరచిత్తుఁడై
వచ్చుచుఁ బోవుచుండు సురవర్యులతో మును పట్లుపల్కఁ గే
యిచ్చయు లేకయుండు టిది యేమని యెంచుచునుండి రాత్మలన్. ౮౬

చ. విచికిలగంధి చేడియలు వింత ప్రసంగములందు శ్రీపతిన్
బ్రచురవిశేషకీర్తియుతు భద్రదు శర్మదు సన్నుతుల్ పొన
ర్చుచు గిరిజాతచిత్తగతిఁ జోద్యముగాఁ దగియుండుటం దలం
చుచు నిదియేమొయంచు నటుచూపుల నద్రిజ తమ్ముఁ జూచుటల్. ౮౭

చ. పలుమఱు సంస్మరించుచు సుపర్వమునీంద్రుని యాజ్ఞఁ జొప్పునన్
మెలఁగుట కృత్యమం చదియె మేలొనఁగూర్చెడునంచు నెప్పుడున్
దలఁచుచు విష్ణుకీర్తుల నితాంతము గేయములందుఁ జొన్పి యా
జలరుహనేత్ర వీనులకు సంతసముం గలిగింప నెన్నుచున్. ౮౮

చ. విసుగుజనింపకుండఁ గడువింతగఁ బాడుచుఁ దన్విచిత్తమొ
క్కసరణినుండుటల్ దలఁచి కాంతవిపర్యయ మొందినట్లు నెం
చుసమయ మొక్కఁడైనఁ గనుచొప్ప గనంబడమిన్ విచారరూ
పసముధికోదధిన్ మునుఁగఁ బాల్పడుచుండిరి నిస్పృహాల్ తగన్. ౮౯

తే. నిస్తరంగసముద్రంబు నెగడునట్లు, తుహినశైలేంద్రుఁ డుత్కంఠతోఁ జూచుచుండె;
నంత నారదమునిరాజు సంక్రందనాది, నిర్జరేంద్రులు తనయాజ్ఞ నెమ్మి వినఁగ.

తే. త్రిదశులెల్లరు నింద్రాదిదేవవరుల, యాశతిం బెండ్లివారలెల్ల సతిజనముఁ
జేయుచుండంగ దూతను శీతశిఖరి, తన్నుజునిచెంత [illegible] [illegible] నెలమి.

ఆ. దేవదేవునాజ్ఞఁ దీవ్రరూపంబున, దైవి విష్ణుమాయ తన్నునట్టి
యాపరింపమఱచె నద్రీశుకడఁ దన, పలికినట్టివాక్యముల విధంబు. ౯౨

ఆ. అదియెకాదె మాయ దగుశక్తి యెవ్వారి, నైన నెట్లుచేయ నాత్మఁ దలఁచు
నట్లుచేయఁజాలు నప్రతిహతశక్తి, దానిమీఱఁజాలఁ దగ రదెవరు. ౯౩

సీ. శ్రీహరియును మానిజిష్ణుని బుద్ధిమాంద్యము నెంచి యదియెకార్యంబునందు
సాయంబుగాఁదగు జగతినెల్లను గర్మగమనము లూహింపఁగాఁ దరంబు
గానివైయుండు నిక్కమ్మంచు నెల్లరు నెఱుఁగుదు రద్దానినే హరునకు
నాకును భేద మొకన్నంగ లేదనుభావ మేర్పడు దుష్టాత్ము లెల్లఁజెలఁగి

ఆ. చేయుచుండునట్టి సిద్ధాంతములు హితములను భావమెల్ల విలయమొందు
ననుచుఁ దలఁచుచుండె నాకార్యమునఁ దన, కెలమి గలిగినట్లు పలుకులలర.

క. ఆవిధ మానారదముని, భావింపఁగ నేరకెంతొ ప్రమదంబున నా
శ్రీవిభునకు నుద్వాహముఁ, గావింపంబూని యెల్లకార్యములందున్. ౯౫

క. తానే కర్తగఁ దలఁచుచు, నేనిర్జరులైన తనకుహితమునె కూర్పం
గానెంచి పనులొనర్తురు, నా నెలమింగాంచి గతమనస్కుం డగుచున్. ౯౬

క. అదియే మిదియే మనుచుం, ద్రిదశుల నదలించుచున్ విరోధిం దలఁగింపం
గఁ దనకు సాధ్యంబను నూ,హదగన్ జరియించుచుండె నాహరిపురినిన్. ౯౭

క. ఎల్లపదార్థంబులు నీ, యుల్లంబునఁ దలఁచినట్లె యొప్పెడు నివిగో
యొల్లి పయనంబుచేసిన, నుల్లాసముమించ వత్తు మోహునినాథా! ౯౮

క. మావలన నించుకంతయు, నేవిధమున లోపమను నదే లేదని యా
దేవతలు విన్నవించిరి, శ్రీవిభుకడనున్న మానిజిష్ణుని చెంతన్. ౯౯

క. ఆమాటల శ్రుతిహితములు, గామానియు నాలకించి కాంచనచేలున్
శ్రీమానినీమనోహరు, వేమఱు దిలకించి పలికె విశ్వేశ! హరీ! ౧౦౦

క. నీయుద్వాహమునకుఁగా, నీయమరులు వస్తువార మెంతయుశ్రద్ధన్
బాయక యొనఁగూర్చిరికన్, నీయనుఁగుఁగళత్రమణుల నెమ్మిం గొనుచున్.

క. పయనము సాగింపఁగనీ,వె యనుగ్రహ మూనవలయు నెడమెంతయొ లే
కయె లగ్న మొప్పుఁగాదే, దయమీఱఁ బ్రయాణమునకుఁ దగుసెలవీయన్.

క. నీవాక్కు వెడలఁగనె యీ, దేవతలెల్లరును బయలుదేఱఁగ నున్నా
రో వాసుదేవ! యుత్తరు, వీవలయు నటన్న నమ్మునీంద్రుని గనుచున్. ౧౦౩

క. దరహాసచంద్రికలు పర్వ రమాపతి యిట్టులనియెఁ బంతము నీయ
ట్లొరులు నెఱవేర్పఁజాలరు, సురమానీ! తలఁప నిద్ది చోద్యంబెయగున్. ౧౦౪

క. ధనధాన్యముఖ్యములు గల్గినవారలుకూడ నిట్లు కీర్తింపంగాఁ
బని నిర్వహింపఁజాలరు, మునిచంద్రా! నీదెనేర్పు పొగడఁదగు నిదే. ౧౦౫

క. ముందును వెనుకను జూడక, సందియ మింతేనిగనక సాహసమునఁ జె
ప్పం దరముగాని విధమున, నందఱు మెచ్చంగఁ గార్య మది యెట్టిదయే.
క. సాధింతువు దేవమునీ, సాధకగణమందు నగ్రసంఖ్య గణింపం
గా ధర్మము నీవే రది, బాధను గావింప వెట్టివారికినైనన్. ౧౦౭
క. నిను వినుతింపందగదే, ఘనకార్యము నిర్వహింపఁ గలవాఁడ వనం
గనుదగదె నిన్నుఁబోలిన ,మునులుందురె యెందునైనఁ బూని వెదకినన్.
క. నామానస మేరీతిగ, నోమౌనీ! సంతసించుచున్నదొ చెప్పం
గా మేలె నీకు శాశ్వత, మౌ మహితఖ్యాతి గల్గు నన్నిజగములన్. ౧౦౯
క. సురవర్యులు నీయానతి, శిరసా వహియించి రనఁగఁ జెప్పవలయునే
పరమర్షి వనుచు లోకో, త్కరకుశలాకాంక్షి వనుచుఁ గడుఁ బూనికతోన్.
క. నీయత్నమునకు మెచ్చితి, నాయద్రిజ నన్నుఁగోర కన్యవలచినన్
నీయెడలమోస మున్నటు, లోయనఘా! తలఁప నింక సుద్యమమొప్పన్. ౧౧౧
క. తరలుద మమరులు మనతో, నరుదెంతురుగాక పంకజాసనముఖ్యుల్
తరుణులతో పరివారో, త్కరములతో నరుగుదెంత్రుగాక జవమునన్. ౧౧౨
క. మనపార్షదముఖ్యులు వే, చని బ్రహ్మాదులకు లగ్నసమయ మెఱింగిం
చి నియతిమీఱక రాఁదగు, మునులం బిలుపింపు శిష్యముఖ్యులవలనన్. ౧౧౩
క. తగినన్ని వ్యోమయానము, లగపతి యచ్చెరువునొందఁ నట్టులుగా రాఁ
దగు, హెచ్చరింపు మిప్పని, కి గుణాకరులైనయట్టి కింకరతతులన్. ౧౧౪
క. ఎవరెవరి కెట్టియాన,మ్ము వరంబని తోఁచునో ప్రభుత్వమ్ము తగన్
సవరింపఁబంపు మట్టులె, యవధానముగల్గువారి నాపార్షదులన్. ౧౧౫
చ. మునివర! నీకు నెప్పనికి బుద్ధిమదగ్ర్యులు పార్షదుల్ తమం
తన పనినొప్పుగా జరుపనైజము గల్గినవార లెందఱే
దినమున నెప్పుడౌఁదగునొ తెల్లముగాఁ బలపోసి ముందె యా
జ్ఞను దెలియంగఁజేయు మటుసల్పుదు రించుక తప్పకుండఁగన్. ౧౧౬
ఉ. తావకశాసనంబు వితథంబుగ నెవ్వఁడొనర్చు నట్టివాఁ
డేవిధి నాసభన్ నిలుచు నించుకయే మరియావఁగాంచు నె
వ్వే విభుతం జెలంగుదు వి దేప్పడ నెల్లరు నెమ్మనంబునన్
వావిరి నిల్పఁగాఁదగు స్వభావము గాంచఁదగున్ మహాత్మకా. ౧౧౭
వ. అని యెల్లరం గనుంగొని యిట్లనియె. ౧౧౮
శా. నామాటే మునివర్యుఁ డెల్లసురసంతానంబులో నైన స్థా
యామోదంబును గాంచ మెల్లఁదగు నంచాజ్ఞన్ స్వతేషత్వఁ జే
నేమాడ్కిన్ దెలియంగఁజేయునొ మహే [illegible] ను
త్రామాదుల్ తలపోయఁగాఁదగును మార్పన్ రాని యత్నమ్మునౌ. ౧౧౯

శా. మౌనీంద్రుండు తపోధనం బెలమి నస్మత్కార్యముల్ దీర్పఁగాఁ
దానే పూనె వ్యయింప నింతకు నదేఽధన్యుండు మించంగఁ దాఁ
బూనుల్ జక్కవ్యయింప నట్లగుట నీపూతాత్ముఁ డొక్కండె స
న్మానార్హాగ్ర్యుఁ డటంచు లెక్కిడఁదగుల్ ఽ మౌనీశ్వరశ్రేణిలోన్. ౧౨౦

మ. కనుకన్ నారదునాజ్ఞ నాయదిగ లోకశ్రేణి భావింపనౌ
నని దేవప్రభులెల్లరున్ వినఁగ నుద్యత్ప్రీతిమైఁ బల్కి వే
చనియెం బెండ్లికిఁ బోవఁగాఁ దగినవేషంబుం దమిం దాల్ప నా
మునియున్ సమ్మతిఁ దెల్పఁగా; నవల సమ్మోదంబు తన్ ముంపఁగన్. ౧౨౧

మ. సురమౌనీంద్రుఁడు శిష్యవారమున దూతుల్ గాఁగఁ బేర్గాంచి యీ
శ్వరు గానంబున మెచ్చఁజేయు నిపుణత్వం బొప్పఁగాఁ బొండిలిన్
బరమఖ్యాతి నెసంగువారిఁ గనుచుం బల్కెన్ వడిం బోయి శ్రీ
వరునాజ్ఞం దలఁదాల్చి దేవముని పిల్వం బంచె మమ్మిత్తతిన్. ౧౨౨

ఉ. మూఁడవనాఁడు పెండ్లిదగు మూరుత మొప్పెడు మీరు బంధులం
గూడి కళత్రయుక్తులయి ఽ క్షోణిధరేంద్రుని చెంత కేగుమ
మ్మోడఁ గనంగ రావలయు ఽ నెల్లర మిచ్చటనుండి దేవతల్
తోడయి రాఁగఁ బోవుదము ఽ తొల్లియుఁ జెప్పిన దిద్దియే గదా. ౧౨౩

ఉ. ఈపనిమీఁదె యంచు నెద ఽ నెంచుచు రాఁదగునంచుఁ బిల్వఁడీ
యాపరమేష్ఠిముఖ్యుల మహామునులన్ ద్వరఁ బోయి రండు మీ
రోపికమీఱ నం చనిపి ఽ యుల్లమునం దిముడంగఁజాలకే
వే పొరలంగఁ బూనుతమి ఽ వెల్వడనీయక చిక్కఁబట్టుచున్. ౧౨౪

ఉ. ఎప్పుడు శీతశైలపతి ఽ నెన్నఁగరానివిభూతితో ముదం
బుప్పతిలంగఁ గాంచనగునో యలమేనను మోదవార్ధిలో
నెప్పుడు ముంపనౌనో యచలేంద్రునిపుత్త్రిక నేత్రయుగ్మమున్
విప్పి యపారభాగ్యమును ఽ వింతగఁ గాంచఁగఁజూచు టెన్నఁడో. ౧౨౫

ఉ. శైలవిభుండు బంధుగుణసత్తములున్ దనపత్ని మేనయున్
జాలముదంబునన్ దనదుసంగతి శ్రీహరి శాస్త్రపద్ధతిం
గ్రాలు సపర్యలం దనుపుఁగాంక్ష నెదుర్కొనరాఁగఁ గాంతునో
శ్రీలలనాదికామినులు ఽ చిత్రమి దేమని కాంచు టెప్పుడో. ౧౨౬

ఉ. పెండిలిపెద్ద నారదుఁడె ఽ ప్రేయసిఁ గ్రొత్తగ నద్రిపుత్త్రికన్
నిండుమనంబుగల్గిన యనింద్యచరిత్రను జక్రధారి వే
దండమహార్తిసంహరణదక్షుఁడు నాఁదగు దేవనేత కొ
క్కండె చెలంగి కూర్చె ననఁగా విని సంతస మొందు టెప్పుడో ౧౨౭

ఉ. ముక్కున వ్రేలు నిల్పి సురముఖ్యులయారె మునీంద్రుఁ డిట్టిడం
చొక్కపుడేఁ దలంచితిమె యుత్తమమైన తపోధనం బదే
యిక్కటు లొందకుండఁ బని యెట్టిదయే ఫలియింపఁ జేయు నం
చొక్కట మాటలాడుకొనుచుండఁగ నే విననోచు టెప్పుడో. ౧౨౮

ఉ. రేపని మాపటంచు నరరే దినరాశి యదెంతవింతగా
నీపనియం దొగిం గడచె నింతటనైన ఫలించునన్న యా
శాపరిపూతభవ్యలత స్వాంతమహీస్థలి నంకురించి వే
వే పరఁగంగ సాగె నిదె విష్ణుకృపారసదృష్టి నాఁదగున్. ౧౨౯

ఉ. ఎన్నిభవంబులన్ సుకృత మెంతయొనర్చినఁగాని శ్రీపరే
శు న్నవమోహనాంగుఁ బరిశుద్ధకృపాజలరాశి భక్తిసం
పన్న జనావనాదరుని భద్రదుఁ బూజలఁ దన్పఁజాలుభా
గ్యోన్నతిగల్గు నాకిచట నొప్పునొకో యది పుణ్యసంగతిన్. ౧౩౦

చ. అని యిటు లెన్నిభంగులనొ యాత్మఁ దరంగములట్టులూహ లె
ల్లను బయిపై నితాంతము చెలంగుచునుండఁగ స్వప్రయత్న మా
వనరుహనేత్రు గాఢకృప వర్తిలుటన్ ఫలియించు నంచు నె
మ్మనమున నిశ్చయించుకొని మానివతంసులఁగూడి వేడుకన్. ౧౩౧

చ. తరలఁగనుండె; శ్రీహరియు దారలలోపల మిన్నయన్న వి
స్తరయశ మొప్పనున్న వనితాతిలకంబగు రాసనాయికన్
నిరుపమశక్తిశోభిత ననింద్యచరిత్రను గాంచి యిట్లనుం
బరమగుణాన్వితా! యొనరుపందగు నట్టిపనిన్ వచించెదన్. ౧౩౨

చ. సతియననొప్పు దక్షసుత జన్మమునం దనయోగశక్తి నా
హుతవహకీలలం దనువు నొయ్యన భస్మముచేసికొంచు ను
న్నతిఁదగు నాహిమాద్రిసుత నాఁగ నెసంగెడునాదిశక్తి నీ
మతిని దలంతుగాదె యలమానిని తా నొకకారణంబునన్. ౧౩౩

చ. హరు విడనాడినట్లు కనరయ్యెడుఁ జుమ్ము మహాత్ముఁడైన శం
కరుఁడును దక్షిణాస్యుఁ డనఁగాఁ బిలువంబడుచున్ నిరాంబిసి
విరహితుఁడైనయట్లు సురబృందమునీశ్వరకోటికిం గనం
దరమయియున్నవాఁడు కలదా ప్రమదావిరహంబ వెప్పువన్. ౧౩౪

ఉ. దానికి నెన్నొహేతువులు తన్వి తలంపఁగనున్న నవ్వి యె
వ్వానికినైనఁ దోఁపనివి వానిని నీవును నేను ధాత త
న్మానిని శారదాంబయు సమస్తవిధంబులచే నెఱుంగుదు
జ్ఞానము గల్గువారలము చానరో యింకొక రెవ్వరే రిలన్. ౧౩౫

ఉ. ఆవిధ మెల్ల నీ వెఱుఁగు ఽ దైనను హైమవతీసమాఖ్యఁ బెం
పావహిలంగనున్న హరిఽణాక్షి హరున్ విధిఁ బెండ్లియాడి దే
వావళి మెచ్చ శంకరుని ఽ యర్ధశరీరమునన్ వసింపఁ దా
వేవిధులం దలంచుచు సుఽవృత్తము వర్ధిలనున్న దాగిరిన్. ౧౩౬

ఉ. కాలము దానికిన్ వలయుఁఽగాదె యదే చనుదేరనున్న దో
శ్రీలలనామణీ! యిపుడు ఽ చిత్రము సాగెడు దానిఁ జెప్పెదన్
బాలిశుఁడై సురర్షి స్వతఽపంబను విత్తము నానిమిత్తమై
చాల వ్యయించి పార్వతిని ఽ సర్వసుపర్వులు చూచి పొంగఁగన్. ౧౩౭

క. నాకుం గూర్పఁగ యత్నం, బేకరణిఁ దలంప నర్హఽమే కాని విధిన్
బ్రాకటశక్తి నొనర్ప ది,వౌకసు లద్దానిఁ జూచు ఽ నాదృతి యలరన్. ౧౩౮

చ. అతనికిఁ దోడు నీడ లటు ఽ లర్హవిధుల్ సలుపంగఁ బూని రీ
వితము నెఱింగి సూక్ష్మముగ ఽ విస్తృతభావము గల్గుమాటలన్
జతనము మానఁ దెల్పితిని ఽ సంయమి యవ్విధ మారయంగ లే
కతిశయశక్తిఁ బూనెఁ దగుఽనట్లుగఁ బెండిలి నిర్వహింపఁగన్. ౧౩౯

చ. హరునితలం పెఱింగి మన ఽ మచ్చటి కేఁగుట కిద్ది హేతువౌ
నిరుపమకర్మశక్తి యవిఽనీతులఁ జేయు నదెట్టివారి నాఁ
బరఁగెడు నిశ్చితార్థమును ఽ బాగుగఁ జాటుట కిద్ది కాల మం
చరసి మునీంద్రుయత్నము నిఽరర్థకమౌనటు చేయ మానితిన్. ౧౪౦

చ. మనము వివాహయత్నమున ఽ మంచుమలం గనఁబోవ నందుశం
భుని వరియించు హైమవతి ఽ పొందుగ నట్టిమహోత్సవంబుఁ గాం
చనగును గాదె పండువుగఁ ఽ జానరొ యందు వివాహ మద్భుతం
బనఁదగునట్లు సాగు మనఽమచ్చట శంకరువంక వారమై. ౧౪౧

తే. నిర్వహింతము పనులెల్ల ఽ నిర్జరర్షి,చింత నొందక యుండఁగఁ ఽ జేయునట్టి
చిత్ర మొక్కఁడు సాగు నేఁఽజెప్ప నేల, చూతుగా నీవె యందలిఽచోద్యములను.

చ. కనుక సపత్నులం గలిసి ఽ కాంతు చెలంగెడునట్టిచందముల్
కనఁబడఁ దర్లమా యచటిఽకార్యము చక్కఁగ సాగఁగాఁ బదా
ర్థనికర మెద్ది కావలయు ఽ దాని సుపర్వులు నానిమిత్తమే
యనుకొని సేకరించిరి రఽపంతయు లోటుకనంగ రానటుల్. ౧౪౩

ఉ. దివ్యవిమానరాజముల ఽ దేవత లెల్లరు నెక్కి రాఁగ గం
తవ్యహిమాద్రిఁ జూత మటఁ ఽ దన్వియు శంకరుఁ బెండ్లియాడఁ ద
ద్భవ్యమహోత్సవంబుఁ గనుఽవారుగదా సుకృతాత్ములంచు మం
తవ్యులు లోకజాలములఁ ఽ దత్త్వము దీనిని నీవెఱుంగవే. ౧౪౪

కం. వివరించితి నిటుఁదెలుపం,గవలయు నెద్దాని; వింతగఁ గల్గించుచు నం
దువరుస సాగెడుదానిని, దివిజేంద్రులు గాంత్రుగాక । తెల్లముగాఁగన్. ౧౪౫

క. హరిహరులకు భేదంబన, నరసినలే దన్నవార్త । యందుం దేల్పన్
బరమాద్భుతముగ దానికె, సురమౌనికి భ్రాంతిగల్గు । చొప్పమరుచుటల్. ౧౪౬

క. జ్ఞాననిధియయ్యు నిర్జర, మౌనీంద్రుఁడు ప్రకృతి తన్ను । మార్పంగా న
జ్ఞానివలెఁ గార్య మొనరుపఁ, బూనెంగద యిద్ది యందుఁ । బోలం దెలియన్.

క. దీనన్ లోకములకు శుభ,మౌ నింతీ! జాలమేల । యందఱుఁ బయనం
బౌనట్లు ప్రోత్సహింపుము, చానలచిత్తములఁ గల్గు । శంక లడఁపుమా. ౧౪౮

క. మానిని వేఱొకతుక నా,చాన యనన్ వీనులెల్ల । సాంద్రార్తి గనం
గా నానెలఁతలు వగతురు, గానం బొంకముగఁ దెప్పఁ । గాఁ జను వారిన్.

క. వింతగ నీకీవార్తల, నింతగ వినిపించు టెల్ల । నెఱుఁగ వనుచు నొ
క్కింతయు శంకంగని కా,దంతర్గతమోద మిట్టు । లాడం జేసెన్. ౧౫౦

క. చనుమింక నెల్లభంగుల, వనితల నలరించి యటకుఁ । బయనము సాగిం
పను సిద్ధపడఁగఁ జేయుము, వనజాయతనేత్ర! నేనుఁ । బయనం బగుదున్. ౧౫౧

ఉ. సర్వము సిద్ధమయ్యె మునిచంద్రుఁడు తొందరచేయ నెంతొ వ్ర
క్పర్వముగా నలంకృతుల । భాసిలుచుం ద్రిదశేంద్రు లెల్లరుం
బర్వులు వాఱుచుంటఁ గనుపట్టెడుఁ జూడు విమానరాజముల్
పర్వహిమాంశుబింబముల భాతి వెలింగెడు వింత గొల్పుచున్. ౧౫౨

చ. అనవిని రాసనాయిక మహామతిసంపద గల్గులేమ గా
వునఁ బతియాజ్ఞ మౌళినిడి । వోయి ముదం బుదయింప నెల్లకా
మినులను బ్రోత్సహించె నిటు మేటివధూటి ప్రయాణయత్నమం
దు నిరతిఁగాంచ నందఱును । దోయరుహాస్యలు నింపువేడ్కన్. ౧౫౩

మ. వరచేలంబులు దాల్చి సారమణులన్ । భాసిల్లుచున్నట్టి శ
స్వరభూషాళి నలంకరించుకొని పొల్పుంగూర్పుహారావళుల్
పరఁగన్ జిత్రములో యనంగఁ దగుచున్ । బ్రాలేయశైలేంద్రమున్
బరికింపం దమకంబులొప్పఁ దగి రాపద్మాక్షుపద్మాననల్. ౧౫౪

ఉ. అంత మురాంతకుండు కనకాంబరముల్ ధరియించి పన్నగే
కాంతవిభూషణావళుల । గాత్రము నూతనకాంతి నొందఁగ
న్నింతయు వేడ్కఁ జేసి సకలేష్టదుఁడై తగు నాను శైలభూ
కాంతుని చెంత కేగు కుతుకంబును గాంచెను మౌని యబ్బుగన్. ౧౫౫

చ. వర మొకకేల నొప్పఁగ సుదర్శన మొక్కకరంబునందు ఫ
కరరిపుకాలమృత్యువయి । క్రాల మఱొక్కకరమ్ముననంబు

స్ఫురతిని గాంచునందకము ¤ శోభిల నింకొకహస్తమందు సుం
దరవికచారవిందము కరనం దగి యుండఁ జెలంగె శౌరి దాన్. ౧౫౬

ఉ. చూచెడువారి కెల్లరకుఁ ¤ జూడ్కులు వేఱొకచోటఁ ద్రిప్పునా
లోచన యింత చొప్పడక ¤ లోలతఁ దన్నె కనుంగొనంగ సం
కోచము నొందనట్టు లొనఁగూర్చెడుచారుత భాసిలంగఁ గా
ర్యాచరణైకదక్షమగు ¤ నా హరిదేహము గ్రాలె నత్తఱిన్. ౧౫౭

ఉ. శ్రీహరిపెండ్లికై చనఁగఁ ¤ జిత్తమునం దలపోసి చక్కఁగా
దేహ మలంకృతిన్ జెలఁగఁ ¤ దృష్టిని దెల్పెడుమందహాస మెం
తో హాయలొప్పనుండఁ గని ¤ యొయ్యన దేవతలెల్ల నట్టులే
యూహలు పర్వ వేషముల ¤ నొప్పిరి ద్రష్టల కన్ను లుబ్బఁగన్. ౧౫౮

ఉ. చారుతయెల్ల నొక్కటిగ ¤ సుస్తవపాత్రముగా నెసంగఁగాఁ
గోరికమీఱఁ జేరె నన ¤ గోభువనంబు కనంగనొప్పె శృం
గారరసాలవాలమయి ¤ కన్నులు వేఱొకరెండు పొల్చినన్
భూరిముదంబు గాంతు మని ¤ బుద్ధుల ద్రష్టలు నెంచునట్లుగన్. ౧౫౯

చ. చెలఁగెను వ్యోమయానములు ¤ సిద్ధసుపర్వగణంబు నిండఁ ద
క్కులలితయానముల్ దివిజకూటము లెక్కఁగ నర్హరీతులం
బొలిచె సురాంగనామణులు ¤ భూషణపంక్తికి భూషణంబులై
లలితతనూలతల్ కడు విలాసమునం దగ నొప్పి రెంతయున్. ౧౬౦

చ. మునివరులెల్ల నారదుని ¤ మూదల నైకొని వల్కలాజినా
దినిఖలయోగ్యవస్తువితతిం గొని పెండ్లికిఁ బోవుసంబరం
బున స్వజటాకలాప మొగిఁ ¤ బొల్పెసలారఁగ నెప్పు డెప్పు పో
వ నగునొయంచునుండిరి వివాహపువేడుక లట్టివౌఁగదా. ౧౬౧

మ. వినతానందనుఁ డంత శ్రీనిలయునిన్ ¤ విశ్వేశు భక్తార్తిభం
జనునిం బెండ్లికిఁ బోవునుత్సుకత భాస్వద్రత్నభూషాళిఁ దా
ల్చినప్రోడన్ హరమిత్రు సర్వగతునిన్ ¤ జిష్ణ్వాదిదేవార్చితున్
గని తా వాహనమౌటకుం దగుగతిం ¤ గ్రాలెన్ మనోజ్ఞంబుగన్. ౧౬౨

సీ. ఇకఁ బ్రయాణముచేయుఁ ¤ డిదె సుముహూర్తము
చెంతనున్న దటంచుఁ ¤ జెప్పువారు
తామసించెద రేల ¤ తపసి యాగ్రహ మూనుఁ
దరలుఁడీ యనుచును ¤ దఱుమువారు
చక్రికన్నుముందె ¤ చనఁదగు నని నార
దాజ్ఞ యయ్యె నటంచు ¤ నఱచువారు

వలయునన్నింటి వివాహసంభారముల్
కొని చనుండీయని కోరువారు

ఆ. చిత్రవాహనముల సిద్ధముచేయుఁడీ, యిపుడె పోవవలయు నీశునాజ్ఞ
ననుచుఁ దెల్పువారు నయి రెల్లయమరేజ్యు,లప్డు శ్రీనివాసునాజ్ఞఁబూని.

ఉ. యానము లెక్కి కొందఱును హస్తివరంబులనెక్కి కొందఱున్
మానసశక్తియుట్టిపడుమాడ్కి నభంబున యోగశక్తిచే
బో నగునంచుఁ గొందఱుఁ బ్రభుత్వము కన్పడ వ్యోమయానసం
తానమునెక్కి కొందఱును దా రొగిఁ బోయిరి పెండ్లిఁ జూడఁగన్. ౧౬౪

ఉ. అచ్చరమిన్న లెల్లఁ బరమాత్ముని కాంతలపిండుఁగూడి సం
పచ్చతురత్వ మేర్పడఁగ భాసుర సారవిమానరాజిపైఁ
గ్రచ్చుఱఁ బోయి రద్రిగణరాజును ముందుగఁ జేరువార మం
చిచ్చఁ దలంచుచున్ గిరిజయిమ్మె కనుంగొను వాంఛితంబులన్. ౧౬౫

ఉ. ఒక్కరికైన నౌర మహిమోన్నతులై తగువారియందు నీ
యక్కజమేమొ నారదునియాజ్ఞ యిదేమొ సుపర్వులెల్ల నే
యిక్కకుఁబోవుఁ డన్నఁ జనరెంచుట యేటికొ పెండ్లియాడఁగా
నిక్కమలాత్ముఁ డెంచుటకు హేతు విదేమని తోఁప దత్తఱిన్. ౧౬౬

ఉ. రా దగు మీరు పెండ్లి కగరాజు మముం బిలువంగఁబంపె ని
ష్డే దరలుండు లగ్నమది యీదినమందని నిశ్చయించి నా
రోదివిజప్రలార! దయయుంచి యిదే సమయంబు పోవ నం
చాదృతిమీఱఁ బిల్వఁ డొకఁడైన నిదేమని యెన్నఁ డొక్కఁడున్. ౧౬౭

మ. మనయంతన్ మనమే చనందగునొకో మర్యాద యద్దానఁగ
ల్గునె యాచారము లిట్టులుండినవె తెల్పుం డున్నచోఁ బెద్దలా
ర! నితాంతంబు తలంపుఁడీ యని యమర్త్యశ్రేణియం దొక్కఁడై
నను జింతింపఁడు దైవి మాయ మది నిండన్ దెల్వి మాప్పంగనన్. ౧౬౮

ఉ. కాలగతుల్ దురూహములుగాని తపోధనయుక్తి కిల్లటం
జాల వశంగతంబులగు సంయమివర్యుల కంచు నాసుమల్
గ్రాలుఁగదా తపోధనని కాయముసం దొఁడేఁ దలంపఁగాఁ
జాలఁడు విష్ణుమాయ తముఁ జక్కఁగఁ గప్పుటచేత నక్కటా! ౧౬౯

ఉ. గొట్టెలఁబోల్కి నెల్లసురకుంజరమౌనిమహేంద్రులేమి యీ
వెట్టి యొకండు పిల్వనిదె వింతగఁ బెండ్లికిఁ బోవుటం చొకన్
మొట్టె యిడంగఁబూనఁ డెప ముందటికాలగతిం దలంపఁగా
మిట్టునుండిజాలుగతి నిందినశక్తియు మాయ యక్కటే. ౧౭౦

క. ఎవ రేమేయోజింపం,గ వలనుపడనట్టు మదిని । గంజాక్షుం డెం
చి వలంబోలిన మాయను, దివిజర్షులఁ గప్ప నెవఁడు । తెలియఁగఁ జాలున్.

క. తపమనువిత్తము తనశ,క్తిపటుత నేకార్యమైనఁ । దెలిసికొనుచు నే
రుపుమీఱఁ జేయఁజాలును, దపోధనుల్ దానినుండి । ధన్యు లనుప్రథన్.

క. సంపాదింపంజాలిరి, పెంపుంగని రెల్లచోట్లఁ । బృథివీశ్వరు ల
ర్చింపం గారణ మిదియే, కంపింతురు మునుల కమర।గణవరు లెపుడున్. ౧౭౩

తే. అట్టితాపసవర్యు లీ।పట్టునఁ దమ, శక్తి వ్యర్థంబుగాఁగ నీ।చంద మిట్టి
దనుచు నూహింపఁజాలక।చనఁగఁబూని, రాహిమాద్రికిఁ బెండ్లికై।యాదరమున.

ఆ. దీనిఁగనిన మునుల।తేజంబ దధికమో, దైవశక్తి యెక్కు।డో విశదము
గాఁగఁ దేలెఁగాదె । యేగతిఁ దలఁచిన, దైవ మధికమనుట । తత్త్వ మగును.

క. పరమేశుఁ డూరకుండిన, తఱుణంబున నెల్లవారు । ధన్యులమే యం
చుఁ గర్వ మూనుదురు త,త్పరమేశుఁడు కన్నుఁదెఱవ । బాలిశు లగుచున్.

క. ఏపనిఁ జేయంజాలక, చూపట్టుదు రట్టులగుట । సురలు మునులు స్వ
వ్యాపారంబుల దైవము,నే పరమంబనుచు నమ్ము।టే న్యాయ్యంబౌ. ౧౭౭

ఆ. మందబుద్ధులగుచు । మానులు విబుధులు, పెండ్లివేడుకలను । బృథుమనీష
లందు విహితమిద్ధి । యగునొకో కావొ యం,చరయుశక్తిలేమి । నజ్ఞులట్లు.

క. చనఁబూనిరి గోవిందుఁడు, వినతాసుతు మూఁపురమున । వెలయుమృదుతమా
సనమునఁ గూర్చుండఁగ వా,ద్యనినాదము లొక్క మొగి ని।తాంతము పర్వెన్.

క. కకుబిభరాట్కర్ణముల న,వికలగతిం జొచ్చి బధిర।వృత్తి వెలయున
ట్లొకట నొనర్చెను వాద్య,ప్రకటధ్వను లట్టి పెండ్లి।పయనంబందున్. ౧౮౦

క. ఉన్నట్టులుండి యొకపరి, గ్రన్నన వాద్యారవములు । గాఢరయమునన్
మిన్నంతయు నాదమయం, బన్నుడికి సార్థకంబె । యన వ్యాపించెన్. ౧౮౧

క. ఒకటొకటిగఁ గాకుండఁగ, సకలశుభాశంసి వాద్య।శబ్దంబులు క
ర్ణకుహరములఁ బగులింపఁగ, వికలధ్వను లొప్పఁబాఱె । వెసఘోటకముల్.

ఉ. పీతిగణంబు పాఱఁగని । భీతిలి యశ్వతరంబు లెంతయున్
రౌతులు నిల్పఁ జాలుజత।నంబును బూనిన లెక్క సేయకే
చేతము లార్తిమున్గ నొక।చెంగున మార్గము దాఁటిపోయె సం
జాతవిచిత్రహాసమునఁ । జానలు చప్పటు లట్టె కొట్టఁగన్. ౧౮౩

చ. ద్విరదము లాస్వనం బొగి శ్రు।తిద్వయిఁ జొచ్చి మనంబు నెల్ల భీ
కరగతిచేఁ గలంచుటయు । గారవమన్న దదెట్టులో చనం
ద్వరఁగొని పాఱె నంకుశ।నివారణయత్నము నిష్ఫలంబుగాఁ
గ రహి వొలంగ హాస్తిపక।కాండము సిగ్గున వంపఁగాఁ దలల్. ౧౮౪

చ. వరుసఁ గ్ర మేలకంబులును ॥ వారణపంక్తులపాటు గాంచి ని
　బ్బర మనువస్తు వెచ్చుటికొ ॥ పాఱఁగ దిక్కునఁదోఁపమిఁ బదాం
　తరములు క్రోశమన్న నిదె ॥ తథ్యమటం చెఱిఁగింపఁ బాఱఁగాఁ
　దరుణులు పక్కునన్ నగిరి ॥ తద్భటు లార్తి మునుంగునట్లుగన్. ౧౮౫

సీ. ఒకరథచక్ర మింకొకరథాంగంబును వెసనీడ్చుకొని పోవువిధము నచటి
　వారికిఁదెలుపంగ నారథంబులు రెండు మఱికొన్నిరథముల ॥ మాన కీడ్చు
　కొనిపోవ యుగ్యముల్ ॥ ఘనజవంబలరంగఁ గొంతదూరముపోయి వింతతోఁప
　జేయుచుఁ దమయిచ్చ ॥ సిద్ధింపఁ బలుదెసలకుఁబాఱ సారథులు కడుశక్తిఁ

తే. బగ్గముల నట్టిలాగుచు ॥ ఫలము లేక, యాడుగఱచుచు వదలలే ॥ కప్పనినటు
　పట్టువదలల సాగింపఁగ ॥ గుట్టెఱింగి, నచటివారలు నవ్వి రహోయటంచు. ౧౮౬

క. ఆసందడి తగ్గగ ముని, వాసవునానతిని దేవవారము పయనం
　బాసక్తిఁజేయఁ దార్క్ష్యుని, పై సరసిజనేత్రుఁ డెలమి ॥ పట్టఁగ రామిన్. ౧౮౭

క. సుర లరుగుచున్న సరణిన్, ద్వరఁగా శీతాద్రిఁ జేరువాంఛం జనిరోన్
　హరివెంట విమానాళిన్, దరుణీమణులెల్ల సమ్మదం బిగురొత్తన్. ౧౮౮

చ. చనిరి మునీంద్రు లాత్రిదశసంతతవెంటనె నారదుండు ముం
　దు నడువ వెంటఁబోయి రదిసూత్న విధంబుగఁ దోఁచుచుండె భూ
　వనిత స్వసంతతిన్ జెలఁగి ॥ వైభవముం దెలియంగఁజేయఁ బం
　పినయటు లూహవెల్వడ గభీరనినాదము లొప్పునట్లుగన్. ౧౮౯

క. తుములముగా నాపయనం, బమరెను; శీతాచలేంద్రుఁ ॥ డవ్వానలనే
　త్రములకుఁ దోఁచెను జిత్ర ము, సమానరహితంబును నగుభంగిన్ నింగిన్.

క. భూమిని వ్యోమముఁ దగులం, గా మేనుం బెంచినట్లుగాఁ దోఁచెను ద
　ద్వ్యోమోహము వదలదు గిరి, భీమాంగముదరికిఁ జేరి ॥ విమలమనీషన్.

క. పరిశీలించినదనుకన్, ద్వరపడి వారెల్ల శిఖరివల్లభుదరిఁ జే
　రిరి వాద్యఘోషములు పుష్కరమును భేదించునట్లుగా వినఁబడఁగన్. ౧౯౨

చ. వనములనెల్ల నిండి గిరివర్యుఁ దటాలున నావరించి లోఁ
　గొనఁగఁదలంచి వచ్చురిపుకుంజరవాజిశతాంగ సద్భటౌ
　ఘనియతిమీఱ నాయమరకాండము చూచెడువారికెల్లఁ దోఁ
　చెను బహువాద్యనాదములు ॥ చెచ్చెరఁ గందరరాజి నిండఁగన్. ౧౯౩

చ. శతధృతిముఖ్యులెల్లఁ గడుసంతస మొప్పఁగ శీతశైలరా
　డ్వితతవిభూతి గన్గొనెడు వేడుక లుబ్బఁగ నిల్చినట్టు లా
　క్షితిధరసన్నికృష్టమునఁ ॥ జెల్వమునం దగు కానవంబుగా
　దతిరమణీయమౌ స్థలమదం బొకచోఁ గనుపట్టె నల్లనన్. ౧౯౪

క. విడిసిరి విమానములు చ, ప్పుడు లేక నితాంతవేగమును మాని దిగెన్
గడు నలసినట్లు కరితతి, తడఁబడుచున్ నిలిచెఁ బర్వతము లివె యనఁగన్. ౧౯౫

క. తక్కిన వాహనములు తమ, కెక్కడ సంవాసభూమియిందని గుఱుతుల్
చక్కఁగ నిడియుండిరొ యా, యిక్కల నివసించె నెల్ల రెదలన్ మెచ్చన్.

క. వినతాతనయుఁడు వ్యోమ, మ్మునుండి శీఘ్రంబ దిగిన మురహరుఁడు ముఖ
మ్మున దరహాసాంకూరము, లొనఁగూడఁగ దిగియె బ్రహ్మయున్ బ్రార్థింపన్.

క. అమరింపఁబడిన మణిఖచి, తమహాపీఠంబునందు ధాతృకరము సా
యముగఁ జెలఁగఁ గూర్చుండెను, దమతమపీఠముల దేవతలును దదాజ్ఞన్.

క. ఉపవిష్టులైరి దివిష, త్తపస్వియు న్మానిప సముదయము వెనుకొనన్
దపనీయాంబరుసన్నిధి, నుపవిష్టుండయ్యె నూహ లొాగిఁ బర్వంగన్. ౧౯౯

శా. వాద్యధ్వానములెల్ల మెల్లగ నిజవ్యాపారముల్ మాన నా
హృద్యస్వానములన్ నుతించునటు శైలేంద్రస్థితానేకదు
ర్భేద్య స్ఫారగుహోత్కరంబు లొాగి శబ్దింపంగ నయ్యద్రిపుం
డుద్యత్కౌతుక మొప్పఁ దమ్ముఁ గొనిపో నుద్యోగ మొప్పారఁగన్. ౨౦౦

మ. అనుదేశం దలపోసి వాద్యరవముల్ హారిప్రమోదంబు ని
ర్భరరీతిం దెలుపం బ్రయాణమయియే వచ్చుంగదా యంచుఁ గం
దరరాజిం జెలువారుతత్ప్రతినినాదంబున్ దమిన్ వించు ని
ర్జరవర్యుల్ తలఁపంగ శ్రీహరిసరోజాతాసనుల్ స్వాత్మలన్. ౨౦౧

ఉ. అందలితత్త్వముం దెలియనర్హులు గావున నిర్వికారతం
జెంది మొగంబులం దెలమిఁ జిందులు ద్రొక్కెడునట్టు లొప్పనా
నందము నూత్నరూపము గనంబడఁజేయఁగ నూరకుండి; రా
కందరనిస్వనంబు చిరకాలము పర్వక తగ్గె మెల్లఁగన్. ౨౦౩

మ. ఇదియే మింతకుఁ గానరాఁడు హిమశైలేంద్రుండు సన్నాహసం
పద మిన్నందగఁ జేయుచున్ దడసెనో భామామణుల్ నైజవృ
త్తిఁ దనుం జేరఁగ రామిఁ జింతిలుచు నీతీ రెన్నమర్యాద కా
స్పదమౌనే త్వర రండటంచుఁ బురికొల్పం బూనియున్నాఁడొకో. ౨౦౪

ఉ. ఇప్పటి కెల్లయత్నముల నెంతొ తొరంగని పూర్తిచేసి తా
గొప్పగఁ గానికల్ గొనుచుఁ గూఁతును సంతసిలంగఁ జేసి యే
చొప్పున శ్రీనికేతనుని శూరశిఖామణి గారవింపనౌ
మెప్పొనఁగూర్ప నౌననుచు మేలుగ నెంచుచు నున్నవాఁడొకో. ౨౦౫

ఉ. మున్నెపుడైన నిట్టివిధముం గనకుండుట నేదియెట్లుగా
నున్న స్వగౌరవంబునకు నొక్కకొ అంతయుఁ గల్గకుండ నం

చెన్నుచు నున్నవాఁడొ తనకెవ్వరు బుద్ధులు నేర్పువారు లే
కున్న నెటుల్ మహామతుల నొక్కటఁదా నడుగంగఁబూనెనో. ౨౦౬

ఉ. ఇంతకుఁ దాఁ బ్రయాణమయి యెల్లసుహృత్ప్రియబంధువర్యు ల
త్యంతముదంబునం బొలిచి త న్నొగిఁగూడియె వచ్చుచుండఁగా
వింతగ నల్లునిం దనుప విస్తృతరత్నవిభూషణాళి నిం
తింతయె యుండుమూల్యమని యెంచగరానిది గొంచు వేడుకన్. ౨౦౭

క. అరుదెంచుచుండు ననుచున్, సురలెల్లం దలఁచుచుండ సురపతిముఖు లి
త్తరుణమున మసలఁ జనునే, పరికింపఁగఁ దోఁచువింతపాటిలు నిందున్. ౨౦౮

క. ఒకపురుషుైనఁ గనంబడ, దొకయత్నము సాగినట్టు లూహింపఁగరా
దుకదా యేమగు నిఁక నని, సకలేశ్వరుఁడే యెఱుంగఁజాలును దీనిన్. ౨౦౯

క. అని గుసగుసలాడుచు నొ,క్కనివోము మఱొక్కఁ డేమికాఁగల దనునా
హాను దెల్పఁ జూచుకొనుచున్, మునిధర్మము పూని చింత మునివరు లెల్లన్.

చ. హరి చనుదెంచెఁ బెండ్లికని యంబుజసంభవుఁ డేఁగుదెంచె ని
ర్జరపతిలోనుగాఁ గలుగుసర్వదిగీశులు వచ్చి యుండు ని
ల్చిరి త్రిదశుల్ ప్రమోదమునఁ జేరిరి కాని హిమాచలేంద్రుఁడున్
వసునకుఁ బూజసేయుటకు వచ్చెనుజాడయె తోఁప దేమియున్. ౨౧౧

మ. ఎవఁడే నల్లుఁడుకాఁగ వచ్చెనన నెంతేఁ బ్రీతిమీఱంగ బం
ధువులున్ మిత్రులు దారలున్ వెనుకొనం దోడ్తోనఁ బూజాప్తవ
స్తువులం గైకొని కన్నెతండ్రి యరుదెంచుంగాదె యాచార మి
ట్లివలోకింపనగుంగదా జగమునం దామార్గమం దింతయే. ౨౧౨

చ. కనఁబడకున్న దిప్పు మునికాంతుఁడు పెండ్లికిఁ బెద్దయై నిలిం
పనికరమున్ స్వకీయమగు పల్కునసే తిరుగంగఁజేసి తో
డ్కొని యరుదెంచె నిచ్చటికిఁ గొండలఱేఁ డిది లోఁదలంచి యీ
మనలఁ గనంగ రాఁదలఁచుమార్గముకూడఁ గనంగరా దయో! ౨౧౩

ఉ. ఏమొవిచిత్ర మిందుఁగల చింతయవజ్ఞత శైలనాథునం
దేమెయినుండు దీనిఁగన నెంతయుశ్రద్ధను బూనఁగాఁదగున్
గామహరున్ హరున్ దలఁచెఁ గామినియుం చొకవాస్తవింట మి
ట్లీమురవైరిఁ బిల్చుకొని యీముని వచ్చుట కేమిహేతువో. ౨౧౪

క. అనుచు విచారించుచు న, ప్పుని యెవ్విధి సాగఁగలదొ బాగుగఁ జూడం
గను దలఁచుచుండి రవ్విధిఁ, జనియెన్ యామంబు నొక్కక్షణ మట్టులఁగన్.

తే. సర్వవృత్తాంత మెఱిఁగియుఁ జక్రధరుఁడు
మోఱకువిధంబుననె యుండె మోమునందు

మార్పు దోఁపకయుండ నెమ్మనము సంత
సమున నొప్పుచునున్న చంద్రమున నలర. ౨౧౬

ఉ. పంకరుహాసనుండు మురభంజనుమోమును జూచి ప్రీతియే
యంకముగాఁగ నిట్లనియె నద్రివరుం డిటరాఁడు నారదుం
డింక నొనర్పఁబూనుపనియే మొ యెఱుంగఁగరాదు శంభుఁ డే
కాంకుఁడు వచ్చుచుండు నని యాత్మఁ దలంచెద; నీమహాటవిన్. ౨౧౭

ఉ. దేవసతీమణుల్ నిలిచి తీవ్రగతుల్ దగఁబాఱుచున్న స
త్త్వావళిఁ గాంచి భీతిలెడునట్లు కనంబడు నింక నేమి మీ
భావమునం జెలంగెడినొ పల్కుమ నెమ్మది శాంతమూనుదుర్
నావిని యబ్జనాభుఁ డెలనవ్వున నిట్లని తెల్పె బ్రహ్మకున్. ౨౧౮

ఉ. ఏమిఁకఁ జేయనౌనని మునీశ్వరు నారదుఁ బ్రశ్న చేయఁగా
నాముని యేమి తెల్పునొకొ యారసి కార్యము నిర్వహింపుమా
మామకచిత్తవృత్తియు సమస్తవిధంబుల మానిచిత్తముల్
వేమఱు చూడఁబూను టొకవింతయె దీనిని నీవెఱుంగవే. ౨౧౯

చ. పలుమఱు హెచ్చరించి మునిఁ బంపుము శీతగిరీంద్రుచెంత క
వ్వల సకలంబు తేటపడు భావము దీని నెఱుంగనీయకే
వలసినకార్యముల్ జరపవచ్చుఁగదా యని ప్రోత్సహింప నా
జలరుహసంభవుం డొకట శక్రముఖామరనాథపంక్తులన్. ౨౨౦

చ. కనుఁగొని పల్కె నివ్విధిని గాఱడవిన్ వసియించి చాలసే
పసఁ దగుఁగాదె యింతకును నయ్యగరాజొ తదాప్తబంధులో
మనలఁ గనంగరాకగద మాని తలం పదియెట్టులో యెఱుం
గను దరమౌనె పెద్దయనఁగాఁ దగునాతఁడె పెండ్లి కెన్నఁగన్. ౨౨౧

క. మనమెల్లరము తదాజ్ఞం, గొనియే యేకార్యమైనఁ గొనసాగింపం
గను జాలువారము మతే, పనియు నతం డెఱుఁగకుండఁ బంతము మీఱన్.

క. ఇంచుక సాగింపఁగ లే, మెంచం బరమేశ్వరాజ్ఞయే మునిపతిగా
వించెడునాజ్ఞయె యని భా, వించుట న్యాయ్యంబు లోకవిభు తలఁ పిదియే.

క. మీరును యోజింపుం డిఁక, ఘోరాటవి నిందునుండఁగూడునె భీతిన్
వారిజనేత్రలు గాంచరె, క్రూరమృగావళులును దిరుగుంగాదె యిటన్. ౨౨౪

క. ఎల్లరఁ గాపాడంగా, బల్లిదులౌ వీరభటులఁ బనుపుం డిందే
యెల్లియు నుండఁగవలయునొ, యుల్లమునం దేమి మానియుం దలఁచెనొకో.

క. మీమీభావంబులనున్, మోమోటమిమాని తెల్పఁ బూనుం డనుచున్
గోమలవాక్కులఁ దెల్పం, గా మానిపయింగలట్టి గాఢామర్షన్. ౨౨౬

క. అమరేంద్రుఁ డాదిగాఁగల, నమర్త్యులీవిధిని బల్కి । రంబుజసూతీ
హిమశైలేంద్రుఁడు రామికిఁ, గ్రమమేదో తెలియఁదగుసు।గాదే మనకున్. ౨౨౭

క. ఏమోకృత్రిమ మిటఁగల,దీమాడ్కిన్ సాగు టెందు।నే గంటిమొకో
యీమనమాని గిరీంద్రుని,దౌ మది యీభావ మూనె । నని యెన్నకయే. ౨౨౮

క. హరికిం బార్వతి నీయన్, గరమనురాగమ్ము గాంచె।గద యని తలపో
సి రయమ్మున నీమనలం, దరలుండని పల్కొనుచుఁ । దలఁతుము దేవా! ౨౨౯

క. అదెగాకయున్న గిరిపతి, ముదమారం దోడ్కొని చన।బూనక మనలన్
మదినైనఁ దలఁపకుండునె, యిదియొక చిత్రంబుగాఁగ । నిపు డెన్నఁదగున్.

చ. మునిపతిఁ బిల్వఁబంచి యిఁక । మూర్తమదెప్పుడో యీవనాంతరం
బును విడనాడిపోవుటకుఁ । బూనుటయెప్పుడో ప్రశ్న చేయుమా
వినఁబడుఁగాదె నారదుని।వృత్తమిదిట్లని యంతమీఁదఁ దోఁ
చినయటు చేయఁబూనుదము । శీఘ్రమ యిప్పనిచేయ నెన్నుమా. ౨౩౦

చ. నలువురుచూచి యీపనికి । నవ్వకయుండఁగఁ జేయవయ్య యో
జలరుహసంభవా! యనిన । శక్రముఖామరవర్యభావముల్
దెలిసెఁగదా యటంచు నల।దేవమునీంద్రుని జీరియొంటిగాఁ
బలికె మునీంద్ర! యేమొ హిమ।వంతుఁడు రాఁడిట నెంతచూచినన్. ౨౩౨

చ. హరిఁ గొనిపోవ బంధుజను।లాదృతి వెంబడిరాఁగ వచ్చి ని
ర్జరపతిపూజ్యుఁ బూజలఁ గ।రం బలరించి యమూల్యభూషణాం
బరము లొసంగి బంధుయుతి । వాద్యసునాదము లొప్పుచుండఁగాఁ
బురికిని దోడుకొంచుఁ జన।బోలుఁగదా మరియాద చొప్పునన్. ౨౩౩

ఉ. యామ మతిక్రమించెను మ।హాటవి బాలుర స్త్రీల వృద్ధులన్
శ్రీముఖకామినీమణులఁ । జేర్చితి మింతకు శైలవర్యుఁ డే
మో మరియాదచేసి పురి । కొప్పుగఁ దోడ్కొనిపోవునంచు నెం
తో ముదమొందు నీమనల । నొక్కతృణంబుగ నెంచె నక్కటా! ౨౩౪

మ. మరియాదల్ జరపింపకున్న మను భాగ్యమాకత్నముల్ ఉగ్రవృ
క్షరపాతంబున నొంతు రంచెఱుఁగు మోహసన్ముని! యీవేళలం
దరుణీచిత్తము నెవ్వగం బొగులఁగాఁ । దాఁ జేయఁబూనం దపే
వరుసన్ దుర్బలుఁడైన నీవిధమె యుద్వాహంబులన్ గాంచనో. ౨౩౫

మ. మును పెద్దైన వివాహకాలములలో । ముగ్ధల్ ప్రచారంబు స
ల్ప నదేమాత్రము నీవు చూచినటు నే।భావింపఁగాఁజాల ని
తననేలా! యిపుడైన నాగిరివిభుం । డాక్షత్రజంబుల్ తరున్
గని తెల్పన్ వరపూజచేసి హరినిన్ । గళ్యాణసంసిద్ధికై. ౨౩౬

మ. అరుదేరందగు నంచుఁ బ్రీతివెలయం బ్రార్థింపఁగా వచ్చు నా
పరమాత్మున్ దృణమట్లుగాఁ దలఁచి యేపాడిం గొనంబూనకే
దురహంకారము నూని యంతిపురియందుౝ హాయిగా నుండునా
సురమానీ! యిది పెండ్లిపెత్తన మటంచుౝ సుంత యోజింపవో. ౨౩౭

చ. పిన్నలు పెద్దలుౝ గలిసి పెత్తన మెవ్వరు నీకొసంగి రే
మన్ననగాని లేదనుచు మాటలఁ దీవ్రశరంబులట్లు ని
న్నెన్నక క్రుమ్మరింతు రిది యీవెఱుఁగంగను జాలవొక్కొ యే
మన్న నిఁకేమిగాని మరియాదకుగా నిట హెచ్చరించెదన్. ౨౩౮

ఆ. ఇంతదనుకనైన నెటఁబోయినం బోవు, నింకనైన మనకు నెవరు దిక్కు
రమ్ము చెంతకనుచు సమ్మతిఁ బిల్చువా, రిట్టి కాఱుకాన నెవరుగలరు? ౨౩౯

చ జరగినదానికిౝ వగవ శాస్త్రము సమ్మతిఁజూప దింకనుౝ
జరగఁగలట్టి కార్యమును జాగొనరింపకయుండఁ జేయఁగాఁ
బురికొలుపం దగుౝ దుహినభూధరవర్యునిఁ దామసించినౝ
హరియు నమర్షఁ బూను క్షణమైనను గాలముఁ బుచ్చరా దిఁకన్. ౨౪౦

క. ఏ మాలోచించితివో, యోమానీ! యంచు నిర్జరోత్తముఁ డగునా
తామరస సంభవుం డనఁగా మునియుౝ దీవ్రకోపకలితుం డగుచున్. ౨౪౧

క. మునుమున్నె తనదుచిత్తంబును గాల్చెడుక్రోధవహ్నిమూర్తికి నైదో
డనఁదగు పద్మజువాక్కుల, విని గ్రహచారం బిదేమివిపరీతంబో. ౨౪౨

క. ఈపని నేనొనరింపఁగ, నోపుదు నని పూనుదినమునుండియు నిట్లే
చూపట్టు నంతరాయము, లేపగిది ఫలింపఁజేయ నిఁక నానొక్కొ. ౨౪౩

క. ఏలొకొ రాకున్నాఁడా, శైలమహేంద్రుఁడు పెండ్లిసందర్భమునౝ
జాలఁగ విఘ్నము లొదవుట, యేలోకమునందు నుండు నేర్పడ వినమే.

క. మఱచెనొకో నామాటలు, మఱునకయేయున్న రాకమసలునె యెవరేఁ
గఱపిరొ కుబుద్ధి యీలోఁ, గఱకంఠుఁడు రాఁడుగద స్వకార్యమ్మునకై. ౨౪౫

క. ఇచ్చటివారెల్లరు నను, గ్రచ్చఱ దూషింపఁ దివురకయె యుండంగౝ
జెచ్చెరఁ బోయెద హిమగిరి, కచ్చటివారికిని దెల్పి హరిరాక వెసన్. ౨౪౬

క. తోడుకొని వత్తు నెల్లరఁ, గూడ దిఁకౝ మసల నిందుఁ గూడినవారల్
వీఁ డెవఁడు పెద్దయై మముఁ, గూడం బనిచేయఁబంపఁ గోరికనొందన్. ౨౪౭

క. అనుచుం దలంచువారలె, కనుకౝ దూషింప నొరులఁ గడుఁ బురికొల్పం
గను జూతు రొవ్వఁజాలమిఁ, జనియెద హరియాజ్ఞఁ బూని శైలంబునకున్.

చ. అని మదినెంచి శ్రీహరిపదాబ్జములం గనఁబోయి యింతదాఁ
కను బరికించినాఁడఁ గద గ్రావము లెన్నఁ గఠోరముల్ జగం

బునఁగలవస్తువారమున భూపతివానికి నెట్టివాఁడొ చె
ప్పనుదరమౌనె యట్టిఁడగు పర్వతునిం గరఁగించినాఁడఁగా. ౨౪౯

ఉ. ఐనను నైజవృత్తి యపుడప్పుడు పాయఁగఁజాల కల్లనన్
దా నొగిఁ జేరుచుండు నిది నైజముగాఁ దగు సృష్టి నెల్లెడన్
మానిహితోపదేశమును మానసమందుఁ దలంపకుండఁ ద
క్షైనఁ దొరం గనంగ నిపు డాతనిఁ జేయఁగఁ బోయెదన్ విభూ! ౨౫౦

ఉ. అందఱుఁగూడి వత్తు నిది యంతయు నీయదియే యటంచుఁ దా
ముందె వచించె మీరు ననుఁ బోలఁగఁ బెద్దగఁ జేసినార లె
ట్లిందఱుఁ దన్నువాఁడనొ యదెవ్విధియో తలపోయఁజాల నై
నం దమసత్కృపాభరమునం బని దీని ఫలింపఁజేసెదన్. ౨౫౧

ఉ. పోయెద నాహిమాద్రిఁ గనఁ బూన్కి వచించెదఁ గార్య మిట్లుగాఁ
జేయుమటంచు నాతఁడు ప్రసిద్ధిని గాంచఁ దలంచువాఁడుగా
నే యలరారుఁ గాన నిపుడే మనలం గొనిపోవఁ బద్మప
త్రాయతనేత్ర! వచ్చు మరియాద యనన్ బ్రమదంబు నొందెదున్. ౨౫౨

క. ఇట నాలసింపఁ దగదీ, యటవి మహాసాధ్వసంబు నబలల కిదు ముం
దెటుపోయి యెటులు వచ్చునొ, పటుశక్తిని గాల మెల్లభంగుల ఘనమా.

క. త్వరపడఁగాఁ దగుతరుణం, బరిసూదన! సెలవె యనిన నఖిలజ్ఞుండౌ
మురహారుఁడు మంచి దటులే, యరుగుము యీపెండ్లి పెద్దవన నీవెకదా. ౨౫౪

క. ఇరుదెసలవారి సమ్మతి, నరుదుగఁ గాంచంగఁ గల్గినట్టిమునిని నే
నొరుఁగాన నిన్నుఁదప్పం, దరమే సామాన్యులకుఁ గనన్ నీశక్తిన్. ౨౫౫

క. అని పురికొల్పిన మునిపతి, పనివిని యొకక్షణములోనఁ బర్వతనాథుం
గనఁబోయి యేప్రయత్నం, బునుమాని విచారజలధి మున్గినవానిన్. ౨౫౬

చ. మునిపతి శిష్యు నెప్పు కనఁబోలునొ లగ్న మదెప్పు డంచు నే
వినఁగ నదృష్ట మొప్పునొ పవిత్రముగాఁగ మదన్వయంబు నై
ష్ఠానపుఁ జాలువాఁడనొ మహోత్తము శ్రీహరి నల్లుగాఁగ నే
గనుఁగొను టెప్పుడో యని నికామము చింతమునుంగు శైలమున్. ౨౫౭

ఉ. నారదుఁ డంతఁ గాంచుచు మనంబున నీతనిమోముఁ జూడఁగాఁ
దోరపుఁజింత మున్గినటు తోఁచెదుఁ గారణమేమొ దీని వే
సారక ప్రశ్న చేసి పలుచందములం బరికింపనెంతు నా
శ్రీరమణుండు నాపనిని సిద్ధిని బొందఁగఁజేయుఁ గావుతన్. ౨౫౮

ఉ. యోజనచేసి యివ్విధి మహోత్తమవాక్కుల నిట్టుపల్కె ని
ట్లాజగదీశ్వరుండు సుఖలంపటుఁ గొల్వఁగ వచ్చి చెంత నే

బూజతనంబు సత్ఫలము నిచ్చువిధంబునఁ జేయ నెంచి శ
క్రాజముఖామరాధిపు లశేషర్షి శమ్ముల్ దను సన్నుతింపఁగన్. ౨౭౯

క. వేంచేసియున్న వాఁడా, కాంచనచేలుని సమస్తకాంతప్రదునిం
గాంచఁగఁ దోడ్కొనిరాఁగా, నెంచక మ్రాన్పడినయట్లు లిందుంటిగదే. ౨౮౦

ఉ. దిక్కులుపిక్కటిల్లెడు విరధిన్ వినవచ్చెడు వాద్యఘోషముల్
చక్కఁగ వీనులంబడవొ స్వాంతము వేఱొకచోట లగ్నమై
యిక్కడ శ్రద్ధలేనియటు నిప్పుడొనర్చితొ తోఁపకున్నదే
యక్కట! యిట్టిచేత మఱియావఁ దొలంగఁగఁజేయ కుండునే. ౨౮౧

క. హేమారంభాముఖ సుర,భామినులాహరిని గొల్వవచ్చిరి రాధా!
వామాక్షీప్రభృతులు హరి, రామారత్నములు వచ్చి గ్రావము చెంతన్. ౨౮౨

క. పరగు నరణ్యానిని శ్రీ, హరిఁగాంచుచు నున్న వార లాలస్య మిఁకన్
బరికింపఁగ నపరాధమె, ధరణీధరవర్య! యగును తామస మేలా. ౨౮౩

క. లెమ్మా! పూజావస్తుగ, ణమ్ముం గొని నేను ముందు నడువంగఁ గళ
త్రమ్ముల్ బంధువులును మి,త్రమ్ములు నినుఁగూడి రాఁగఁ దరలుము త్వరఁగన్.

క. అని హెచ్చరింప మేనయుఁ, జనుదేరం గాంచి మౌనిసత్తముఁ డమ్మా
చనునే యిట్లాలస్యం,బును జేయఁగ వచ్చినారు పో హరి సురలున్. ౨౮౫

క. అని నాలుగుదిక్కులకుం, దన దృష్టిం బరఁగఁ జేసి ధాత్రీధర! యే
మనియెంచినాఁడ వీనను, గనరా దిటఁ బెండ్లిపనులు గావించినటుల్. ౨౮౬

చ. హరి వసియింప నర్హమగు హర్మ్య మదేడ? విరించముఖ్యులౌ
సురలు వసింపఁగాఁ దగినచొప్పున నొప్పుగృహంబులేడ? మం
డపములు తక్కువారి కని తీర్చినవెక్కడ? మౌనిరాజికిన్
శరణములేడ? యేపనియు సల్పినజాడయె గానరా దయో. ౨౮౭

ఉ. ఏమనుకొంటివో హరియు నెల్లసురేశ్వరులున్ మహర్షులున్
నీమదికిం దృణంబులని నేటికిఁ దోఁచినయట్లు లెంచెదన్
నామన మెట్టియిక్కటులు నాటఁగనున్నదొ నీవెఱుంగవే
భూమిధరేంద్ర! యింకయినఁ బోదము లెమ్ము విచారమేటికిన్. ౨౮౮

చ. విబుధమునీంద్రుఁ డీగతిని వేయివిధంబులఁ దొందరించి ప
ల్కఁ బొగులుచున్ హిమాద్రి యనుకంప దలంగి మునీంద్ర! యిట్లు న
న్నుఁ బలుక మేలె బంధువులును దెగిపల్కఁగ నాలకింపకే
మి బదులు చెప్పకుంట నినుమించి మఱొక్కని నమ్మకేగదా. ౨౮౯

మ. ఇదిగో పోయి ముహూర్తనిశ్చయము నేఁడే చేయనౌనంచు శా
రదనేతం గని వేఁడి మూర్తమును శ్రీరాధామనోనాథు చెం

త దమిత్ర విన్నప మొప్పఁజేసి యపుడే ♦ నాశిష్యుమూలంబునన్
దుదముట్టం దెలియంగఁజేయుదు మనోఽదుఃఖంబు లెట్లో చనన్. ౨౭౦

క. ఆమాటవిన్న యంతనె, యేమాడ్కిఁ బ్రయత్న మెట్టులే నొనరింపం
శ్రీమానినీమనోహరుఁ, డామోదము గాంచు నట్టు ♦ లరసి జతనమున్. ౨౭౧

క. ఒనరింపఁ బూనుమా యని, మునివర! తెలియంగఁబల్కి ♦ పోయితివిగదా
కనిపెట్టియుండి యిపుడే, మనమునఁ జింతించుచుండ ♦ మాటల వీనిన్. ౨౭౨

క. ననుఁ గాఱియపెట్టుట నీ,కును ధర్మముగాదు నాకుఁ ♦ గూర్చుహితుఁడవ
య్యును దూలనాడఁ జెల్లునె, చను దెంచుట న్యాయ్యమగునె ♦ సన్మునిచంద్రా!

క. నేనేయత్న మొనర్పం, గానేరను నీదునాజ్ఞఁ ♦ గావింతు నటం
చానాఁడె యొప్పఁజెప్పితిఁ, గానన్ నాదోష మిందుఁ ♦ గనఁబడ దనఘా! ౨౭౪

ఆ. ఇంతదనుకఁ గాచి ♦ యిది యేమటంచు నా,యింటికిఁగూడి వగచి ♦ యేమిచేయఁ
దోఁపకున్న నన్ను ♦ దూఱుట ధర్మమే, తలఁపవయ్య మదిని ♦ తాపసేంద్ర.

క. పనిపితివే యంతేవా,సిని నొక్కని లగ్న మిప్డు ♦ సిద్ధించెను నీ
వును యత్నపరుఁడ వగుమా, యని తెల్పఁగ నింకనేల ♦ యాగ్రహ మూనన్.

క. త్రికరణశుద్ధిగ నీపా,దకమలముల ముట్టి నాది♦తప్పిం దిసుమం
త కలుగదంచని శపథము, సకలజ్ఞా! చేయువాఁడ ♦ సత్యముపైనన్. ౨౭౭

చ. అని తడఁబాటునొందుచు మహార్తునిబోలి వచించుపర్వతేం
ద్రుని గని మౌని యెంతయును ♦ ధూర్తత మ్రాన్పడ నాత్మకార్య మె
య్యనఁ దలపోసి యియ్యదియు ♦ నారయ సత్యమె నేనె శిష్యునిం
బనుపఁ బ్రమాద మొందితిని ♦ బాచిత మియ్యది నాకె యయ్యెఁగా. ౨౭౮

సీ. డంబంబుగాఁ బల్కుకోటయుఁ దొల్త నవ్విధి జరుపకుండుటయునొక్కఁడని రిత్త
దూఱుటయు ననునీదోషముల్ నాకిప్డు తోడఁబుట్టువులుగఁ ♦ దోఁచుచున్న
వేమందు నీతని ♦ నెట్లు కార్యముఁదీర్తుఁ బెండ్లి యెవ్విధి హరిప్రీతిపముగ
సాగింపఁజను బ్రహ్మశక్రాదు లీననుఁ బరిభవింపఁగఁబూని ♦ పల్కుచుండి

ఆ. జక్రి పెద్దవగుచు ♦ సాధింపుమాయని, నన్నె పనిచె శేఖరోనాపుపుంప
నల్లి నాదును త్తమాంగమందున బడి, వావరింపఁ జేసె ♦ నక్కటకట! ౨౭౯

క. నాగరువమె నన్నెంతయు, నీగతి పగపాలుచేసె ♦ నేమందు నెటం
బేఁగల్పింతు నదెవ్విధిఁ, గాఁ గార్యము నిర్వహింపఁ ♦ గల్గుదు నింకన్. ౨౮౦

ఉ. తోఁప దదేమియున్ వగలు ♦ దోడనె కల్గుచునున్న దెన్నియో
తేపలుగాఁ బదింబదిగ ♦ దేవత లెల్లను వేచియుంటి రిం
దేపనియే నొనర్పఁబడ ♦ దిప్డు దొనర్పఁగలట్టి దేదియో
నాపరితాప మాపుజతనం బదియెట్టిదొ చేయు టెట్టులో. ౨౮౧

చ. శతమఖముఖ్య దేవగణసత్తము లెందఱొ యుండ సన్ముని
ప్రతతులు లెక్కకున్ మిగిలి పర్వుచునుండఁగ నే నొకండనే
కృతమతి నంచు గర్వమున నెవ్వరినైన గణింప కివ్విధిం
జ్యుతమతినైతి నిం కెవరొకో ననుఁ బ్రోచెడువార లిత్తఱిన్. ౨౮౨

ఉ. సాయముచేయఁబూన నొకజంతువయేఁ గనుపట్ట దెట్టులే
నాయజుఁ డాదిగాఁగల సుధాశనులెల్లరు నన్నుఁ దూలఁగాఁ
జేయనె కోరుచుందు రిది సిద్ధము శ్రీహరిచెంత కేగినన్
జేయుము పెండ్లి నాకనును జెప్పుదు నేమని చక్రిసన్నిధిన్. ౨౮౩

చ. తెలియక తప్పుచేసితిని దీని క్షమింపుమ యందు నేని యి
ప్పలు కిపు డిచ్చుటం బలుకఁ బాడియె పెండ్లికిఁ దర్లివచ్చి కా
నల నివసించి యింటికిఁ జనన్ బరిహాసము చేయకుందురే
నలువురు లోకజాలముల నారద! యేమన నేమిచెప్పుదున్. ౨౮౪

శా. తప్పెందప్పెను గార్య మింకెటులు నే దానిన్ సమర్థింతునో
చెప్పంజెప్పె మురాంతకుండు మునుపే సిద్ధించునే యిద్దియో
యప్పప్పా! పనియెల్ల నీయదియె నాయం దేమిభారంబు లే
దొప్పొప్పే తప్పా యొనర్పు మీవె యని యోన్నోసార్ల స్పష్టంబుగన్. ౨౮౫

ఉ. దానఁగలట్టిభావమును దత్పరతం దెలియంగలేక యి
ట్లూనినగర్వభారమున నొక్కటియైన నెఱుంగలేకయే
యే నఖిలంబొనర్తు నని యీశునిసన్నిధిఁ బల్కినాఁడ ని
ప్డీనను నేనె తిట్టుకొన నేమిఫలంబు పొసంగు దైవమా. ౨౮౬

చ. ధరణిధరేంద్రుఁ డీతఁ డొకత ప్పొనరింపఁడు పెండ్లియత్న మె
క్కరణి నొనర్పు శిష్యునిముఖంబున నన్నియుఁ దెల్పువాఁడ న
వ్వరుసఁ బ్రయత్నమంతయు వివాహమహంబున కర్హరీతిఁ ద
త్పరత నొనర్పుమంటి నటుపాల్పడనైతి నొనర్ప నక్కటా! ౨౮౭

ఉ. ఆయొకమాట తప్ప సకలార్థములందు మతిప్రగల్భతల్
పాయవు ముఖ్యకార్యమునఁ బ్రజ్ఞ యొకింతయు శ్రద్ధనూన ద
య్యో! యిది దైవమాయయె మఱొక్కఁడు గాదని యి ప్డెఱింగితిన్
జేయఁగలట్టికార్య మెది? సిద్ధిని గాంచు నదెట్లు చేసినన్. ౨౮౮

ఉ. వచ్చినవారు పెండ్లికని వాసవముఖ్యులు దిక్పతుల్ మహా
సచ్చరితుల్ మునీంద్రులును స్రష్టయు శారదలోనుగాఁగఁ గీ
ర్త్యుచ్ఛ్రితమించు సాధ్వులు గుణోత్తము లన్యశమొప్ప సంపదల్
హెచ్చుగనొప్పు యక్షులు మఱెందఱొ దేవత లెంతొ వేడుకన్. ౨౮౯

ఉ. కాననమందు వృక్షపరికల్పితవేశ్మములందు నిల్చి యే
మో ననుఁగూర్చి పల్కుచు మహోత్సవదర్శనకాంక్ష లొప్ప నిం
కైన హిమాచలుండు మరియాదగఁ దోడ్కొనిపోయి పెండ్లికై
తా నటఁగూర్చియున్న గృహతల్లజరాజిని మమ్ముఁ జేర్చునా. ౨౯౦

క. అని యితనిరాకఁ గోరుచుఁ, గనిపెట్టియె యున్నవారు కాలము యామం
బునకంటె హెచ్చుగడచెను, మనసులఁ గ్రోధంబు హెచ్చె మాట లికేలా!

సీ. ఏప్రయత్నము చేయఁ డీగిరీంద్రుఁడు నాదె యవివేకమని తేల్చెనద్ది సూనృ
తమెయగు దైవమే తగినట్టు లిశాస్తి నాకొనరించె ననంగ నొప్పు
నిన్నికార్యముల నే నెన్ని చేయంబూని యుండియు నొక్కవిష్ణుని బనుపక
యుండఁ గారణమేమియో తోఁపకున్నది శ్రీవిష్ణుమాయయే చెలఁగి నన్ను

ఆ. నావరించి యుండు నని స్పష్టమయ్యెడు, నిప్పు డూరకున్న నిందిరేశుఁ
డలుగకుండునే? బదులుపల్కువాఁడ నే, మనుచు నెట్లుతీర్తుఁ బనిని దీని.

క. అని యోజించుచు నుండటఁ, గనఁబడుచున్నట్టి శిఖరికాంతుని జూడం
గను లేనిదృష్టి యొప్పం,గను మ్రాన్పడియుండె మానకలితుఁడుపోలెన్. ౨౯౩

చ. వినఁబడె నొక్కమ్రోఁత వినువీథిని బ్రద్దలుచేయుచుఁ దిశా
వనితల హారసూత్రములు వారక పైకెగురంగ దిక్కరీం
ద్రనిచయ కర్ణముల్ బధిరితం గనఁగూర్చుచుఁ బద్మజాండ మొ
య్యనఁ బగులింపఁ బూనినటు లావనజంతువు లార్తిమ్రాన్పడన్. ౨౯౪

ఉ. ఏమగు నిద్దకాండలయమే యనితోఁపఁగఁ జేయుచుఁ మహో
ద్దామముగాఁగ; నంతటనె ధాత్రియె యీనినయట్లు నిర్జర
స్తోమము బ్రహ్మవాసవులతో వడిమీఱఁగ వచ్చె శైలరా
ట్టేమియుఁ దోఁపకే కనఁగ నెల్లవిధంబులఁ జూడ భీమమై. ౨౯౫

ఉ. ఎందు హిమాద్రిరాట్టలరు నెయ్యడ నారదమౌని యున్నవాఁ
డెందు నెసంగెడున్ విడిదియిండ్లు సుఖాసనయుక్తిమీఱఁగా
నెందు వివాహమందిర మహీనవిభూతి చెలంగనుండు రా
రెందుల కీమమున్ విడిచి యిండ్లకుఁ జేర్పఁగ సేవకోత్తముల్. ౨౯౬

మ. అదిగో తార్క్ష్యరథంబు దానిపయినిన్ హర్షంబుమీఱంగ సం
పద లొప్పారఁగ భక్తకోటికిడు నాపద్మాక్షుఁ డుద్యత్ప్రభా
స్పదుఁ డున్నాఁ డతఁడే వివాహమహకాంక్షుల్ మీఱ నేతెంచెఁ గాం
చఁదగుం గన్నులపండువై తగుజగత్సంఘాధిపున్ శ్రీపతిన్. ౨౯౭

ఉ. మంగళవాద్యయుక్తముగ మాధవుఁ దోడ్కొని రాఁగ బంధురా
జింగొని వస్త్రభూషణవిశిష్టపదార్థములన్ గ్రహించి మే

నాంగన తోడరాఁగఁ దుహినాద్రివిభుండు మహావిభూతిఁ బో
వంగఁ దగుంగదా మసలవచ్చునె మీనమువేష మెన్నుచున్. 298

ఉ. మేమిటు తొందరించినను మే లిది యట్లె యొనర్చువార మం
చేమియు నుత్తరం బిడఁగ నెవ్వఁడు పూనఁ డిదేమిచిత్రమో
మామొఱ లాలకించుటకు మైకొనువాఁ డొకఁడైన లేఁడె యీ
భూమిధరేంద్రుచెంత నని పొంగెడువేడ్కలఁ బల్కు నిర్జరుల్. 299

చ. కనఁబడసాగి రెల్లెడలఁ గాని బదుల్ పలుకంగఁ బూన నె
వ్వనికగు శక్య మాశిఖరివర్యుఁడు మౌనికి ముందు నిల్చె న
మ్మునియు నదేజగంబునకు బుద్ధిని బంపెనొ కాని దారువే
యనఁదగు నట్టులుండె నిఁక నందులకున్ బదు లెట్లు వచ్చెడున్. 300

తే. భంగసంగతిలేని యావార్ధిభంగి, హిమగిరీంద్రుని పురవర మెల్లనుండె
నొక్కమాటయుఁబల్కంగనొకఁడు లేమి,నంత హరియాజ్ఞఁబద్మజుండరిగెనటకు.

చ. అరిగి హిమాచలేంద్రుఁ గని యాతనిముం దొకశుష్కదారు వ
ట్లెసయఁగ నాసురర్షివరు నప్పుడు గాంచి పితామహుండు నే
సరసిజనేత్రునానతిని జయ్యన వచ్చితి బ్రహ్మనాముఁడన్
సురమునివర్య! యేటికిటఁ జోద్యముగా నిలుచున్నవాఁడవో. 302

ఉ. వచ్చినకార్య మేమనుచు స్వాంతమునం దలపోయకుండఁగా
వచ్చునె న్యాయ్యమే యిదియు వాసవముఖ్యులు నీవు రామిచేఁ
జెచ్చెర వచ్చినా రిటకు శ్రీహరియున్ దయచేసె నింక మే
మిచ్చట నెందునుండు మిపుడేని వచింపుము సత్కృపానిధీ. 303

ఉ. చాలును నీవొనర్చినప్రశస్తమహోత్సవకార్యదీక్షయుం
జాలు నిటం బొసంగిన విశాలసపర్యలు మాటలేల మే
మోలిఁ జనంగ నుత్తరువె యోముని పెండ్లికిఁ బెద్దవాటయే
చాలును వేలువచ్చినటు సంతసమందుచుఁ బోవు టొప్పఁగా. 304

చ. తడిసిననుల్కమంచము విధంబున బిఱ్ఱబిగించుకొన్న ని
ప్పుడు పనిసాగునయ్య, మముఁబోటులఁ జంపితి వింతదాఁక న
య్యడవుల నుండఁజేసి మరియాదలు నేర్చుకొనంగవచ్చె నీ
కడ నిఁకఁ జాలుఁజాలు మృతకల్పులఁగా మము నెంచినాఁడవే. 305

చ. దనుజులు దైత్యరాక్షసులు త్వత్పరికల్పితదేవకార్య మి
ట్లనుపమరీతి సాగఁగని యార్చుచుఁ గేలి యొనర్పకుందురే
వనజదళాక్షుఁ డిప్డు చనవచ్చునె వచ్చినత్రోవఁబట్టి, య
య్యెనె యటఁ బెండ్లియం చడుగ నేమనిపల్కుదు మేము వారితోన్. 306

ఉ. సిగ్గొకయింతలేక సురసిద్ధుల నీపనిచేయుఁడంచు నీ
వగ్గలిఁ బల్కు తప్పు మరియాదలఁ బొల్పడఁ జేయఁజాలకీ
విగ్గిరిచెంత నిప్పుడిటు లేమియుఁ బల్కక యుండఁజెల్లునే
యగ్గురువంపుఁబాపఫల మార్తుల నిన్నలయింపకుండునే. ౩౦౭

సీ. తగుదునమ్మాయనఁ దగిననానుడిరీతిఁ దలయెత్తుకొని యెవ్విధమున నింకఁ
దిరుగంగఁగలవొ యాదివిజులలోన; నీవింతకుఁ బూర్వమే యెన్నొకలహ
ములను గల్పించి మెప్పులఁ గాంచినాఁడనం చాత్మగర్వంబున నల్లి యిపుడు
పార్వతిపెండ్లిని బండితు లవుననఁజేసి మెప్పునుగాంచనాస గనిన

తే. వాఁడవో నేమొ మమ్మెల్లఁ బంతమలరఁ, బిలిచిపిలిచి యిప్పట్టునఁ దెలియనట్టు
లూరకుండినఁ దప్పునే యువిదమిన్న, లెల్ల నవ్వరె చాలు నింటట్టులుంట.

చ. జతనము నిర్వహింపు మిదె చక్రధరుం డరుదెంచె శాస్త్రచో
దితమగు పద్ధతుల్ వెలయఁ దృప్తిగఁ బూజలఁ దన్పఁబూన్పు ప
ర్వతపతి నెల్లవారికి నివాసముల్ వడిఁ జూపఁ బంపుమా
మతివిభవంబు పేర్మి నలమానినిఁ జక్రికిఁ గూర్పు వేగమే. ౩౦౯

క. తారాచంద్రబలంబుల, నారసి నీవేకదా మహామతి నగుచున్
సారబలాన్విత లగ్నము, నేరిచితివి నిశ్చయింప నిర్జరమౌనీ! ౩౧౦

ఆ. లగ్నబలము దగఁజెలంగుఁ గార్యంబని, శాస్త్రముండుఁగాదె సన్మునీంద్ర!
యట్టిరీతి లగ్న మది నిశ్చయించితి, ఫలము గల్గవలదె భవ్యగతిని. ౩౧౧

క. ఏమన్న నూరకుండిన, నేమి యొనర్పంగలార లీనన్ననుచున్
నీమది నెంచితివొకొ యిదె, తామరసాక్షుండు పిల్వఁ దలఁచెన్ నిన్నున్.

క. చనుదెమ్మా దేవర్షీ, యనుచుం దను హెచ్చరింప సంతట స్మృతి రా
ముని యంతటఁ గనులను ద్రి, ప్పెను ముందు గిరీంద్రుఁ గాంచెఁ బృథులతరాస్త్రన్.

ఆ. పార్శ్వమందు నిల్చి పలుకుచున్న విరించి, యంతఁ గాంచి త్రపయును నలముకొనఁగ
మాటలాడలేక మఱిమఱి కంపితాంగంబు చూడ వింతగా నెసఁగ. ౩౧౪

క. జలజాసనా! నమస్కృతు, లెలమిన్ గ్రహియింపు మనుచు నింతపలుకుచున్
వెలయుమహర్షిన్ దిక్కులఁ, గలయం గాంచుచును బావకసమముఖనయున్.

ఆ. వ్రాలి "పాహి"యనుచు భక్తిభరంబున, లేవకున్న తనయు లేవనెత్తి
కరుణ లోననిముడఁగాఁ జేసికొని యిట్లు, పలికె వింతయర్థములు గలుగఁగ.

క. తనయా! యేమిది దుఃఖంబును గాంచెద వేమియయ్యెఁ బూనికని యీ
వనటం గాంచిన వ్యర్థమె, యనునూహ చెలంగుచున్న యాత్మన్ నాకున్.

క. కారణమేమొ మోసం, బీకీర్తిం జేసె నెవ్వఁ డెఱిఁగింపుము త
త్కార్యరమనీషుని నిత్తఱి, సౌరిపుడం బందు నుండఁ జక్క నొనరుతున్.

క. పరమేశ్వరుకార్యంబున, కురువిఘ్నము గల్గఁజేయుకునుద్ధతుఁ డింకన్
శిర మెత్తుకొని జగంబులఁ, జరింపఁగాఁ జాలువాఁడె ? సంయమివర్యా! 3౧౯

క. తెలుపుము సాగిన దెల్లం, దెలిసిననీయట్టివాని ? ధీమహిమం బి
ట్టులు వ్యర్థమౌ నటంచుం, దలఁపంజాలము మున్న దెపుడు ? తాపసివర్యా!

క. ఇపుడేటికొ నీచేసిన, శపథంబిటు వ్యర్థమయ్యె ? సంయమివర! నీ
కృపకుం బాత్రుండేకా, దె పర్వతేంద్రుం డదేటి ? కిపు డిటుమాటెన్. 3౨౧

క. మునివర! యశ్రుకణంబులు, కనుఁగవ నిండంగ నేడ్వఁగా నేటికొ య
వ్వనజాతుకరుణ సర్వం,బును ఫలియించున్ విచారకమును మాను మింకన్.

క. అని లేవనెత్తి యభయం,బు నిచ్చి యాశీతగిరివిభుం గాంచి మునీం
ద్రుని దుఃఖకారణంబును, వినిపింపుమ సాగినట్టివిధ మీపనిలోన్. 3౨౩

చ. సరసిజసూతి యిట్లడుగ ? శైలవిభుండును భక్తిమీఱఁగా
జరగినదెల్ల దాఁపక వెస్సం దెలియంగను విన్నవించె న
త్తరుణమునందె బ్రహ్మయును ? దాపసులం బిలువంగఁబంచి ని
ర్జరగురుముఖ్యులం గలిసి ? రమ్యసభాస్థలిఁ జేరియంతటన్. 3౨౪

చ. హిమగిరిశేఖరా! యిచటి ? కెల్లర మల్లరమేశుతో వివా
హమునకు వచ్చినారము ప్రహర్షముమీఱఁగ నిమ్మునీంద్రువా
క్యము నెఱనమ్మి నీపలుకు ? లారయఁగా నిసుమంతయైన దో
షము కనరాకయున్నయది ? సర్వము సంయమిదౌ ప్రమాదమే. 3౨౫

చ. స్ఫుటముగఁ దోఁచె నెల్లరకు ? సూనృతవాక్యము నీదియౌ మఱే
మిటు జరగంగనౌనొ నిను ? నే నడుగంగఁ దలంచినాఁడ నొ
క్కటి దలపోయఁగా వలదె ? కాంచనచేలుఁడు వచ్చి దేవతా
పటలముఁగూడి వే మరలి ? పర్విడె నన్న వినంగ న్యాయ్యమే. 3౨౬

చ. త్రిదశులు పద్మజన్ముఁడును ? దేవపతుల్ తనుఁగూడిరాఁగ నా
రదువచనంబు నమ్మి ఖగరాజుపయిం దమిఁ గూరుచుండి శ్రీ
మొదలగుధర్మపత్నులు ప్రమోదమునం దనవెంటరాఁగ వ
చ్చి దను గిరీంద్రునాత్మజయుఁ ? జే గ్రహియింపమిఁ బోయె వ్యర్థుఁడై. 3౨౭

చ. అనుచు జగంబులందుఁ గడు ? నల్లుకొనుఁగద దుర్యశంబు దా
నినివిర నష్టమే మనకు ? నీవె తలంపుము పర్వతేంద్ర! నీ
తనయను బిల్వఁబంపుము నితాంతము కన్గొనెదం దదాశయం
బును ముదుకండఁగానఁ దనబుద్ధిని దెల్పును లజ్జ నొందకే. 3౨౮

ఉ. ఆవలఁ బోలినట్టివిధ ? మారయువాఁడ నటన్నఁ బర్వతుం
డావిధ మెల్లచందముల ? న్యాయ్య మనందగియుంట నట్టులే

నావరపుత్రిఁ బిల్చెద మానసంబునఁ గల్గినమాటఁ జక్కఁగా
వే వివరింపు మంచుఁ బరివేలతెఱంగుల నొక్కి చెప్పెదన్. ౩౨౯

ఉ. కాని మఱొక్కమాట వినఁగాఁ దగియుండును మీకుఁ బద్మజ
న్మా! నలినాక్షి యిందఱు వినంగ వచింపఁగ లజ్జనొందునో
కాన మదీయపుత్రిఁ గనఁగాఁ దమరే యొకకొందఱిద్దె యీ
మానినిఁగూడి రా నట సమస్తము మీకెఱుఁగంగ నయ్యెడున్. ౩౩౦

క. ఇది మంచిదనుచు మీ రె, మ్మదికిన్ రుచియించునేని మద్గృహమునకున్
సదయులరై దయచేయుఁడు, విదితముగన్ దుహితృచిత్తవృత్తం బందున్.

క. అని ప్రార్థించినఁ బద్మజుఁ, డనునార్యా! యిద్ది సత్య మగుఁ దప్పక నే
మునివరులఁగూడి వచ్చెద, వినియెదఁ ద్వత్పుత్రి పల్కు వృత్తాంతంబున్.

క. తరువాత న్యాయపద్ధతి, పరమాదరణీయమగుటఁ బరికింతము వే
యరుగుద మచ్చటికిఁ క నన, సరసిజజన్మప్రభృతుల సంతస మలరన్. ౩౩౩

క. పిలుచుకొనిపోయి శుద్ధాం, త లసన్మణివేదియందుఁ దగునాసనముల్
విలసిల్లుచోట సుపవి, ష్టులఁగా నొనరించి లోనఁ జొచ్చి కొమరితన్. ౩౩౪

క. పరికించి పద్మసంభవుఁ, డరుదెంచె న్నిన్నుఁ గాంచు నాదరమున ని
ర్జరమాని లోనుగా ముని, వరు లొకకొందఱును గూడ వచ్చిరి తల్లీ! ౩౩౫

చ. హరి చనుదెంచెనంట సురలందఱు నారదునాజ్ఞఁ బెండ్లికై
పరమముదంబు నొంది తమభార్యలఁగూడి విమానపంక్తిపై
నరుదుగ వచ్చిరంట యిట యత్న మదెద్దియుఁ జేయకుంట నే
నరిగి సపర్యలం దనిపి యందఱఁ దోడ్కొని రాకయుండుటన్. ౩౩౬

క. కారణ మెద్దియొ యని య,వ్వారిజసంభవుఁడె మానిసవర్యులతో వే
సారక వచ్చెను నేనును, గారవమునఁ దెల్పితి నిటఁ గలవార్తలనున్. ౩౩౭

క. అంతటఁ బద్మజుఁ డెంతయు, వింతనుగని నిన్నుఁ గాంచి విమలాశయ మ
త్యంతముఁ దెలియఁగఁ గోరిన, నంతిపురిం జేర్చినాఁడ నన్నాం బనుచున్. ౩౩౮

క. కొందఱె యచ్చట నున్నా, రందఱు మర్యాదఁ గాంచి యాశయమును నీ
డెందమునఁ గల్గుదానిని, సందేహముమాని తెల్పు సారసనేత్రా! ౩౩౯

క. మోమోటమి యించుకయే, నీమాటలు దెల్పరాదు నిర్మలచిత్తా
బేమాడ్కిఁ దోఁపఁజేయునొ, కో మానిని తెల్పు మిప్పు నో పంకజముఖీ. ౩౪౦

క. సముఖమున రాయబారము, విమలమతుల్ తలఁతు రెల్లవిధములఁ బగ దం
చు మదిఁ గలట్టి తలంపులఁ, గమలాసను మ్రోలఁ దెల్పు గాధేయపుత్రీ! ౩౪౧

చ. అని తను హెచ్చరింపఁ బరమాత్మ తపోధనముఖ్యుఁడిట్లుఁ దె
ల్పినశుభవార్త నెమ్మదికిఁ బ్రీతి వహింపఁగఁజేయ సత్ఫలం

బున కిది కాలమంచు నలభూతపతిన్ హరు శంకరున్ నిరం
జను భయభక్తులొప్ప నొకసారి తలంచి మహాత్మ! నీనుడుల్. ౩౮౨

మ. ఫలియింపంగను జేయుసత్స్వమయ మిబ్బంగిన్ సమీపించె ని
స్తులభక్తిన్ భజియింతు నీపదములన్ దోడ్తో ఫలింపంగ ని
మ్ముల రమ్మా! సభయందె నీదుశపథంబున్ సర్వగీర్వాణవ
ర్యులు దిగ్భ్రాంతి నెసంగఁ దీప్ప సకలార్థుల్ నన్నొగిం బాయఁగన్. ౩౮౩

చ. కలవిలపాటు గాంచ కలకంజదళాక్షునిసూను మ్రోల నేఁ
దెలిపెద నీవు తెల్పినవిధిం బయికార్యము దీర్చుభారముల్
నిలిచెఁ ద్వదీయశీర్షమున నేఁ జనుదాన విరించిచెంత కం
చలపుచుఁ దండ్రితోడ జలజాసనుసన్నిధి కేగెఁ గన్నెయున్. ౩౮౪

ఉ. వేదికమీఁద నున్నవిధి వింతలుపర్వఁగ నయ్యుమాంగనన్
బ్రోదిగఁ గాంచి యారు! సురపూజ్యుని శంకరుఁ జెట్టపట్టఁగా
నే దగిఁయుండు నీసుదతి నిమ్ముని యజ్ఞతఁ జక్రధారికిం
దాఁ దలఁచెన్ ద్వితీయగ నొనర్పఁగ శక్యమె యేరికైననున్. ౩౮౫

క. మూలప్రకృతియె యీయమ, యేలా! సందేహమొంద నిఁక బోధింపం
బోలదు భావమె తెలియం, జాలును నాకార్య మిదియె చక్రి తలఁపిదే. ౩౮౬

క. ఈరీతిం దలపోయుచు, సారససంభవుఁడు కన్నె సవిధిగనె నమ
స్కార మొనర్చిన విధిహిత, సారాభీష్టైకసిద్ధి చాంనరొ యగుతన్. ౩౮౭

తే. అనుచు దీవన లిచ్చి మర్యాద కెంతొ
వింతపొడమఁ గూర్చుండుమా వెలఁదిమిన్న
యంచు జనకునిచెంత నర్హ్మమగురీతిఁ
గూరుచున్నట్టి యుమఁ బల్కెఁ గోరి కలర. ౩౮౮

చ. అమ్మా! నీతలపెల్లఁ దా నెఱిఁగిన ట్లానంద మొప్పారఁగా
నిమ్మానీంద్రుఁడు మమ్ముఁ బెండిలికటం చెన్నే వచింపంగ రా
దమ్మాడ్కిం బలుసారులే పిలిచె మే మమ్మాట లాలించి స
త్సమ్మానార్హతమున్ మహామహిమునిన్ సంపత్ప్రదున్ శ్రీహరిన్. ౩౮౯

క. పిలుచుకొని వచ్చినారము, తెలియక యిట సాగినట్టితెఱఁ గెల్లన్ ద
ప్పులఁబట్టఁగూడ దిఁక నీ, తలఁపె యెఱుంగంగ నిప్డు తగునని తోఁచెన్.

క. ముకుకుఁడ నీజనకునకున్, వదలం దగనట్టిసఖుఁడ వామాక్షీ! నీ
మది కెదితోఁచిన నయ్యది, వదలక వాక్రువ్వవమ్మ భయపడ కిచటన్. ౩౯౦

క. అని యిట్లు హెచ్చరించిన, విని వారిజనేత్ర పలికె వినవయ్యా! నా
మనసు స్వయంవరమునఁ బతిఁ,గొనఁ దగునని యెంచెదు నట్టుకోరుదుఁ జేయన్.

క. వినిపించెద నాపద్ధతిఁ, జనుదెంచినవారిచెంత సంవత్సరముల్
కన రెండుగడువ మూఁడవ, దనఁబడు వర్షంబురాఁగ నలరెడు బాలున్.

క. నాతల్లి యంకముపయిన్, నాతండ్రియె యనుపవలయు నానాదేవ
వ్రాతము చూడఁగ నెవ్వం, డాతనిఁ బయికెత్తు నతని నాత్మేశ్వరుగన్. ౩౫౪

క. కైకొనియెద నీపద్ధతి, నీకున్ నాతండ్రి కెంతొ నెమ్మి నిడు నటం
చాకాంక్షించెద నిదియే, నాకోరిక వేఱులేదనన్ విని యజుఁడున్. ౩౫౫

చ. మనసున చింతనొంది యిది మానిని కెన్న శుభప్రదంబెయౌ
నని తలపోసి త్ర్యంబకుని యాశయ మెన్నఁ దరంబె యేమిపం
చిన నటుచేయుటే వరము చెప్పినయిప్పలు కెన్న న్యాయ్యమే
యనఁదగుఁ గాని వేఱుగతి నాడిన న్యాయవిరుద్ధమే యగున్. ౩౫౬

చ. ఒకక్షణకాల మిప్పగిది నూహలుసాఁగఁగ నూరకుండి యో
వికచసరోజనేత్ర విన విస్మయమౌ నిది యట్లొనర్ప నా
కొకవిధినే నసర్థమను నూహ జనింపదు న్యాయసమ్మతం
బిఁకఁ దడవేల యప్పనికి నీకొనువారము నే నమస్త్యలున్. ౩౫౭

చ. గిరివర! యీవిధానమునఁ గేవలసమ్మతి నొందువాఁడవం
చరసెద నేమనంగలవొ యన్న గిరీశుఁడు సంతసంబె యి
క్కరణి నొనర్ప నెవ్వనిని గాంతునిగాఁ గొనునో వచింపరా
దురుతరసంశయావళులె యొప్పెడుఁ బైపయి నామనంబునన్. ౩౫౮

ఉ. కన్నియగాన లోకములఁ గన్నడు నాచరణంబులంచు నే
కొన్నిటనే నెఱుంగ దొకకోర్కి మదింబొడకట్ట నంచు బా
గున్నదొ యోగె యున్నదొ యి చొప్పడు నిట్టని నిష్ఠయుం [illegible]
నెన్న సమర్థురాలనుచు నించుకయైనను దోఁప దోవిధీ! ౩౫౯

చ. కనుకనె తోఁచినట్లుగ నఖండమనోద్రఢిమంబుగల్గిన
ట్లనువుగఁ జెప్పె రాఁగలుగునాపద లించుకయే నెఱుంగ దె
మనఁగలవాఁడ నింకఁ దమ రెన్ని మహాత్మజ మేలుగోరి యే
పని హితమంచుఁ జెప్పెదరొ వారక దానిఁ దలన్ ధరించెదన్. ౩౬౦

ఉ. శీతగిరీంద్రుఁ డిప్పగిదిఁ జెప్పిన స్రష్టయు నాలకించి త
చ్చేతము తృప్తినొందుగతిఁ జేయఁదలంచి గిరీశ! నీతనూ
జాతకు శాశ్వతంబయిన శర్మము గల్గెడుభంగి నీజగ
ద్వ్రాతము మెచ్చునట్లుగ వివాహము సాగెడు నంతరింపుమా. ౩౬౧

ఉ. ఈవిషయంబునందు మది నేమియుఁ జింతలఁ జొప్పడింపకుమా
భావివిశేషముల్ గనెడు భాగ్యము గల్గుచు నీవు మేనలో

నీవిధ మెల్లఁ జెప్పుము నిరీహుఁడవై కనుచుండు మింక నీ
వేవిధి యత్నముం సలుపనెంచుట మేలో యెఱుంగఁ జెప్పెదన్. ౩౬౨

క. నాకూఁతు స్వయంవరమునఁ, జేకొనుఁ బతి నెల్లదేవసిద్ధాదులు సు
శ్రీకులు రాఁదగు నేఁ డని, యేకడలం దెల్పఁదగునొ యేమఱ కిపుడే. ౩౬౩

ఆ. చాటఁబంపు మనుడు సంతసం బిగురొత్త
నచలవర్యుఁ డపుడె యద్రిఁగలుగు
శిఖరముఖములందుఁ జెలఁగుదేవాళుల
కెఱుకపఱుపఁ బంపె నెల్లభటుల. ౩౬౪

క. మునుముందె పెండ్లివేడుకఁ, గన వచ్చినవారె కానఁ గనఁబడ రెండుం
వినిపించితి మొకశంకరు, ననుచరులే విని రటంచు నాభటవర్యుల్. ౩౬౫

క. తెలిపిన విని ముదమందుచు, జలజాసనముఖుల కెల్లసంవాసార్హా
మలహర్మ్యంబుల నేర్పఱి, చి లలి స్వయంవరమునకుఁ బ్రసిద్ధస్థలమున్. ౩౬౬

క. పరమేష్ఠియనుమతంబున, ధరణీధరవర్యుఁ డెంతొ తమకంబున సుం
దరమండప మేర్పఱిచెను, సురవర్యులు దానిఁగాంచి చోద్యంపడఁగన్. ౩౬౭

క. అంతట నాపార్వతి శు, ద్ధాంతమునందుండి శంకరా! పరమేశా!
వింతగదా నీమహిమం, బింతయనం జాలువా, రిదెవ్వరు సృష్టిన్. ౩౬౮

క. ఇంచుకభేదంబుగ సా, గించితి నీమాటయే యకృత్రిమకరుణా
సంచయుఁడవు ననుఁ బాలం, ముంచెదవో సలిలములను ముంచెదవో విభూ!

క. తెలియంగఁజాల నేనీ, పలుకుల నెఱనమ్మి యట్లె పలికితి స్వామీ!
తలఁపుమ యిచటికి రాఁగా, జలజాసనముఖులు హరియుఁ జనుదెంచి యిటన్.

క. ఏమో తలఁచుచునున్నా, రేమాడ్కి మదీయభాగ్య మిపుడు ఫలింపం
గామహరా! యున్నదియో, యేమాత్ర మెఱుంగఁజాల కిటఁ జింతిలుచున్.

ఆ. ఉన్నదాన ననుచు సుమ తన్ను ధ్యానింపఁ, బ్రేమతంతు వొకటనేమ మలరఁ
దన్నుఁ బ్రోత్సహింపఁ దరలె భూతేశ్వరుఁ, డాదిదేవుఁ డగు శశాంకధరుఁడు.

సీ. ఇరుకరంబుల మహాహీంద్రకంకణములు పరమాత్మతత్త్వంబు బయలుపఱుప
నవ్యరుద్రాక్షకుండలముల దీప్తులు దిగ్విదిక్తమసులఁ దెరలఁజేయ
వాసుకిముఖ భోగివర్యహారంబులు పరమేశ్వరత్వంబు సరిగఁదెలుప
నరుణజటాభూషణామలశశిరేఖ నిరుపమవిభవత నెఱి వచింప

తే. హస్తిచర్మాంబరము నిరీహతను జాటఁ, గరవిభూషణ మృగశాబకము కృపైక
సింధువనుమాట నెంతయుఁ జెలఁగి చెప్ప, వృషభవాహనుఁడే తెంచె నెలమిమిగుల.

ఉ. లక్షలొ కోట్లొ యంచును జెలంగుచు లెక్కిడలేక పన్నగా
ధ్యక్షుఁడు భోగముల్ ముడువఁ దక్కినవార లిఁకేరు శక్తులీ

త్ర్యక్షునిసైన్యసంఖ్య యిదె । యంచు వచింపఁగ నంచు దేవతా
ధ్యక్షులు చూచుచుండి రెదలం దొకవింతలు పర్వుచుండఁగన్. 328

ఉ. చుక్కలు దేవకాకృతులఁ । జోద్యముగా ధరియించి వచ్చెనో
యక్కజమే యిదంచు సురలందఱు చూచుచునుండ నంది పై
నెక్కి త్రినేత్రుఁ డీశ్వరుఁ డహీనవిభూతి చెలంగ వచ్చె నే
దిక్కుననుండి వచ్చెనొకో । దేవవిభుండని మానులుం గనన్. 329

ఆ. ఎల్లభూతములను । హృదయగతుండయి, దిరుగఁ జేయుచుండు । దేవవిభుఁడు
చిత్రరూప మలరఁ । జేరె స్వయంవర, మండపమున కాత్మమహిమ మలర.

చ. హరుఁ డరుదెంచె నన్నుడి । యంతటఁ గర్ణయుగంబులం బడన్
హరియును బ్రహ్మముఖ్య విబుధావళితోఁ జనుదెంచె వేడ్క ని
ర్జరతరుణీమణుల్ మఱియు । రాధయుఁ దక్కినవిష్ణుపత్ను లా
దరమున వచ్చి రమ్మహముఁ । దా రొగిఁ గాంచెదమనూహ లుబ్బఁగన్. 322

చ. నిరుపమరత్నకాంచన వినిర్మితమంచములందు నెల్ల ని
ర్జరవిభు లాహిమాద్రిభటసత్తము లెంతయు భక్తిఁ జూపఁగా
హరిహరపద్మగర్భు లొగి । నం దుపవిష్టులు కాఁగఁ గూర్చుచుం
డిరి మహ మెట్లు సాగునొకొ । నీరదవేణియు వేని కబ్బునో. 32౮

ఉ. బాలకు నెవ్వనిన్ శిఖరివర్యునిభార్య నిజాంకసీమపై
లీలఁగ నిల్పుకొన్న నవలీలఁగ నాతని నెవ్వఁ డెత్తఁగాఁ
జాలునొ యాతనిం బతిగఁ । జాన గ్రహింపఁగ సమ్మతించె నం
చోలి వినంబడున్ సురగణోత్తముఁ డెవ్వఁ డదృష్టవంతుఁడో. 32౯

చ. తెలియఁగఁ జాల మింక నలధీశుని గాంతుము కన్నులార నం
చలరుచు దేవతల్ పలుకునాసుడు లంబరవీథి నిండె నే
జలరుహనేత్రపుత్త్రుని విశాలవిభూతి నెసంగువాని భూ
ధ్రలలన దా గ్రహించునొకొ । తత్తనయుం డెటు లుండువాఁడొకో. 330

క. అనుచుం గొందఱు పల్కం, గను దద్ధ్వని నిండె నెల్లకడల నలహిమా
వనిభృద్వర్యుఁడు పద్మా, సను కనుసన్నను గ్రహించి । సంతస మలరెన్. 331

చ. తనపని యిట్టులయ్యె నని । తద్దయు వంతల గుందుచున్ మహా
మునిగణమందు నుండ కొకమూల నదెట్టులొ దాఁగియున్న య
య్యనఘుని నారదుం బిలిచి । యాతనిఁగూడి వయఃంబుమీఱ సీ
తనిచగు నాజ్ఞచొప్పుననె । తాను సమస్తము నిర్వహించుటల్. 33౨

చ. సురగణ మంతయున్ వినఁగఁ । జొక్కపుఁబ్రీతిని జెప్పె యమ్మునీ
శ్వరుఁ గొనిపోయి స్వీయగుహసద్మముఁ జేరి కుమారిఁ జీరి య

మ్మరో! భవదాశయంబు మునిమండనుఁ డీతఁడు మంచిదే స్వయం
వరమును జాటఁబంపుమనె | వాక్యము దాని ధరించితిం దలన్. ౩౮౩

క. అక్కరణిఁ గార్యమంతయుఁ, జక్కఁగ సాగించినాఁడ | శంకరముఖ్యుల్
దిక్కుల్ పిక్కటిలంగా, నక్కజముగ వచ్చినార | లందఱు తల్లీ! ౩౮౪

క. నీవన్నమాటయే యగుఁ, బావన మద్దానిఁ జేయఁ | బాటిల్లు శుభం
బావనిత కంచుఁ బద్మజుఁ, డావేళ వచించెఁగాదె | యావిధముననే. ౩౮౫

సీ. వాస్తుశాస్త్రమురీతి | భాసిల్లునట్లు స్వయంవరమండప | మలరఁజేసి
యుచితాసనంబుల | నొప్పుగాఁ గూరిచి వచ్చినవారల | భక్తిమీఱ
నాయాయి తావుల | నర్హాసనంబులఁ గూరుచుండఁగఁజేయు | నేరుపుగల
యట్టిభటావళి | నందుఁ జేర్చితి వార లల్లెయొనర్చి రయ్యామరవరులు

ఆ. శంకరాబ్జనేత్ర | శతధృతు లమరేశుఁ, డింకఁగల్గు నట్టియెల్ల నిర్జ
రులును గూరుచుండి | రెలమి మించఁగ నింకఁ, దరలిరమ్ము వేగ | తల్లి కాన.

చ. జననిని గూడి వచ్చి త్రిదశప్రభులెల్లరు చూచుచుండ రెం
డనఁ దగునేండ్లునిండి సకలాంగరుచుల్ తగుబాలు నేరికో
మ్మనునయమొప్ప నీజనని | యంకముపై నిడుకొన్నవాని నె
త్తు నెవఁడో వాఁడు నీపతియె | తొయ్యలి నీపలు కిద్దియేకదా. ౩౮౭

క. ఆరీతిగఁ గార్యంబుఁ గు,మారి! సాగింపు మింక | మండపమునకుఁ
జారుతరవేష మొప్పఁగ, రారమ్మా! తల్లిఁగూడి | ప్రాణేశుఁ గొనన్. ౩౮౮

క. అనుటయు నారదముని నీ, వనినట్లే యొప్పుకొంటి | మబ్జభవాదుల్
చనుదెంచిరి తడవేటికిఁ, జనుదెమ్మా! నెమ్మి మదిని | సంధిలఁ గొమ్మా! ౩౮౯

సీ. తొలిజన్మములను నిస్తులపుణ్య మెద్దాని నొనరించితివొ కాని యొప్పుమీఱ
సర్వసుపర్వులు | శంకరమాధవుల్ పద్మాసనుండును | భవ్యమూర్తు
లలరారుచుండ స్వయంవరమండప రత్నసింహాసనరాజిఁ గూరు
చున్నారు నీరాక | నెన్నుచునున్నారు దయచేయవమ్మ నిద్దంపుఁబ్రీతి

తే. నెవని రెండ్లేండ్లునిండిన | యీడుగల్గు
బాలునిం గోరుదువొ వానిఁ | బరమసాధ్వి
మేనకాంబయు నంకముమీఁదఁ గూరు
చుండఁ బెట్టుకొనుంగాక | యురుముదమున. ౩౯౦

క. ఆకొమరుని నేత్రిదశుఁడు, ప్రాకటతావక సుభాగ్యఫలముగఁ దానే
వీఁకమెయి నెత్తఁగలఁడో, నీకాంతుం డగు నతండు | నీరదవేణీ! ౩౯౧

క. ఇదిమఱువకు నీదగు నెమ్మదిఁ జాతువుగాక యట నమర్త్యులలో నో
ముదితా! యబ్బాలుని నెత్తఁదగినవా రెంద ఱనుచుఁ | దత్పరమతివై. ౩౯౨

క. అనునప్పలుకులలోఁ గల, ఘనభావం బెఱిఁగి మునియొకాని మహాదే
వునిశక్తి నెఱుఁగఁ డీతం, డనుమానము నొందెఁ బందెమందు మనసునన్.

క. ఆకొమరుఁ డెట్టివాఁడో, యేకష్టములేక యెత్తు నెల్లరకు నతం
డేకరణి సాధ్యుఁడగునో, శ్రీకంఠుని శక్తి యెట్లు చెలఁగునొ సభలోన్. ౩౯౪

క. ఈముని యెఱుఁగం జాలక, నామీఁదఁ గృపాతిశయమునఁ బందెం బో
కోమలి యేటికి నిడి తని, వేమాఱును హెచ్చరించు వెఱ్ఱితనమునన్. ౩౯౫

క. కనుఁగాని యితఁడు శంకరు, ఘనశక్తి సభాంగణమునఁ గడు వింతగ నే
మనక చనుదాన నిప్పుడు, మునివెంటన్ వాంఛఁ దెల్పఁబోల దితనికిన్. ౩౯౬

వ. అని యూహించి జనకానుమతిం గొని చని జననికవ్వార్తఁ దెలుపుటయు నవ్వామలోచన సంశయాకులస్వాంతయగుచుం బుత్త్రిక నేమనంజాలక తద్భాగ్యం బెట్టులున్న నట్టులగు నన్నతలంపునం గూఁతుంగూడి పయనంబుచేయ నిశ్చయించె నంత. ౩౯౭

క. గిరివర్యుఁడు మునివర్యుఁడు, పరమామోదంబుమీఱ భటతతి గొలువన్
సురలెల్లఁ జూడఁగ సభాంతరమున కేతెంచి రన్నవమ్ములువోలెన్. ౩౯౮

ఉ. అన్నులమిన్న యొప్పు తనయంబనుగూడి సభాంగణంబునం
గన్నులపంటగా మనకుఁ గానఁబడున్ మఱి యేసుమాప నె
త్తన్నలినాక్షి తల్లికడఁ దానిడు నామెయు నంకపీఠికం
గ్రన్నన జేర్చు నేమిపలుకంగను బూనునొ పర్వతేంద్రుఁడున్. ౩౯౯

క. ఎప్పు డివియన్నియుఁ గనఁబడు, నెప్పుడెప్పుడు నేన నేన యీబాలకు ని
క్కపుశక్తి నెత్తువాఁడ ననుపలుకుల్ వినఁగఁ గృతిఁ గనుంగొన నగునో.

క. అని యంచలివారలు నొక్కనితో నొక్కరుగఁ బ్రీతి గడలుకొనంగా
ననుమానముడిగి చెప్పుకొనను బూనిరి వింతగాఁ గనంబడుతనన్. ౪౦౧

ఉ. అంతట నూత్నతేజము ముఖాంబుజసీమ కనంబడంగ నొ
క్కింత త్రపాభరంబు మొగమించుక వంచుచుటుల్ ఘటింప జల్
వింతగ వీక్షణావళులు వెల్వడుచున్ సభనున్న దేవతా
సంతతి కెంతొ యచ్చెరువు స్వాంతములం గలిగించుచుండఁగన్. ౪౦౨

సీ. కౌశేయయుగ్మ సంక్రాంతతనూవల్లి యుత్తమాచారసంపత్తిఁ జూపఁ
బొందుగా నడుగుందమ్ముల నుంచునొయ్యార ముత్తమజాతిత్వమొప్పఁ దెలు
సిప దవనతాస్యహిమరుచిబింబము సాక్షీస్వభావంబుఁ జాటుచుండఁ
గరగతసితచామరము మనోగతసాధు కార్యవిశేషంబుఁ గనఁగఁ జేయఁ

తే. చప్పుడొందని నడక విశాలభాగ్య, మొప్పఁ జెప్పఁగఁ బూనంగఁ జుమ యపూర్వ
సృష్టిసంపద యే యిట్లు చెలఁగె ననుచుఁ, దోఁచఁజేయుచుఁ దనతల్లితోడ వచ్చె.

ఉ. ఆసభఁ జేరవచ్చుటయు నయ్యమరోత్తములెల్ల రయ్యుమా
భాసురభాగ్యరేఖఁ జెలువంబును గాంచి యయారె యివ్విధిం
జేసినసృష్టి యిద్దియె విశేషవిధిం దగునంచుఁ జెప్పనా
నాసగసీరుహప్రభవు నాత్మపవిత్రమ యయ్యె దీనిచేన్. ౪౦౪

స్వయంవర విశేష మహోత్సవము.

చ. అనుకొనుచుండి రంత నచలాత్మజ మేనయు ముందుఁ బోవఁగా
వెనుకొని వచ్చి నెచ్చెలులు వేడుకమైఁ దనచుట్టు నిల్వఁగా
మునిపతి నారదుండు గిరిపుంగవునిం బురికొల్ప నెల్లరున్
విన నతఁ డిట్లు పల్కెను గభీరరవంబు దిశాళి నిండఁగన్. ౪౦౫

చ. సురవరులార! నాదుహిత షోడశవర్షవయస్క యీసభాం
తరమున నున్న దీయమ యుదారగుణాఢ్య స్వయంవరంబు నాఁ
బరఁగు పథంబునూనియె వివాహము చేసికొనంగఁ గోరు నం
దరయ విశేష మొండుగల దయ్యది యిట్టిదటంచుఁ దెల్పెదన్. ౪౦౬

సీ. ఇందుఁ జేరినవారియందు నేనుచరితకడ నున్న బాలు నొక్కఁడుగ రెండు
వర్షములే చన వఱలువానిం బ్రీతిఁ గొనివచ్చి మేనాంకమున నునుతును
వాని మీలోన నెవ్వం డెత్తు నవలీల నాతని నాపుత్త్రి యాత్మనాథుఁ
గా వరించును బణం బీవిధిఁ జెల్లును భాగ్యయత్నమున నీవరపణంబు
తే. పెట్టఁబడె నంచు నెఱుఁగనౌ నిట్టు లిప్డు, సాగు నీయుత్సవంబు ప్రశస్తరీతి
నిండుఁ బాల్గొనఁబూనువారుందురేని, సిద్ధపడియుండుఁ డిద్ది నాచేయుమనవి.

క. అని విన్నవించి నారద, మునియుం బద్మాసనుండు మొదలగువారె
ల్లను సమ్మతింపఁగాఁ జని, వనితామణి యోర్తు సభనుభామినులందున్. ౪౦౭

క. కనఁబడఁగ నామెచెంతనె, తనయుఁడు రెండేండ్లునిండి తార్తీయీకం
బనఁదగు వత్సర మప్పుడె, చనుదేరఁగ నుండువాని సకలాంగరుచిన్. ౪౦౮

ఆ. పరిఘవిల్లువాని బాలుని గాంచి యా, సాధ్వివేఁడి యామె సంతసమున
నొసఁగ లాలనములనొగి వానిఁ దన్పుచుఁ, దెచ్చి తనదుభార్యకిచ్చె నంత.

ఉ. మేనయు సంతసంబు దనమేనున నల్లుకొనంగ నాన్నరా
రా ననుఁగన్నతండ్రి యుడురాజు సమానము నీమొగంబుతో
నౌ ననవచ్చు నంచుఁ బ్రియమారఁగఁ గైకొని యంకపీఠికం
జానుగఁ గూరుచుండఁ గడుఁ జాతురియొప్పఁగఁ జేసె నంతటన్. ౪౧౧

ఉ. శంకరునాశయం బదొకసారియు నిష్ఫలమౌట సృష్టియం
దింకను జూడఁగోరుమతిహీనుఁడు కానఁగరాఁ డటంచు నే
ణాంకుని బ్రస్తుతింతురు మహర్షులు గావున బాలకుండు నా
వంక గణేశతేజుఁ డయివర్ధిలుచుండె మహేశుసూహచేన్. ౪౧౨

ఉ. బాలుని గాంచినట్టి సుర। వర్యులు వీని నదెట్టు లెత్తఁగాఁ
బోలును వీనితేజ మల। పూషునితేజముఁ గ్రిందుచేయఁగాఁ
జాలు నితం డెవండొ కన। సాధ్వస మయ్యెడు నిద్ది మాయకాఁ
బోలు నటంచు లేవఁగను। బూనకయుండిరి గ్రావముల్ వలెన్. ౪౧౩

ఉ. మంచిముహూర్త మిద్ది గుణ। మండితులార! యిదేల యంచు యో
జించుట ధర్మమే తమకుఁ। జెప్పెడువాఁడనె యత్న మెల్లఁగా
వించుట ముఖ్య మయ్యదియు। విస్తృతమౌ ఫల మిచ్చు నీయఁగా
నెంచకయే యడంగు నది। యెట్టులు తొల్తనె నిర్ణయింపనౌ. ౪౧౪

చ. పురుషులు యత్నముల్ దగిన। బుద్ధి నొనర్చుట ధర్మమౌను గా
పురుషులు సత్ఫలంబు గనఁ। బోలునొ లేవొ యటన్న శంకనుం
దురు జతనంబుమాని యది। దోషవిదుత్తమ సమ్మతంబుగా
దరసిన మీరు నట్టివిధ। మాత్మఁదలంపక యెత్తఁ బూనుఁడీ. ౪౧౫

చ. అని హిమవంతుఁ డెంతయును। హర్షముగల్గఁగఁ జేయుమాటలన్
వినయముమీఱఁ బల్కినను। విక్రమసంపదఁ జూపఁబూన క
య్యనిమిషులుండ నంత హయ। నాశయముల్ పురికొల్ప నొక్కరొ
క్కనికిని బౌరుషంబు గలు। గం బలుకంగఁ దొడంగి రంతటన్. ౪౧౬

సీ. ఒక్కఁడు పీఠంబు। నుండి లేవఁగఁ బోవ నొకఁడు నీకేటి కం। చుడుపఁబూను
నింక నూరకయున్న। నిలఁ బౌరుషమె మాయు నని లేవ నొకఁడుండ। నాపునొకఁడు
బాలునెత్తఁగలేనె। యేల యూరకయుండ నని లేవఁబోవ వల్దను నొకండు
వీని నెత్తి కుమారి। నేను గైకొనువాఁడ ననుకొన వేఱొకఁ। డకట యనును

ఆ. సురలయందు నిట్లు। పరిపరివిధముల, యత్నపరత దాని। నడచుపథము
చూడఁ బడుచునుండె। సురపతి యంతట, సాహసమున లేచి। చనియె నటకు.

క. వామాక్షి యదరె భుజమది, వేమాఱు వడంకె నీకు। విషమఫలంబే
రా మది దలఁచెడు నోసుత్రామా! యని యానిమిత్త। రాజియె దెలిపెన్. ౪౧౮

క. దానం దలఁకక యటఁజని, మేనాంకమునం జెలంగు। మేటిశిశుప్రఁ జేఁ
బూనిక నెత్తం దలఁపడఁ, గానంబడె మేను భూధ్ర। కల్పాకృతిగన్. ౪౧౯

క. కదలింపనైనఁ జాలక, మదిఁ దోఁచినసిగ్గు తన్ను। ముంచ్రాప్పడఁ జేయం
గదలకయె యుండె నదిగని, పదపద యింకేల యనుచుఁ। బల్కె నొకఁడటన్

క. అందఱు నవ్విరి దానికి, బృందారకనాథుఁ డెదఁ బ్ర। వృద్ధాస్త్ర లోగిం
గుందఁగఁ జేయఁగఁ జనియెఁ బురందరుగతిఁ గాంచి యట సు। రల్ చిత్తములన్.

క. ఔరా! యితఁ డెవ్వానిసు, మారుఁడొ సామాన్యుఁ డనుచు। మఱిఁ దలఁచితి మీ
తీరుగన నెవ్వఁడో యిట్లీరూపున వచ్చె ననుచు। నిప్పుడు తోఁచెన్. ౪౨౨

క. కావున నిట్టిపందెమ, దే కాలమునందు నిడుట యింతదనుక నే
యేకడల నైన వింటిమె, శ్రీకాంతుఁడొ శ్రీగళుండొ చేకొన వలఁతుల్.

ఉ. ఇంకొకఁ డీకుమారవరు నెత్తఁగఁ జాలఁ డటంచుఁ బల్కుచున్
బింకముమాని యుండఁ బృథివీధరవర్యుఁ డమర్త్యులార! యే
శంకలు మానిరండు గురుసత్త్వముఁ జూపుఁడు కైకొనంగ నాఁ
బంకరుహాక్షి నాతనయఁ బార్వతి నీశ్వరతం జెలంగుచున్. ౪౨౪

క. ఒకఁడైన నమర్త్యులలో, నీక నేఁ బోయెదఁ గుమారు నెత్త ననుచుఁ బూ
నిక కలవాఁడు కనంబడఁ, డకటా! యింక నేమి యనఁగ నా నిర్జరతన్. ౪౨౫

క. కొలఁది నిమేషము లెల్లే, పలుకక వారుండ సాగఁ బరమేశుఁ డెదం
దలఁపఁగ నుత్సాహం బది, తలసూపెం దివిజవర వితానమున నొగిన్. ౪౨౬

క. నేనని నేనని పోవం, గా నెంచిరి దివిజు లంతఁ గడుముద్దుగ నే
కానంబడు నబ్బాలుని, మానక యెత్తంగఁ జని సమగ్రబలంబున్. ౪౨౭

చ. కనఁబడఁ జేసియుం దుదకుఁ గష్టముమీఁదఁ గదల్పనైనఁ జా
లని తమపౌరుషంబులు బలంబులు వ్యర్థములే యటంచుఁ దోఁ
చిన చనిరంత వెన్కకిటు చేడ్పడి యందఱు నూరకుండ నా
వనజదళాక్షుఁ డాత్మఁగల వాంఛ బయల్పడ నీక లేచెఁదాన్. ౪౨౮

మ. కమలాక్షుం డిటు లేవఁగాఁ గనుఁగొనంగాఁ గల్గు నప్పార్వతీ
ప్రమదారత్నము నెమ్మనంబు భయసంభ్రాంతమ్ము గాఁగాఁ దదా
ర్తిమదిం గాంచి శశాంకశేఖరుఁడు తృప్తిం గాంచఁగాఁ జేసె స
వ్యముగా నొప్పు భుజంబు పైకెగురు చిహ్నంబుం గనం జేయుటన్. ౪౨౯

చ. తొలుత రవంతసంశయము తోఁచెను గాని యనంతరంబె మేల్
గలుగునటంచుఁ దెల్పు నిజకాయగతామల చిహ్నముల్ మనం
బెలమిఁ గనంగఁ జేయఁగ నిజేష్టము పండునటంచు నమ్మియే
కలవిలపాటులేక కుతుకంబునఁ గాంచుచు నుండెఁ జక్రినిన్. ౪౩౦

ఉ. తామరసాక్షుఁ డంత సురతల్లజు లెల్లఁ గనుంగొనంగ నా
హైమవతీనితంబినియు నట్టె తనుంగన వేగపోయి య
క్కోమలబాల హస్తమును గోరి కరంబునఁ బట్టుకొంచు నె
మ్మోము దరస్మితంబునఁ బ్రమోదభరంబును దెల్పుచుండఁగన్. ౪౩౧

మ. కదలింపం దమకించి శక్య మెటులేఁ గామిన్ విచారించి పా
ర్షదు లౌరా! యిది యేమటంచుఁ దనశౌర్యం బెన్నుచున్ వింతయౌఁ
గద యీచంద మటంచు నెంచఁ గరయుగ్మంబున్ వడింజాఁపి యె
త్తఁ దలంపుంగొని బాలుఁ డించుకయు నెత్తన్ రామి నూహించుచున్. ౪౩౨

మ. బలమెల్లన్ వెలయించి విక్రమముఁ జూపంజాలు యత్నంబునన్
బలుసార్లిట్టటుపార్లఁ జేయఁగను బూనన్ దాన నబ్బాలకుం
డలఘుండౌట స్థిరత్వమూని యచలంబట్లుండ సంవ్యానమున్
దొలఁగంబెట్టి యనూనశక్తిమెఱయన్ దోస్సార మొప్పారఁగన్. ౪౩౩

క. కదలింపఁబూని యించుక, వదలినపరిధాన మట్టిబాగుగ బిగియిం
చి దనమహాద్భుతశక్తిని, గదియించి కదల్ప నెత్తఁగాఁ బూనుటయున్. ౪౩౪

క. ఆతఁడు శైలంబట్టులు, భీతిం గన కెలమిఁబూని వింతవికాసం
బాతతిఁ గనఁబడనుండెను, శ్రీతరుణీవల్లభుండు చేతులు నొవ్వన్. ౪౩౫

చ. తనువున స్వేదబిందుసముదాయమె కన్పడనుండెఁ; బద్మజుం
డనుకొనినట్టులే యయిన దంచు విచారము మానియుండె న
వ్వనరుహనేత్రు నారదుఁడు వారక చూచి విచారసాగరం
బునవె మునింగి భూరుహముఁబోలి యిదేమని యాత్మ నెంచుచున్. ౪౩౬

ఉ. ఊరకయుండె; నంత హరుఁ డున్నతపీఠమునుండి యల్లనన్
సారసనేత్రుఁ గాంచు చెదసాధ్వికి వేడుకఁగూర్పఁ బూని మే
నారమణీసమీపమున నారదునింగని పిన్ననవ్వు గం
భీరతరార్థముం దెలుప వేడుకలూరఁగఁ బోయి బాలునిన్. ౪౩౭

తే. ఇక్షుదండము భూరికరీంద్ర మెట్లు, లీలఁగైకొనునో యట్లు శూలికైని
బట్టుకొని యెత్తి కూర్చుండఁబెట్టె నవల,జయజయధ్వానములు మింటసందడింప.

క. కురిసెన్ సుమవృష్టి మహేశ్వరమీఁదన్ దేవదేవ జయజయ యను శ్రీ
కరశబ్దజాల మెల్లెడ, సరగున వ్యాపించె నంత సంతస మలరన్. ౪౩౮

మ. హిమశైలాత్మజ తండ్రిపంపున మహాహేమాద్రిహారన్ మహో
త్తము దేవప్రభు శంకరుం గనుచు వింతన్ దేవతల్ గాంచఁ ద
త్కమనీయోత్తమకంఠమందు నునిచెన్ గాంతామణుల్ చూడఁ గ
ల్పమహీరుట్సితపుష్పదామకముఁ బ్రాగ్భాగ్యప్రభావాఢ్యమున్. ౪౪౦

ఉ. చప్పటు లుప్పతిల్లె నట సంతసముం దెలుపంగఁజాల్ యీ
యొప్పులకుప్పఁ గోరినటు లొక్కటియుం గొఱలేక యుండఁగా
నిప్పుడె సాగె నెంతటి యదృష్టమొ యంచు సతీమతల్లు లా
క్కప్పు డదేకొఱంతయును నంపక యుండెంత మీమె యం వొగిన్. ౪౪౧

క. ఆశీర్వదింప మానిమ, హేశుల్ సద్భాగ్యరాశి యీయింతియె యా
నీశాను మదిం గోరి సు,రేశునిఁ దాఁబడసె నట్టులే చిత్రముగన్. ౪౪౨

క. ఈ మెంబోలు సదృష్ట, శ్రీమహితలు గలరెయొఁపలు సిద్దించు నిజ
కామితములు వృషభక్తిని, దేమార్గమునం దలంప నింతుల కెల్లన్. ౪౪౩

క. అని సంభావించిరి త, త్పినాకపాణియును దన్ను బృందారకు లె
ల్లను జూడఁగ హిమవంతుని, తనయవరింపంగఁ బ్రీతి దళ్కొత్తంగన్. ౭౭౪

తే. ఆమెపార్శ్వమునన్ నిల్చె నంత దేవ
దుందుభులు మ్రోయుచుండంగఁ దుహినశిఖరి
మేనయుం దోడరాఁగ నా మృడుని నర్ఘ్య
పాద్యముఖములఁ బూజించెఁ బ్రమద మొప్ప. ౭౭౫

చ. సరసిజసూతి చక్రియును సంతసమొందుచు దానిఁ బైకి నె
వ్వరికిని దోఁపనీయని స్వభావములం దగియుండి; నంత శ్రీ
హరి విజయంబు గాంచమికి నాత్మల దుఃఖము లొక్కసారి ని
ర్భరగతి నుబ్బ దేవతలు వాసవముఖ్యులఁగూడి తెంపునన్. ౭౭౬

మ. ఇది యేమో యొకమాయపన్నినటులే యెన్నందగుంగా సరో
జదళాక్షుం డొకచిన్న బాలకుని వర్షద్వంద్వమే నిండి యె
న్నఁ దరం బెవ్విధిఁగాకయుండునతనిన్ నైజప్రభావంబు మా
యఁ దదుత్సంగమునుండి యెత్తుటకుఁ దా నర్హుండు కాఁడాయెఁగా. ౭౭౭

ఉ. ఇంతకుమించు చిత్రము మఱెయ్యది యుండును? గాన మాయయే
యింతవిచార మేల మన మీయహిభూషణుఁ జుట్టుముట్టి యీ
కాంతను బల్మిమీఱ మురఘస్మరుదేవిగఁ జేయు టొప్పు మా
యాంతకుఁడయ్యు నివ్విధిని నర్భకు నెత్తకయుండు టేలొకో. ౭౭౮

క. నేరుపరియయ్యు నొకతఱి, సారం బెడలంగ శరులచంచన్మాయా
పారావారంబునఁ బడి, ధీరహితునివలె నడంగుఁ దీవ్రవిధిగతిన్. ౭౭౯

ఉ. కావున నీమురాంతకుని గారవము న్నిలుపంగఁ బూనుటే
దేవగణైకకృత్యమగుఁ దెప్పున లెండు మహాస్త్రజాలముల్
శ్రీవిభుఁ డిచ్చు మెచ్చునటు చేవ చెలంగెడురీతిఁ దాల్చి భూ
తావళిఁ గొల్వనుండు త్రిపురారిని మార్కొనుఁ డెంతొ పూనికన్. ౭౮౦

చ. అని పురికొల్పుకొంచు దితిజాంతకుఁడౌ హరియాజ్ఞ లేక దే
వనికర మట్టి యుద్ధమునఁ బౌరుషముల్ వెలయింపఁబూని యీ
శుని నలుదట్లఁ జుట్టుకొని శూలగదాసిముఖాయుధంబులన్
గొని యనిసేయ నూల్కొనిరి కొంకొకయింతయు లేక యత్తఱిన్. ౭౮౧

ఉ. శ్రీపతి యావిధంబుఁ దనచిత్తమునం దలపోసి వారిచూ
పోపమి కర్హమౌ ఫలము నొయ్యనఁ గల్గుట మంచిదే యటం
చాపనిమాన్పఁ బూనక మహామతి గావున నూరకుండె వా
ణీపతి యట్టెయుండె హరునిర్భరశౌర్యముఁ జూచు వేడుకన్. ౭౮౨

చ. నిలునిలు మెట్టు లిప్పుడఁతోనిం గొనఁజాలుదు వింక వంచశా
జలరుహపత్త్రనేత్రు నొకఛద్మమునన్ మతిహీనుఁజేసి యి
మ్ముల విజయంబు గాంచినటు ౹ పొంగుచుఁ బార్వతిఁ బెండ్లియాడఁగాఁ
దలఁచితివేమొ సాగునొకొ ౹ దంభములీయవి మాకుటుంగటన్. ౨౫౩

చ. అరుదుగ బాలునొక్కని మహాద్భుతశక్తిఁ జెలంగువాని ని
ర్భరపటుసత్త్వయుక్తుని సభాస్థలిఁ బార్వతితల్లి యంకమం
దురుతరమాయఁ బన్ని చెలువొప్పఁగ నుండఁగఁజేసి వాని నె
వ్వరు కదలింపఁజాలనటు ౹ బాపురె! చేసితి వట్టిమోసమున్. ౨౫౪

చ. కనఁబడఁజేయువార మిటఁ ౹ గాలగళా! శరచాపధారివై
యని యొనరింపు మంచు సురలందఱు భీకరశౌర్యసారముల్
కనఁబడఁజేయఁ బూని తమకంబున నాయుధపంక్తివైవ నూ
ల్కొని తమచేతు లెత్తుటయుఁ ౹ గొందలమందిరి తత్సభాసదుల్. ౨౫౫

మ. విపరీతంబు లిఁకేమిసాగునొకొ యీ ౹ విశ్వేశ్వరుం డూరకే
శపథంబుల్ వినుచున్ మనంబున మహాశాంతంబు పూనంగ నే
రుపదేశింతురొ యాయుధంబుల మహోద్యోగంబునన్ వైవఁగా
నిపు డుంకించిరి దేవవర్యు లిఁక నీ ౹ యీశుండు సక్రోధియై. ౨౫౬

మహాస్రగ్ధర:—
విలయాగ్నిజ్వాలమాలా ౹ వితతభయద రుక్షేక్షణం బెంతొ పూన్కిన్
గలనన్ వ్యాపింపఁజేయన్ ౹ క్షణమున దివిష ౹ త్కాండముల్ భస్మమౌఁగా
వలదంచున్ బల్కువారౌ రవ్వఁగలరు సభన్ ౹ బ్రహ్మయున్ మౌన మూనెన్
జలజాక్షుం డూరకుండెన్ ౹ జనుఁగవ యిఁక నీ ౹ సంగరం బాపు టెట్లో. ౨౫౭

తరళ. మునులయందును, దీని నాపఁగఁ ౹ బూనువార లదెవ్వరో
కనఁగఁజాలము సూతరైన నిఁకన్ గిరీశుఁడు క్రోధియై
తనతృతీయ విలోచనంబు నితాంతరూక్షము విప్పఁగా
మనసునం దలపోయునట్లను ౹ మౌన మీమన కొప్పెఁగా. ౨౫౮

చ. అనుకొను చుండునంతట మహామతి శంకరుఁ డాదితేయరా
జిని గని హుంకృతిధ్వనులచేఁ గనఁ జిత్రముగాఁగ మ్రాన్పడం
గ నొనరిచెన్ భుజావళిని ౹ గంజదళాక్షుఁడు బ్రహ్మయుం గనుం
గొని తగుపాచితంబు జరగుంగద యంచను కొన్నయట్టులే. ౨౫౯

చ. జరగె నమర్త్యకోటి కిఁక ౹ శంభునికోప మడంచువార లొ
క్కరయినఁ గానరా రనుచుఁ ౹ గన్గొనుచుండఁగ నాదిదంపు శం
కరుఁగని తన్ముఖంబున నికామము వెల్గెడు క్రోధవహ్నిదు
ర్భరమని యెంచి దేవతల ౹ బాహువులం గని చింతపైకొనన్. ౨౬౦

సీ. తానుబంచినపని మానక చేయుట శ్రీపతియాజ్ఞను శీర్షములను
ధరియించి తా నేమి పరుషవాక్కులు పల్కినను సైచియుండుట వనజనేత్రు
నందుఁగలట్టి నెయ్యమున శంకరుతోడఁ బోరాడుటకుఁ దగఁబూనుకొనుట
శివునివశంకృతిచేతఁ జేతులు స్తంభించియుండుట యేమిచేయుటకుఁ దోఁప
తే. కుండుటయుఁ గాంచి యాదేవతోత్తములకు
నప్పు డలవడియున్నయా యాపదలకుఁ
జిత్త మెంతయుఁ బెనుదుఃఖ సింధువునను
మునుఁగ శంకరుఁ బొగడె నిప్పొల్కి భక్తి. ౪౬౧

చ. పరమకృపాంబుధీ దురితభంజన దేవవరార్చితాంఘ్రిపం
కరుహాయుగా ప్రపన్నజనకాండ సముద్ధరణైకకృత్య, ని
ర్జరరిపు గర్వసంహరణ శాశ్వత, భక్తసురద్రుమా మహే
శ్వర! సకలాపరాధముల సైపుము జాల్ముఁడఁ జంచలాత్ముఁడన్. ౪౬౨

సీ. నీశక్తి నెఱుఁగంగ నేరరు బ్రహ్మాదు లట్టినీశక్తి నే నరయఁగలనె
జాల్ముఁడఁ గావున శంకరా! యజ్ఞత దురహంకృతిని బూని తోఁచినట్లె
కార్యంబు సఫలంబుగాఁ జేయ నేనె యంచీకార్యమునయందు నెలమిఁగంటి
క్షమియింపుమా దేవ చక్రికి నీకును భేదముఁ గల్పించు వాదములకు
తే. నీయకొంటిని దెల్వియు నించుకైనఁ
గలుగదయ్యెను జక్రివాపలుకులఁ గల
భావ మెఱుఁగంగ లేనైతిఁ బరమపురుష
యిద్ది నాయపరాధ మం చెఱిఁగితి నిట. ౪౬౩

క. అది యేమిమాయయో నా,మది సుంతయుఁ జక్రధరునిమాటలఁగలదే
యది భావమంచు యోజింపదు; నాస్వాంతం బదెంత పాపకృతంబో. ౪౬౪

మ. పలుతేపల్ హరి హెచ్చరించినను మద్భావంబు సుంతైన న
ప్పలుకుల్ దేనిని బోధచేయు నిటులే పద్మాక్షుఁ డీభావముల్
దెలుపం గారణమేమి యం చరయ యత్నింపంగనుం జాలకే
యలసుం బోలి చరించితింగద మహాత్మా! సైపు మీతప్పులన్. ౪౬౫

ఉ. కాలము సర్వభంగుల నికామము యోజనచేసి చూడఁగాఁ
జాల సమర్థమా నెఱుఁగఁజాలరు తద్గతు లిట్టివంచు వే
దాలయులంచుఁ గీర్తిగనినట్టి సరోరుహజన్మముఖ్యులం
చోలి నెఱింగినాఁడ నిపు డోపరమేశ్వర! సత్య మిద్దియా. ౪౬౬

ఉ. కర్మము కాలసంగతిని గార్యములన్ ఫలియింపఁ జేయుఁగా
శర్మమొ దుఃఖమో యదె యొసంగుచునుండును జాల్మ లెల్లరీ

మర్మ మెఱుంగఁజాల కభిమానము నూని నశింత్రు కర్మసం
వర్మితులే పయోజభవవాసవముఖ్యులు మాట లేటికిన్. ౪౬౭

మ. ఇది నేమున్నె యెఱింగియుండియు నదేమేమాయ నన్గప్పెనో
యదియెల్లన్ స్మృతిగోచరంబగుట సుంతైనన్ మహాదేవ! లే
దిదియే చిత్రము విష్ణుమాయ నను నిట్లీకార్యముం జేయుస
మ్మదమందం బురికొల్పెనో యెఱుఁగ నమ్మంగాఁదగున్ శంకరా. ౪౬౮

శా. ఆనాఁ డావనమందుఁ గన్పడిన బ్రహ్మర్షీంద్రు చిహ్నంబులే
యీనాఁడున్ భవదాస్యపంకజమునందే కాంచఁగాఁ జాలితిన్
మానీశుండ నటన్న గర్వమె ననున్ మార్కొంచఁగాఁ జేసె నం
చీనాఁ డిందుఁగలట్టి నాయనుభవంబే చాలెదున్ గట్టిగన్. ౪౬౯

శా. ఔరా! లగ్నము నిర్ణయింపుమని యత్యంతంబు ప్రార్థించినన్
నీరేజాసనుఁ డేమియో తెలిపి మన్నించెంగదా యెన్నియో
సారుల్ వేసర కేఁ జనంగఁ గని మాత్సర్యాంతంబు సమ్మోహగం
భీరాబ్ధిన్ మునుఁగంగఁ బల్కి ననుఁ బంపించున్ హరిం జేరఁగన్. ౪౭౦

ఉ. అంతియకాని లగ్న మిపు డంచు వచింపఁ డిదేటి కంచు నా
స్వాంతమునం దలంప నొకసారియు శ్రీహరిమాయ గప్పుటన్
వింతయొకాదె యిద్ది పరవీరనిషూదన! మీమహత్త్వ మిం
తింతయటం చెఱుంగ నిపుడించు నెఱింగితి దీనితత్త్వమున్. ౪౭౧

మ. హరి యుత్కృష్టుఁడు సర్వదేవతలయం దామ్నాయతత్త్వం బిదే
హరుఁ డుత్కృష్టుఁడు సృష్టియం దిదియపో యామ్నాయసారం బటం
చురువాగ్ధాటి సభాస్థలిన్ గుజను లోహో యంచు మెచ్చన్ సుధీ
వరవారంబునఁ గొంద ఱిట్లుభయథా వాదంబులన్ జేయుచున్. ౪౭౨

మ. కలహంబుల్ కలిగించుచున్ మత మనంగా నెట్టిదో యెంచకే
పలుగాపుల్ తమశిష్యులై మెలఁగఁగా భర్మంబు నార్జించుకో
ర్కులు మీఱం జరియించుచుండఁగను, నాకుం దోఁచె నిందేది ద
ర్బలమో యెయ్యది సారమో యనుచుఁ దెల్పంజాలు నూహల్ ప్రభూ ౪౭౩

తే. ఇదియెగాదె యహంకార మిందుశేఖ
రా! మహాదేవ! యిదియె కారణముగాఁగఁ
బూనినాఁడ నీకార్యమునకుఁ బుట్టె దానఁ
జాల నజ్ఞాన మిదె కార్యమూల మభవ. ౪౭౪

మ. ఇపు డికార్యమునన్ భవుం డనఁగ సర్వేశుండె యూ నిక్కమా
తపనీయాంబరుఁడా జగత్ప్రభువు సత్యం బెన్న వీరిద్వరం

దుపమానం బుపమేయమా నితఁడె యం చొప్పంగఁబల్కంగ రా
దపసిద్ధాంతమెయౌ నదే తలఁపఁగా నద్వైతమే వీరికిన్. ౪౭౫

ఉ. ద్వైతమనన్ మతంబగునె తత్త్వవిచారముసేయఁ జోటులే
దేతఱినేని దాని, కది యేర్పడు నొక్కయవస్థగా నటం
చాతతబుద్ధు లెన్నఁదగు నట్టులుగాదని యెన్నువారి క
ద్వైతము దోఁప దద్దియె భవంబున మర్త్యత యందు నాద్యమా. ౪౭౬

చ. తెలిసెను నేఁటి కీశ్వరుఁడు దేవవిభుండగుఁ జక్రపాణినా
నలరు మహాత్ముఁ డట్టిఁడగు నారయ వీరలు కార్యసంగతిన్
జెలఁగుట నిర్వురైరి యిదె చిత్రము వీరిచరిత్ర మెంతొ ని
ర్మలమగు; నిర్వు రొక్కటియె మామకబుద్ధి యెఱింగె దీనినిన్. ౪౭౭

చ. జలములు చంచలించుతఱి సారసబాంధవుబింబ మెన్నిసం
ఖ్యలుగనొ తోఁచు సత్యమున కయ్యది యొక్కఁడెగాదె యట్లె చం
చలమతులైన వారలకుఁ జక్రధరేశ్వరులందు భేదమే
గలుగునటంచుఁ దోఁచు నది గాదుగదా నిజ మెట్లుచూచినన్. ౪౭౮

క. హరిహరులకు భేదంబును, బరికించెడువారు నేను బలె నజ్ఞాన
స్ఫురణమున మోసపోయిన, పురుషులె తత్త్వంబు నెఱుఁగఁబోలరు వారల్.

క. అనుటయె సిద్ధాంతము నా, యనుభవమున దీనిఁదెల్ప నర్హుఁడనైతిన్
మునులార ! దివిజులారా, వినుఁడీ నామాట లెల్లవీను లలరఁగన్. ౪౮౦

చ. హరునకుఁ జేయుపూజలవి యన్నియు విష్ణుని బ్రీతుఁజేయు శ్రీ
హరి కొనరించుపూజలు మహాత్ముని శంకరుఁ బ్రీతుఁజేయు నీ
యిరువుర నొక్కటే యరయ నింకొకభేదము కానరాదు శ్రీ
హరికిని నీలకంఠునకు నంతర మింతయు లేదు చూడఁగన్. ౪౮౧

మ. వనజాతేక్షణుఁ డెప్డు ప్రీతుఁడగు సర్వజ్ఞుండు నన్దే ముదం
బును గాంచున్ శితికంఠుమోదమె యగుంబో పుండరీకాక్షు నె
మ్మన ముప్పొంగఁగఁజేయు నద్ది; తగ నామ్నాయైకభావం బిదే
యనఁగా నొప్పు మదీయమా ననుభవంబౌ సాక్షి యిద్దానికిన్. ౪౮౨

చ. తెలివియె లేక యిచ్చమెయిఁ ద్రిమ్మరు మోఱకులే వచింతురి
ప్పలుకుల విష్ణు వెక్కుఁడు కపర్దియె యుత్తముఁ డన్నవాని ధీ
విలసితు లిట్టివాని విన వేడుకనొంద రటంచు నిత్తఱిం
దెలిసితి నింక నెన్నటికిఁ దెంపున నివ్విధిఁ బూనఁ గార్యముల్. ౪౮౩

క. ఈనా చేసిన యపకృతి, మానీశగణార్చితాంఘ్రి మన్నింపుము శ్రీ
జానియు మన్నింపంగా, నే నొనరుతు వందనములు నీకున్ హరికిన్. ౪౮౪

మ. మునియయ్యుం బరమాజ్ఞతం గనియెఁబో ♦ మూర్ఖుం డితం డంచు న
న్ననఁగాఁ బూనకు మో మహేశ్వర! మదీయాజ్ఞానముల్ సైచి న
న్ననుకంపం గృతకృత్యుఁ జేయు మివియే ♦ యస్మత్ప్రణామంబు లీ
శ! నినుం గాంచఁగ నోఁచితిన్ దొలఁగె నజ్ఞానంబు సర్వం బిటన్. ౪౮౫

చ. హరి కవమాన ముప్పతిలె ♦ నంచు వ్యథాకులితాంతరంగు లై
సురవరు లెల్ల ని న్నెఱుఁగు ♦ చొప్పు కనుంగొనఁజాల కాయుధో
త్కరమున నొంపఁ జూచి రది ♦ కాళగళా! యవివేకమూలమే
పరమకృపార్ద్రచిత్తమున ♦ భక్తులఁగాఁ దలపోసి వారినిన్. ౪౮౬

క. కాపాడవే మహాత్మక, శ్రీపతి కవమాన మెట్లు ♦ సిద్ధించు నటం
చేపగిది నెఱుఁగఁజాలమి, నీపనికిం బూని రంచు ♦ నెంచి సతంబున్. ౪౮౭

ఆ. చరణసేవకులుగ ♦ సంరక్షణము చేయు,నలయు ననుచు వేఁడి ♦ నపుడు కంప
మొందుచుండ భాలనయనుఁ డాశ్వాసిం దగఁ దన,యడుగుల కడఁబడిన ♦ యమరవరుని.

మ. కరుణావారిధి శంకరుండు గని యక్కాఁ జూచు వీక్షించి యా
దర మొప్పం బరికింపు మంచ తఁడు ప్రోత్సాహం బహాంగంబులన్
బరు లెవ్వార లెఱుంగనట్లు తెలుపన్ ♦ బద్మాసనుండున్ వియ
చ్చరులం గాచెడు వేడ్క సన్నిధికి రా ♦ శంభుండు దేవర్షినిన్. ౪౮౯

మ. పదపద్మంబుల చెంత ధాత్రిఁబడి కాపాడందగున్ దీనునిన్
సదయాత్మా! యని దిక్కు నీవె యని నాస్వాంతం బహంకారముల్
వదలెన్ నీమహిమం బెఱింగితి నిఁకెబ్బంగిన్ మతే కార్యముం
దుఁ దమిం బొందఁ బ్రమాణమిద్ది యని తోడ్తో నెంచు నానారదున్. ౪౯౦

మ. కరపంకేజయుగంబుఁ జాఁపి మునిభూకాంతా! యిఁకన్ లెమ్ము నీ
దురవస్థంగనఁ జిత్తమార్తిఁగను నీదోషంబు సుంతేని లే
దరయం గర్మగతుల్ చెలంగుఁ బ్రభునిచ్ఛాధీనతన్ వానినిన్
మరలింపన్ మఱి యొక్కరీతినయినన్ ♦ మార్పంగ శక్యంబెటౌ. ౪౯౧

మ. మన మెల్లన్ మునివర్య! కర్మగతులన్ ♦ మార్పంగ లే మంచు నెం
చిన నే బుద్ధిమదోఘమందు నెపుడేఁ ♦ జేరంగవచ్చున్ మరం
బున నీచందముఁ బల్మఱుం దలఁపు నొప్పున్ దాన మేల్గల్గ రె
మ్మనినన్ లేచి సురర్షి నమ్రవదనుం ♦ డై యుండె శ్రీ ఫాలతన్. ౪౯౨

మ. కనకాఖ్యాంతకుఁ డంతఁ జేరఁజని శ్రీకంఠుం బమిం గాంచి యి
ట్లనియెన్ దేవ! మహర్షి నారదుఁడు నీకాత్మన్ దయం తేని చిం
తను గూర్పంగఁ దలంపఁ డింతయును భక్తశ్రేణివిభ్రాంతి. బా
పను నేఁ బూని యొనర్చినట్టిదె సుమీ ♦ పల్మాట లింకేటికిన్ ౪౯౩

ఉ. వంచకు లొక్కకొందఱిల వారక యెల్లెడలం జరించి ప్రే
మించినయట్లు పామరుల మెల్లన లోఁబడియుండునట్లుగా
వించి మహేశ! యీమనకు భేదము గల్గునటంచు మించి బో
ధించుచుఁ బెక్కుచందములఁ దేఁకువ విత్తములెల్ల లాగుచున్. ౪౯౪

మ. యతులంబోలి చరించుచున్ విమలయోగాభ్యాసముం జేయుప
ద్ధతులం గన్పడఁజేయుచున్ వివిధభేదస్ఫారధర్మాళిఁ జే
యుతలంపుల్ వెలయించుచున్ మఱియు నోన్యోరీతులం బల్కి శి
ష్యతతింగూర్చుచు నుంద్రు; వారివలనన్ సత్యం బదెల్లం జెడెన్. ౪౯౫

క. నే నెక్కుడంచుఁ గొందఱు, కానరు త్ర్యక్షుని మహేశుఁ గాలాంతకునిన్
మానివరవినుతు శ్రేష్ఠుం, డౌనని మఱి కొంద ఱిట్టు లజ్ఞుల కెల్లన్. ౪౯౬

క. తెలియం జెప్పుచు మనకుం, గలదెంతో భేద మనుచుఁ గడఁగి సభలలోఁ
బలుకుచుఁ బామరులమనం,బులఁగల దృఢభక్తి నాశముగఁ జేయుపనిన్.

క. ఒవరించుచుండ వారల, కనుపమదృఢభక్తి నిల్ప నాత్మఁదలఁచి యీ
ముని నాడించితి నివ్విధ,మున మాయం గప్పి యజ్ఞుపోలిక దేవా! ౪౯౮

క. తొలువోలుత నట్టిదుర్వా,దులనే యీనారదుండు తూలింపంగాఁ
దలఁచియె యీపెండ్లికిని, మ్ములఁబూనెను గాన దానఁ బూర్ణఫలంబుల్.

క. కలుగంగఁ జాల వసుసూ,హలు పర్వెడునట్టు లితని నజ్ఞుఁడుపోలెన్
బలువిధములఁ జిత్తభ్ర,ములఁ బడఁగాఁ జేసినాఁడఁ బురహర నేనే. ౫౦౦

క. ఈతనిమూలంబున వి,ఖ్యాతం బగుఁగాదె, మనకుఁ గల్గునభేదం
బేతఱినైనఁ జలింపక, భూతలమున నిద్ది నిల్చుఁబో యికమీఁదన్. ౫౦౧

ఉ. ఈమునియందు దోస మన నించుకయైనను లేదు నీవునున్
గామహరా! కనుంగొనితిగాదె వనాంతరసీమ నొక్కటన్
హైమవతీసతీమణి మహాప్రకృతిం దగునంశమేకదా
యీమును లీయమర్త్యులిపె యేర్పడ నారయఁ జాలువారలే. ౫౦౨

ఉ. ఐనను నీమహత్త్వము సమంచితరీతి జగంబులందు నిం
పౌనటు విస్తరింపఁగ మహాత్మ తలంచుట యోగమాయయున్
లోనగున ట్లొనర్చితి విలోలమనస్కులెయైరి దేవతల్
మానులు నంతెకాని నిను మార్గ్యాన నీసుర, లెంచువారలే. ౫౦౩

క. ఈనాకార్యంబున నే, యీనారీమణి మహత్త్వ మెంతయు విశదం
బై నెగడె నీకు నాకును, గానంబడ దంతర మని ఖ్యాతంబయ్యెన్. ౫౦౪

సీ. మనయందు భేదమేమాడ్కిని గలదని వాదించుమూర్ఖులు భక్తిదూల
నిరయంబునంబడి నిత్యదుఃఖితులయి యుందురు వారికి నొక్కకాల

మునవైనఁ దన్సూక్తి పొసఁగదు సత్యంబుగా ననిపల్కి యశమ్మానివరుల
సురల నింద్రాదులఁ జూచి మీరెల్ల రీవృత్తాంతమును జక్కనెఱిఁగినట్టి
తే. వార లిఁకమీఁద నిట్టిదుర్వాదములను, జేయువారికి సత్కర్మసిద్ధి గలుగ
దనెడుమామకసూక్తిఁ జక్కనివిధమునఁ, దెలుపుఁ డీయది నాయాజ్ఞ పలుకులేల.

ఉ. హరిహరు లొక్కటే యనెడునాశయ మెవ్వరి మానసంబులం
దరయఁగ నుండదో యలనరాధముల౯ జమునింటనిల్పి దు
ర్భరనరకంబులంబడుచుఁ బాపఫలంబుల నొందఁజేయుఁడీ
సురవరులార! యాజ్ఞయిది శూలికి సమ్మతమౌచు నెన్నఁడీ. ౧౦౭

తే. బాహ్యచిహ్నంబులే దృఢభక్తి కెన్న, ముఖ్యములు వానివదలిన ముక్తిలే ద
టంచు భక్తుల మనుకొనువంచకులకు, ఘోరనిరయంబె మోక్షమార్గ౯ ధ్రువంబు. ౧౦౮

సీ. వేదవేదాంతముల్ విమలపురాణమ్ము లితిహాసములు వేదహితతమార్గ
ముల వేయిభంగులఁ దెలిపెడుస్మృతులును హరిహరాభేదసిద్ధాంత ముత్త
మోత్తమం బనితెల్పు చున్నవి సతతంబు కానియాయర్థమ్ము గాదుసత్య
మని వికటార్థంబు లనువదించెడునట్టి వంచకప్రవరుల నించుకేని

ఆ. కరుణమాలి వేగ నిరయకూపంబులఁ, బడఁగఁద్రోయవలయు వారిమాట
లాలకించి మమ్ముఁ దూలనాడెడువారి, సాగనంపుఁ డట్టి స్థానములకు. ౧౦౯

ఉ. పంకజసూతి నేనును గోపాలియు నాపరశక్తిదివ్యప
త్పంకజరేణులేశులమె భద్రముల౯ సుజనాళి కీయ ని
శ్శంకముగా నఘంబులను సల్పెడువారి నడఁప లోకమం
దంకిలి నొందకుండునటు లారసి ధర్మము నిల్పఁబూనికన్. ౧౧౦

క. పరదేవియాజ్ఞఁ గొనియే, పరిమాద్భుతశక్తిఁ దాల్చి పరమపదముల౯
జరియించువార మనిమీ, రరయుఁడు పలుమాట లింక నాడఁగనేలా. ౧౧౧

క. పరశక్తి యాదితత్త్వం, తరమే యగు నిర్గుణమనఁ దత్త్వ మ్మనియే
పరినుతమౌ వేదముల౯, సురలారా! యీవచనమె సూనృతపథమౌ. ౧౧౨

మ. పరతత్త్వంబు మనంబునం జెలమితో భావించువారే మునీ
శ్వరులంచు౯ నుతిగాంచువారు పరమేశస్థానతేజంబె యీ
శ్వరి నా నాదిమశక్తి నాఁ బ్రకృతినాఁ బ్రఖ్యాతనిం గాంచు నా
చ్చరణాంభోజ పరాగలేశములమై సంచత్ప్రభావంబులన్. ౧౧౩

సీ. లోకంబు సృజించి ప్రాకటసుఖములఁ గాంచె నేనన్ను పాలించి కా
మరుదేర ప్రందించి యాదిత్యసాధ్యుల నాయాయికార్యములందు నిల్పి
యధికార మొక్కొంత యవ్వారలకు నిచ్చి దానిఁగాపాడుచు నేను మ్మెలఁగి
యుండువారలమె మేమోసురవరులార! యట్టి యాముగ్గురయందు భేద

ఆ. మెట్లు కలుగు సుంతయెన్నఁడీ యీముఖ్యా,రమును బ్రకృతిచేతఁ బ్రభుతచేతఁ
నొకరి నొకరు మించ నోపుదు మేరీతిఁ,గాన భేదబుద్ధిమాను టొప్పు. ౫౧౩

క. ఇక్కార్యమందు నారదుఁ, డెక్కువఁగాఁ దోడుపడియె నీతనికంటెన్
మిక్కిలిభక్తుఁడు లేఁడని, యిక్కార్యమె తెలుపు మీకు నెల్లర కిచటన్.

క. నామాయకులోనై తగ, నీమౌని యొనర్చినట్టి యిక్కార్యంబే
మీమానసముల నెంచిన, నేమాత్రము శంక లేకయే నానుడులన్. ౫౧౪

క. స్థిరపడెఁ గాన మీరలు, హరునకుఁ జోహారు లొప్పునట్లుగ నిపుడీ
నిరుపమ మంగళకార్యము,జరపుఁడు హిమశైలపతియు సంతసమందన్. ౫౧౫

క. నేనును రాధాదేవియు, మౌనివరుల్ మీరు నీయుమాదేవిని బెం
పూనినభక్తిని శివునకు, నీనీలగ్రీవునకు మహేశునకుఁ దమిన్. ౫౧౬

సీ. ఉద్వాహ మొనరింత మొకకాలమందు వియోగమే కల్గనీయురుతరప్ర
భావులకుం బెండ్లిపద్ధతి యేమిటి కని తలంతురో యేమొ యమరులార!
యిది యెన్న నేకమాయయే యగు లోకుల కాచారపద్ధతి నమర నేర్పు
టకెకాని వేఱుకా డిఁక నీమనమునెల్ల వరపక్షమున నుండవలయు మనకుఁ

తే. దగినమర్యాద లీధరాధరవరుండు,చేయవలయు నివాసముల్ శిఖరి యిపుడె
చూపవలయును నా విని యాపురారి,స్మితము సమ్మతినిం దెల్ప శ్రీపతిఁగని.

క. మునివరుని గరువ మడఁగం, గను జేసితి దానిమూలకంబునఁ గర్మం
బను నద్దియె యుత్కృష్ట,మ్మని తెల్పితి వోమహాత్మ యఖిలజగములన్. ౫౧౮

తే. కీర్తివఱలంగ నెగడుమా యార్తిహరణ,నామ మదిసార్థకంబుగ నీమనోజ్ఞ
యశము లోకాళి వ్యాపింప నమరవితతి,గలిసి యుద్వాహకార్యంబు వలసినట్లు.

క. ఒనరించి మనయభేదము, గని భక్తులు సంతరింపఁగా గోలోకం
బున కేగి త్రిజగములఁ జ,క్కనిధర్మము నిల్పవయ్య కమలదళాక్షా! ౫౨౧

మ. మనదైనైక్య మెఱుంగఁజాలక మదోన్మత్తత్వ ముప్పొంగ న
న్నని నొంపన్ నిను ధన్యుఁజేయఁగ మహాయత్నంబు గావించి నీ
యనుకంపం బడయంగఁగోరిన యమర్త్యానీకముల్ వఱంకృతి
ధ్వనిసంస్తంభితదేహముల్ గలుగ నత్యంతవ్యథన్ గాంచుచున్. ౫౨౨

చ. మురహర! నిన్నుఁ జూచుచుఁ బ్రభుత్వముమీఱఁగఁ దమ్ముఁగావ నా
తురపడుచున్న వట్లయినఁ దోరపుభక్తిని నిన్నుఁ గొల్పు శే
యరయఁగ నన్నుఁగొల్చినటు లౌట క్షమించితి నింకమీఁద ని
ర్జరులు త్వదుక్తకార్యమున సంయతచిత్తులుగాఁదగున్ హరీ! ౫౨౩

క. అనునంతలోన సంస్తం, భనకర్మవిహీనులగుచుఁ బరమానందం
బున శివునకు జోహారులు, ఘొనరిచి హరి పల్కినట్లుపూని రొనరుపన్. ౫౨౪

చ. శతధృతి యంత లగ్నమిది ౹ సర్వవిధంబుల నొప్పి యున్న ద
చ్యుత! యింక వేగిరింపఁదగు ౹ నొప్పుగఁ బెండ్లికి నర్హరీతి వ
స్తుతతిని గూర్పఁగాఁ దగును ౹ దొందరగా మన కెల్ల నీకుభృ
త్పతి నివసింప సౌధముల ౹ భవ్యతమంబులఁ జూపఁగాఁ దగున్. ౫౨౫

సీ. అనుటయు శ్రీపతి ౹ యద్రీంద్ర! యుద్వాహలగ్నము చెంతఁ జేలంగుచున్న
దద్ది గుణోపేతమౌట వేగిరపడఁ దగుఁగాన వస్తువితతినిఁగూర్పు
మీ విశ్వకర్మయే ౹ యిప్పుడ నిర్మించుఁగాక సౌధంబులఁ ౹ గమ్రవస్తు
సంకలితంబుల ౹ సయమీంద్రుండగు నారదుఁ డెట్టిచోదముసఁ బలుకు

ఆ. నట్లె పెండ్లి జరపు ౹ మాతఁ డెఱుంగని, దొకటిరైన నుండదు కద యెందు
ననిన జిత్తమందు హర్షంబు పొంగఁగ, నమరవరుల మఱియు ౹ హరిహరులను.

చ. సరసిజసంభవా ద్యమరసత్తములం గనిపల్కెఁ బెండ్లి నిఁ
జరపుఁడు మీర లేను దమసంగతి నంతయుఁ జూచుచుండు ని
త్తరుణము పూర్వజన్మసుకృత ప్రమదైకఫలంబుగాదె నే
జరపఁగఁ గర్తనే? తమరె ౹ శక్తులు సర్వము నిర్వహింపఁగన్. ౫౨౭

వ. అని నారాయణుం గాంచి యిట్లనియె. ౫౨౮

మ. వరపక్షంబున వచ్చినట్లు తలఁపన్ ౹ వచ్చుఁగదా యంటివో
పరమాత్మా! యిది నీగృహంబెకద యీపల్కుల్ విభేదంబునే
సరిగాఁ దెల్పును గాన నాపయిఁ గటాక్షంబుల్ తగం బర్వఁగా
పరివారల్ నను గాంచవింపఁగ విశేషఖ్యాతి వ్యాపింపఁగన్. ౫౨౯

శా. నాపక్షంబున నిల్చి యుష్మహము వింతల్ గూర్పఁగాఁ జేయుమా
రూపద్మాక్ష! యటంచు వేఁడ విని యత్యుత్సాహ మొప్పంగ నీ
యాపక్షంబు లనంగ నేల? వినుమా ౹ యద్రీంద్ర! పక్షద్వయ
వ్యాపారంబున నిర్వహింతుఁ బనియే ౹ భంగిన్ గనం దృప్తిఁగన్. ౫౩౦

క. మాపక్షంబున వచ్చెను, శ్రీపతి కార్యంబుఁదీర్పఁ ౹ జెందిన వేడ్కన్
జూపట్టు నెల్లపనులం, బ్రాపీతఁడె యంచు రెండుపక్షము లెంచన్. ౫౩౧

క. మెలఁగెద మీమానసములు, కలఁతం గనకుండఁ బెండ్లికార్యపుభారముం
దలఁదాల్చి నిర్వహించెదఁ, బలుకులఁ బనిలేదు కార్య ౹ మతం గనుమా. ౫౩౨

క. ఎపు డెపుడు పెండ్లి యనియీ, చపలాక్షులు వేచియుండు ౹ చందముగన ని
ట్టిపలుకులం గాలమ్ము జరపఁగూడ దటంచు నద్రిరాజా! తొందరన్. ౫౩౩

సీ. ఉద్వాహవేదిక ౹ నొప్పుచెన్నుఁగా నిర్మింపఁ బంపుమీ ౹ నిక్కముగను
వాసయోగ్యంబులౌ ౹ వస్త్రనికరంబుల సిద్ధముచేయుంగ ౹ నేమములను
నియమింపు మానసనిర్మిత గేహంబు లట్లుగా నవ్యవిధి ౹ యమరుచుండ
వలయు వివాహార్హ వస్తుజాతంబుల శక్రగుర్వాదుమతి ౹ సంగఁ గూర్పు

ఆ. మించుకంతతడవు హితమగు నీక యని, తలఁచి పనులనెల్లఁ దత్పరమతి
వగుచుఁ జక్కఁదీర్పు మద్రివిభూ! వర,పూజ చేయరమ్ము పొలఁతిఁగూడి.

చ. మునిపతులీనినుం గలిసి పూజల శంభుఁడు తృప్తినొందురీ
తిని జరపింత్రుగాక హిమదీధితిశేఖరుఁ గూడియుండి యే
పని యెపు డెట్లు కాఁదగునొ పంతముపూని యదట్లె నిర్వహిం
తును మఱి రాసనాయిక వినూత్నముదంబున నాదునానతిన్. ౫౩౫

క. హైమవతిం గై సేయుచు, నేమమ్మున లగ్నమునకు నిఖిలాశారా
ధ్యామినుఁగూడి తోడ్కొని, యీమృత్యుంజయునిఁ గూర్పనే తెంచుఁ దమిన్.

ఉ. ఏను వివాహమండపము నీపరమేశ్వరుఁగూడి చేరుదుర్
మానులు నిర్జరుల్ కన సమస్తవిధంబుల నొప్పువేళ వి
జ్ఞానధనాఢ్యుఁడై సకలసద్గుణరాశి యనంగ సద్యశం
బూనిన యీనిలింపమునియుం గనుచుండఁగఁ బెండ్లి సేయుమా. ౫౩౭

క. ఒకప్రక్క నాకళత్రం, బొకపక్షమునందు నేను నుభయంబున వే
డుకమించ నీసురర్షియు, సకలప్రక్రియల నిల్చి సాగింతు మొగిన్. ౫౩౮

క. ఎవరెవరిఁ గోరుదువొ యా,దివిజులు సంయములు నెలమి దీటుకొన, నహా
ర్యవరా! వత్తురు నీదగు, భవనమునకుఁ బెండ్లిని జరపఁగఁ బూనికమై. ౫౩౯

క. ఏకొఱంత గాంచకుండఁగ, నీకార్యము సాగుఁజుము మహీంధరవర్యా
నీకలిమియె పొగడందగు, నేకడలన్ భాగ్యయుతుఁడ వీవె గణింపన్. ౫౪౦

క. అనిపలికి తన్నుఁగార్యం,బునకుం బురికొల్ప శిఖరిభూపతి విష్ణా
ర్తిని మౌళిఁదాల్చి నారద, మునియుం దనుఁగూడిరా విబుధు లరుదేరన్.

సీ. తనమందిరము చేరి తరుణితో యోజించి విధియుతంబుగఁ దనవేశ్మ దేవ
తలను బూజించె నిస్తులభాగ్యరేఖయే భూషణంబుగ నొప్పఁబొల్చుచున్న
కన్యకామణికి వేడ్కలుపొంగ నాచార మంతరింపక యుండునట్లుగాఁగ
మంగళస్నానమ్ము మానినీమణు లెల్లఁగూడి చేయింపఁగఁ గోరినట్టి

ఆ. వస్త్రభూషణముల భాసిల్లఁగాఁ జేసి
మునులు వేదపాఠముల నొనర్చు
చును ముహూర్తకాలమునకు ముందుగఁ జన
వలయు నను చొగిఁ బురికొలుపుచుండ. ౫౪౨

వ. మంగళస్నానంబు గావించి సకలవిధగృహాచారంబుల వదలక సాగించి భూషి
తాంగియై వేచియున్న తనయోషామణింగూడి జివిషత్పాలకపురంధ్రీమణులు
మంగళద్రవ్యనికర నిబిడగాంగేయ పాత్ర విలసత్కరసరసిజలై తోడ నరుదేర
వారింగూడి యాశాపాలకులు రా నానందంబు వెల్లివిరియ సూతవందిమాగధ
వైతాళికుల స్తుతిపాఠంబు లాలకించుచు దిదృక్షానుయాయి పార్వతీయుల కలక

లంబులు దిగంతరాళంబులఁ జెవుడ్పడఁ జేయఁ దలంగుఁడు తలంగుఁడని వేత్రహస్తులు బరాబరులుసేయ మందమందగమనంబునం జనుసమయంబున మృదుతమామూల్యకౌశేయంబులం బఱచుచు సేవకులు వెనుక కదుగులిడుచు ముందు నడుచుచుండ వానిపైఁ బదపంకజంబుల నునుచుచు శ్రుతిసుఖావహంబులుగం జెలంగుమంగళవాద్యనినదంబుల కానందించుచు, నత్యంతశుభావహశకునవ్యూహంబులం బరికించి మహానందసాగర నిమగ్నుండగుచు మందమందవిచల త్పవన శిశుస్పర్శంబున కెంతయు సంతసించుచు, నారదాదిమునిబృందారకబృందములు డెందంబులఁ దమసంకల్పంబు భగవదిచ్ఛానురూపంబున మార్పుచెందుటతోఁప నచ్చెరువందుచుం దన్ను హెచ్చరింప, సరభసగమనంబునకునుంకించుచుఁ జెంతం దోఁతెంచు చంచరీకవేణుల కభయంబొసంగుపొంబె నడకజడిమ గనఁజేయుచుం నంతం గల్యాణీ ! నీమనోరథఁబు సిద్ధించెఁగదా యనివచియించు విచికిలగంధుల సల్లాపంబుల కుల్లాసంబు వెల్లుఱేఁగ నించుక యడంచుకొని దృశ్యాదృశ్యరూపసుస్మితంబున స్వాభిప్రాయంబు వెలిఁబుచ్చుచుసంతోషపారవశ్యంబున నడబెడంగు గుఁటువడ నడుగులుతడఁబడ నిడుచుదానిం గానరానీకయుపలక్షింప నూహించుచు నాయంతరంబున నవ్వరీతిం గనంబడనడుగుఁదమ్ము లిడుచు నిదేమియని నెచ్చెలులు హెచ్చరింప నుంకించుతెఱంగెఱింగి కారణాంతరంబుఁ గల్పింప నువ్విళ్లూరుచుఁ దటాలున నదితోఁపమిఁదనజనయిత్రి తన్నుఁ బల్కరింప నుత్తరం బొసంగు చందంబు నభినయించుచుఁ, జంద్రశేఖరుదర్శనంబునకుఁ ద్వరపడుచు నాభావం బొరులకుఁ దెలియరానీకదాఁప నుంకించుచు నందులకు నెన్నేఁ గారణంబులం గల్పించుచు వానికలరూపెఱింగితి మీకనేల యారటించెద వింతలోనన మించిపోయిన దేమని యాశ్వాసింప నాయత్తపడు తోడిచేడియల రూక్షవీక్షణంబులఁ దూలించుచు వచ్చుచున్నయన్నులమిన్నఁ బార్వతిం దిలకించి యానందపారవశ్యంబునొందుచు నాహిమవంతుండు వివాహమండపాభ్యంతరంబున శాస్త్రరీతి నిర్మింపంబడిన ధర్మరత్నమయవేదికిం జేరంజని యందు. ౫౮౩

## ——విచాహమహోత్సవము.——

సీ. శ్రీరాసనాయిక ॥ శీతగిరీంద్రుని పుత్త్రికారత్నంబు ॥ భూషితాంగిఁ
గావించి నిర్జరకామినుల్ గొలువంగ ॥ వేదనాదంబులు ॥ స్వాదువాద్య
నాదముల్ దెసలనిండఁగఁ దోడుకొనివచ్చి ॥ వేదికకడ నిల్పి ॥ వేచియుండె
వరునిరాగమనంబు ॥ వాంఛించుచును; గృష్ణుఁ డంత శంకరునకు నష్టాకితి

తే. మంగళస్నాన పూర్వకసంగతార్ఘ్యములను దివిషద్వరులకును ॥ గలుగనాత
నములయినపద్ధతులను సుకృతముసుమించ, సుందరుఁపించెనకాశ్యలోనినిగొల్వ.

మ. దరహాసంబు ముఖాంగణంబునను వింతల్ గుల్క నాట్యంబు చే
య రమానాథుఁడు పల్కె శంకర! వివాహం బన్న జన్మంబునం
దరయం గల్గుమహోత్సవంబులను వర్యంబంచు వర్ణింపనో
దరమే ప్రాక్తనపద్ధతిం దలఁగ శాస్త్రవ్యూహసారం బదో. ౫౪౫

చ. మన మొనరించుపద్ధతులు మంచివి యంచు సురల్ గ్రహింత్రు దే
వనిచయ మాచరించునవి బాగని మానవులున్ గ్రహింత్రు గా
వున నితరోపదేశము ప్రభూతమె యా మన కంచు నెమ్మనం
బున నిడికొంచు భూషణసమూహము దాల్పుము పెండ్లికై యిటన్. ౫౪౬

ఉ. కన్నియ నిచ్చువారలు నికామముదంబును గాంచ నీవరుం
డన్నివిధంబులన్ సుతకు నర్హుఁడె యా యని యెంచ బంధువుల్
సన్నుతిపాత్రుఁ డీతఁ డని సంతసమందుచునుండ శంకరా
యెన్ని ధరింపు మీమణుల నెన్నికఁ గాంచిన భూషణంబులన్. ౫౪౭

క. మనచూపున కీయవి యే,పనికిం దగవంచుఁ దోఁచుఁ బరమేశ్వర! యీ
వనితామణులకు శర్మం,బు నొసంగం జాలియుంటఁ బూనుము తాల్పన్. ౫౪౮

క. ప్రకృతికి లోఁబడియుండుట,యొకదా మనకార్యమంచు నెన్ని మదిని దే
వికి మోదం బిడుటకు ర,త్నకలాపములన్ మహేశ తాల్పుము వీనిన్. ౫౪౯

చ. ఉరగమహోగ్రజిహ్వలకు నుత్పలనేత్రలు భీతిగాంత్రు సుం
దరులకు సంతసంబు నిడఁ దద్దయుఁ జాలిన కార్యసిద్ధి యం
చరసి మహోరగాళి మణిహారము లట్లుగ మార్పవయ్య యి
త్తరుణమునందు నద్దియె ముదం బిడు నీవనితాళి కెంతయున్. ౫౫౦

చ. అనియిటు వేఁడ శంకరుఁడు హారిమణీమయభూషణంబులం
దను వలరంగఁ గూర్చి వనితాతతికిం బ్రియమూర్తిగాఁ దగెన్
వనరుహనేత్రుఁ డట్టితఱి వాసవముఖ్యులఁ గూడి శంకరున్
వినుతసువాచ్యసంయుతిని వింతగఁ దోడ్కొని పోయె నుబ్బుచున్. ౫౫౧

వ. ఇట్లు పక్షద్వయంబునం గల పురంధ్రీపురుషోత్తములు వేదికచెంత నిలుచుండ
నంబికాపరమేశ్వరులం బరమోత్సాహంబున వేదికపయిం గూరుచుండఁ
జేయఁబూని యాచారంబుం బాటించి మునుముందు మీరే రాఁదగునని
యెదుర్కోలు వేడుకలం జరప సమకట్టి రట్టియెడ హరిపట్టపుదేవి రాధాం
బికతోడి గంధదంతావళయానల బృందంబులకుఁ గనుసన్నల మరియాదఁ
దెలుప వారలెల్ల నేరీతి నెవరికేఁ గదలింపరాని తెఱంగున నిట్టట్టు కదలక
మెదలక సుస్థిరవర్తనంబుఁ దెలుపుచందంబు ననుసరింప, సరోజనయనుండును
మాఱుచేయందలంచి పురారిచరణసరోరుహంబులు త్వరయెఱుంగని తెఱంగుం
గానిపింపం జేయ నంతర్వర్తులగు నమర్త్యప్రవరులు రండురండు ముహూ

ర్తంబు చేరువకు రానున్నదని చేయివీచుచుఁ ద్వారపెట్ట నద్దాని విన నట్లుభయ
పక్షంబులుండ మరల వార లయ్యారె యియ్యెడ వియ్యంబందు పద్ధతిని జేర
రాఁదగు. పంతంబులమాని వేదికచెంతకుఁ జేరరావలయునని పెచ్చువేడుకల
హెచ్చరించుచు ఫలం బిసుమంతయేఁగానక మత్తకాశినీచిత్తంబులు మెత్తం
బడునని మదుల హత్తునాశలం జేరంబోయి యుత్తమాంగనామణులార!
యిత్తఱి తత్తఱపడుట యుత్తమంబగునని యెలుంగెత్తి యెంత చెప్పిన నించుకే
నంగీకరింపక తొలుతఁ బురుషులే రాఁదగుదురనియు నవ్వల జవ్వనులు రాఁద
గుదురనియుఁ బూర్వాచారంబుండ దానిమాని మానసంబుల నూదినమానం
బున మానినుల రమ్మను టేటిమర్యాదయని యుత్తరంబు రానీకఁ గార్యంబు
లేదని శంకరుపంక వారలం జేరి యింకనైన బింకమ్ములుమాని పంకజాసనాదులం
గూడి రండు. ఏల యీలీల జాగుసేయఁబూనితి రిదిపంతంబులకుఁ దగినయదను
కాదని యూహింప వలంతులయ్యు నిట్లుండ నేలని యెన్నిచందంబులం బల్కిన
నించుకయు నడుగుపెట్టక వడివడి రాఁ దగునని పడఁతులకడ నుడువక తడయక
చను దెండని మమ్మేల సమ్మతింపఁజేయ వచ్చితిరని బదులిచ్చుచుండ నారదాదులు
తుహినభూధరవరేణ్యుం బురస్కరించుకొని వచ్చి వాసుదేవాదులం గని యీసమ
యంబునఁ గాసంతయైన నాలసింపఁ జనదని యెఱింగినమీరే యిట్టి పట్టిపట్టు
దలంబట్టుకొన్న బనియెట్టులు సాగునో యోజింపుఁడని వేఁడికొని మెత్తంబడం
జేసి వామలోచనావారంబుకడం జేరి వారిపౌరుషంబు మానించితి మింక మీ
రును సమ్మతింపుఁడీ యని మృదువాక్కులవేఁడిన నాహరిణేక్షణ లొక్కమాటఁ
గా వారు నాలుగడుగు లిడిన మేము రెండడుగు లిడఁదగునని వెడవెడ మేము
నెలుఁగుడుము గాన నాయాచారంబు నాచరింపందగు నని మఱి పలుకక
యుండ నూరకుండనేరక మాధ్యస్థ్యము చెప్పియొప్పింపఁబూని పుండరీకాక్షు!
చండిమంగొని యుండఁజెల్లునే యల్లన నడుగుఁ జేయుమన నాతండు సముచిత
జ్ఞానసంపన్నుండు కాన ముందుమిగిలి నాలుగడుగులిడి తమవారి నెల్లనిడఁ జేసెన
నవ్విధంబెఱింగి రాధాదిసాధ్వీమణులు వాలుచూపుతూపులఁ బరిహసింపుచు
మృగమదాదిసుగంధవస్తుసంకేత కుసుంభచూర్ణ [illegible] సునసార[illegible]రాగంబు [illegible]
యలు నలుదెసలం జల్లుచుండ సువర్ణ[illegible] సువర్ణ[illegible]బులు మీఱ [illegible]
ప్రఫుల్లసారసంబు లొకటిరెండు[illegible] [illegible] [illegible] [illegible] [illegible]
పుంగవులు సారసాక్షునికడను [illegible] [illegible] [illegible] [illegible]
వేఁడి వార లట్లొనరింప నీక [illegible] [illegible] [illegible]
నడువవలయునని రాధాది[illegible]మణుల [illegible] [illegible]
ముసిముసినగవులఁ దమ[illegible] [illegible] [illegible] [illegible]
పల్లవాధరాంబులగు [illegible] మెల్లమెల్లన [illegible] [illegible] [illegible]

సాసులు ప్రార్థించిప్రార్థించి యయ్యిరు దెఱంగుల వారలం జేర్చి వేదికోపరిభాగం
బున నాసీనులఁజేసి లగ్నంబుసమీపించె ననివిన్నవించి కృతకృత్యులగుటయుం
బుఁ దరాదిబృందారకులు తొందరంపడఁ బుండరీకాక్షుండు ననుమతింప హిమ
వంతుం డంత. ౫౫౧

చ. సనకసనందనాది మునిసంఘము లెంతయుసాయముం బొన
ర్పను దమినూన గిప్పతి ధరాధరవర్యుని మేననుఁ యథో
క్తనియత రత్నపీఠములఁ గ్రాలఁగఁజేసి తదంతరంబునన్
మనమునఁ గల్గువాంఛ యణుమాత్రము లోపము లేక పండుటన్. ౫౫౨

ఉ. సంతసముబ్బ దాని నొకచందమునన్ వెలిఁబుచ్చకుండఁగా
స్వాంతమునం దిముడ్చుకొనఁజాలిన ప్రోడను గన్యకామణిన్
వింతగ వెూముచందురుఁడు విశ్వనుతింగని యొప్పనుండు నా
కాంతను సర్వమంగళ సుఖంబున వెల్గఁగఁజేసి యవ్వలన్. ౫౫౩

ఉ. శంకరుఁ డర్హపీఠమున సర్వసుపర్వులు మేలుమే లనన్
గొంకుచు నారదుండు కనుఁగొంచు జనార్దనచేష్టితంబులే
శంకుని యాశయంబు నహాహ యని యాత్మను మెచ్చుకొంచు నే
బింకము లేక కాంచఁగనె వెన్నునిపంపునఁ గూరుచుండఁగన్. ౫౫౪

ఆ. స్వస్తివాచనమును జరపి నాందీముఖ,ములగువిధుల శాస్త్రమునఁ గలట్టి
పద్ధతిని జెలంగి పాటించి సాగించి, యవనికగఁ దనర్పు నంబరంబు. ౫౫౫

మ. తొలఁగించెన్ సురదేశికుండు హిమవంతుం డాత్మభాగ్యం బటం
చెలమిం బెంచిన కన్యకామణి హరుం డెంతోముదంబార న
వ్యలతాంగిన్ బలెఁ గాంచె మంత్రగతమౌ నర్థంబు సాధ్వీక్షణం
బులఁ బాలించినచందముం దెలుపఁగాఁ బూఁబోఁడియున్ మక్కువన్. ౫౫౬

చ. తొలుదొలుతన్ మనోహరుని దోయరుహంబులఁ గేలిసేయు స
ల్లలితవిశాలనేత్రముల లక్షణయుక్తినిబొల్చువాని ని
మ్ములఁ గనె నంతలోనఁ ద్రప పొంకముగా మెయినిండఁ బ్రాఁకి ని
స్తుల ముఖచంద్రబింబమును దోడనె వంచె నదేమి కోరియో. ౫౫౭

చ. సురవరదేశికుండు త్రిదశుల్ దనుఁ దొందరపెట్ట శాస్త్రమె
క్కరణి వచించు నట్టివిధి క్ష్మాధరవర్యుఁడు ప్రీతిఁ జంద్రశే
ఖరునకు నాత్మజాత నొసఁగంగ నొనర్చెను శంకరుండు త
ద్గురుఁడు వచించునట్లె యలికుంతలకై గ్రహియించె నేర్పునన్. ౫౫౮

చ. మునివరులెల్ల నక్షతలు పూవులుఁ గైకొని లోకపాలనం
బున సతతంబువర్తిలుచుఁ బొల్తురుగా కని యాశిషంబులం

దనిపిరి పార్వతిన్ శివుని । దానవసూదనుఁ డెల్లవారికిం
దనివి సనంగ రత్నసము।దాయము హాటకబృంద మిచ్చెఁ దాన్. ౫౫౯

తే. తొలుత నారదమౌని కీమ్ముల వరమ్ము
లిచ్చె శంకరుఁ డిమ్మౌని।యే సమస్త
జగములకు క్షేమకరకార్య।సమితిఁ జేయఁ
జాలు ప్రోడయెయగు నంచుఁ । జక్కఁ దెలిపి. ౫౬౦

క. సుమవృష్టులఁ దమసంతస, మమరులు తెల్పుచును నార।దాశయములు లో
కములకు క్షేమము లొసఁగన్, క్షమము లె యని పొగడి రంత।గమలాక్షుండున్.

క. హరునాజ్ఞఁ దద్గళాంతర,పరిభూషిత దివ్యకుసుమ । భారమహిత సుం
దరహారము వైచెను ని,ర్జరమునిగళమందు దేవ।సంతతి పొగడన్. ౫౬౨

చ. హరిహరతత్త్వ మొక్కటియె । యౌ నని యీమునివర్యు చర్యలన్
గరము ప్రసిద్ధమయ్యెఁ ద్రిజ।గంబులఁ; దుష్టులవౌ దురాశయో
త్కరములు వమ్ములయ్యె మత।ధర్మములంచును వ్యాజమూని క
ర్బురమును సంగ్రహించెడు ప్ర।మోదమునన్ వచియింత్రు చక్రిశం
కరులకు భేదముం గలదు।గా యని పండితమానులొక్కటన్. ౫౬౩

క. పామరులకు నుపదేశం,బేమాఱక చేయు వార । లిది నిజమనుచున్
ధీమహిమ మింతలేమిని, వ్యామోహము నొంది రద్ది । వమ్మగు నింకన్. ౫౬౪

చ. అనివిధి పల్కె నారదుఁడు । హర్షము మీఱఁగఁ జక్రిఁ గాంచి యా
తనిసెలవంది యిట్లనియె । ధన్యుఁ డనంగను నేనె యెన్న నీ
వనరుహనేత్రు వాక్యగత।భావ మిదౌనని యెంచలేక మా
యను దొలఁగించుకోఁ దగిన।యట్టి సమర్థత లేక స్వేచ్ఛగన్. ౫౬౫

చ. తిరుగుచు నేమియో పనుల । ధీవిభవంబునఁ జేయఁబూనితిన్
సురవరులార! మాయదగు।పొక్కును బాపుకొనంగ నేరకేఁ
దరమగునొక్కొ యిప్పనిని । [illegible] తత్త్వమెఱుంగఁగ నయ్యెనిఁక నీ
హరిహరతత్త్వముం దెలుప । [illegible] పంచెదెనన్. ౫౬౬

క. పరశివునకుఁ బార్వతికిన్, [illegible] సంబంధ [illegible]
స్థిరమెకదా యం [illegible], [illegible]

క. లోకైకశ్రేయం బగు, నీకళ్యాణంబుఁ గం [illegible] । [illegible]
యీకాంచనచేలుండే, యీకావ్యము [illegible] । [illegible] ౫౬౭

క. ఇదిశుభదం బిది స్తుత్యం, బిది పరము [illegible] । [illegible] ము [illegible] మా
నిది సంతతంబు ధ్యేయం, బిది మునిసుత [illegible] । [illegible] ౫౬౮

క. కరతాళధ్వను లరుదుగఁ, బరఁగంగా నాట్యమా [illegible] । [illegible]
స్ఫురణము ప్రేరేపింపఁగ, సురమునిపతి చూచు [illegible] । [illegible] ౫౬౯

చ. పరిణయ మివ్విధంబునఁ బ్రపంచశివప్రదమౌచు సాగఁగా
హరివిధిముఖ్యు లాహిమవదద్రివరుం గని ప్రీతిమీఱ నో
గురుసుకృతైకపూర్ణ! మదిఁ గోరినయట్టులె మమ్ము నెల్లనా
దరణముమీఱ మన్ననలఁ దన్పితి వేమికొఱంత లేనటుల్. ౫౭౧

ఉ. ధన్యుఁడ వన్న నీవె సుకృతవ్రజభూరిధనుండవన్న స
న్మాన్యుఁడవన్న నీవె గిరినాయక! ని న్నుపమింపఁజాలు వా
రన్యులు నీజగత్త్రయమునందును లే రిడి నిక్కవంబు సౌ
జన్యముగల్గునిన్ బొగడఁ జాలెడువా రెవరైన నుందురే. ౫౭౨

శా. నీ పేరెన్ని మహాత్ములందుఁ దొలుతన్ నిన్ బోలునం చొక్కనిన్
రూపింపందగుఁ జంద్రశేఖరుఁడు శత్రువ్యూహకాలుండు భ
క్తాపాయాళి తమిస్ర తీక్ష్ణరుచి దేవాధీశ సంపూజిత
శ్రీపాదాబ్జుఁడు నీకు నల్లుఁడగుటం జెప్పంగ నేలా నినున్. ౫౭౩

మ. ఇఁక నీవల్లుని గూఁతుఁ గానికల నెంతేఁ దృప్తినొందించి దే
వకదంబంబులు మేముగూడఁ జనుదే వస్త్యప్రవేశం బనం
బ్రకటఖ్యాతిఁ జెలంగు నుత్సవము సంపద్యుక్తమై సాగఁజే
యుకడంకం గనుమద్ది గాంచి చనఁగా నూహింతు మే మెల్లనున్. ౫౭౪

క. ఆయుత్సవంబుఁ జూడన్, మాయనుఁగుఁ గళత్రములు మనంబులఁ గోరన్
మాయభిమతమటు లుండఁగ, నోయద్రీంద్రా! వచించు టొప్పుంగాదే. ౫౭౫

చ. త్వరపడు టొప్పు నిప్పనికి వాసవముఖ్యులకోర్కి యిద్దియే
ధరణిధరేంద్ర! యన్న విని తామరసాక్షముఖాశయంబు శం
కరునిదె యంచు నమ్మి తమకంబున నప్పనిఁదీర్ప నెంచి ని
ర్జరులనుగూడి శంకరుని సద్మముఁ జేరఁగఁబోవ నెంచినన్. ౫౭౬

మ. వనజాక్షుండు పినాకిఁ గాంచి దివిషద్ద్వారంబు రానెంచె భూ
ధ్రనృపుం డెంతయువైభవంబు దగ నాప్తశ్రేణితో వచ్చు ని
ప్పని చక్కంగ నొనర్చుభార మది యేర్పాటం దలంపంగ నీ
మనదౌ; యత్నముచేయఁ బంపు మిపు డస్మద్బంధువుల్ ముందుగన్. ౫౭౭

క. అనుగందగు వచ్చెదమని, ర్జరులన్ హిమవత్ప్రముఖులఁ బ్రమదామణులన్
మరియాదఁ బిలుచుకొని మం, దిరముల కేగంగవలయు దేవా! కానన్. ౫౭౮

క. ప్రమథుల కాజ్ఞాపింపుము, సమస్తసద్వస్తువులను సవరింపఁగ వెం
ట మనము బంధుయుతంబుగ, విమానముల నెక్కిపోయి వేడుకమెఱయన్.

క. పురముఁ బ్రవేశింతము కా, పురమునకై పోవునట్టి పూఁబోఁడి విభా
వరియందు భర్తృగృహముం, జొరఁదగు నని పెద్ద లండ్రు శుభసమయ మదౌ.

ఉ. యామిని కీశ్వరుండు శశి ♦ యాతని కెన్నఁగ స్త్రీస్వభావమే
యేమెయిఁ జూచినం బొసఁగు ♦ నియ్యది సూనృత మంచుఁబండిత
గ్రామణులెల్లఁ బల్కుదురు ♦ గావున స్త్రీలు గృహప్రవేశముల్
యామిని యందె చేయఁ దగు ♦ నన్నది యాచరణంబుగాఁ దగన్. ౫౮౧

చ. అది మనకేలయంచుఁ బరమాత్మ! వచింపఁగరాదు లోకు లె
య్యది హితమంచు క్షేమకరమంచుఁ దలంతురొ యద్ది పాతకం
బొదవఁగఁ జేయదేని మన ♦ మొప్పట మంచిది నెమ్మనంబులం
దెది సుఖదం బటంచుఁ దగు ♦ నిచ్చు ఫలంబది యల్లె శంకరా. ౫౮౨

ఉ. కావున రాత్రియందె స్వనికాయ్యము జేసట సర్వలోకసం
భావితమార్గ మంచుఁ దలఁపంజను నింక భవన్మహాశయం
బేవిధినొప్పు నట్టె నటియింపఁగఁ బూనెద నన్న శంకరుం
డోవిమలాత్మ! యెద్దిమది ♦ కొప్పునొ యట్టులె సేసె చేయుమా. ౫౮౩

ఉ. నన్నడుగంగ నేటికి? మనంబున నెట్టులుతోఁచు నట్టె సీ
వన్నియుఁ జేయఁగాఁదగుదు ♦ వయ్యవి నాకు హితంబులే సుమీ
యెన్ని యదెట్లు చేయఁదగు ♦ నియ్యెడ నంచు వచింతు వట్టులే
క్రన్ననఁ జేయువాఁడ నొకకార్యము నిన్నడి చేయువాఁడనే. ౫౮౪

చ. అనవిని రాసనాయిక మహాప్రకృతిం గని స్త్రీజనంబుఁ దో
డ్కొని చనఁగాఁదగున్ రజతగోత్రమునం దగుసౌధసీమ క
ప్పని యొనరింపఁగాఁ దగుదు ♦ భవ్యవిమానగణంబు సీవశం
బునఁ దగు; నిర్జరప్రకరముం గొని నేఁ జనుదెంతు రాధికా. ౫౮౫

చ. రజని యిదే గృహంబుకు జొరంగ శుభంబుల నిచ్చునంచు నో
గజవరగామినీ! మును లఖండమహత్త్వము గల్గువారు స
ద్విజగములున్ సుఖంపడఁగ ♦ స్వాంతములం దలపోయువారు ల
క్కజముగఁ బ్రోత్సహించిరి యిఁకేం [illegible] బూనుట న్యాయ్యమే [illegible] ౫౮౬

చ. అని తనుహెచ్చరింపఁగనె ♦ హర్షము తన్[illegible]గఁ [illegible] నా
జ్ఞను శిరసావహించి [illegible]జప్రమదా[illegible]తోడఁ బార్వతీ
జననియుఁ దోడ[illegible]గఁ గొని ♦ శం[illegible]
స్తను సుముహూర్తమప్పటికిఁ ♦ దో[illegible]! [illegible] ౫౮౭

చ. [illegible]జులఁగూడి మీరు చనుదెంచుట యొప్పు [illegible] నే
శివునిగృహాంగణంబునను ♦ స్త్రీలు [illegible] గార్యముల్
దవిలి యొనర్ప [illegible]ంచును వృథా జనులా[illegible] వా[illegible] ని
ష్ఫు వితథముల్గదా యనెమహాఁ పోల్కఁ జరింతును బ్రాణనాయకా! ౫౮౮

క. హృదయేశ్వరి యిటుపల్కిన, ముదమొంది మురారి తనదు। పూనిక సాగిం
పఁ దలఁచుట మెచ్చుఁ గూర్పఁగ, సుదతిం బోఁబనిచి మునుల। సురలం గొనుచున్.

వ. హయని విమానరాజమున। యం దుపవిష్టుని జేసి తానుని
ర్జరపతిముఖ్యులుఁ విధియు । సర్వమునీంద్రులు గూడుచుండ శం
కరుఁ దమిఁగూడి పోయి మతి। కల్పిత మట్టులెసంగు రౌప్యభూ
ధరమును జేరె నప్పటికె । తామరసాయతనేత్ర లచ్చటన్. ౩౯౦

సీ. హరిహయుల్ చనుదెంతు । రమరులఁగూడి యెత్తఱినంచుఁ జూచుచు । దక్షకథల
నితరేతరము చెప్ప । నెంతో వేఁడుకపడుచుండఁగా శంకరు । వ్యోమయాన
మగపడఁ జాలించి । యాదరంబున వారిఁ గనఁగోరుచుండి రక్కాలమందె
హరిముఖుల్ దిగిరంత। హరుని దోడ్కొని హరివిధిముఖుల్ రాఁగను। వేడ్కఁబూన

తే. నంత మణిమయభూముల। నమలకోమ,లాంబరంబులఁబఱచి వా। ద్యములమ్రోయఁ
జేసి రందున్న ప్రమథులు। చిత్రరీతి, నందుఁ బదపద్మముల నుంచు। చరిగె శివుఁడు.

చ. ఉమయును వామపార్శ్వమున । నుండఁగఁజేసిరి రాసనాయికా
ప్రముఖసతీశిరోమణులు । పార్వతిదా వలకేలు సవ్యహ
స్తమునఁ గదించి శంకరుఁడు । తా నడచెన్ హరి ప్రీతినొందఁగన్
బ్రమదమునిమాఱ నారదుఁడు । పార్వతిభాగ్యము నెన్నియుబ్బఁగన్. ౩౯౧

తే. రాసమండలనేత్రి పర్వతకుమారి, యంతికమ్మున శంకరు। నంతికమున
వనజనేత్రుఁడు నుండిరి । బాసటయయి, చూచునిర్జరులెల్లరుఁ । జోద్యమంద.

ఉ. మందగతుల్ చెలంగఁగ ను। మాసతి తోనదుదేర శంకరుం
డిందుధరుండు వేసుకమె। యిన్ నడచెన్ బదకంజయుగ్మయు
క్తిం దలలెల్ల వంచి ఫణి। ధీశుఁడు శేషుఁడు భక్తిఁజూప నా
నందరసంబు పొంగ ముని। నాథుఁడు నారదుఁ డట్టిచూడఁగన్. ౩౯౨

చ. అంతకుముందె శిల్పపతి । హర్మ్యచయంబుల శంకరేచ్ఛచే
వింతగ సృష్టిచేసి పది। వేలకు మించఁగ నిల్పియుండె నే
మింతటిలోన నిన్నియగు। హర్మ్యగృహంబులఁ గట్టె నెవ్వఁడం
చెంతయు వేడ్కమించఁ గని । రెల్లసుపర్వులు మానివర్యులున్. ౩౯౩

చ. ప్రమథవరేణ్యుఁ డంచును ప। రంబగుఖ్యాతి గలట్టినంది యా
యమరులు లోనుగాఁగలుగు । నందఱకున్ విడుదుల్ ఘటించి స
క్రమముగ నాతిథేయము ల। ఖండవిభూతిని దెల్పునట్టిచం
దమున నొనర్చె నెల్లరు ము। దంబునఁ జేలెడునట్టిరీతులన్. ౩౯౪

చ. ఎది యెవఁ డెప్డుకోరునో య। దెంతయు వేడుకఁ గల్గఁజేయురీ
తిఁ దగుచు నప్పుడే యమరుఁ । దెచ్చి యొకండటఁ బెట్టినట్లు కాం

చఁదగక; యిద్ధి యేమనుచు స్వాంతమునం దలవాఁడె యెంచు న
య్యదియెకదా మహాత్ముల మాహాత్త్వము బుద్ధి కగోచరంబెయౌ. ౧౯౮

మ. అపురూపం బిదిసృష్టియం దిటుపదార్థాళుల్ మనోదృష్టి నె
ట్లుపదున్ జేపడునట్టు లప్పుడె కడుం జిత్రంబుగాఁ దోఁచుచున్
గపటం బించుకపూని లే దిది యనంగాఁ జాలఁ డెవ్వాఁడు దే
వపతిస్ఫారమహత్త్వ మిట్టిదనుసద్భావంబు చెల్వారుటన్. ౧౯౯

సీ. గేహావర్యంబులఁ గీర్తించుచున్ శంభుఁ డాపార్వతినిఁగూడి హర్మ్యమందుఁ
దాఁబ్రవేశించు నిత్తరుణంబునం దని మున్నె చేరినదేవపూగ మప్డు
వేడుకఁజూడంగ వెలఁదిమిన్నలఁగూడి వచ్చి రత్తఱి సురవర్యముఖులు
వెనువెంటనడువంగ విశ్వేశ్వరుం డుమాసాధ్వితోఁ జొచ్చెఁ బ్రాసాద మప్డు

తే. గురువు స్వాచారమిది మానఁగూడ దనుచు, ద్వారసీమను బార్వతివామపాద
మాది నునుపంగఁజేసె విష్ణ్వాదు లద్ది; మంచి దనిసమ్మతించి రిమ్మాడ్కి శివుఁడు.

చ. ఉదవసితంబుఁ జేరి త్రిదశోత్తములం గరుణావలోకనా
స్పద వరదానసమ్మద విభాసురచిత్తులఁ జేసి వేడుకల్
బొదలఁగఁ గొంతకాలము ప్రమోదము వర్ధిలుచుండఁ బుచ్చి యా
త్రిదశులు కాంచనాంబరవిధిప్రముఖుల్ దనువేఁడి నంతటన్. ౨౦౦

ఉ. వారలనెల్ల దివ్యమణివారవిభాసుర భూషణాదులన్
గారవమొప్పఁ దన్పి త్రిజగంబులకున్ శుభ మబ్బఁజేయువాం
ఛారతిఁ బూన దీపన లొసంగి మహాముని నారదాహ్వయుం
జేరఁగఁ బిల్చి హస్తసరసీజమునన్ దనువున్ స్పృశించుచున్. ౨౦౧

ఉ. మానిగణేంద్ర లోకముల మాధవశంకరతత్త్వ మొక్కఁడే
గాని విభేద మించుకయుఁ గానఁగ రా దెపుడైన దాని కం
చూనినశ్రద్ధఁ దేటపడునుద్యమముం బొనరించినాఁడ వీ
జ్ఞానమె కల్గునెవ్వరికి శాశ్వతమోదము వారి కబ్బెడున్. ౨౦౨

చ. ఇహపురియందు నొక్కని గణించి మఱొక్కని దూలనాడు నా
పురుషులు దుర్గతింబడి విముక్తియె లేక తపింత్రు మౌనికుం
జర! కృతకృత్యతం గనఁగఁజాలితి వింక యథేచ్ఛ మెప్పఁగాఁ
దిరుగుము లోకజాలముల దీనులఁ గావఁగ మానిమిత్తమై. ౨౦౩

చ. వరములఁ గోరనొ ననెడువాంఛ పొసంగునయేని కోరుమా
పరమముదంబుమీఱ సురపాలకు లొనన నే నొసంగెదన్
మురహరుఁ డుబ్బునన్న మునిభూపతి యాదల వంచిమ్రొక్కి శం
కర! భవదీయదివ్యపదకంజములన్ భజియింపఁ గోరెదన్. ౨౦౪

చ. అనవరతంబు నామది మహోత్సుకంబున నీదుపాదసే
వన మొనరించుభక్తి దగి వర్ధిలఁగా వరమిమ్ము దానిమిం
చినవర మొల్ల నన్న శశిశేఖరుఁ డెంతయు సంతసంబునన్
మునివర! కోరినట్లు వరమున్ గొను మిచ్చితి నింకనున్ నినుం
గనుజను లెంతొ పావనతఁ గాంచెడునట్లు వరం బొసంగితిన్. ౬౦౫

ఉ. తాపసకృత్య మిద్ది సతతంబును సంస్మరియింపఁ బాపముల్
వోవు శుభంబు లబ్బు నిను బుద్ధివిహీనుఁ డటంచు నీపనిం
గావలె నంచుఁ బల్కుజనకాండము బుద్ధిబలంబులేక దుః
ఖావళి తన్ను నేఁచఁగ నఘాంతము గాంచఁగఁ జాల కుండెడున్. ౬౦౬

చ. జగదుపకారి వంచు సురసత్తమపూజ్యుఁడ వంచు సుంతయేఁ
దగనిపనిం బొనర్పఁ డని తత్త్వవిదుత్తముఁ డంచు నెవ్వఁడేఁ
బొగడు నినున్ సతం బతఁడె పో సుజనప్రవరుం డనంగ ఖ్యా
తిగలిగి వర్ధిలంగలఁడు దేవమునీ! మదనుగ్రహంబునన్. ౬౦౭

మ. పరతత్త్వంబది యద్వితీయ మెవఁడే భక్తుండు సుస్వాంతమున్
సరసీరుట్ప్రపమందు స్వాభిమతవర్ష్మం బొప్పు నట్లున్ని సు
స్థిరభక్తిం గదియించి యోగనిరతిన్ సేవించు నవ్వాని క
ప్పరమేశుండు గృహీతతద్వపువునన్ బ్రత్యక్షుమై కాచెడున్. ౬౦౮

ఉ. ఇంతనరానికష్టముల నెల్ల సహించి సువాసనైకసం
క్రాంతిని మించుపుష్పముల రమ్యతమోత్తమచందనంబు కా
సంత కొఱంతలేనియటు లర్హపదార్థములన్ గడించియున్
జింతయొకింతలేని మదిఁ జేయనిపూజ యభీష్టదం బెటౌ ౬౦౯

చ. వినుము సురర్షివర్య! కడువేడుకఁ గూర్చెడువస్తువారముల్
మనసు విచంచలం బగుటమాత్రము లేనియెడన్ బరేశునె
మ్మనమున కింపుఁగూర్ప నణుమాత్రము చాలవుసుమ్ము నిశ్చల
త్వనియతిఁ గన్నయమ్మనమె దైవకృపం గలిగింపఁ జాలెడున్. ౬౧౦

చ తొలుతను బాహ్యపూజలును దోఁచు ఫలమ్ముల నిచ్చునట్లుగాఁ
దలఁపఁగ నవ్వి యల్పఫలదమ్ములె యంచును దోఁచుఁ బిమ్మటన్
ఫలములఁ గోరనట్టిదృఢభక్తి నొనర్చెడుపూజనంబె ని
ర్మల మదె యాంతరంగికము మాన్యతమంబునునై చెలంగెడున్ ౬౧౧

చ. కుసుమముఖంబులం దవిలి కూర్పప్రయాస మొకింత లేద దె
ట్టిసరణి దుఃఖలేశము గడించివిచారము కల్గఁజేయ దె

న్న సులభమార్గమై తగు మౌనస్థిరతాసుసహాయమైనదై
యసదృశముక్తిదంబు నగునయ్యది దుర్గమ మజ్ఞరాజికిన్. ౬౧౨

చ. ఎది యొనరింప సత్ఫలము లెంతయుఁ గన్పడకే భవాబ్ధి ముం
పఁదగుచుఁ గష్టసంతతి నపారము నీయఁగఁ జాలియుండు న
య్యదియె సమంజసం బనుచు నాగమసమ్మత మంచు మూఢు లిం
పొదవఁగఁ దెల్పఁబొల్పడుదు రుత్తమ మంచొనరింపఁ బామరుల్. ౬౧౩

మ. ఒకరూపం బొకనామముం బ్రియముగా నొప్పారునే నొక్కతా
వు కడుం బ్రీతికిఁ బాత్రమై యొసఁగునేఁ బూజ్యవ్రజంబందు వ్య
క్తికి నద్దానికి నాద్యమౌ పదము తర్కింపంగ లేదంచు శా
స్త్రకలాపంబు వచించుఁగాదె పరతత్త్వం బద్ది యెట్లౌ మునీ. ౬౧౪

ఉ. అంతట నావరించి వివిధాకృతులన్ జెలువారి భిన్నవ
స్త్వంతర మెద్దిలేకయె విహారము సల్పుచు వ్యక్తిరాశి కెం
తెంత తదీయకర్మగతి కెన్నఁగ నర్హమొ తేజ మట్లె దే
హాంతరమందుఁ జొన్పుచుఁ గృపాకరమై పరతత్త్వ మొప్పుఁగా. ౬౧౫

చ. అది యొకచోటనుండు నను టారయ నర్హమె యెల్లతావులం
బొదలును గాన నెవ్వరికి బుద్ధి నదేతనునామచిహ్నయు
క్తిఁ దగిన మోదముం గలుగుఁ గేవలభక్తి భజింప నట్లె స
మ్మదమునఁ దోఁచి కాచు సురమౌనివరా! శ్రుతిసమ్మతం బిదే. ౬౧౬

క. ఇంపుండును భగవంతుఁ డ, దెందును సంప్రీతినుండ నెంచఁడు గానన్
డెందమలరఁ బూజింపుఁడు, పొందుఁడు ఫల మనుచుఁ జెప్పఁబూనుదు రజ్ఞుల్.

సీ. అట్టి యజ్ఞులపల్కు లాదరింపక తనకిష్టమౌ రూపమ్ము నిష్టనామ
మును గల్గువానిఁగా మనసున నెన్నుచు ధ్యానింపఁదగు భక్తిఁ దగినయట్లు
దాన నాపరమతత్త్వము మోదమందుచుఁ దద్రూపనామముల్ దనరఁ దోఁచి
తత్కర్మములకును దగినఫలంబుల నిచ్చు నిరీహుల కిడును ముక్తి

తే. విగ్రహార్చన మనునది విహితమెట్టి
పగిదిఁ దలపోసినం గాదు భద్రదంబు
ధ్యానయోగమె సర్వమతముల కొక్క
విధమె యంచుఁ దలంచుటే విహిత మగును. ౬౧౭

చ. మునివర! యీవిధంబు జగముల్ చరియించుచు బోధచేయుచున్
గనకముఁ గూర్పనెంచి పలుగాకులు తెల్పెడుపల్కు లెల్ల న
జ్ఞనికరముల్ గ్రహింపక విచారమునొందక యిట్టిమంచిత్రో
వను జరియింపఁజేయు టిదె వారిజనేత్రుని యాశయంబు నౌ. ౬౧౮

చ. హరిహరనామముల్ గలుగుకేనాపరమాత్మున కింక నెన్నియో
సురుచిరనామముల్ గలుగు ॥ సూనృత మియ్యది గాన భక్తుఁ డే
పరున భజించినన్ మదిని ॥ భక్తివృషంబుగ నున్నఁజాలు నా
పరమకృపాబ్ధి యాతనికి ॥ భద్రము లిచ్చు నిఁకేల తెల్పఁగన్. ౬౨౦

క. ఈకల్యాణమహంబున, నీకథ యెల్లరకుఁ దోఁచె ॥ నిర్మల మనుచున్
బ్రాకాశ్యఁగాక యిదివిన, నేకరణిం జేసినట్టి ॥ యెల్లయఘములన్. ౬౨౧

చ. తిరుగుము లోకజాలముల ॥ ధీవిభవంబుచెలంగ సజ్జనో
త్కరయుతిఁ బామరావళికిఁ ॥ గాంచన చేలుఁడు శంకరుండు నీ
యిరువురు నొక్కటే యనుచు ॥ నెన్నఁగ భేదము చెప్పరా దటం
చురుతర శాస్త్రపద్ధతుల ॥ నొప్పుగఁ జెప్పుము మానిచంద్రమా! ౬౨౨

చ. కులగిరులున్ సముద్రములుఁ ॥ గోకనదాప్తుఁడుఁ బద్మబాంధవుం
డిలఁ దగువారో యెంతపఱ ॥ కీర్తిజగంబుల నిచ్చనచ్చిన
ట్లిలయుక సంచరించుచు మహామునిమండలమందు మేటివై
చెలఁగుము నీదుకీర్తనము ॥ సిద్ధిదమై తగియుండుతన్ మునీ! ౬౨౩

మ. జలజాక్షుండు మదర్థమై నిను మహాసాంద్రంబుగా మాయచేఁ
గలఁతం బొందఁగఁజేసె నీసుగలుగం గాజించె నెన్నోవిధం
బుల నీపూన్కిఁ బరీక్షచేయుటకె యోపొప్పెల్కిం గనన్ సుస్థిరం
బలఘుస్ఫూర్తి నెసంగుశ్రద్ధ దగునీయందంచుఁ దేలెన్ దుదిన్. ౬౨౪

మ. మునివర్యా! పలుమాటలేల భువనంబుల్ మూఁడు నీకీర్తిచం
ద్రుని గాంచన్ దలపోయు నంచును దలంతున్ నేను గోవిందుఁ డి
ప్పనికై నిన్గొనియాడు; నెల్లకడలన్ ॥ బద్మాసనాదుల్ సతం
బును గీర్తింతురు నీదుకార్యమును బెంపున్ మోదయుక్తాత్మలన్. ౬౨౫

చ హరునకు శైలజాతకు, మురారికి రాధకు బ్రహ్మకున్ మనో
హరతర గానపాండితి నహాయని యెల్లరు మెచ్చు నొప్పువా
క్తరుణికి నెన్నఁడే వియుతి ॥ గల్గునె యించుక లోఁదలంపు ని
ష్ఠరమునినాథ! కర్మములజాడలు తెల్పఁగ మాని యోగముల్. ౬౨౬

ఉ. దాసులమంచుఁ గొందఱు నితాంతము స్వర్ణము ప్రోఁగుచేయ స
న్న్యాసుల మంచుఁ గొందఱు విహారము సల్పఁగఁగోరి యొక్కటన్
వేసములూని పామరుల ॥ వింతగ శిష్యులఁ జేసికొం చనా
యాసముగా సుఖింతురు మహాపద లబ్బును వారినుండియే. ౬౨౭

ఉ. వారల నీచవాక్కులకుఁ ॥ బామరు లింతయు లొంగకుండ వే
సారక సంచరించి పలుచందములన్ సుమతం బిదంచు నిం

దారయ సత్ఫలంబు గలదంచు వచించుచు వారియజ్ఞతన్
దూరముగాఁ దొలంగునటు తోరపుఁబట్టుదలం బొనర్పుమా. ౨౨౮

క. ఇదె నీకుం బరమార్థం, బిదియే మముఁగొల్చు టనుచు నెంచుచు సతతం
బుఁ దిరుగుచున్ బోధింపుము, సదమలవిజ్ఞాన మబ్బుసరణిన్ మానీ! ౨౨౯

క. అని పరమాదరమునఁ బ, ల్కిన నచ్చటదేవవరులు కీర్తించిరి మా
నిని వాసుదేవుఁ డత్తఱిఁ, బనివినఁగా నెంచుదేవ పటలంబునకున్. ౨౩౦

సీ. రత్నభూషణములు రమ్యవస్త్రంబులు వేడుక నొసఁగి యావృత్రవైరి
కితరదిక్పతులకు నెన్న మూల్యమెలేని వస్త్రకలాపముల్ వరుస నిచ్చి
వారిభార్యలకు నవ్వారిగాఁ బెండ్లివస్త్రాదులనిచ్చి మర్యాదయొప్ప
శారదాదేవికి శతధృతికిని దగినట్లు కట్నముల నెయ్యమ్ము వెలయ

తే. నిచ్చి వారెల్ల గీములకేగ నాజ్ఞఁ
గోరఁ దా నిచ్చి రాధికంగూడి కొంత
కాల మందుండి బంధువర్గమ్ము నెల్లఁ
బనిపి తానును గోలోకమునకు నేగ. ౨౩౧

చ. తలఁచి మహేశుతో నుడువఁ దామరసాక్షు! సురర్షివర్య ని
మ్ముల మరియాదలం దనుపఁ బోలునుజు మ్మన నారదుండు శ్రీ
గళ! భవదీయసత్కృపయెగాక మఱొండుఫలంబు గోరఁగాఁ
దలఁప వరంబుగా మును పె దాని నొసంగితి వింతచాలదే. ౨౩౨

క. మీయిరువుర నామమ్ముల, నేయెడలన్ వదలకుండ నెద నెంచుచు నే
నీయఖిలలోకముల మీ, యీయుపదేశంబుఁ దెల్పుటే కృత్యముగన్. ౨౩౩

క. తిరుగుచు నుందును గోరిన, తఱుణంబున వచ్చి మిమ్ము దర్శింతు నిదే
మరియాదగా వరంబును, గరుణింపుము చాలుఁజాలుఁ గరుణాసింధూ! ౨౩౪

క. అనివారి కిర్వురకు వం, దనములు నర్పించి సెలవు తాఁ గొనిపోయెన్
ముని యేగిన శ్రీహరి రా, ధనుగూడి నివాసమునకుఁ దరలెం బ్రీతిన్. ౨౩౫

క. హైమవతియు శంకరుఁడును, బ్రేమంబున రాధికన్ హరిం గానికలన్
భూమానందము నొందఁగ, శ్రీమెఱయం జేసి పంపఁ జిత్తము లలరన్. ౨౩౬

తే. పార్షదులతోడఁ బయనమై పర్వతేంద్ర
మందిరంబున నర్థి సమయముగొంత
గడపి గోలోకమున కేగె; గౌరిఁగూడి
శంకరుండును భక్తవశంవదుఁడయి. ౨౩౭

చ. సనకసనందనాది మునిసంతతి కెంతయు వేడ్కమీఱఁ జ
క్కని యుపదేశ మిచ్చుచు జగంబులఁ బ్రోచెడు శ్రద్ధనూని డు

ర్జన మనుదూఱుఁగన్న మనుజప్రకరంబునుగూడ నెప్పుడై
నను దరియింపఁగా వలయు § నాదగు సంస్కృతి నంచు నెంచుచున్. ౬౩౮

ఆ. భేదబుద్ధి మాని § వివిధమతంబుల
వారు ప్రీతిమీఱ § భక్తి గలిగి
యిష్టదైవతము నభీష్టదంబని నమ్మి
కొలుచుచుండ్రుగాక § కోర్కె మాని. ౬౩౯

చ. పరమతముల్ దురాచరణ § పంకయుతంబులు మామతంబె సు
స్థిరపద మబ్బఁజేయు నది § చెప్పెడి దేమిఁక నిర్మలంబెయౌఁ
ద్వరితముగాఁగ రండు చొరరె బాలుఁడు దీని నటంచుఁ బల్కకా
పరమును మాని యొప్పగని § వర్ధిలఁగాఁ దగునంచు నెన్నుచున్. ౬౪౦

చ. ఉపనిషదోఘతత్త్వ మిటు § లొప్పెడునం చని మానిరాజికిఁ
గృపదొలుకాడఁ దెల్పుచు నకృత్రిమపద్ధతి నిష్టదైవ ది
వ్యపద సరోజయుగ్మమును § ధ్యానముచేయుఁడె యుత్తమార్చనం
బపరిమితాఘతూల దహనాభ మటం చొగి నిర్వచించుచున్. ౬౪౧

ఉ. భక్తసురద్రుమం బనఁగ § బ్రహ్మముఖాఖిలదేవమస్తసం
సక్త పదాంబుజుం డనఁగ § సాధుజనాదరణుం డనంగ వి
ష్వక్తనుశోభితుం డనఁగ § సన్ముని సన్నుతిఁగాంచుచున్ త్రయీ
ప్రోక్తసుకర్మరాజ నితరోపకృతిం దలపోసి చేయుచున్. ౬౪౨

ఉ. కమ్మరపుప్పుచందమునఁ § గోరిక లొందినయట్టులుండుచున్
నెమ్మన మాత్మఁ గాంచుచు మునివ్రజ మచ్చెరువందుచుండఁగా
సమ్మదసాగరోర్ముల నోసంగుచుఁ గ్రీడయొనర్పనుండె లో
కమ్ముల మేలె కోరుచును § గౌరెయుఁ దోడ్పడుచుం జెలంగఁగన్. ౬౪౩

ఉ. క్రూరతరాంగచిత్తములఁ § గ్రుమ్మరుజంతువులెల్ల మైత్రిచే
కూరఁగఁ దన్నుఁ గొల్వ నొకకోరికయైన నలభ్యమైనయ
ట్లూరయఁ గానరాక తగ § నందఱ కన్నితెఱంగులన్ నిజ
స్ఫారమహత్త్వమే వివిధభంగుల వాంఛలు తీర్ప వెల్గుచున్. ౬౪౪

చ. హృదయసరోజపీఠమున § నెంతయు భక్తిచెలంగ సమ్మదా
స్పదమయి నిర్మలంబయి విశాలమునై తగునాత్మ తేజమున్
గుదురుగ నిల్పి దాని నొకకోర్కెయులేక భజించు యోగిరా
జిఁ దమిని ముక్తిదానమున § సిద్ధిని గాంచ నొనర్చి యొప్పుచున్. ౬౪౫

చ. ప్రకృతియుఁ బూరుషుండు నన § భాసిలునయ్యది యొక్కతత్త్వమే
సకలము తత్స్వరూపంబె యగుఁ § జాలరు వానికి భేద మున్నయ

ట్లోకవిధిఁ జెప్ప నేరయిన; । నొప్పును దద్ద్వయసామ్యభావనా
ప్రకటవిధాన మంచుఁ దలఁపం జనువారల నుద్ధరించుచున్. ౬౪౬

చ. శ్రమపడి పూజకై కుజన।సజ్జనభేదముఁ జూడ కెంతొ నీ
చమతిని దేబెఱయై యడిగి । సంతసమారఁగఁ గూర్చునప్పుడా
ర్థములను బూజసల్పి యవి । తన్నును దైవమునన్న నమ్మకం
బమర భజించువారలకు । నల్పఫలంబులె యీయ నెంచుచున్. ౬౪౭

చ. మనసున నిష్టనామయుత।మంజులరూపునిగాఁ దలంచి ని
ల్పి నియతిమీఱ దైవము ని।లింపగణార్చితునిం బ్రకల్పితా
సనముఖపూజలం దనుపు । సాధుశిరోమణులన్ ఫలాభిసం
ధిని విడనాడువారి నతి।తృప్తిగ నిష్టము లిచ్చి కాచుచున్. ౬౪౮

చ. శరణము నీవె నిన్వదలఁ।జాల నదెప్పుడుగాని చాలదు
స్తరమగు నీభవార్ణవము । దాఁటఁగఁజేయుము చాలు నీయెడన్
మరల జనింపకుండ నొక।మాట వచింపుము దేవ యంచు నా
దరమున ధ్యానయుక్తిఁ దగు।ధన్యుల లోఁగొని కోర్కెఁ దీర్చుచున్. ౬౪౯

మ. పరతత్త్వంబె సమస్తభాగముల నొప్పంజాలు నంచెంచి యీ
శ్వరునే యెందును గాంచుచున్ మఱి ప్రపంచం బెల్ల యోజింప న
శ్వరమే యన్న వినిశ్చయం బలర సత్సంగంబునే కోరు జ్ఞా
నరమావంతుల కప్రతర్క్యమగు నానందంబుఁ గల్పించుచున్. ౬౫౦

మ. సురతృప్త్యర్థము సాధుజంతుబలి యిచ్చున్ భక్తుఁ డెవ్వాఁడు త
త్పరమానందదపూజనంబునకు దైవం బట్టె లో మెచ్చుచున్
సిరులన్ ముక్తినిగూడ నిచ్చు ననుచుం । జెప్పంగ నూల్కొన్న దు
ష్పురుషున్ దుర్గతు లొందఁజేయఁగను దక్షుండై విరాజిల్లుచున్. ౬౫౧

ఉ. ఏవిధి నిన్నుఁగొల్వఁ దగు । నేనెఱుఁగం బరమేశ్వరా! మదీ
యావిలమానసంబు భవదంఘ్రిసరోజములందు నిల్చి జ్ఞా
నావసథంబుగాఁ దగ దయన్ వరమిమ్మని వేఁడుచుండు దీ
నావళి నుద్ధరించుగతి । నారయు వేడుక మించ నొప్పుచున్. ౬౫౨

మ. తనుఁ దాఁ గాంచుచు నాత్మభిన్నము పదార్థం బిద్దియే యంచు నె
వ్వనికేఁ జెప్పఁ దరంబుగానియటులే । వ్యాపించి సర్వంబునుం
గనఁగాఁ బెక్కుతెఱంగులన్ వెలయు నొక్కం బిద్దియే యంచుఁ దోఁ
చునటుల్ చేయుచు నద్వితీయుఁ డగుచున్ । శోభిల్లుచుండెన్ గడున్. ౬౫౩

మ. తనయర్ధాంగము గౌరిదై యొసఁగ సత్యం బిట్టులే పూరుషుం
డనఁగా మాయయనంగ భేద మన సుంతైనం గనన్ రాదటం
చును దెల్పంగ సమస్తకర్మములఁ దాఁ జూడంగ శ్రీదేవియే
యొనరింపం దనసర్వసాక్షిత జగద్వ్యాహంబునం దోఁపఁగన్. ౬౫౪

మ. తనమాహాత్మ్యము వేదజాల మెఱుగం దర్కింపఁగాఁ జాలకే
యనుమానించి యిటుండ నౌనొ యని యూహల్ చేయఁగా సాగ నె
వ్వనికే నిర్ది యగమ్యమేయ మెను భావం బుద్భవం బందఁగా
ఘనతేజోనిలయుండునై చెలఁగె శ్రీ గౌరీశుఁ డాకొండపై. ౬౫౫

చ. మనమున శంకరా! యనినమాత్ర నిదే సకలార్థముల్ గ్రహిం
పను జనుమంచు వాంఛలను భక్తుల కెల్లను దీర్చుచున్ మునీం
ద్రనిచయబోధకుం డగుచుఁ దా నెదఁ దన్నె తలంచుచున్ సుఖం
బునె కనఁజాలియుండె సురపుంగవు లెప్పుడు గొల్చుచుండఁగన్. ౬౫౬

ఆ. సర్వమంగళయును సర్వజ్ఞు నిచ్చయే
దనదు నిచ్చగాఁగ ననుపమాన
కరుణ నాశ్రితాళిఁ గాపాడుచు నుపాస
కులకు సిద్ధిదయయి యలరుచుండె. ౬౫౭

సీ. సాదాఖ్యకళయని స్వాంతంబులఁ దలంచి యోగులు ధ్యానించుచుండ వెలసి
కులనాయిక యనుచుఁ గోర్కిని గౌళమార్గనిరతు లర్చింపఁగాఁ జెలంగి
కామకళాంబ నాఁగ శుభాగమాచార తత్పరుల్ పూజలఁదన్ప నలరి
పరదేవియని వేదపద్ధతి వైదికుల్ తన్ను నారాధింప దయను మించి

తే. యెట్టిమార్గమ్మునంగాని యెవరు భక్తిఁ
దనను గొల్చినఁ దద్వాంఛితముల నిడుచు
సర్వకారణతం బొల్చి సర్వమంగ
ళాఖ్యచే మించి శ్రీదేవి యలరుచుండె. ౬౫౮

ఉ. వ్యక్తినిబట్టి భేదము నెవండు తలంచునొ వానికద్ది శా
స్త్రోక్తమె యాద్యజన్మమని యుర్వి; మహత్త్వముఁబట్టి యెవ్వఁడా
సక్తిని భేద మందుఁ గనఁజాలునొ రెండవజన్మ మద్దియా
వ్యక్తివిభేదముం గనెడువాని దె యద్ది తురీయజన్మమౌ. ౬౫౯

చ. అనుచు సనందనాదులు మహర్షులు తెల్పఁగ భక్తు లాదరం
బున గ్రహియించి సర్వమునఁ బొల్చినవారిఁగఁ దమ్ము నెంచి శా

స్త్రనియతిమిాఱ కాత్మల నేసంగెడుభక్తిని గొల్వ సత్కృపం
గనుచుఁ దదీప్సితంబుల నికామ మొసంగుచు నుండి శాగిరిన్. ౬౬౦

తే. సర్వగతులయ్యుఁ గైలాసశైల మొక్క
కొందఱకు ధ్యానయోగంబుకొఱకు ముఖ్య
మౌట నందుండి రట్టియాఖ్యలను దాల్చి
రెండు నెవ్వరు దలఁచిన నం దెయుండ్రు. ౬౬౧

క. ఎదికనఁబడినఁ భక్తుం, డది తద్ధామంబె యనుచు నాత్మ సతతమె
న్నఁ దగుఁ గావున నట్టిం,డ్ర దయం గాపాడుచుఁ వీరాజిల్లి రొగిన్. ౬౬౨

క. ఎందెం దేయేభక్తుఁడు, సందేహముమాని శాస్త్రసరణిఁ బ్రియమునఁ
డెందమునఁ దలఁచు నల్లెక,నందగి వారొప్పి కమలనైజ విభవతన్. ౬౬౩

క. భంగ మనంగా నెఱుఁగని, మంగళముల నిచ్చు సర్వమంగళయని యు
ప్పొంగెడు ముదమున నుతియిం,పం గల్గిరి భక్తులు దముఁ బాలింపంగన్.

క. శివములఁ గోరినయట్టులె, భవహరములఁ బుణ్యకర్మఫలములను సదా
శివుఁ డొసఁగు భక్తిఁ గొల్చిన, సవిధిగ నని కొంద ఱెలమి సల్పిరి స్తుతులన్.

క. చరితం బీయది భద్రా,కర మగుటం జదువఁగ వినఁగ వివిధకాంక్షి
త్కారములు ఫలించు నంచని, సురమౌని చెలంగిపల్కెఁ జొక్కపుభక్తిన్.

క. మాయిరువ్వురయం దెవ్వరు, పాయని యేకత్వరూపభావము గనువా
రో యట్టివారిఁ గృతిసము, దాయముచం జెర్తు ననుచుఁ దమి వారి పల్కెన్.

క. ఏతనువునఁ దగువానిగ, నేతీరున నఖిలజగదధీశుని సమ్య
క్ప్రీతిని దలంచు నల్లే, యాతనికిం దోఁచి ప్రోచునని విధి పలికెన్. ౬౬౮

క. అందఱు తమ్మిటు నుతియిం,పందగి యవ్యాజకరుణ పైకొన సుమనో
బృందముల మేలె కోరుచు, నిందుధరుం డద్రిజయు గిరీంద్రంబందున్. ౬౬౯

క. అవినాభావంబగు బాం,ధవ మొప్పఁ బరస్పరసుకృతఫలాయిత సం
భవతం బొల్పుచు దంపతు, లవిరతశర్మముల నుండి రమరులు గొల్వన్. ౬౭౦

క. పరదేవి పరమేశ్వర, చరితం బిది దివ్యయోగసారము సుజనో
త్కరపాఠ్యం బిష్టార్థద, మరివర్గనికృంతనంబు నగు సతతంబున్. ౬౭౧

—౦ ఆశ్వాసాంత్యము. ౦—

క. ద్వైధీభావనికృంతన, వేధఃక్రముఖప్రజేశ వితతికృతనుతా
సాధిత దుష్టమహాసుర, యోధా కరుణామహాపయోధీ గిరిశా. ౬౭౨

శా. నారాచాయిత భార్గవీశ, సకలామ్నాయస్తుత ప్రాభవా
ఘోరాకారమహాసుర త్రితయసంగుప్తోరు పూర్భంజన

స్ఫారోదగ్ర కృశానునేత్ర విలసద్భాలా శివాఖ్యాస్మృతి
ప్రారంభ ప్రపలాయితాఘనికరా ! హారాయితాహీశ్వరా. ౬౨౩

మంగళమహాశ్రీవృత్తము:—

వారిధరవాహముఖ ! వర్ణిత మనోజ్ఞతమ ! భాసుర యశఃకువలయాప్తా
సారకరుణామృత రసస్నపనమోదయుతసాధుజనచిత్తవికచాబ్జా
భూరిసురవైరి కృతభూత వితతార్తిహృతి ! పూతగురు శౌర్యధనరాశీ
చారుతరశీలమణి ! సారవర హారగణ ! సన్నుతతనూ సురమహీజా. ౬౨౪

గద్యము. ఇది శ్రీమత్త్రిపురసుందరీ కరుణావాప్త గీర్వాణాంధ్రకవితాప్రాభవ, కాశ్యపాన్వయప్రభవ, శ్రీజనమంచి వంశాంబురాశికుముదినీమిత్ర, సుబ్రహ్మణ్యమనీషిపుత్త్ర, తాండవకృష్ణాపరాభిధేయ, శేషాద్రినామధేయ వినిర్మితంబైన శ్రీ సర్వమంగళాపరిణయంబను మహాప్రబంధంబునందుఁ బంచమాశ్వాసము సంపూర్ణము.

క. గిరిశరవసుశశికవత్సరయుత యువవర్షమందు ! శ్రావణమాసో
త్తరపక్షాష్టమియందు దిది, పరిపూర్ణంబయ్యె దేవి ! పరమకరుణచేన్.

శ్రీ సర్వమంగళాపరిణయము సర్వము సంపూర్ణము.

శ్రీ. శ్రీ. శ్రీ.



చెన్నపురి: శ్రీ 'రామ' ప్రెస్సున ముద్రితము.—1935.—1000.